# భక్తిసంకీర్తనము

గ్రంథకర్త :

ఆవతార్ శివానంద భగవాన్

అనువాదకులు :

శివానంద పాదసేవక్ S. P. S.

స్వామి శ్రీనివాసానంద సరస్వతి

'రామానంద' నండూరి వేంకట సుబ్బారావు B. A, S. D. L. S.

ప్రకటనకర్త :

నండూరి వేంకట సుబ్బారావు B. A. S. D. L. S.

ప్రకాశకులు :

యోగవేదాంత అరణ్య విద్యా పరిషత్తు

శివానందనగరము

సర్వస్వామ్యములు
ప్రకాశకులవి

ప్రథమ ముద్రణ
500 ప్రతులు

వెల : 4-0-

పుస్తకములు వలయువారు :

ఈ క్రింది చిరునామాలకు వ్రాయవలయును.

(1) నండూరి వేంకట సుబ్బారావు

ఏలూరు - దక్షిణపువీధి - ప. గో. జిల్లా. (ఆంధ్ర)

(2) సెక్రటరీ దివ్యజీవన సమాజము

శివానందనగరము (Via)హృషీకేశ్, డెహ్రాడూన్ జిల్లా. ఉత్తర ప్రాంతము.

# విషయసూచిక






అ వ తా ర్

శ్రీ స్వామి శివానంద భగవాన్

S. P. S. స్వా మి

శ్రీనివాసానంద సరస్వతి



అవతార్
శ్రీ స్వామి శివానంద భగవాన్

శ్రీ నండూరి
వెంకట సుబ్బారావు

ఓం ఓం ఓం

## యుగవిభూతి "అవతార్" శివానందభగవానుల

# సంక్షిప్త జీవిత చరిత్ర

శ్రీ స్వామి శివానంద సరస్వతీ మహారాజుల పూర్వాశ్రమనామము శ్రీ కుప్పుస్వామి. అపర శివావతార మనవరగు శ్రీ అప్పయ్యదీక్షితులవారి వంశమునకుచెందిన దాక్షిణాత్య శ్రోత్రియ బ్రాహ్మణవర్యులు. వారు ది 8-9-1887 న (సర్వజిన్నామసంవత్సర భాద్రపద బహుళ షష్టి గురువారం భరణి నక్షత్రములో) 4-17 ఉదయంకు బ్రహ్మముహూర్తమున మద్రాసురాష్ట్రమునగల తిరునల్వేలి జిల్లాయందలి "పట్టమడయి" గ్రామములో జననము. 10 సంవత్సరములు మలయాలో డాక్టరుగపనిచేసిరి. కొంతకాలము గృహస్థధర్మమును కూడ నెరవేర్చిరి. కాలక్రమమున భగవదాదేశమున సర్వము త్యజించి ది 1-6-1924 న హృషీకేశములో శ్రీ స్వామి విశ్వానంద మహారాజులనుండి సన్యాసము గొనిరి. M. B. B. S., M. R. A. S. (Member of the Royal Asiatic Society) M. R. I. P. H. (Member of the Royal Insitute of Public Health) A. R. San. I. (Associate of the Royal Sanitary Institute) మున్నగు డిగ్రీ లెన్నియో సన్యాసాత్పూర్వము వహించియుండిరి. 15 సం॥లు తపస్సొనర్చిరి. 8-9-1930 న నాత్మ సాక్షాత్కార భాగ్యశీనొందిరి. 1932 లో శివానందాశ్రమమును స్థాపించిరి. 1936 న దానినే దివ్యజీవన సంఘము (Divine Life Society) గ వెలువరించిరి. దాని శాఖలు (Branches) హిందూదేశము సర్వత్రను, జర్మనీ, అమెరికా,

యింగ్లండు, స్విట్జర్లండు, పోలండు, సింగపూరు, దక్షిణ ఆఫ్రికా, చైనా, యిండోనీషియా, జపాను, ఆస్ట్రేలియా మున్నగు విదేశములను మొత్తము 350 కు పైబడి గలవు. 1948 లో నేటి "యోగ వేదాంతారణ్య విద్యాపరిషత్తు" (Yoga Vedanta Forest Academy) యోగ వేదాంతారణ్య విశ్వ విద్యాలయః (Yoga Vedanta Forest University) మను నామమున నెలకొల్పబడినది. ఆయనచే నాంగ్లమున రచింపబడిన ముద్రితగ్రంథము లీసరికి (అముద్రిత గ్రంథములు కాక) మూడువంద (300) లకుపైగ నుండును. ముద్రితగ్రంథములు దేశీయభాషలగు తెలుగు, అరవము, మళయాళము, కన్నడము, గుజరాతీ, మరాఠీ, సింధీ, ఉర్దూ, బెంగాలీ, హింది, ఒరియా, గురుముఖి మున్నగుభాషలలో మాత్రమే కాక విదేశీయ భాషలగు జర్మను, ఫ్రెంచి, జపాను, స్వీడిష్, రష్యన్, బర్మా, లాట్వియన్, ఎస్పరాంటో, బల్గేరియన్, డచ్, చైనా, యిండోనీషియా మున్నగుభాషలలో సహితము తర్జుమా యొనర్పబడినవి. దివ్యజీవన సంఘశాఖల తరఫున ఫ్రెంచి, జర్మన్, యిండోనీషియా ఆంగ్ల భాషలలో విదేశముల వివిధ సామయికపత్రికలు (Periodicals) నడచుచున్నవి. అటులనే స్వదేశమున దివ్యజీవన సంఘశాఖల తరఫున కన్నడము, అరవము, గుజరాతి ఆంగ్లభాషలలో ప్రస్తుతము మాసపత్రికలు నడచుచున్నవి. గతమున తెలుగునకూడ "శివానందవాణి" "ప్రాణజీవని" "దివ్యజీవనము" అను మూడు వేర్వేరు పత్రికలు నడచెడివి. ప్రస్తుతము "దివ్య జీవనము (రాజమండ్రి)" పునరుద్ధరింపబడినది. అటులనే పూర్వమున బెంగాలీ, హింది, మరాఠీభాషలలోను మాసపత్రిక లాయా

ప్రాంతములనుండి నడిచెడివి. ప్రపంచమందలి పత్రికలన్నింటికి శివానందుల వ్యాసములు ప్రతి నెల తప్పనిసరిగ జనుచుండును. హిందూదేశములోని సర్వ ముఖ్యభాషలలోని పత్రికలలో సదా ప్రచురితమగుచుండునని వేఱే తెలుపబని లేదు.

శివానంద నగరమునుండి వెలువడు నాంగ్ల మాసపత్రికలు "Divine Life" "Wisdom Light" "Branch Gazette" "Health and Long life" యను నాలుగుమాత్రమే. "Yoga Vedanta forest Academy Weekly" (వార)పత్రిక యొకటి కూడ నాంగ్లమున బయల్వెడలెను. ఇవిగాక రాష్ట్రభాష యనదగు హిందీలోకూడ "యోగవేదాంత" యను మరియొక మాస పత్రికయు నడచు చున్నది. శ్రీ శివానందులవారి యమూల్య గ్రంథములు, పత్రికలన్నియు నాధ్యాత్మికమగు యోగ వేదాంతములకు, నారోగ్యమునకు, లౌకిక పురోభివృద్ధికి, సర్వదృక్కోణములకు సంబంధించినవి మాత్రమే. ప్రపంచశాంతికి, మానవాభ్యుదయమునకు, లోక కళ్యాణమునకై శ్రీ శివానందు లొనర్చుచున్న నిరుపమసేవలకు ముగ్ధులై పలు విదేశసంస్థలు (Foreign Institutions) శ్రీ గురు భగవానుల కింతవరకొసగిన వివిధబిరుదము (Titles) లిరువదితొమ్మిది. (29)

1950 సంవత్సరములో భారతదేశము, సింహళ (Ceylon) మంతట నాధ్యాత్మిక ప్రచార మొనర్చుచు పర్యటించిరి. 1953లో విశ్వమతముల సమావేశము (Parliament of World Religions) ను శివానందనగరమున నిర్వహించిరి. శ్రీ గురుదేవులకు స్వదేశవిదేశమునగల వివిధ మత విశ్వాసములకు

(Religious faiths) వేర్వేరు శాఖలకు చెందిన స్త్రీ, పురుష శిష్యులు ప్రపంచమంతటగలరు. ఇతర విభాగముల (Departments] మాటటుంచి శ్రీ శివానందుల ప్రత్యేకవీక్షణ, సలహాలకై ప్రతినెల కనీసము రెండువేల (2000) కు తక్కువ లేకుండ ప్రపంచపు టన్ని మూలలనుండియు "నారోగ్యాధ్యాత్మిక, లౌకిక" సంబంధపుటుత్తరములు పీసు, వారనక సర్వతరహా [Status] ల వారినుండియు వచ్చును. ఆంగ్లమునకేకాక దేశీయభాషలగు తెలుగు, అరవము, హిందీ, కన్నడము, మళయాళము వగయిరా భాషలలోను శ్రీ గురుదేవుల పర్యవేక్షణ, జాబులకైనుత్తరములువచ్చును. సంకల్ప ప్రసారము (Thought transmission) రీత్యా తపాలుద్వారా దూరదేశస్థులకు వారివారి కోరికపైని వారివారి యిష్టదేవ మంత్రోపదేశము (Mantra Initiation) నొనర్తురు. ప్రపంచమంతట వందలాదిగ స్త్రీ, పురుషులు శ్రీ శివానందుల ఆదేశ ప్రకారము తమతమ మత విశ్వాసరీత్యా ప్రతినెలను సాధన (అనుష్టానము) నొనర్చుచు నాధ్యాత్మిక దైనంది [Spiritual -diary] ని, పూర్తిచేసిన మంత్ర లేఖన పుస్తకములను[Mantra writing note book] శ్రీగురుదేవులవిసుర్యనాధ్యాత్మికముందంజ (Spiritual advance) కై సూచనలకు పంపుచుందురు. ఇందాశ్రమమున భారతదేశమందలి సర్వప్రాంతములవారును సర్వముఖ్యభాషలవారును రెండువందల (200) వరకు గలరు. ఇది కేవలము హిందూదేశమునకు మాత్రమేకాక ప్రపంచమునకంతటికి సంబంధించిన నంతర్జాతీయసంస్థ (International Institution) యగుటచే సదా నాధ్యాత్మికముగ కార్యభారముతో కలకలముగ (busy) నొప్పారును.

హిమాలయ పర్వతావృతమై గంగ కిపతల రొయ్యున హృషీకేశ, లక్ష్మణ ఝూలాలమధ్య శ్రీ బదరీ నారాయణము కేదారములకుపోవు బస్సుదారిని "మునికీ రేతీ (Muniki Reti) యను మండలము (Zone) న నీ యాశ్రమముగలదు, బెజవాడ ఢిల్లీమీదుగగాని లేదా వాల్తేరు హౌరా (కలకత్తా) మీదుగ గాని వచ్చువారు హరిద్వారములోదిగి బస్సుపై వచ్చుచో శివానందాశ్రమము వద్దనే సరాసరి దిగవచ్చును. (హృషీకేశ మునకు రైలుగలదు. స్టేషనునుండి యాశ్రమమునకు 1½ మైళ్ళ దూరముండును. హరిద్వారమునుండి హృషీకేశమునకు 16 మైళ్ళు.)

ఆశ్రమమున శ్రీ విశ్వనాథ మందిరము, ముద్రణాల యము ఛాయా చిత్రాగారము [Photo Studio] యోగ వస్తు ప్రదర్శనశాల (Yoga Museum) నిర్విరామ అనగా 24 గంటల కలిసంతరణోపనిషన్మంత్రమగు "హరేరామ ... హరేహరే" సంకీర్తనజరుగు "బజన భవనము" అన్నపూర్ణక్షేత్రము, ఆయుర్వేద వైద్యశాల, నేత్రచికిత్సాలయము, (Eye Hospital) విదేశీ వైద్య (Allopathy) ఆస్పత్రి ప్రకృతివైద్య సదనము హోమియో వైద్యశాల, సత్సంగ భవనము మున్నగు పలు విభాగములు కలవు. ఇంకను నాశ్రమమున తంతి (Telegraph) దూరశ్రవణ వాహకాగారము, (Telephone) లతో సహా తపాలాకార్యాలయము, (Post Office) గలదు.

ప్రస్తుత మాంధ్రలో "ఉంద్రాజవరము, తణుకు, కర్నూలు, చీపురుపల్లి, హైదరాబాదు, సికిందరాబాదు, ఉదిత్యాల్ (తెలంగాణా) గుంటూరు, గుంటకల్, చేవేంద్ర పాలెం (కృష్ణాజిల్లా), రంపయఱ్ఱపాలెం (తూర్పుగోదావరి

జిల్లా). వేంకటగిరి. బరంపురం, (ఒరిస్సా) మద్రాసు (రాయపురము). ఖుర్దారోడ్డు (ఒరిస్సా), బోలారం (సికిందరాబాదు), ద్రోణాచలము, రాజోలు, భద్రాచలము, బేతంచర్ల (కర్నూలు జిల్లా) ట్రిమల్ గెరీ (సికిందరాబాదు) సిర్పూర్, కాగజ్‌నగర్ (తెలంగాణా). రాజమండ్రి, హిందూపూర్, ఏలూరు, తాడేపల్లిగూడెం."ల వద్ద దివ్యజీవన సంఘశాఖలు నెలకొల్పబడి నిర్వహింపబడుచున్నవి.

శ్రీ గురుభగవానులు (శివానందులు) మొత్తముపై నొక లక్షరూపాయలకు పైబడు విలువగల తమ గ్రంథములకు పదివేల రూపాయలకు మించి విలువచేయు నాయుర్వేదౌషధములను నుచితముగ ప్రపంచమంతట గల భక్తవరులకు ప్రతి సంవత్సరము సంపుదురు. ప్రతినిత్యము ప్రపంచపు నలుమూలలగల స్త్రీ, పురుష భక్తులనుండి శ్రీ శివానందులకు వచ్చు నుత్తరశతము పరికించ నెందరెందరో శ్రీ శివానందుల తమ, తమ యిష్టదైవములగు శివ, రామ, కృష్ణ, వేంకటేశ్వర, దుర్గ, సరస్వతి, సుబ్రహ్మణ్య, బుద్ధ, శంకరాచార్య, సాయిబాబా, క్రీస్తు నానక్, మహమ్మదువగైరా "అవతారం" మని కేవలము భూలోక భగవానుడేననియు నింకా నేమేమో వారివారి దివ్యానుభవములబట్టి వ్రాసియుండుట సుస్పష్టమగును. పాదసేవకులు (స్వామి శ్రీనివాసానంద సరస్వతి) సంపూర్తిగ గత సప్త (7) సం॥రములయి నుత్తర పత్రశాఖలో నొకమూల నాంగ్లవిభాగమున వేరొకమూల తెలుగు విభాగమున రెంటిలోను సద్గురు కృపచే నుండుటచే స్వానుభవమున నీ ప్రకటనమున సువిదితము. ప్రత్యక్షముగ శివానందుల దర్శించువారికిని నట్టి దివ్యభావమే స్వతస్సిద్ధముగ లోనుండి

యుద్భూతమగును. వాస్తవికముగ నాధ్యాత్మిక దృష్ట్యా నీయన నేటికాలపు రాజాధిరాజులు, సార్వభౌములు, చక్రవర్తులు, సామ్రాట్టులు మాత్రమే కాక నిస్సంశయముగ నధునాతన యుగమున "నవతారి" పురుషులే.

ఈ "సూర్యవర్చస్వి" యగు స్థిరపురుషులు సదా పూర్ణ యోగము (Synthetic yoga) ననుష్ఠానమునకై బోధింతురు. జర్మనీ, ఫ్రాన్సు, మలయా, అమెరికా, ఆఫ్రికా, ఆక్లండు, ఇంగ్లండు, ఫిజీదీవులు, ఆస్ట్రేలియా వగయిరాలకు చెందిన విదేశీయులు హితులు (హిందూదేశమువారిని గూర్చి చెప్పనేల) సద్గురు సమక్షమున "పూర్ణయోగశిక్షణ" నందుచు స్వదేశ గమనానంతరము యోగ వేదాంత వ్యాప్తికై, బద్ధకంకణులగు బహుసంఖ్యాకులనిట సదా సంవత్సరపు టన్ని నెలల చూడ నగును. అఖిల ప్రపంచమున జాతి, మత, లింగ, వయోభేదము గాని, దేశకాల వ్యవస్థాభేదముకాని లేక శిష్యులుగలరని, తిరిగి యిప్పటున తెలుపుటనవసరము. కోరినంత మాత్రముననే స్త్రీ, పురుషుల నెవరినైనను సరే తమశిష్యులుగ నంగీకరింతురు. ఈయన సిద్ధసంకల్పులని, సంకల్పసిద్ధులని, వేరే నుడువబని లేదు.

సంవత్సరము పొడుగున ననగా 365 రోజులు, శివానందాశ్రమ దేవాలయమున నత్యధిక ప్రాముఖ్యమగు సజీవ జీవన్ముక్త పురుషులగు "అవతార" శివానంద భగవానుల దర్శనాశీర్వాదములకై, మనోరథసిద్ధులకైవచ్చి సేవించు యాత్రికబృందమున కంతుండదు. ఇది వాస్తవిక విషయము.

శ్రీ శివానంద భగవానులీజన్మమున మాత్రమే జీవన్ముక్తులుగారు. ఈయన ప్రస్తుత జన్మతో కలుపుకొని మూడు

జన్మలుగ 'జీవన్ముక్తులై' శ్రీ సుబ్రహ్మణ్యావతారులై, భాసిల్లు చున్నారు. తొలిజన్మమున శ్రీసుందరమూర్తి నాయనారుగను, నాయనయే శ్రీ వడలూరు రామలింగస్వామి వారిగ, ననంతరము శ్రీ వడలూరు రామలింగస్వామివారే, ప్రస్తుత శివానందులుగ నవతరించిరి. అనగా శ్రీ శివానందులు త్రిగుణ జీవన్ముక్తులు. ఇప్పటి జన్మతో కలుపుకొని శ్రీ శివానందులు మూడు జన్మలందును నాత్మ సాక్షాత్కృతి నొందినవారే. ఏల నిటు ముమ్మారవతరించవలసి వచ్చినదన భగవదాదేశముచే తమకొరకేమాత్రమునుగాక ప్రపంచోద్ధరణకు మాత్రమే ఈ వివిధ స్ఫురణలు "పాదసేవకుల" (స్వీయము)చే వివిధ సమయముల సమర్పింపబడి శ్రీ శివానంద భగవానులచే వ్యంగ్యముగ నామోదింపబడినవి. ఈవిషయముపట్ల స్వకీయపు ముద్రితాంగ్ల వ్యాసములును గలవు. ఇట్టి దివ్యపురుషుని "యుగవిభూతి" "అవతార్" "విశ్వప్రభువు" నను టెంతయు నతిశయోక్తి కాక సమంజసమే.

శ్రీ సద్గురు స్వామిశివానంద సరస్వతి మహారాజుల వారి నిత్యపూజాపారాయణ నిమిత్త ముపయోగింపబడు అష్టోత్తర శతనామావళి. యీ నామావళి శ్రీ ఆదిగురు శంకరాచార్యులవారి నామావళి ననుసరించిన శ్రీ స్వామి "శివానంద పాదసేవక్" S. P. S. శ్రీ స్వామి శ్రీనివాసానందుల వారిచే సంగ్రహింపబడినవి. ఇవి ఋషీకేశ ఆశ్రమములో "పాదపూజ" కుపయోగింప బడుచున్నవి. చాలశక్తివంతము లైనవి.

# నామావళి

ఓం ఓంకారరూపాయ నమః
,, సద్గురవే నమః
,, సాక్షాచ్ఛంకర రూపధృతే నమః
,, శివానందాయ నమః
,, శివాకారాయ నమః
,, శివాశయనిరూపకాయ నమః
,, హృషీకేశ నివాసినే నమః
,, వైద్యశాస్త్ర విశారదాయ నమః
,, సమదర్శినే నమః
,, తపస్వినే నమః 10
,, ప్రేమరూపాయ నమః
,, మహామునయే నమః
,, దివ్యజీవనతత్త్వ సంఘ ప్రతిష్ఠాత్రే నమః
,, ప్రబోధకాయ నమః
,, గీతానంద స్వరూపిణే నమః
,, భక్తిగమ్యాయ నమః
,, భయాపహాయ నమః
,, సర్వవిధేయ నమః
,, సర్వగాయ నమః
,, నేత్రే నమః 20

ఓం త్రయీమార్గ ప్రదర్శకాయ నమః
,, వైరాగ్యజ్ఞాన నిరతాయ నమః
,, సర్వలోక హితోత్సుకాయ నమః
,, భవభయప్రశమనాయ నమః
,, సమాధి గ్రంథకల్పకాయ నమః
,, గుణినే నమః
,, మహాత్మనే నమః
,, ధర్మాత్మనే నమః
,, స్థితప్రజ్ఞాయ నమః
,, శుభోదయాయ నమః 30
,, ఆనంద సాగరాయ నమః
,, సారాయ నమః
,, గంగాతీరాశ్రమస్థితాయ నమః
,, విష్ణుదేవానందదత్త బ్రహ్మజ్ఞాన ప్రదీపకాయ నమః
,, బ్రహ్మసూత్రోపనిషదాంగ్లభాష్య ప్రకల్పకాయ నమః
,, విష్ణ్వానంద చరణయుగ్మ సేవాజాత సుబుద్ధిమతే నమః

ఓం మంత్రమూర్తయేనమః
,, జపపరాయనమః
,, తంత్రజ్ఞాయనమః
,, బలినేనమః 40
,, ఉమారమణ పాదయుగ్మ సతతార్చనలాలసాయనమః
,, పరస్మై జ్యోతిషేనమః
,, పరస్మై ధామ్నేనమః
,, పరమాణవేనమః
,, పరాత్పరాయనమః
,, శాంతమూర్తయేనమః
,, దయాసారాయనమః
,, ముముక్షుహృదయ స్థితాయనమః
,, ఆనందామృతసందోగ్ధ్రేనమః
,, అప్పయ్యకులదీపకాయ నమః 50
,, సాక్షిభూతాయనమః
,, రాజయోగినేనమః
,, సత్యానంద స్వరూపిణేనమః
,, అజ్ఞానామయ భేషజాయ నమః
,, లోకోద్ధారణ పండితాయ నమః
,, యోగానందరసాస్వాదినేనమః

ఓం సద్విచార సముజ్జ్వలాయ నమః
,, ఆత్మారామాయనమః
,, గురవేనమః
,, సచ్చిదానంద విగ్రహాయ నమః 60
,, జీవన్ముక్తాయనమః
,, చిన్మయాత్మనేనమః
,, నిస్త్రైగుణాయనమః
,, యతీశ్వరాయనమః
,, అద్వైతసార ప్రకటవేద వేదాంతతత్త్వగాయనమః
,, చిదానంద జనాహ్లాద నృత్యగీత-ప్రవర్తకాయనమః
,, నవీనజన సంత్రాత్రేనమః
,, శ్రీ బ్రహ్మ మార్గప్రదర్శకాయనమః
,, ప్రాణాయామ పరాయణాయనమః
,, నిత్యం సముప్రాశ్రితాయ నమః 70
,, జితమాయాయనమః
,, ధ్యానమగ్నాయనమః
,, క్షేత్రజ్ఞాయనమః
,, జ్ఞానభాస్కరాయనమః

ఓం మహాదేవాదిదేవాయ నమః

,, కలికల్మష నాశనాయనమః

,, తుషారశైల యోగినేనమః

,, కోటిసూర్య సమప్రభాయ నమః

,, మునివర్యాయ నమః

,, సత్యయోనయే నమః 80

,, పరమపురుషాయ నమః

,, ప్రతాపవతే నమః

,, నామసంకీర్తనోత్కర్ష ప్రశంసినే నమః

,, మహోద్యుతయే నమః

,, కైలాసయాత్రా సంప్రాప్త బహుసంతుష్టచేతసేనమః

,, చతుస్సాధన సంపన్నాయ నమః

,, ధర్మస్థాపన తత్పరాయ నమః

,, శివమూర్తయే నమః

,, శివపరాయనమః

,, శిష్టేష్టాయనమః

,, శివేక్షణాయనమః

,, చతురంత మేదినీ వ్యాప్త సువిశాలయశోదయానమః

ఓం సత్యసంపూర్ణ విజ్ఞాన సుతత్త్వైకసులక్షణాయ నమః

,, సర్వప్రాణిషు సంజాత భ్రాతృ భావాయ నమః

,, సువర్చలాయనమః

,, ప్రణవాయనమః

,, సర్వతత్త్వజ్ఞాయనమః

,, సుజ్ఞానాంబుధిచంద్రమసే నమః

,, జ్ఞానగంగాస్రోతస్స్నాన పూతపాపాయనమః

,, సుఖప్రదాయ నమః 100

,, విశ్వనాథకృపా పాత్రాయ నమః

,, శిష్యహృత్తాప తస్కరాయ నమః

,, కల్యాణగుణ సంపూర్ణాయ నమః

,, సదాశివపరాయణాయ నమః

,, కల్పనారహితాయనమః

,, వీర్యాయనమః

,,భగవద్గానలోలుపాయనమః

,, సద్గురుస్వామి శివానంద సరస్వతినే నమః 108

శ్రీ స్వామి శివానందాజీ మహారాజువారి తీవ్రభక్తుల (ardent devotees) ప్రయోజనము కొఱకై జగత్ప్రభు శిష్యులగు స్వామి శ్రీనివాసానందు లీ దిగువ మంత్రము లొసగెను.

| | |
|---|---|
| 1. ఓం నమశ్శివానందాయ<br>2. ఓం నమో భగవతే శివానందాయ | జపమునకు, లిఖిత (వ్రాత పూర్వక) జపమునకు, సంకీర్తనకు యీ మంత్రములు వాడనగును. |
| 3. ఓం శ్రీశివానందమమ దేహి కరావలంబమ్ (ప్రభు శివానందా! నాకు నీయూత నిచ్చు హస్తమునొసగుము అనగా నాకు నీ చేయూత నిమ్ము.) | ప్రార్థన కొఱకగు మంత్రము |
| 4. ఓం శివానందచరణౌ శరణం ప్రపద్యే (శ్రీశివానంద పాదముల కడనే శరణందు చున్నాను.) | ఆత్మార్పణ మంత్రము |
| 5. ఓం శ్రీ శివానంద శరణం మమ (ప్రభు శివానందయే నాశరణ్యము-అండ) | ఆత్మార్పణ కొరకగు మరి యొకమంత్రము |
| 6. ఓం శ్రీ సద్గురుస్వామి శివానందసరస్వతయే నమః | సమస్త కార్యకృత్యముల ప్రారంభమున నుచ్చరింపనగు మంత్రము. |

7. ఓం శ్రీ శివానందార్పణ మస్తు — సమస్త కార్యకృత్యములు సమాప్త్యనంతరము శివానందార్పణగ సమర్పించుచు నుచ్చరింప నగునది.

8. ఓం తత్పురుషాయ విద్మహే,
శివానందాయ ధీమహి
తన్నో బ్రహ్మప్రచో
దయాత్

. ఓం శివానందాయ విద్మహే
జీవన్ముక్తాయ ధీమహి, తన్నో
నిర్గుణ బ్రహ్మప్రచో
దయాత్

శివానంద గాయత్రీ మంత్రములు

10. ఓం సుందరమూర్తి విద్మహే, రామలింగాయ ధీమహి,
తన్నో శివానంద ప్రచోదయాత్.

ఓం ఓం ఓం

# "భక్తి, సంకీర్తనా"వతరణ.

పూర్వాశ్రమమున బొంబాయి ప్రాంతములలో నన్నుద్యోగ రీత్యా నుండుతరి 1945 నుండి 1953 లోని సన్న్యాస స్వీకార పర్యంతము నెన్నెన్నియో నాంగ్లమున గల శివానంద గ్రంథముల కొనియు, తెప్పించియు, నితరులవద్ద బదులు పుచ్చుకొనియు, నమిలి మ్రింగుట తటస్థమైనది. అట్టివాటిలో పైగ్రంథ మొకటి. ఉద్యోగ విరమణానంతరము పెంటపాడు (పశ్చిమ గోదావరిజిల్లా) లోని యొక డాక్టరుగారి వద్ద బదులు పుచ్చుకొని నీ "భక్తి, సంకీర్తన" గ్రంథమును ప్రప్రథమమున చదివితిని. చదువునపుడు తర్జుమా నొనర్ప ప్రేరేపింప బడలేదు. కాని కొంతకాలము జరిగిన పిమ్మట నందుగల విషయ ప్రాశస్త్యమునుబట్టి యేలకో సంపూర్తిగ తర్జుమా నొనర్ప గలందులకు 1949-50 లలో పూనుకొంటిని. ఇంకను మూడు వంతుల ముప్పాతికభాగము సన్న్యాసాత్పూర్వమే తర్జుమా యొనర్పబడినది. తర్జుమా యొనర్పబడిన లిఖితపాత్రముల ననుసరించి "ముముక్షువు" (ఏలూరు) పత్రికా సంపాదకవర్గము ప్రేమతో కొలదిభాగము మాత్రము ప్రచురింప గల్గినది. ఈ పుస్తక ప్రచురణపట్ల నే చూపుచున్న విసుగును భరింపలేక, శ్రీ గురుదేవ శివానందులపట్లగల నకుంఠితగురుభక్తిని, "పాదసేవకుల" (సీయము) పట్లగల నపారప్రేమను, నొక్కుమ్మడి వ్యక్తపరచుటకా యన్నట్లు, శ్రీ నండూరి వేంకటసుబ్బారావుగారు, (ఏలూరు) లుప్తభాగముల నాకు తీరుబడిలేమిచే నా కోరికపై తాము తర్జుమానొనర్చి పూర్తిచేయుటయును, శివా

నంద పాదపంకజముల కాలక్రమమున సమర్పించుటకును, ఆయనంతటాయన ముందంజవేసిరి. ఇందులకై శ్రీ గురుదేవుల తరఫున, నాతరఫున, మాహార్దిక, సంతసపూర్వక, కృతజ్ఞతా ప్రణామములతోడ మా ప్రేమైకాశీర్వాదాక్షతల, వారిపైనిదె జల్లుచున్నాడ.

ఈ సద్గ్రంథము నేటికి పది (10) సంవత్సరములకు పూర్వము, సన్న్యాసమును స్వీకరింపకమునుపు, చాలవఱకు తర్జుమాయైనది. కాన సంపూర్తిగ సరిచూచుటలు, సవరణలు, విషయసూచికలు, మొదలగునవి జేయుటకై తర్జుమాకు పెక్కు సంవత్సరములు పట్టె. లుప్తభాగముల తర్జుమాకువలెనే సిద్ధహస్తులై నప్పటికిని సంకోచించి సాహసింపకుండిన వారి నెటులనో ప్రోద్బల పరచి యొప్పించి, వారిపైననే, వలదనినను సమస్తభారమును విడిచితి.

ఇక, నిట నాశ్రమమునగల పాతిక (25) మంది తెలుగు వారిలో, సాక్షీప్రతులను వ్రాయుటయందు, పరమపూజ్యులు, వృద్ధులు, నగు శ్రీ గున్నుదప్పు వెంకట రంగారావుగారిని మాత్రమే సర్వశ్రేయస్కరమైన యెంపుడు [choice] గ భావించి కోరుటయేతడవుగ, వారి యారోగ్యము సరిగ లేన ప్పటికిని, కేవలము గురుదేవ శివానందభగవానులయెడ భక్తి, "పాదసేవకుల" (స్వీయము) యెడ విపరీతమైన ప్రేమ, మాత్రమే వీరి నందుల కంగీకరింపచేసినవి. వీరికి పెట్టని సొమ్ములగు లౌకికానుభవము, భాషాపరిజ్ఞానము, గ్రంథ పాండిత్యము, పరిపూర్ణాధ్యాత్మిక హృదయము, మిక్కిలి మనోజ్ఞమైన హస్తలిపి, (దస్తూరి) యే, నన్ను వీరిపట్లాకర్షింపచేసినవి. వీరియ్యకొని గ్రంథముద్రణకై సహకరించినందులకు ప్రణామ శతములు.

ఇష్టపడిన "ముముక్షువు" పత్రికా సంపాదకులకును విశేషగ నా కృతజ్ఞతా వందనముల సమర్పింతును.

నిఖిలాంధ్ర ప్రజాకోటియొక్క నాధ్యాత్మిక శ్రేయస్సు నకై, నీయుత్తమగ్రంధమును ప్రేమతో సమర్పించుచున్న "శ్రీరామానంద మహారాజు" లకు నానందస్మితాశీర్వాద ప్రణామములు.

ఆఖరిగ నీయుద్గ్రంధమును తప్పనూ నొసగ్ని నాత్సుక్య పరచిన సర్వాత్మీయుల నొకపరి సంస్మరించి కృతజ్ఞతా శ్రుత ర్పణ మొనర్చు చున్నాను.

ప్రజాభిరుచి "భక్తి" పై మ్రొగ్గును కాన నీ "భక్తి, సంకీర్తన" గ్రంధము పలు ముద్రణ లందగలదని శివానందైక హృదయులము, ననువాదకులమ. గు "శ్రీరామానందుల," "పాదసేవకుల," యొక్క సహజమైన, నాశయము.

"శివానంద పాద సేవక్"

S. P. S. స్వామి శ్రీనివాసానంద సరస్వతి.

శివానందాశ్రమము.

హృషీకేశము, డెహ్రాడూన్ జిల్లా.

హిమాలయములు.

# మా స్వవిషయము

## 'శివానందపాదసేవక్'

## S. P. S. స్వామి శ్రీనివాసానంద సరస్వతి

("గురుచరిత్ర" ను దృక్పథములో నుంచుకొని లిఖింపబడినది.)

పూర్వాశ్రమ (సన్యాసాత్పూర్వ) వివరములు

జననము:- 11-2-1922 (చిత్రభాను సంవత్సర మాఘపూర్ణిమ శనివారము 11-30 P.M ఆశ్లేష తృతీయ పాదం) బ్రాహ్మణావతంసులు, కృష్ణ యజుర్వేదము. భారద్వాజ గోత్రము. ఇంటిపేరు "విష్ణువఝ్ఝుల" వారు.

జన్మనామకరణము:-సుబ్బారావు.

ముఖ్య విద్యార్హత:- బి. ఏ. [B.A. Mathematics] హిందీ రాష్ట్ర భాష (ఉర్దుతో సహా).

జన్మస్థానము, సంపూర్తి విద్యార్థిదశ:-విజయనగరము. విశాఖపట్టణము జిల్లా.

దత్తతనామము:-రామారావు (చిలకంపాడు, తాడేపలిగూడెం తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లా)

+ ...

ఉద్యోగము:-కేంద్రప్రభుత్వము [Military Accounts Department] పూనా, వాల్తేరు, ఔరంగాబాదు (దక్కను) బెల్గాము (వాల్తేరు తప్ప మిగిలిన వన్నియు బొంబాయి రాజధానిలో గలవు) తొల్దొల్త చదివిన నాంగ్లపు శివానంద గ్రంథములు. యోగాసనములు (పూనా 1945) భక్తుల జీవిత

ములు-మొదటి భాగము. బ్రహ్మచర్యాభ్యాసము. (సికింద్రాబాదు-1946)యోగజీవన ప్రకాశిక. మొదటిరెండు భాగములు [Sure Ways for Success in Life & God realisation] నాసికరోడ్డు 1947) తత్త్వము, బోధలు [Philosophy & Teachings - బెల్గాము-1948] భక్తుల జీవితములు - రెండవ భాగము (మీరజ్ - 1948) ఆకస్మిక [instantaneous] పరివర్తన మొనర్చిన గ్రంథములు:- (i) Sure Ways for Success inLife&Godrealisation.(యోగజీవనప్రకాశిక-మొదటి,రెండు భాగములు)(ii) "Philosophy&Teachings" (బృహద్గ్రంథము) శివానందులతో నుత్తరముల ద్వారా ప్రథమ పరిచయము :- 3-5-1948. ఉద్యోగ విరమణ :- 4-10-1948. ఉద్యోగ విరమణానంతరము స్వగృహ వాసమున చదివిన గ్రంథములు :- "BHAKTI & SANKIRTAN" "Science of Pranayam" "Kundalini Yoga" "Upanishad Drama" "Practice of Yoga" "Easy steps to Yoga" "Sivagyan's" Life of Sivananda" ... ... ... వగైరా.

దర్శించిన క్షేత్రములు:-పూరీజగన్నాథము, తిరుపతి, శ్రీ కాళహస్తి, అన్నవరము, అగసవిల్లి, సింహాచలము, పండరీపురము, నాసిక, త్ర్యంబకేశ్వరము, శృంగేరి, భద్రాచలము, ప్రయాగ వగైరా. స్వగృహవాసము (శివానంద నగరము-చిలకంపాడు) 1948-1952. శ్రీ సంతానయోగ సుబ్రహ్మణ్యేశ్వర ప్రతిష్ఠ (శివానందనగరము, చిలకంపాడు, తాడేపల్లిగూడెంతాలూకా పశ్చిమ గోదావరి జిల్లా) 23-11-1952 నామ పరివర్తనా క్రమము:-సుబ్బారావు, రామారావు, శ్రీనివాసానంద, ఇష్టదైవము:-ఏడుకొండల శ్రీనివాసుడు (వేంకటేశుడు) గృహ

త్యాగము : 16_1_1953, శివానంద ఆశ్రమము (శివానంద నగరము) న చేరిన తేదీ : 24-1-1953, మంత్రోపదేశమందిన తేది : 29-1-1953 మాఘపూర్ణిమ. వాస్తవి కాధ్యాత్మిక జీవితములో మిక్కిలి ప్రియాతి ప్రియమైన తేది : 7-2-1949 (రథసప్తమి)

మూడు పంక్తులలో పూర్వజీవితము.

1922—1943 - (B. A.) డిగ్రీవరకు విద్యార్థిదశ వగైరా.
1944—1948 - ఉద్యోగ ప్రవృత్తి వగైరా.
1949—1952 - స్వగృహావాసము, అంతర్ముఖ జీవనము, శివానందులతోడి యవిరళ సాంగత్యము. దివ్యజీవనసంఘ శాఖానిర్వహణ వగైరా- బిరుదము. "కవిరత్న" (శివానంద ప్రసాదితము)

సన్న్యాసదీక్షా స్వీకారము : 12_2_1953 మహాశివరాత్రి.

సన్న్యాసానంతర ముఖ్యవివరములు.

1957 లో సంపూర్తిగ పదునొకండు (11) నెలల పర్యంతము కేరళ, కన్నడ, తమిళ, ఆంధ్ర, ఉత్కళ (ఒరిస్సా) బెంగాల్, బీహార్, ఉత్తర ప్రదేశములలో పర్యటన. అదనముగ దర్శించిన క్షేత్రములు. కేదారము, బదరీ నారాయణము, హరిద్వారము, కంఖాళ్, డెహ్రాడూన్, దేవప్రయాగ, జ్యోతిర్మఠము, కోట్ద్వారా, ల్యాంసుడౌన్, వగైరా.

సేవాకార్యము : సంపూర్తి తెలుగు, యితర విభాగములు, ఆంగ్లమున, తెలుగున, వ్యాసముల ప్రచరించు

మొత్తము పత్రికలసంఖ్య - ముప్పదియారు (36) "అవతార్" "శివానందభగవానులు" పిలుచు నాదుకపేరు. "పాదసేవక్" అందఱకు నాశ్రమములో నితరత్ర సర్వత్ర తెలుగు, నాంగ్ల ఉత్తర. పత్ర శాఖా విభాగములలో సుపరిచయమైన సంజ్ఞాక్షరములు S. P. S. (Sivananda Pada Sevak) అసలు పేరు : స్వామి శ్రీనివాసానంద సరస్వతి, ఉత్తరములలో తప్పని సరిగ వ్రాయవలసిన చిరునామా:- "శివానంద పాద సేవక్" S. P. S. స్వామి శ్రీనివాసానంద సరస్వతి, శివానందాశ్రమము, హృషీకేశము. హిమాలయములు.

" పా ద సే వ కు ల "

ఆత్మార్పణతోడ 1953 లో శివానందులు ముద్రించిన గ్రంథము How to Cultivate Virtues & Eradicate Vices.

## శ్రీ రామానందాజీ మహరాజ్

"ఆధ్యాత్మరత్న" "జ్ఞానయజ్ఞరత్న" శ్రీ నండూరి వెంకటసుబ్బారావుగారు, B. A., S. D. L. S., దక్షిణపువీధి, ఏలూరు, పశ్చిమగోదావరిజిల్లా.

వీరాంధ్రలో నాధ్యాత్మిక లోకమునకు, నందును ముఖ్యముగ శివానంద భక్తకోటికి, సుపరిచితులు. శ్రీ శివానందులయొక్క అనన్య, అచంచలభక్తులు. "అవతార్" శివానంద భగవానులయొక్క "పాదసేవ" కై సర్వత్యాగము, బలిదానములకైనను వెనుకంజవేయరు. వీరిప్పటివరకు ప్రస్తుత "భక్తి - సంకీర్తన" గ్రంథముతోడ కలుపుకొని నేకాదశ 11 గ్రంథముల ప్రచురణను పూర్తియొనర్చిరి. ఇంకను ప్రచురింప

వలసినవి సుమారొక షట్కము (6) వరకు నుండును. వీరి ప్రచురణలలో మిక్కిలి బృహద్గ్రంథము శ్రీ శివానందుల “భగవద్గీతాభాష్యము.” వీరిలో జనాత్యమేనాడో నశించినది. ఉదాహరణకు గతమున గీతాభాష్య ప్రచురణోత్సవమును భగవానుడెన్నెన్నియో పరీక్షలకు వశగానిని గురిచేసి యుంచెను. కాని వాటన్నిటిని నిశ్చలులై సహించుకొని నిజమైన యౌగిక (Spiritualised) జీవనమును గడుపుచుండిరి. కావననే స్వకీయమును సన్న్యాసాత్మ్యమును స్వగురువగు శ్రీగురుదేవుల “శ్రీనివాసానంద” యని పిలుచుకొనుటకెంత యుత్సహించి యలవాటుపడితినో, నటులనే వీరిని “రామానంద” యని పిలుచుటకును, నంతర్వాణినే దివ్యాదేశ మందినటులొనర్చు చుంటి. ఈనాడు “పాదసేవకులు” (స్వీయము) మాయందువలె “పాదసేవకులు”గ (నొక్క ఆంధ్రప్రదేశమునందే గాదు, నాంధ్రేతరమునగూడ) విరాజిల్లుచుండెనన దానికి కారణము శివానందుల తమపరి శ్రీరామానందుల పేర్కొనకతప్పదు. 1957 లోని 11 నెలల పర్యటనలో వీ “పాదసేవకుల” కొనర్చినసేవ యింతింతనరాదు. ఆంధ్రులలో నింతవరకు నా హృదయపీఠమున నాసీనులై నాహృదయమును కొల్లగొన్న శివానందభక్తులలో వీ రొక్కరే. వీరు నిష్కపటహృదయులు. నిరాడంబరస్వభావులు. నిష్కామ్య సేవాకాంక్షులు. వీరి కనవరత విద్యాదానమున బహు ప్రీతి. భగవద్గీతార్థము వీరు సదా వివిధభంగులనొనర్చు “జ్ఞానయజ్ఞసేవ” “ఆధ్యాత్మిక ప్రసారము”ను వేరితరులకైగాక తమకై తామాధారపడుచు నొనర్చుచున్నవి బహుప్రశంసా పాత్రములు. వీరికి సదా మా శుభాశీస్సులు.

## శ్రీ గుమ్మడపు వేంకట రంగారావుగారు

వీరు పూర్వాశ్రమమున, కృష్ణాజిల్లా నందిగామ తాలూకా "జుజ్జూరు" గ్రామ నివాసులు. గౌరవ కుటుంబీకులు వీరు స్థానిక స్వపరిపాలనా (Local self Government) సంస్థలలో తాలూకాబోర్డు సభ్యులుగ, జిల్లాబోర్డు సభ్యులుగ, మండల విద్యాసంఘ (District Educational Council) సభ్యులుగ, తాలూకాబోర్డు అధ్యక్షులుగ, హోదాలను నేక శ్రీవముగ ప్రజామోదముతో వహించి విద్య, వైద్య, పథికాది వివిధ రంగములలో బహుముఖ ప్రజ్ఞతో ప్రజాసేవ నొనర్చి యుండిరి. ఇట్టి యాదర్శ సేవల మూలముననే "కంచికచర్ల" నుండి "జుజ్జూరు" నకు వేయబడిన పక్కా (మెటలు) రోడ్డునకు, అప్పటి జిల్లాబోర్డు అధ్యక్షులగు శ్రీ మీర్జాపురం రాజా వారిచే ప్రారంభోత్సవము జరుపబడి "రంగారావురోడ్డు" అని వ్రాయబడిన ఫలకము రోడ్డు ప్రారంభ ప్రదేశమున నిర్మించిన స్థంభమున స్థాపింపబడి రోడ్డు "రంగారావురోడ్డు" గ ప్రకటింపబడినది. వీరు 1922 నుండి 1939 వరకు ప్రజా సేవలో సంపూర్తిగ నిమగ్నులయి యుండిరి.

వీరి ప్రస్తుత వయస్సు 70 సంవత్సరములు. వీరు కేవల పారమార్థిక చింతతో శేషజీవితమును గడుప 23-3-1957 న హృషీకేశమునకు వచ్చి, శ్రీ శివానంద భగవానుల వద్ద 14-4-1958 (ఏకాదశి) న మంత్రోపదేశ మొందిరి. వీరిప్పటి వానప్రస్థ జీవితములో "బదరీ నారాయణము" ను కూడ సందర్శించి, యచ్చట మూడు నెలలు జప ధ్యానాదులతో భారతదేశపు పలు మహాత్ముల సత్సాంగత్యమున గడపిరి. శ్రీ బదరీనాథుని యనుగ్రహమున నిట శివానందాశ్రమమున

7-10-1958 న ప్రవేశించిరి. ఇట ప్రతినిత్యము 24 గంటలును సంకీర్తింపబడు "కలిసంతరణ" మహా మంత్రమగు "హరే రామ" మంత్రమును నాలుగు గంటల కాలము దినము సంకీర్తించుచును నితరత్ర గురుసేవ, దైవసేవలలో కాలమును గడుపుచు జీవితమును ధన్య మొనర్చు కొనుచుండిరి. వీరికి మా మంగళ మయాశీర్వాదములు.

లేఖ

ఆనందకుటీరము, మునికీరేతి, హృషీకేశము.
6-8-1941.

ప్రియ నారాయణా!

భక్తియే భగవానుని యెడ నుత్కృష్టానురాగము. అది భక్తులయొక్క కిరీటమున కోహినూర్ వజ్రము. అది తదుపరి జ్ఞానముగ పుష్పించును. అది మోక్షము లేక భగవత్సాక్షాత్కారమునకు తోడ్పడచూపును.

దానిని సత్సంగము, జపము, కీర్తన, ప్రార్థన, ధ్యానము, భక్తులసేవగుండా కృషిచేయుము.

భక్తిలేనివాని జీవనము నిజమైన చావే. ప్రహ్లాదుని, ధృవుని, జ్ఞప్తియుంచుకొనుము. నీవుతేజము (Inspiration) ను గ్రహింతువు.

ప్రాపంచికత, వాసనలు, కాంక్షలు, (Cravings) గర్వము, ఆసక్తి, అహంభావము కాముయును, భక్తికి శత్రువులు. వాటిని హతమొనర్చుము. భగవానునిపట్ల సంపూర్తి యాత్మసమర్పణ నొనర్పుము.

నీ హృదయము భక్తితోడ పూరింపబడుగాక! నీవు సదా సర్వదా భగవానునిలో సుప్రతిష్ఠితమగుదువుగాక!

శివానంద.

భక్తి, సంకీర్తనలు, కృషిసలుపుము. తొమ్మిదివిధము లగు భక్తి (నవవిధభక్తి ని పెంపొందింపుము. భాగవతుల సేవింపుము. సర్వత్ర నా పరమాత్ముని నంతర్యామిత్వపు (Indwelling) టునికి ననుభవింపుము. శ్రీకృష్ణునియొక్క దర్శనము నీ స్వతః జన్మముననె కాదా స్వతః క్షణముననె, కలిగియుండుము. మహదైశ్వర్యయుత భాగవతునిగ, జీవన్ముక్తునిగ, నయి సంతోసము. ఆనందము. శాంతుల, సర్వత్ర చుట్టుప్రక్కల, నల్లెడల ప్రసరింప చేయుము.

శివానంద.

---

ఆనందకుటీరము, మునికిరేతి, హృషీకేశము.
8 ఆగష్టు 1941

ప్రేమైక గోవిందా.

దేవుని నామమును గానమొనర్చుటయే. కీర్తన. భగవాను నొందుటకై, నది మిక్కిలి సులభమైన. మిక్కిలి నిశ్చయమైన. నింకను మిక్కిలి సంక్షేపమైన పంథ.

కీర్తనయే నమృతము కీర్తనయే నాత్మకు దివ్యాహారము, కీర్తన నిన్నమృతుని (మోక్షప్రాప్తుని) గ చేయగలదు.

మహామంత్రము.

హరేరామ హరేరామ రామరామ హరేహరే॥
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

నుకీర్తింపుము.

నీవు కీర్తనద్వారా భగవాను నొందుదువు గాక.

శివానంద.

# తొలి పలుకు.

భక్తిమార్గములో నారదునియొక్క భక్తిసూత్రము లట్టివో ఋషి శాండిల్యుని భక్తి సూత్రములును జిజ్ఞాసుల కంతయుపయోగమైనవి. ప్రతియొక్క సూత్రమును గణింప రాని విలువగలమణియే. ప్రతియొక్క సూత్రములోను భావ గాంభీర్యత [Depth of thought] గలదు. ఈ సూత్రములు మిక్కిలి సొంపగు విధమున భక్తియొక్క స్వభావము, భక్తి యొక్క కృషి, భక్తియొక్క రకములు, నధికారులు లేదా భక్తి మార్గమును త్రొక్కుట కర్హులగు మనుజులు, భక్తి యొక్క వస్తువు. (ధ్యేయము) భక్తియొక్క ఫలములను గూర్చి చర్చించును.

"నారద భక్తిసూత్రములలో 84 సుసూక్ష్మ విజ్ఞాన నుడులు (Aphorisms) గలవు. శాండిల్య భక్తి సూత్రములు 100 సుసూక్ష్మ విజ్ఞాననుడుల గలిగియున్నది. సూత్రమన, గంభీరార్థముతో గర్భితమైనట్టి సంస్కృతములోని క్లుప్తమగు, హ్రస్వమైన శ్లోకము. గొప్ప తాత్త్విక భావములు (Philosophical thoughts) సూత్రములో సంక్షిప్త మొనర్చబడును గంభీరమైన తాత్త్విక భావనామణులు దేనిపై గ్రుచ్చబడునో నట్టి దారమే సూత్రము. హిందూదేశపు ఋషులందరు తమ భావములను, నాధ్యాత్మికాను భవములను, సూత్రముల రూపమున వ్యక్తపరచిరి గాఢమగు నాంతర్యదృష్టి, సుస్పష్ట మైన జ్ఞానదృష్టి. (Intuition) తో నుండు నాత్మ సాక్షా త్కారపు ఋషులు మాత్రమే సూత్రములను వ్రాయజాలు దురు, విశదమైన సంపూర్తియైన వ్యాఖ్య (Commentary) సహాయము లేనిదే నీ సూత్రముల మనము గ్రహింపజాలము.

నారదఋషి తన సూత్రములలో జీవుడు, భగవానుల మధ్య తేడా (భేదము) యున్నదని చూపించును. కాని శాండిల్యఋషి వారి యేకత్వము (Oneness) ను గుర్తుచేయును.

శాండిల్యుని భక్తిసూత్రములు మూడధ్యాయములు గల్గియుండును. ప్రతియొక్క యధ్యాయము రెండు భాగములు గల్గియుండును. మొదటి యధ్యాయముయొక్క మొదటి భాగములో శాండిల్యఋషి భక్తియొక్క నిర్వచనము నొసగి, భక్తి, జ్ఞానమునుండి భిన్నమనియు, నుత్కృష్టభక్తి లేక పరాభక్తి యేకత్వము, నమృతత్వము, (మోక్షము)ల యొక్క ప్రాప్తికి దారి తీయుననియు, తెలుపును. మొదటి యధ్యాయములోని రెండవభాగములో భక్తియొక్క స్వభావము, యోగము, జ్ఞానము, నింకను వాటియొక్క యంతస్సంబంధముల (Inter-relations) గూర్చి యాయన చర్చించును. రెండవ యధ్యాయముయొక్క మొదటి భాగములో జ్ఞానమంతరంగ సాధన (Internal means) గను, నల్పతర రకపుభక్తి, భక్తి యొక్క బహిరంగసాధన (External means) గను నాయన చూపును. రెండవ భాగములో నాయన నుత్కృష్టభక్తి (ముఖ్య లేక పరాభక్తి) యొక్క కారణమగు పారతంత్ర్య (Secondary) భక్తి సేతల (గౌణభక్తి) యొక్క విస్తృత వర్ణన నొసగును. మూడవ అధ్యాయ మందలి మొదటి భాగములో భక్తివస్తువు (ధ్యేయము) ను గూర్చి యాయన ప్రస్తావించును. రెండవభాగములో నాయన జీవుడు లేక జీవాత్మ భగవంతునితోడ తన యేకత్వమును పరాభక్తిగుండా ప్రత్యేకానుభవమొంది యంత్యవిముక్తి [Final emancipation)ని సంపాదించునని తెలియచేయును.

అటులగుచో మనయొక్క సంశ్లేష్య (assimila-tion) కు సులభమగు విలీనత (absorption) కై భక్తి సార స్వతమనెడి సముద్రమునుండి మథించి భక్తిసూత్రము లనెడి వెన్నను వెలికెచ్చిన మనపూజ్య శాండిల్య ఋషికి మన గాఢ మగు కృతజ్ఞతా భావమును భక్తిపూర్వకముగా మనము వెల్లడించవలదా ? భక్తిని పెంపొందించుటకు, సంత్యమోక్ష మొందుటకు, మనకు సులభమార్గము చూపిన మన వందనీయ ఋషి శాండిల్యమునకు జయము. ఆయన యొక్క నాశీర్వాద మనయందఱిపై నుండుగాక.

---

# భగవద్దర్శనమునకై ప్రార్థన.

ఓ కరుణాపూర్ణప్రభూ ! కాలము పరుగిడుచున్నది. ఇంద్రియములు తిరుగుబాటొనర్చుచున్నవి. మనస్సు మునుకు చున్నది. మాయ మోహపఱచుచున్నది. మూడు అగ్నులు (తాపత్రయము) కాల్చివేయుచున్నవి. పంచక్లేశములు బాధించుచున్నవి. మిత్రులు లలజడిచేయుచున్నారు. రోగములు నొప్పించుచున్నవి. వేసవికాలపు వేడిమి దహించుచున్నది. ఈగలు, దోమలు, నల్లులు, తేళ్ళు, నన్ను మితముగ గాసి చెందించుచున్నవి. ప్రపంచపు సౌందర్యతలు [Charms] భ్రమింపచేయుచున్నవి. నేను ధారణ (ఏకాగ్రత) నొనర్చుట గాని, ధ్యానించుటగాని చేయలేను. నీయొక్క కరుణాకటాక్షము లేనిదే నాధ్యాత్మికపంథ [Path] లో నేనేమియు చేయ జాలను. ఓ స్వామీ ! (జగదీశా) నీవు కరుణాసముద్రుడవు. నన్నాశీర్వదింపుము. ఆ కరుణాసముద్రమునుండి నేనొక బిందు వొందుచో నదియెండిపోవునా ?

ఓ పూజ్య పురాణపురుషా! జనులు నిన్ను "దీన బంధు, దీననాథ, కృపానిధాన, కృపాసాగర, అనాథరక్షక." యని చాటుదురు. నీ వహల్య, ద్రౌపది, ప్రహ్లాదుడు, ధృవుడు, గజేంద్రుల కాపాడితివి కాని నావిషయములో నీవే మియు చేయ లేదు. నేనింకను బాధ, ఆవేదన, అంధకారము లలో నున్నాను. నేను నీకృప, సాహాయములకై నడచు చున్నాను. ఈ ప్రపంచపు ఓ అదృశ్యస్వామీ! నీవెక్కడను జనితివి? ఓ స్వయంప్రకాశమానముగు భగవాన్! మత్స్యము (చేప) నీరు లేనిదే జీవింపజాలదు. సూర్యకాంత సుమము (పుష్పము) సూర్యుడు లేనిదే బ్రదుకజాలదు. పతివ్రత ఆమె పెనిమిటి (భర్త) లేనిదే మన (జీవింప) జాలదు. మనస్సు ప్రాణము లేనిదే పనికి వహింపజాలదు. దీపపుజ్యోతి నూనె లేనిదే నుండజాలదు. ఆలాగున నేకూడ నీవు లేనిదే నే వసింప జాలను. ఓ పరమేశ్వరా! రా, రమ్ము. నా హృదయము లో నాసీనుడవుకమ్ము. నీవు నాప్రాణములలో ప్రాణమవు. నీవు నా ఆత్మలో నాత్మవు. ప్రార్థింతు. నన్నాశీర్వదింపుము. నాకు దివ్యదర్శనమిమ్ము. నేనీ విరహ (యెడబాటు) బాధ నికెంత కాలము సహింపజాలను.

## భక్తుని యొక్క ప్రార్థన

ఓ దివ్య సౌందర్యమా! ఓ యాధ్యాత్మిక యవినాశ యక్షయ ద్రవ్యమా! ఓ మధుర మధువా! ఓ స్వర్గముల (ఊర్ధ్వలోకముల) ప్రకాశమా! ఓ దేవతల లేదా స్వర్గ పురుషుల [Celestial beings] యొక్క దీపమా! ఓ నాప్రియ

బింధూ! నీవు నా దేహమవు, నీవు శరీరపు టాంతర్య హృద యమవు. నీ వీదేహాపు టంతర్వ్యాపివి. నీవు గర్భాశయమందలి గ్రుడ్డు [Ovum] వు. నీ వుత్పత్తి కారక జీవాణువవు. నీవు స్వయముగ జీవతత్త్వమవు. నీవు తల్లియొక్క గర్భాశయములో వసించు పిండమ [foetus] వు. నీవు నా చక్షువవు. నీవు కంటి లోని నల్లటి భాగమవు నీవు కండ్లలోపల చలించు నాంతర్య కనుపాప [pupil] వు. నన్ను రక్షింపుము. చెడు [Evil] నన్ను స్పృశించ కుండుగాక. నన్నీ ప్రపంచమును మరచిపోనిమ్ము. నేను నిన్ను సదా స్మరింపనిమ్ము. నీ మధుర వక్ష స్థలమునకు నన్ను గైకొమ్ము. నన్ను నీలో శాశ్వతముగ వసింపనిమ్ము.

సమస్త పదార్థముల వ్యాపించునట్టి యో మహాగైన దివ్యప్రేమా! ఈ విశాల విశ్వ జగత్తును నిలబెట్టు నో దివ్య శక్తీ! సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, బుద్ధులకు కాంతి నొసగు నో స్వయం ప్రకాశ జ్యోతీ! ఈ జగత్తు యొక్క నో యారాధన ప్రభూ! ఓ దేవ దేవా! ఓ ప్రభువులకు ప్రభువా! నీవు వేదములకు గర్భమవు (మూలమవు) నీ వీ జగత్తుయొక్క నియామకుడవు. లేదా పరిపాలకుడవు నీవు నా జీవితమునకు జీవితమవు. నాయాత్మ కాత్మవు. ప్రాణము లకు ప్రాణమవు. నా మనస్సునకు మనస్సువు. నా చక్షువులకు చక్షువవు. నా శ్రోత్రములకు శ్రోత్రమవు. నీవు పుష్పములు ప్రాకృతిక దూర ప్రదేశము [Lands cape] లలోని సౌందర్య మవు. నీవు ముఖము, చర్మములలోని మనోజ్ఞత [Charm]వు. నీవు వేదము లందలి ప్రణవమవు. నీవు మధురమగు నిశ్శబ్దతవు. నీవు హృదయములో వసించు దివ్యశాంతివి. నీవు శాశ్వతా నందమవు. నీ వవిద్య లేక మూఢత్వము యొక్క వినాశకారి

యగు జ్ఞానమవు. నీ పవిత్రత్వ (మోక్ష) ప్రదాతవు. నీవు మన్మథుని (కామము - Cupid) యొక్క విధ్వంసకుడవు వ పవిత్రతవు. అజ్ఞానము, సంశయము, మోహము లనెడి తమస్సును పటాపంచ లొనర్చు జ్యోతులలో నీవు పరమ జ్యోతివి. బాధ, దుఃఖము. విచారము, క్లేశముల తొలగించు వట్టి నీ వపరిమిత సంతసమవు. నీ పవిత్రతను లేక సుధవు. నీవు సత్యము, జ్ఞానము, అనంతము, నిత్యము, యనాది, యద్వైతము, యఖండము, పరిపూర్ణము, సచ్చిదానందమవు.

ఓ నీవగునద్వితీయ, యేకైక పరమాత్మా! ఓపూజనీయ యేకైకప్రభూ! ఓపరబ్రహ్మమా! ఈయపరిమితాకాశము (Space) నుండి నాపాదముల వద్ద క్రిందనుండు చిన్నపచ్చగడ్డి కేకు (పరక) వరకు గల నీవిశ్వజగత్తున నీవంతర్యామివై, సంతర్వ్యాపివై కమనై. యుంటివు, ఈసమస్త నామరూపములకు నీవు మూలమవు. నీవు నాకంటె కెంపగువాడవు. నాహృదయము యొక్క దివ్య ప్రేమవు. నాజీవితము యొక్క స్వతః జీవితమవు. నా ఆత్మయొక్క స్వతః మైన నాత్మవు. నాబుద్ధి, యింద్రియ ముల యొక్క వికాసకుడవు. నాహృదయము యొక్క మధుర మగు ననాహత సంగీతమవు యింకను, నాభౌతిక, (స్థూల) మానసిక, (సూక్ష్మ) కారణ, నిర్మాణము (frame)ల యొక్క మూలపదార్థమవు. ఈవిశ్వజగత్తుయొక్క ప్రబలపరిపాలకునిగ, నామూడు దేహముల యొక్క నాంతర్యనియామకునిగ, మాత్రమే నేను నిన్ను గుర్తింతును. నాప్రభూ! నీమ్రోల తిరిగి తిరిగి నేసాష్టాంగ మిడుదును నీవు నాకేవల శరణ్యము. ఓ కరుణా ప్రేమ సముద్రుడా! నేను నిన్నుమాత్రమే నమ్ము దును. ఉద్ధరింపుము. వికాస మొనర్పుము. దారిచూపుము.

సంరక్షింపుము. నాయాధ్యాత్మిక సంధసుండి యజ్ఞాంకుల తొలగింపుము, అజ్ఞానపు తెరను తప్పించుము. ఓనీవగు జగన్నాథా! ఒక క్షణము సహితము నీదేహపు క్లేశములు, నీజీవితము, నీసంసారముల నింకెంత దీర్ఘకాలము నేనసహింపజాలను. దివ్యా పన్నమును శీఘ్రముగనిమ్ము. ఓ ప్రభూ! నేను గాసిచెందు చున్నాను. నేను కరిగిపోవు చున్నాను. విను. విను, నాతపించు నాంతరిక ప్రార్థనను వినుము. నా ప్రభూ! కఠినముగ నుండకుము. నీవు దీనబంధువవు. నీవధమోద్ధారకుడవు. నీవు పతితపావనుడవు. (పతనమైన వారిని పవిత్రమొనర్చువాడవు) ప్రేమ, కనికరములతో కూడిన నోమహావైభవ ప్రభూ! ఓ యానంద జ్ఞానముల మూల పురుషుడా! (fountain head) నీవీ ప్రపంచము యొక్క చక్షువవు. నీవదృశ్యమగు ద్రష్ట (seer) వు. నశ్రుతమగు శ్రోతవు. (hearer) నమూహితమగు మూహితుడవు. (thinker) నజ్ఞాతమగు జ్ఞాతవు. నన్ను సమస్తాకర్షణాల నుండి విడుదల నొనర్ప ప్రార్థించు చున్నాను. నాకు కాంతి (ప్రకాశము) పవిత్రత, జ్ఞానముల ప్రసాదింపుము.

# భగవానుడే సత్యము

భగవానుడే సత్యము. సత్యమే భగవానుడు. ఎట్టి వెలకైన సత్యము వచింపుడు. సత్యము మాత్రమే నెగ్గును. (జయించును) కాని యసత్యముకాదు. "సత్యమేవ జయతినానృతమ్" సత్యవంతమగు పురుషుడు చీకాకులు, నాదుర్దాల నుండి సంపూర్తి విముక్తుడై యుండును, వేదములు, ఉపనిషత్తులు, యజ్ఞములు, మున్నగు వాటికంటె సత్యా

మున్నతరమైనది. హోదా, గౌరవము, పేరు (కీర్తి) మున్నగు వాటికై నసత్యములు పలుకకుడు. మీ రబద్ధము చెప్పుచో, పరితపించు హృదయముతో, తిరిగి యీయబద్ధ తుల్యతప్పిదము నొనర్పనని తీర్మానించుకొనుడు, నుపవాసము, 50 మాలల (50 × 108) జపముచేయుటద్వారా మిమ్ముల మీరు శిక్షించుకొనుడు. హింసారాహిత్యత. న్యాయము, సమత్వము, ఆత్మసంయమము, నమ్రత, నిష్కాపట్యము, సరళప్రవర్తన, దృఢత్వము, ఆత్మనిశ్చయము, ఆత్మబృందావనము, క్షమాశీలత, నిర్భయత్వము, జీవిత పరిశుభ్రత, ఋజుత్వము, క్రోధ రాహిత్యము, త్యాగము, వక్రత్వ (కుటిలతా) రాహిత్యము, అనాసక్తి, అణకువ, చాంచల్య రాహిత్యము. ఓరిమి, ఉదారత, ఈర్ష్యా రాహిత్యము, నిరాసక్త పరోపకార సేవ, [Disinterested Philanthrophy] స్వీయ (ఆత్మ) వశీకరణ [Self possession] సహిష్ణుత. పవిత్రత, బలము, గర్వము లేమి, అన్నియు సత్యము యొక్క రూపములే.

సత్యము పల్కుట. సత్యమును మనస్సు, వాక్కు చేతలలో నవలంబించుట ద్వారా భగవద్దర్శనము నొందుడు. మీరు సత్యములను పండ్రెండు (12) సంవత్సరముల వరకు వచించుచో మీకు వాక్సిద్ధి యొదవును అప్పుడు మీసంభాషణలో శక్తియుండును. మీ రేమనిన నది జరుగును.

"నేనీదినము సత్యము వచింతు"నని నుదయమున దృఢనిశ్చయ మొనర్చుకొనుడు. హరిశ్చంద్రుడు, మహాత్మాగాంధి యింకా నితరుల జీవితములు పరికింపుడు. దైనికాధ్యాత్మికడైనందిన పట్టీ (Daily spiritual diary) నొకదాని నుంచుకొని ప్రతినిత్యము మీరు చెప్పు అబద్ధముల సంఖ్యను గుర్తించుడు.

క్రమేణ నసత్యము (అబద్ధము)ల సంఖ్య తగ్గును. అంత్యమున మీరు సత్యము (నిజము) తప్ప నన్యమేదియు పలుకరు.

సత్యసామ్రాజ్యము లోనికి మిక్కిలి యగాధముగ చేరబడుడు. సత్యా మనుభూతి నొందుటకు కాంక్షింపుడు. మీసర్వస్వమును సత్యము కొరకై బలియొనర్పుడు సత్యము వచింపుడు. సత్యము కొరకై మరణింపుడు. సత్యమే జీవితము. సత్యమేడునికి. సత్యమే జ్ఞానము. సత్యమే ఆనందము. సత్యమే నిశ్శబ్దత. (మౌనము) సత్యమే శాంతి. సత్యమే ప్రకాశము. సత్యమే ప్రేమ, సత్యము గ్రహించుటకు జీవింపుడు. సత్యము ననుభూతి నొందుటకు మనుడు (జీవింపుడు) ఆ సత్యమే మిమ్ముల మీసమస్త కార్యములలో త్రోవ చూపించుగాక.

## తెలివిగబ్రతుకుము

చర్మము (త్వక్కు), దుస్తులు, నగలు తీసివేయుచో స్త్రీ యనునది శూన్యమై యుండును. ఆపె త్వక్కును (శరీర చర్మము) తీసివేసినటుల క్షణకాల మూహింపుము. కాకులను గ్రద్దలను త్రోలివేయుటకై నొక పొడుగాటి కఱ్ఱను పట్టుకొని ఆపె ప్రక్క నిలవబడవలసి యుండును. శారీర సౌందర్య మసంపూర్తిదియు, భ్రాంతి కారకము నాశయుతమునై యున్నది. అది త్వక్కునకు సంబంధించినది. (చర్మగాంభీరతకు చెందినది) మాత్రమే. బాహ్య దృశ్యములచే మోహము నొందకుము. అవి మాయ యొక్క గారడీవిద్య. అనంత సౌందర్యము సౌందర్య తలలో నుత్కృష్టమగు సౌందర్యము

నకు మూలమగు ఆత్మ వద్దకు జనుసు. నీ నేంద్రియకలు తెల్ల బడుచో, మృత్యువునకు ప్రభువగు యమధర్మరాజు వద్ద నుండి వచ్చిన మొదటి యాజ్ఞా పత్రమదియే. వానిని కలుసు కొనుటకు నీవు సిద్ధమై యుండవలయును. ముఖమునందలి ముడతలు, శరీరవక్రత (వంగుట) యు నాజ్ఞా పత్రమును గురించి తిరిగి నీకు జ్ఞప్తిచేయును. పండ్లూడిపోయి కంటిదృష్టి చెడినప్పుడు నీ వాతని వందన మొనర్చుటకు పూర్తిగ సిద్ధపడి యుండవలెను. ప్రక్కపై బడియుండగా నీకు మూడు వెక్కిళ్ళు లేదా అంత్యమరణ శ్వాసలు కలుగును. ఆఖరి వెక్కిలి వచ్చినప్పుడు ధనాదిఆస్తి సామగ్రులు నీకొడుకులు భాగస్థులచే తీసికొనబడును. ఒకడు సేవింగ్సుబ్యాంకు ప్యాసు పుస్తకముకొఱకు పరుగెత్తును. మఱియొకడు బొక్కసపు (ధనపు) పెట్టెను పట్టుకొనును. ఇంకొకడు పోషణనిధి పత్రములు (Provident fund papers] జీవితభీమా హక్కు పత్రములను (Insurance claim papers) వేఱొకడు వంటిపైగల ఆభరణములను అటులనేతీసికొందురు. ఈ పృథ్వీస్థలియందలి జీవితమిట్టిది. ఆధ్యాత్మిక జ్ఞానప్రచారము, బీదలు, బాధి తులు మున్నగువారి సేవవంటి ధర్మకార్యములకు ధనము వెచ్చింపబడునటు లేల చూడరాదు? మిత్రుడా! భక్తి, ధ్యానము. పవిత్రత సేవ, జపము, ధ్యానము, విచారము (ఆత్మ) ద్వారా మోక్షమునొందుటకు యత్నింపుము. సమస్త మగు కష్టములు బాధలు అంతమొందును.

# యోగముయొక్క విత్తులు, ఫలములు.

## క ర్మ యో గ మా ర్గ ము

స్వార్థరహితకార్యమే (ప్రజాకోటిసేవ) విత్తు. [Seed] సేవించుటలోని నారాయణభావమే (సమస్తజీవులు భగవానుని వ్యక్తీకరణము లేననియు, సమస్తజీవులలోని భగవానుని నేను సేవించుచున్నాననెడి భావన) వేరు (చెట్టు - (Root) ఉత్సాహమే (కుతూహలము, మనోహ్లాదము) జల్లు. (వాన-Shower) హృదయవికాసమే పుష్పము. (Flower) హృదయపవిత్రతయే ఫలము. [Fruit]

## భ క్తి యో గ మా ర్గ ము

భక్తియేవిత్తు.విశ్వాసమేవేరు. భాగవతులశుశ్రూష (సేవ) యే జల్లు. భగవానుని కంకితమొనర్చుకొనుట (శరణాగతి) యే పుష్పము. భగవానునితోడి యైక్యమే ఫలము.

## హ ఠ యో గ మా ర్గ ము

ఆసనమే (శరీరపు నిలుకడయొక్క తీరు) విత్తు. ప్రాణాయామమే (శ్వాసయొక్క దమనము) వేరు. క్రమాభ్యాసమే జల్లు. ఉత్తమారోగ్యమే పుష్పము. ఏకాగ్రమనస్సే (ఏకాగ్రత) ఫలము.

## రా జ యో గ మా ర్గ ము

యమము, (ఆత్మసంయమము) నియమము, మున్నగునవియే విత్తులు. ధారణ. (ఏకాగ్రత) యే వేరు. ఈశ్వర ప్రణిధాన (భగవంతుని కాత్మార్పణ) మే జల్లు. ధ్యానమే

(ఉపాస్యమునై చింతించుట) పుష్పము. అసంప్రజ్ఞాత సమాధియే (చైతన్యాతీతస్థితి) ఫలము.

### జ్ఞా న యో గ మా ర్గ ము

వివేకమే (ధర్మాధర్మ విచక్షణాబుద్ధి) విత్తు. వైరాగ్యమే (విరక్తి) వేరు. గురుకృపయే జల్లు. బ్రహ్మజ్ఞానమే (ఆత్మజ్ఞానము) పుష్పము. మోక్షమే (విముక్తి) ఫలము.

## భ గ వ న్నా మ వై భ వ ము

1. భగవన్నామమే కలియుగములో నీయొక్క కేవల శరణ్యము. భగవన్నామమే నీయొక్క ప్రాపు (అండ) ఆశ్రయము. ధామము. భగవన్నామమే నీయొక్క ఆధ్యాత్మికగురువు. భగవన్నామమే నీయొక్కమిత్రుడు. సహచరుడు.

2. శాశ్వతానంద ప్రదాత భగవన్నామమే. భగవంతుని యొక్కనామము, నామమునువహించు భగవానుడు (నామి) ను, విడివడజాలరు. భగవానుడు మఱియు వానియొక్క నామమును నొకటియే. భగవన్నామముత్కృష్ట దివ్యామృతము.

3. భగవన్నామము చింతామణి లేక కల్పవృక్షము. అది సిద్ధి, భక్తి, ముక్తులనొసగును. అది మనోచాంచల్యత నరికట్టి పరమాత్మునితోడ జిజ్ఞాసువు [Aspirant] నైక్యమొనర్చును.

4. భగవన్నామము భక్తుల నలంకరించు చూడామణి [Crest jewel] యే. అది ముముక్షువు నమృత (మోక్ష) ధామమునకు గొంపోవును. అది యాంతర్యాధ్యాత్మికజ్వాల (Flame) ను రగుల్కొల్పును. అది పవిత్రమగు దివ్యప్రేమ నుత్పత్తిచేయును.

5. అది భగవంతునిదరికి నిన్ను లేవనెత్తు దివ్యనిచ్చెనయే. అది ముముక్షువుల మార్గమును ప్రకాశింప చేయును. అది భయము, దుఃఖము, బాధల నిర్మూలించును. అది మనస్సుయొక్క మలినముల కడిగివేయును.

6. భగవన్నామముతో పూసల (beads) ద్రొర్లింపుము. (త్రిప్పుము) భగవన్నామమును తెంపు (Break) లేకుండ నుచ్చరింపుము. భగవన్నామమును శ్వాసతో నను సంధించు (Associate) ము. ఇంకను సంతోషముతోడ భగవన్నామమును కీర్తింపుము.

7. "ఓం నమో నారాయణాయ" "ఓం నమశ్శివాయ" యనునవి భగవన్నామములు. "సీతారామ్" "రాధేశ్యామ్" "ఓమ్" యనునవికూడ భగవన్నామములే. నీ వత్యుత్తమముగ నిచ్ఛించు నే భగవన్నామము నైనను నెంచుకొని, దానిని భావము, శ్రద్ధ, ప్రేమ లతో జపింపుము.

8. "మీరా" భగవన్నామము ద్వారానే శ్రీకృష్ణ పరమాత్మనొందెను. తు. కా. (తుకారాముడు) భగవన్నామముగుండనే విఠలుని చూచెను. ప్రహ్లాదుడు భగవన్నామము మూలముననే శ్రీ నరసింహు నవత

రింపచేసెను. భగవన్నామమునకు జయము. శ్రీహరికి మంగళము. రామకృష్ణులకు శోభ.

9. ఓ మధుర దివ్యనామమా! ఓ యారాధ్య భగవన్నామమా! ఓ యవినాశ (మోక్ష) దైవనామమా! భగవన్నామముతో నన్ను మత్తెక్కబడనిండు. భగవన్నామమును సర్వదా నన్ను జ్ఞప్తియుంచుకొనననిండు. భగవన్నామములో నన్ను సదా నిలువనిండు.

10. ఓ సర్వశక్తివంత భగవన్నామమా! ఓ సర్వదయామయ భగవన్నామమా! భగవన్నామమునకు వందనములు. భగవన్నామమున కారాధనలు. భగవన్నామమునెడ సంపూర్తిరుచి లేక నభిలాషను నన్ను కలిగియుండనిండు. భగవన్నామములో నన్ను స్థిరమవబడనిండు.

11. ఓ భగవన్నామమా! నీవు నా తండ్రివి. తల్లివి. మార్గదర్శకుడవు. నీ వజ్ఞానము, దుఃఖముల నివృత్తికారకుడవు. నీ వమృతత్వము (మోక్షము) నానందముల ప్రసాదకుడవు. ఓ భగవన్నామమా! నేను నీలో శరణు గైకొందును. నన్ను రక్షింపుము.

---

## శాంతిగానము

1. "అయమాత్మా శాంతః" ఈ యాత్మ శాంతియే. అటులని యుపనిషత్తులు ప్రకటించును. ఓం శాంతి శ్శాంతి శ్శా

2. "శాంతమ్, శివమ్, అద్వైతమ్" శాంతిమయ, మంగళ కారక, ద్వైతహీనముగ పరమాత్మ లేక బ్రహ్మ మున్నది. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

3. నిశ్చలముగ నుండి విచిత్రమగు పులకితము (హర్షో త్ఫుల్లము) ననుభవింపుము. చూపట్టు [apparent] గలిబిలి [Chaos] వెనుక శాంతి సముద్రము గలదు. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

4. నీవు శాంతియొక్క మూర్తిత్వమే [embodiment] ఊహాల (సంకల్పముల) నిశ్శబ్ద మొనర్చుటచే దీని ననుభవింపుము. ఏదియు నిన్నిప్పుడు కలత చెందించ లేదు. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

5. మనస్సు, వాసనలు సంకల్పముల యొక్క మూటయై యున్నది. వాసనలే కట్టెలు, సంకల్పములే యగ్ని. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

6. వాసనలనెడి కట్టెల వెనుకకు లాగుము. సంకల్పము లనెడి యగ్ని చల్లార్చ బడును. పరమశాంతి నప్పు డనుభవింపుము. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

7. శాంతి సముద్రములో లోతుగ మునుగుము. విలువ లేని (అమూల్యమైన) నాత్మ ముత్యమును వెలుపలికి దీసి సంసార సముద్రమును తరించుము. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

XL

# ఆధ్యాత్మిక పంథ

1. ఆధ్యాత్మిక పంథ (మార్గము) పదునైన కత్తియొక్క అంచువలె నుండును. నీవా మార్గమును ద్రొక్కునపుడు జాగ్రత్త వహింపుము.

2. తుపానులు, జడిగాలులు, త్రోవపై వచ్చును. స్థిరముగ నుండుము. నిశ్చలముగ నుండుము ధైర్యముగ నుండుము. నీ నౌకా నిర్వాహక చక్రము [helm] ను సక్రమముగ నుంచుకొనుము. నీవు తప్పని సరిగ నొడ్డును చేరుదువు.

3. ఆ మోక్షము శాశ్వత శాంతి రాజ్యమే. నానందామృతముల యొక్క నీయమృత ధామమే. మరణ రాహిత్య నగరమే. ఋషులయొక్క నద్వైత సామ్రాజ్యమే.

4. నీయాదర్శము, లక్ష్యముల కంటిపెట్టుకొని యుండుము అంతర్విచార మొనర్పుము. లోనికి చూడుము. ఆత్మ విమర్శ నొనర్పుము. నూహాల (సంకల్పముల) కని పెట్టుము. (పరీక్షించుము) వాటిని మెల్లటి యంతస్థుల ద్వారా నణగ ద్రొక్కుము.

5. దైనికాధ్యాత్మిక దైనందిన [diary] నుంచుకొనుము. తప్పిదముల సవరించుము. దైనిక చర్యల సమీక్షించుము [review] ము. దానిని ముందు నెల యొక్క దానితో సరిపోల్చుము.

6. ప్రతి దినము సరిక్రొత్త తీర్మానము [resolve] నొనర్చుకొనుము. నేనీ దినమున ప్రశాంతముగ నుందును.

నేను బ్రహ్మచారిగ నుందును." ఇటుల లక్ష్యమున కొక యడుగు సమీప తరముగ జనుము.

7. నీ ధ్యానములో సక్రమముగ నుండుము. నిశ్చలముగ ముందుకు సాగుము. జీవితలక్ష్యమునుచేరి విజృంభిత [Dynamic] యోగిగ విరాజిల్లుము.

## అధ్యాత్మిక విజయము

1. నీయల్పాత్మను మట్టుపెట్టుము. హృదయమును పవిత్రముగ నుంచుకొనుము. ప్రేమయనెడి సేతువు (వంతెన)ను నిర్మింపుము. శాంతి సామ్రాజ్యమున జొరబడుము.

2. ఆహారములో మితముగ నుండుము. ఇంద్రియముల వశమొనర్చుకొనుము. నీవధమతర మనస్సు (lower-mind) ను జయింపుము. మోక్షమార్గముపై పయనించుము.

3. వివేచించుట (Discriminate) ను నేర్చుకొనుము. ఇంద్రియ విషయక పదార్థముల ద్వేషించుటను నేర్చుకొనుము. నీవేది కలిగి యుందువో దాని నిచ్చుటను నేర్చుకొనుము. ఆంతర్యమున చూచుటను నేర్చుకొనుము.

4. లైంగిక ప్రేరణ (sex impulse) ను పవిత్ర ప్రేమలోనికి పరివర్తింపుము. లింగము (sex) దేహములకు చెగ

లెమ్ము. అమృతాత్మలో వసింపుము. చిరకాలముండు (ever lasting) జీవితమొందుము.

5. జనన మరణముల నుండి విడుదల నొందుము. సదా శాంతిలో వసింపుము. ఇప్పుడు మనస్సు నిన్ను బాధింప జాలదు. నీస్వరూపములో నీవు విశ్రమింప గలుగుదువు నీవిప్పుడు స్వతంత్రుడవు. నీవిప్పుడు పరిపూర్ణుడవు.

6. నీ విప్పుడు వికసితుడ (illumined) వు. నీ విప్పుడు జీవన్ముక్తుడవు.

# భక్తి - సంకీర్తనము

## ప్రథమాధ్యాయము - భక్తిసాధన

### భగవంతుడున్నాడు

రైలుబండియొక్క జడమగు యింజను (ఆవిరి యంత్రము) బుద్ధిశాలియగు (నిర్వాహకుడు) నడుపువాడు లేనిదే కదలజాలదు. అటులనే యీ శరీరమనెడి యింజను లేక యంత్రము బుద్ధిశాలియగు నడుపువాడు భగవంతుడు లేక యీశ్వరుడు లేనిదే నడువ జాలదు. శరీరపు టునికినిబట్టి శరీర యంత్రముయొక్క కంటికి కగుపడని నడపువాని యొక్క ఉనికిని మీరు గ్రహింపవచ్చును.

భగవంతుడు, పరబ్రహ్మము. (Brahman) లేదా ఆత్మయొక్క ఉనికిని ఉపాధులగు శరీరము, మనస్సు, ప్రాణము, యింద్రియములయొక్క ఉనికిచే నిర్ణయింప బడవచ్చును. లేదా చూపబడవచ్చును. ఏలన వాటిపనులలో ఆత్మచైతన్య ముండి తీరవలయును.

ఆస్తి సామగ్రులు, సర్వవిధములగు సుఖములు ఉన్నప్పటికి, నీ వెల్లప్పుడును నేదియో కొఱత పడినటుల భావింతువు. పరిపూర్ణత్వ భావనలేదు. నీకు నీవు సర్వపరిపూర్ణుడగు భగవంతుని మాత్రము చేర్చుకొనుచో, నీకు పరిపూర్ణత్వమబ్బును.

నీవు దుష్కార్యము నొనర్చునపుడు భయపడుదువు. నీ అంతరాత్మ నిన్ను బాధించును. ఇదికూడ భగవంతు

డున్నాడనియును నీ యొక్క సర్వతలంపులను, చర్యలను, సాక్షిమాత్రుడుగ వీక్షించుచున్నా డనియును, ఋజువు చేయును.

పరబ్రహ్మమును నిర్వచించుటన, పరబ్రహ్మమును (కాదనుట) ఒప్పుకొనకుండుటయే. కాదుకాదనుటల వరుసల క్రమము మాత్రమే. పరబ్రహ్మముయొక్క సరియగు వర్ణన "నేతి, నేతి-ఇదికాదు, ఇదికాదు" అని పరబ్రహ్మమునుగురించి ఆ కారణముచేతనే బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యఋషి నుడివెను. దీనియర్థ మేమన నామరూపముల నపహోయించగా మిగిలినది పరబ్రహ్మము.

ఇంద్రియములకును మనస్సునకును అగమ్యుడగుటచే పరబ్రహ్మమును లేదా ఆత్మను లేదా సర్వవ్యాపి యగు భగవానుని ఋజువు పర్చలేము కాని వానియునికిని యనుభవబద్ధమగు కొన్ని సత్యముల (యథార్థముల) నుండియు లేదా నిత్యజీవనములోని సామాన్యానుభవములనుండియు గ్రహింపవచ్చును. ఒకానొక స్త్రీ మూడవ అంతస్థునుండి పడుట సంభవించెను. దిగువన వాడిమొనగల రాళ్ళశయ్య గలదు. ఆమె తీవ్రముగు గాయముల నొందవలసినదే కాని విచిత్రముగ రక్షింపబడెను. ఆమె యంతటామెయే "నేను కొన్ని యదృశ్య హస్తముల వెచ్చని సుఖకరమగు కౌగలింత ననుభవించ గలిగితిని. ఏదియో నద్భుతమగు శక్తి నన్ను రక్షించినద"ని పలికెను. ఇట్టి యుదాహరణము లసామాన్యములు గావు.

ఒక్కొక్కప్పుడు నీవొక విచిత్రమగు సందిగ్ధ పరిస్థితిలోననో లేదా యొత్తిడి కలుగజేయు నార్థికపు టిబ్బంది

లోననో నుందువు. విచిత్ర రీతిగ నీకు సహాయము లభించును. సరియగు సమయమున ధనము పొందుదువు. మీలో ప్రతి యొక్కడును యిట్టి దాని ననుభవించియే యుండవచ్చును. అట్టి సమయమున సంతోషముతో "భగవంతునిరీతులు వాస్తవముగ నద్భుతములు, నాకిప్పుడు భగవంతునిపై సంపూర్ణ విశ్వాసము కలిగినది. ఇంతవరకు భగవంతునిపైనమ్మిక లేద"ని నీవు వెల్లడింతువు.

ఒక వకీలు (న్యాయవాది) కు భగవంతునిపై నమ్మిక లేకుండెను. వానికి ద్విత్వశ్వాసావరోధము (Double Pneumonia) పెంపొందెను. వాని ఆఖరుశ్వాస ఆగిపోయెను. వాని భార్య, కొడుకు, బంధువులు యేడువ నారంభించిరి. కాని యాయ నొక విచిత్రమగు ననుభవమును బొందెను. యమభటులు వానిని బట్టుకొని తమ ప్రభువగు యమునివద్దకు తీసుకొని జనిరి. యముడు తన చారులతో "నేను కోరిన దీ మనుష్యుడు కాడు. అన్యుని తీసుకవచ్చితిరి. వానిని పంపివేయుడ"ని పలికెను. ఒక గంటయనంతరమాతడు శ్వాసించసాగెను. ఆతడు నిజముగ ప్రత్యక్షముగ శరీరమును త్యజించినటులను, యమదర్బారుకు జనినటులను, తిరిగి తన భౌతిక దేహమున పునఃప్రవేశ మొనర్చినటులను, ననుభవమును బొందెను. ఈ యాశ్చర్యకరమగు ననుభవము, వాని స్వభావము (ప్రకృతి) నంతటిని పూర్తిగ మార్చివేసెను. ఆతడు భగవంతునిపై నధికమగు భక్తివిశ్వాసముల పెంపొందించి ధార్మికపురుషుడుగ తయారయ్యెను. సంయుక్తరాష్ట్రములో (United Provinces) నిప్పటికిని యాతడు జీవించియున్నాడు.

మఱియొక న్యాయవాదికిని నిట్టి యనుభవమే కలిగెను. కాని యీ విషయములో కొంత మార్పు గలదు. ఆతడు యమదర్బారునకు చారులచే గొంపోబడెను. ఈ న్యాయవాది యముని "భౌతికస్థలియందు నేను చేయవలసిన పనిని పూర్తి చేయలేదు. ప్రయోజనకారకమగు పని నింకను చాల నేను చేయవలసి యున్నది. దయయుంచి నా ప్రాణము నిప్పుడు రక్షింపు" మనెను. వానికి వర మీయబడినది. ఇట్టి యద్భుతమగు ననుభవముచే నాత డాశ్చర్యమొందెను. వాని ప్రకృతి యంతయు పూర్తిగా మాఱిపోయెను. తత్క్షణమే యాతడు న్యాయవాదవృత్తిని విడిచిపెట్టెను. ఆతడు తన జీవిత శేషము నంతను నిస్స్వార్థసేవయందును, ధ్యానమునందును గడపుచున్నాడు. దక్షిణహిందూదేశములో నాత డింకను జీవించి యున్నాడు.

చచ్చుటకు సిద్ధముగనున్న రాజును ప్రపంచమునందలి మిక్కిలి ఘనవైద్యులు సహితము కుదర్చలేకపోవుట నీ వెరుగుదువు. గొప్పగొప్పవైద్యులు సహితము నిరాశను వ్యక్తపరచు వ్యాధివిషయములో మొండిజాతి వ్యాధులచే బాధపడుచుండెడి బాధితులు విచిత్రముగ కుదర్చబడుటయొక్క వివిధోదాహరణలను గూడ నీవు వినియె యుందువు. సమస్తమగు వ్యాధి నివారణలవెనుక భగవంతుని హస్త మొకటికలదనుటలో దీనంతటిదియె యొక స్పష్టమగు ఋజువు లేక ప్రమాణము.

ఒక్కొక్కప్పుడు నీవు మానవుల సాంగత్యమునుసహించజాలకపోదువు. ఏకాంతముగనుండుట కిచ్ఛగింతువు. ఏకాంత ప్రదేశమునకో, ఉద్యానవనమునకో, నదియొడ్డునకో పోయి ఆంతరంగికమగు శాంతి ననుభవింతువు. మూలతత్త్వముగా,

నీవు శాంత్యవతారమూర్తివని, ఏకైకుడవని, పరబ్రహ్మముతో నైక్యతను కలిగియున్నావని, యిది యొక సూచన నిచ్చును.

కొందఱు యెనుబదిసంవత్సరముల ప్రాయమప్పుడు చని పోవుదురు. కొందఱుగర్భములోనుండగనే చనిపోదురు. కొందఱు యిరువది సంవత్సరముల వయస్సప్పుడును, మఱికొందఱు నలువదియప్పుడును గతింతురు. ఇట్టి పరిణామమునకు కారణ మేమి? అందఱకును జీవితపరిమితి నెవ రేర్పఱచెను. ఇది కర్మసిద్ధాంత మొకటి కలదనియు, జీవులయొక్క కర్మఫలములను పంచియిచ్చువాడును, చేయు కర్మల స్వభావమునుబట్టి జీవిత పరిమాణమును నిర్ణయించువాడును, కర్మలయొక్కయు వాటి ఫలములయొక్కయు సరియగు సంబంధమును యెఱిగినవాడును, నగు సర్వజ్ఞుడగు భగవంతుడొకడు కలడనియు స్పష్టముగ ఋజువుచేయును. కర్మయనునది జడమగుటచే నది నిశ్చయ ముగ కర్మలయొక్క ఫలముల నంతమొందించజాలదు.

గుడ్లగూబ, వెలుతురుయొక్క ఉనికి నంగీకరించినను లేకపోయినను వెలుతురెప్పుడునుగలదు. నీవు భగవంతుని యునికినంగీకరించినను లేకపోయినను భగవంతుడెప్పుడును నున్నాడు. మూడుకాలములయందును సర్వదాప్రకాశించు చున్నాడు. నీవా జగత్ప్రభువును వెదకుటకుముందును యాతఁ డున్నాడు. ఆ పరమేశ్వరుడు నీ శ్వాసకంటెను దగ్గఱగను, నీ చేతులు, పాదములు కంటెను సన్నిహితముగ నున్నాడు.

నీవున్నావా లేదా? అదినాప్రశ్న. నీవు లేదనుచో నాకండ్లకెదురుగ కండరయుతమగు బాహువులతోడను,విశాల మగు నుదురుతోడను, పెద్దకండ్లతోనున్న పొడుగాటి విగ్రహ

మును నేను చూచుచున్నాను. అవునని చెప్పుచో నిది భగవం తుని యునికిని ఋజువు పర్చుటకు సూచన నిచ్చుచున్నది. భగవంతుడున్నాడా లేదా యను ప్రశ్న సహితము భగవంతు డున్నాడని స్పష్టముగ ఋజువు చేయుచున్నది.

నీవేది చూచినను భగవంతుడే. నీవేది వినినను భగవం తుడే. నీవేదియాస్వాదించినను (రుచిచూచినను) భగవంతుడే. నీవేది యాఘ్రాణించినను భగవంతుడే. నీవేది స్పృశించినను భగవంతుడే. ఇది వ్యక్తరూపమగు నంశ. ఈ భౌతికశరీరము విరాట్టునకు జెందును. సూక్ష్మతత్త్వము హిరణ్యాగర్భునకు జెందును. కారణశరీర మీశ్వరునకు జెందును. "నేను" అనున దిప్పుడేదీ ?

మన చుట్టుప్రక్కల ప్రతిదినము జరుగుదాని గుఱించి యొకింత విచారణ సలుపుచో మన యిచ్ఛకంటె వేఱొక ఉత్కృష్టమగుధర్మము సంఘటనలనుసరిచేయుననియు (సక్రమ పఱచుననియు) మన వ్యసనకరమగు ప్రయాసలు చాల నవస రము, సంపూర్ణముగ ఫలరహితమనియు, మన సునాయాస, సాధారణ, తక్షణచర్యలలోనే మనము దృఢముగ నుందు మనియు, వినమ్రతతో నెదుర్కొనుటచే మనము దైవత్వము నొందుదుమనియు, మనకు దృష్టాంతపరచును. విశ్వాసము, ప్రేమయు, మనల నమితమగు బాధ్యతాధారమునుండి వద లించును. సోదరులారా! దేవుడున్నాడు. ప్రకృతియందు కేంద్రీకృతముగను, ప్రతిమానవుని యిచ్ఛపైనను, విశ్వప్రపంచ మును మనలో నెవడును హానిచేయలేకుండునటుల నొకయాత్మ గలదు. దాని సలహా నంగీకరించుచో మనము పెంపొందు నటుల తనయొక్క దృఢమగు నాకర్షకత్వమును ప్రకృతిలో

సమితముగ జొనిపెను. మరియు మనము దానియొక్క సృష్టి జీవుల నొప్పింప పరిశ్రమించునపుడు మనచేతులు మన పార్శ్వముల కంటుకొనును. లేదా అవి మనబొమ్మల బాదును. ఇట్టి విషయములయొక్క గమనము (వర్తన) మనకు విశ్వాసము నుపదేశించుట కరుగుచున్నదని "ఎమర్సన్" (Emerson) చెప్పెను.

నాకు చెప్పగలవా మిత్రమా ! చావునకు భయపడని వాడెవడైన నీభువిపైగలడా? తీవ్రమగుకష్టములో నున్నపుడును, జీవితము తులలో నదరచున్నపుడును, లేక సమితమగు వేదనలో నున్నపుడును, భగవన్నామము నుచ్చరించని వాడెవడైనా గలడా ? ఓ దైవదూష్యులారా (Sceptics) అటువంటప్పుడు భగవంతుని యునికి నెందుకు లేదందువు. నీవు చిక్కులలో నుండునపుడా పరమేశ్వరుని యునికిని నీయంతట నీవే యొప్పుకొందువు. విపరీత బుద్ధిచేతను, ఐహికమగు ప్రపంచ మత్తతచేతను, నీవొక నాస్తికునిగ నుపక్రమించితివి. ఇదియొక గొప్ప తెలివిలేమిగాదా ? తీవ్రముగ నాలోచింపుము. వాదించుట మానుము. ఆ పరాత్పరుని జ్ఞప్తి యుంచుకొని, మోక్షమును ననంత శాంతిని సరిగ నీక్షణముననే బొందుము.

## ప్రార్థన యొక్క ప్రభావము

ప్రార్థన కత్యంతమగు ప్రాబల్యము గలదు. నేను బహు అనుభవముల కలిగియుందును. గాంధీజీ ప్రార్థనయొక్క నొక గొప్ప ఉపాసకుడు. ప్రార్థన మనః పూర్వకమయిన దగుచో, నది హృదయమూలము (ఆంతరికము), నుండి బయలు దేరుచో, నది తక్షణము భగవంతుని హృదయమును కఱగించును. ద్రౌపదియొక్క హృదయ పూర్వకమైన ప్రార్థనను వినుట

తోడనే భగవానుడగు శ్రీకృష్ణుడు ద్వారకనుండి నగ్న పాదము లతో పరుగెత్తవలసి వచ్చెను. మీ యందఱకు నిది తెలియును. ఈ విశ్వజగత్తుయొక్క సమర్థ పరిపాలకుడగు శ్రీహరి ప్రహ్లాదుని ముందట నొకింత నాలస్యముగ వాని రక్షణకై వచ్చి నందులకు క్షమింపవేడెను. ఎంత దయాపూర్ణుడు, ఎంత ప్రేమ యుతుడో కదా భగవంతుడు !

ప్రార్థన, పర్వతములను చలింప చేయగలదు. ప్రార్థన నద్భుతక్రియల నొనర్పగలదు. "ఓ భగవానుడా ! నేను నీ వాడను. నీది (నీ యిచ్ఛ) యే నొనర్పబడును. నాపై కరుణ వహింపుము. నేను నీసేవకుడను-క్షమింపుము. దారిచూపుము. రక్షింపుము. జ్ఞానప్రకాశ మొసర్పుము. త్రాహి - ప్రచోదాయాత్" అని హృదయాంతర్యము నుండి యొకపర్యాయ మైనను చెప్పుము. నమ్రపూర్వకా కర్షకయుతమగు మన స్తత్వమును కలిగియుండుము. నీ హృదయములో భావమును కలిగియుండుము. ఆ ప్రార్థనము తక్షణము వినిపించుకోబడి ప్రత్యుత్తర మీయబడును. దీనిని దైనిక జీవితయుద్ధమున నొనర్చి నీయంతట నీవు ప్రార్థనయొక్క నున్నత ప్రభావమును గ్రహింపుము. నీవు దృఢమగు నాస్తిక్యబుద్ధి (భగవదునికి యందు దృఢమగు నమ్మకము) ని కలిగియుండవలెను.

బగవంతుని నుండి వేర్వేరు కానుకలు, నౌదార్య పూరిత దానముల (దాతృత్వముల) నొందుటకు క్రైస్తవులకు వివిధములగు ప్రార్థనలు కలవు. మహమ్మదీయులును, సమస్త మత పరాయణులును, సూర్యోదయమున, మధ్యాహ్నమున, సూర్యాస్తమయమున, సరిగా పడకనిద్రకు జనుటకుముందు, సరిగ భోజన స్వీకారమునకు ముందు, దైనిక ప్రార్థనల కలిగి

యుందురు. ప్రార్థనయే యోగముయొక్క ప్రారంభము. ప్రార్థన యోగముయొక్క మొట్టమొదటి ముఖ్యమగు నంగము. తొలి యాధ్యాత్మిక సాధన లేక నభ్యాసమే ప్రార్థన.

బందిపోటుదొంగ ప్రార్థించి నప్పుడును భగవానుడు వానికి సాయపడును. భగవానుని పరిశుద్ధత్వమునకును, భక్తికిని, ప్రకాశమునకును, జ్ఞానము (ఆత్మ) నకును, ప్రార్థింపుము. నీవీవస్తువుల పొందుదువు. ఉదయాత్పూర్వము లేచి, మానసిక, శారీరక, బ్రహ్మచర్యము నొందుటకై నేదేని స్తోత్రము (దైవ ప్రార్థనము) నుచ్చరింపుము. నీయిచ్ఛ వచ్చినటుల నేరీతినైన ప్రార్థింపుము. పసిబిడ్డనివలె నంతటి నిష్కపటుడ వగుము. నీ హృదయము నందలి గదులను స్వేచ్ఛగ తెరువుము. కపటమును, ( జిత్తులమారి తనము ) వక్రత్వమును, కలిగి యుండకుము. సమస్తమును నీవొందుదువు. మనః పూర్వకమగు భక్తులకు ప్రార్థనల యొక్క నున్నత ప్రభావము గూర్చి యత్యుత్కృష్టముగ తెలియును. నారదముని యిప్పటికిని ప్రార్థించుచున్నాడు. నామదేవుడు ప్రార్థించెను. వాని సమర్పణల (నైవేద్యముల) భుజించుటకై విఠలుడు విగ్రహము నుండి బయలువెడలి వచ్చెను. ఏకనాథుడు ప్రార్థించెను. చతుర్భుజయుతమైన తన స్వరూపమును శ్రీహరి చూపెను. మీరా ప్రార్థించెను. శ్రీకృష్ణుడొక దాసునివలె నామెను సేవించెను. దామాజిపాదుషా (చక్రవర్తి) కు వాని బాకీలు చెల్లించుటలో శ్రీకృష్ణుడు పరిచారిక ధర్మమును వహించెను. అధికముగ నింకేమి కోరుదువు ? సరిగా నిప్పుడే నీక్షణమునుండియే తీవ్రముగ ప్రార్థింపుము. మిత్రుడా ! జాగు చేయకుము. ఆ "రేపు" యెప్పటికినిరాదు.

## ఆరాధన యొక్క ప్రాముఖ్యత

భగవంతుని లేదా పరమాత్మ యొక్క సామీప్యము లేక సన్నిధి చేరుట, ఉపాసకుని (పూజించువాడు లేక నుపాసన నొనర్చువాడు) పక్షపు యుద్యమమే నారాధన. సాధకుడు లేక జిజ్ఞాసు వాధ్యాత్మికసీమలో స్థిరాభివృద్ధిచేయుచు తుదిని తనలో తాను తన స్వీయహృదయములో దైవత్వపుటునికిని గ్రహించునట్టి శారీరక, మానసికమగునట్టి సమస్తయాచరణలు ననుష్ఠానములచే నదిపొసగియున్నది. ఉపాస్య మనగా నుపాసనకగు వస్తువు లేక భగవంతుడు.

తినుట, త్రాగుట, నిద్రించుట, భయము, సంగమము, మున్నగునవి. మృగములలోను, మనుష్యులలోను సామాన్యమైనవి. కాని యొకని నిజమగు మానవుని లేదా భగవత్సముడగు మానవునిగా నొనర్చునది ఉపాసనయే. ఉపాసన మానవుని ధన్యమగు వేలుపు(దేవత)గ పరివర్తించును. భగవద్గీత 11వ అధ్యాయము 54వ శ్లోకములో "కాని నాయందలి భక్తి చేత మాత్రమే నేనిటుదర్శింపబడనగును. నోయీ అర్జునా! నింకను నో పరంతపా! మూలసారమున తెలిసికొన గలిగి, చూడనయి, చొరబడనగు" నని మీరు కనుగొందురు.

ఎట్టి యుపాసనము చేయక నెవడైతే కేవలము వెలుపటి యింద్రియసంబంధ జీవితమును గడుపునో, నాతడు బాహ్యముగ మనుష్య రూపమును దాల్చినప్పటికిని పశువు మాత్రమే.

ఆత్మోన్నతి, యాధ్యాత్మికాభివృద్ధి, ధర్మసంగ్రహాము లకు దారితీయునట్టి సమస్త వస్తువులలో నన్నితరగతుల నంత

స్థుల, జనులకు విధిగ ముఖ్యమయినది మాత్రమే కాకుండా, విఖ్యాతముగ నుపకారకమయి నట్టిదగు నుపాసనయొకటి. అది సులభముకూడను. దాతలో విశ్వాసము లేకుండ, ధర్మము పరిపూర్ణత నొందదు. మరియు, దాతగరిష్ఠ ప్రయోజనముల సంపాదింపడు. ఉపాసనాతీవ్రతచేతను, భగవత్ప్రేమ చేతను ప్రేరేపింపబడిన సమస్తదానములు, (ధర్మములు) నిజముగ సాత్వికములే. తపస్సునందును, యజ్ఞమునందును, కీర్తన యందునుకూడ విశ్వాసము, భగవత్ప్రేమ, దివ్యప్రకాశమున కగు తీవ్రేచ్ఛలయొక్క ప్రోగుడుశక్తులు, సంపూర్ణమగుసాత్వికప్రయోజనముల లేక ఫలితముల నుత్పత్తి చేయును.

పతంజలిమహర్షి తనయొక్క రాజయోగ సూత్రము లలో, నుపాసనయొక్క ప్రాముఖ్యముపైన, వివిధ స్థలములలో నొక్కిచెప్పెను. రాజయోగికినిగూడ నుపాసనఅవసరము. అతడు, తన స్వీయమగు నిష్టము లేదా మార్గదర్శక దేవత యోగీశ్వరుడగు కృష్ణునో, లేక ప్రభువగు శివునో, గలిగియుం డును. రాజనియమము, క్రియా యోగముల భగవంతుని కాత్మార్పణ మొక యంగమై యున్నది. "ఒక డుపాసన ద్వారా సమాధి చేరగలడ"ని పతంజలి చెప్పెను.

## ప్రతిమ లేక చిహ్నము

సమస్త పదార్థములును నారాధింపదగు వస్తువులయి యుండగ, మనస్సుపై వాటికుండు ప్రభావమురీత్యా దాని కెక్కువగ సరిపడు వస్తువులే సహజముగ నెన్నుకోబడును. ఒక మూర్తిగాని, లేదా సాధారణ చిహ్నములలో నొకటి యుపాసకునియొక్క మనస్సులో దేవతయొక్క భావమును బహుశః

లేవదీయును. సాలిగ్రామశిల సునాయాసముగ మనోనిశ్చలత్వ మును (నేకాగ్రతను) కలిగించును. ప్రతిమానవుడును నొక విశిష్టమగు చిహ్నము, గుఱుతు లేదా విగ్రహమున కభిరుచి కలిగియుండును. ఆరాధకునియందు వానికి వాటి యసాధారణ ప్రయోజనమునందలి నమ్మకమునుబట్టి నివియన్నియు స్వకీయ మగు నభిలాషలు మనస్తత్వరీత్యా నొక విశిష్టమగు మనస్సు విశిష్టమగు (ప్రత్యేకమగు) పనిముట్లు లేక గుఱుతులు లేక విగ్రహములద్వారా నది యిష్టించెడు ఆపంథ (త్రోవ) ను నత్యుత్తమముగ పనిచేయుటను కనుగొనునని నిదంతయు నర్థమగును.

చిహ్నమును విశ్వసించు నారాధకునకు నుపాసకునకు శిల (రాయి), బంకమన్ను, యిత్తడి, చిత్రువు, సాలిగ్రామము మున్నగువాని రూపమునుండు నేవిధమైన విగ్రహమైనను భగవంతునియొక్క శరీరమే. ఇట్టి యుపాసన విగ్రహారాధన నెన్నటికిని కాజాలదు. సమస్త వస్తుతతియును, భగవంతుని యొక్క వ్యక్తస్వరూపమే. ఉనికిగల ప్రతి వస్తువునందును భగవంతుడున్నాడు. ప్రతివస్తువు నారాధింపదగిన పదార్థమే. ఏలయన, సకలమును నందారాధింపబడు భగవంతునియొక్క వ్యక్తస్వరూపమే. ఆయదే యుపాసనాక్రియయే నారాధ్య వస్తువు శ్రేష్ఠమైనది చైతన్యయుతమైనదను భావము నవగత మొనర్చును. వస్తువులవైపు చూడదగు నీవిధము భక్తునిచే నొందబడవలెను. అశిక్షితమైన మనస్సు వస్తువులను పైవిధ ముగ చూచుటకుగాను నేర్పబడవలెను.

మానవకోటిలో నధికమొత్తమపరిశుద్ధ లేదా దుర్బల మనస్సుగలవారై యుందురు. కాన యీమానవుల కారాధన

వస్తువు పరిశుద్ధమయి యుండవలెను. కామమును, నసహ్యాతను బురికొల్పు వస్తువులను, వర్జింపవలెను. పరిశుద్ధమైన మనస్సు గలిగి యెల్లయెడలను నెల్లవస్తువులందును భగవదునికిని దర్శించు నధికమైన నున్నతినొందిన సాధకు డేవిధమైన వస్తువునైనను నారాధించవచ్చును. కొందఱు వంచకులు తమ కోరికల నారాధననెడి మూత (Cover) లో తృప్తినొంద కోరుదురు.

## భజన

దేవునియొక్క ఆరాధనయే భజన. భగవంతుడే సత్యము. భగవంతుడే ప్రేమ. భగవంతుడే జ్యోతి. భగవంతుడే శాంతము. భగవంతుడే ప్రేమ, శాంతము, సత్యము, జ్ఞానము, ఆనందము, ఉనికి (స్థితి) యు సమానార్థకపదములు మాత్రమే. నేను తిరిగి దాని నీ విధముగ నుంతును. నీ హృదయ గుహలలో నంతర్యామి లేక నాంతర్య పాలకుడుగ వసించువాడును, నాది, మధ్యాంతములు లేనివాడును, సర్వవ్యాపియైన వాడును, పరిణామము పొందని వాడును, భూత, వర్తమాన, భవిష్యత్కాలములం దునికి గల్గియుండు వాడును స్వయంభు (స్వతస్సిద్ధపు టునికి గల్గిన) వైనవాడును స్వతంత్రుడును, స్వయంప్రకాశము గలవాడును, నద్వితీయమగునట్టి యాపరమాత్మయే భగవంతుడు (దేవుడు). భగవంతునిపైని ధ్యానమే భజన. భజనయే నుపాసన. సంక్షిప్తముగ, భక్తుని భగవంతునితో ముఖాముఖిగ తెచ్చుటకు గణన చేయబడు సమస్తోపాయములు లేక పద్ధతులును భజనయే. జపము, (భగవన్నామోచ్చారణ) సంకీర్తనము, (ఒంటరిగగాని, లేదా కొంతజన సమూహముతో గాని, భగవన్నామమును గానమొనర్చుట) ధ్యానము, మున్నగునవన్నియు భజనగా కట్టుబాటగును.

నా ప్రియమిత్రులారా! ఏదో నొక రకపు లేదా నింకొకటియైన భజనలేని జీవనము బొత్తిగా నిష్ప్రయోజనము. ఉపాసనలేని జీవనము భయానకమును సంతోష రహితమునై యున్నది. అది యీ పృథ్విపై కేవలమొక బరువు మాత్రమే. ప్రారంభమున నొకటి లేనిదే సున్న శూన్య మెటులనో నటులనే కూడ నీ జీవనము, నీవీ ప్రాపంచిక వస్తువులన్నిటిని విస్తారముగ కలిగియుండు నప్పటికిని, భజన లేనిచో క్రియాత్మకముగ (Practically) శూన్యము. ఈ ప్రపంచ మొక దీర్ఘస్వప్నము. కష్టములు, దుఃఖములతో నిండి యనిత్యమైనది. కేవల సారవస్తువు భగవంతుడే.

భక్తిమార్గమున ప్రారంభకులకు (Beginners) మత విషయికాచారములు కలవు. భక్తుడు ముందుకు సాగునప్పుడు నాతని మనస్సు వానియొక్క భజన వస్తువు లేక నిష్టదేవతలో సంపూర్ణముగ నైక్యత చెందియుండు నప్పుడు దీపహారతి నొసగుట, గంధపు ముద్దను సమర్పించుట, గంటలు వాయించుట నిష్ప్రయోజనము. యావత్తు విశ్వమును వానికి బృందావనమె. వాని హృదయము కృష్ణుడు రాధతో నానందించునట్టి సేవాకుంజము. అది యెంతటి మహిమాన్విత స్థితిగలభక్తియో గదా! భక్తుడు పరాభక్తిలేక శ్రేష్ఠమైన భక్తి నొందును. ఇట్టి యున్నతి నొందిన భక్తులకు సమస్త ధార్మిక క్రియలు (Rituals) ను వాటంతట వేపతనమగును. కాని ధార్మికాచార క్రియలు భక్తిని పెంపొందించుటలో ప్రారంభకుల కమిత సహాయకారులు. వాటి నేహేతువు చేతను నుపేక్షింపరాదు.

సమస్త మత పరాయణులును తమ స్వీయభజనను తమ స్వీయ పద్ధతిలో నొనర్తురు. గమ్యస్థానము సమానమే.

కాని సంథ (త్రోవ) లు వేఱు. సమస్త మతములలోను ప్రధానాంశము లన్నియు సమానమే. కాని యనావశ్యకములపై పోరాడుచు మతముయొక్క కేవలాంతర్యమును లేక సారమును విడుతురు. ఆకుల నేల వృథాగా లెక్కింతువు? మామిడిపండ్లను తిన్నగా తినుము. ప్రతి మతమును సాధకుని నుండి పరిశుద్ధత్వమును, ఉత్తమ శీలమును, జీవులయెడ కరుణను, భ్రాతృ ప్రేమను, సత్యము పలుకుటను, భగవచ్చైతన్యము నొందుటను ఖచ్చితముగ కోరును.

చెట్లు, సెలయేఱులు, నదులు, మహాసముద్రము, ప్రశాంతమగు మందమారుతము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, పక్షులు మున్నగునవి సహితమునిశ్శబ్దముగభజన నొనర్చుచున్నవి. అవి భగవన్నామము నుచ్చరింపు చున్నవి. నదులు భుం, భుం యని నుచ్చరించును. మందమారుతము "ఓం, ఓం, ఓం" యని పలుకును. సముద్రపు టలలు "హరిః ఓమ్" లేక "సోఽహమ్" యని యుచ్చరించును. ప్రతి పక్షి యొక్క నోటినుండి "హరిఃఓమ్" యను శబ్దము వెలువడును. రైలుబండ్లును, కార్ఖానాలయంత్రములును, "హరిఃఓమ్‌తత్సత్" యని పునరుచ్చరించును. దానిని చాల జాగ్రతగ గుర్తింపుడు.

ఆరాధన లేక భజన నొనర్చుటలోగల నుద్దేశ్యముల నంత, శాశ్వతశాంతి, మోక్షము, పుట్టు, చావులు దానివెంట ననుసరించి యుండెడి చెడుగులు నేవనగా రోగము, ముసలితనము, పాపములు, సమస్తవిధములగు దుఃఖములయొక్క సాంసారిక చక్రమునుండి విడుదల (విముక్తి) ను పొందుటయే. ఈ ప్రపంచములోను దాని వస్తువులలోను లేశమంతసుఖమైన లేదు. అది యంతయు భ్రాంతి సుఖము లేక మనఃకల్పిత,

యథార్థముకాని నరముల గిలిగింత (ప్రేరేపణ) యే. అంతర్యామగు నంతఃకరణ (మనస్సు) మందుచుండెడు కొలిమి (అగ్నికుండము) వంటిది. భజన త్రివిధతాపములైన నాధ్యాత్మిక, నాదిభౌతిక, నాదిదైవికములను నాశన మొనర్చును. అవిద్యాగ్రంధులను (ముడులను) నిర్మూలమొనర్చి, పంచక్లేశములను మనస్సుయొక్క త్రిదోషములను తుదముట్టించును. అది భక్తుని పరంధామమునకు తీసికొనిపోవును. భక్తుడు భగవంతునితో సమస్త దివ్యైశ్వర్యముల ననుభవించును. ఆతడు మోక్షామృతమును గ్రోలును. ఆతడు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యముక్తుల నందును.

ఇప్పుడు ప్రియమిత్రులారా! లేచి నిలువబడుడు. నడుముకట్టుడు. మనఃపూర్వకముగ, యథార్థముగ నుండుడు. ఆ పరమాత్ముని నామమును "హరిః ఓమ్, సీతారామ్ లేక రాధేశ్యామ్"ను నెల్లవేళల గానమొనర్పుడు. భగవన్నామమును జ్ఞప్తియుంచుకొనుడు. భగవ దునికిని (సమక్షమును) నెల్లయెడలను, ప్రతిముఖమునను ననుభవమొందుడు. ఆ పరమాత్ముని ప్రత్యక్షానుభూతి నొందుడు. అదియె మీయొక్క నుత్కృష్టధర్మము. భగవానునిపై ధ్యాన మొనర్పుడు. నిష్కామ్యభావముతోడను, నారాయణభావముతోడను, మానవ జాతిని సేవించుటద్వారా మీ హృదయమును పరిశుద్ధమొనర్చుకొనుడు. సమస్తమును ప్రేమింపుడు. అన్నిటియెడ దయగల్గి యుండుడు. తిరుగుబాటొనర్చు నింద్రియముల వశపర్చుకొనుడు సత్యము పల్కుడు. నమ్రత, క్షమ, ఓర్పు, సేవాభావము, ఆత్మబలిదానము (Self Sacrifice) ల పెంపొందింపుడు, వీర్యమును భద్రపరుపుడు. భగవంతుడు మీకు మిక్కిలి సమీప

మున మీ హృదయములో నున్నాడు. ఆ జగత్ప్రభువు మిమ్మాలింగన మొనర్చుకొనుటకు సర్వదా సంసిద్ధుడైయుండును. ఆ జగదీశ్వరునిలోనే జీవింపుడు లోన నైక్యమొందుడు. లోతునకు మునుగుడు. మీ భజనయొక్క ఫలము నిప్పు డనుభవింపుడు. నేను మిమ్మిచ్చట విడుతును. గాఢముగ త్రాగుడు. జలగవంటిపట్టుతో భగవన్నామము నంటియుండుడు. సర్వదా కీర్తన మొనర్పుడు. మీ హృదయగుహాల తెఱచి ప్రేమతోను భావముతోను తిరిగి యొక్కపరి,

"సునాజా సునాజా సునాజా కృష్ణా
తూఁగీతావాలా జ్ఞానా సునాజా కృష్ణా"

"బోల్ హరి బోల్ హరి హరిహరి బోల్
కేశవ మాధవ గోవింద బోల్"

యనిసంకీర్తింపుడు. ఇదియే భజనయొక్క సారము. భజనయొక్క ఫలము లివియే. యోగి, మునీంద్రుడు లేక జ్ఞాని, లేక భాగవతులుకండు. దివ్యప్రకాశము సర్వదా మీ ముఖములో శోభిల్లుగాక. భగవదీయమైత్రి(నేళవింపు) మీహృదయమును, మీ యావత్తు జీవమును, నిండియుండుగాక!!

## ఉపాసన

ఉపాసన యనగా నారాధనయే (పూజయే). శబ్దార్థ ప్రకారము నది భగవంతునికి "దగ్గఱగ కూర్చుండుట" యను నర్థ మిచ్చును. ఎంపుడైన (Chosen) నావర్శమును లేదా నా ఆరాధనావస్తువును శాస్త్రముల యొక్కయు, గురువు యొక్కయు నుద్బోధనలద్వారా దానిపైధ్యానించుచునాయొకే

భావప్రవాహమున నొకపాత్రనుండి వేఱొకపాత్రకు పోయబడు నూనెధార (తైలధారవత్)వలె నిశ్చలముగ వసించుచు సమీపించుటయే నుపాసన.

ఉపాసన రెండువిధములు గలది యేవనగా "ప్రతీక" ఉపాసనయు, "అహంగ్ర" ఉపాసనయును, ప్రతీక మనగా చిహ్నము. "ప్రతీక" ఉపాసనయే సగుణోపాసన "అహంగ్ర" ఉపాసనయే నిర్గుణోపాసన. లేక నిరాకార ఉపాధిరహిత అక్షర లేదా పర (అతీత) బ్రహ్మముపై ధ్యానము. విగ్రహములు, సాలిగ్రామము, శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీశివ, గాయత్రి, దేవీల చిత్తరువులపై ధ్యానముప్రతీకోపాసన. నీలి విస్తృతాకాశము, సర్వవ్యాపియైన నాకాశము, సర్వవ్యాపియైన సూర్యకాంతి, మున్నగునవి కూడానిరాకార(నిర్గుణ) ధ్యానమునకు "ప్రతీకములే". సగుణోపాసనయే సాకారధ్యానము. నిర్గుణోపాసనయే నిరాకారధ్యానము.

భగవంతుని లీలల వినుట, కీర్తన, లేక భగవన్నామముల గాన మొనర్చుట, భగవంతుని నిరంతరము జ్ఞప్తి యందుంచుకొనుట, (స్మరణ) ఆజగత్ప్రభు పాదసేవ, పుష్పముల సమర్పించుట, సాష్టాంగ ప్రణామము, ప్రార్థన, మంత్రోచ్చారణ, ఆత్మార్పణ, భాగవతులసేవ, నారాయణ భావముతో ప్రజానీకపు, దేశపు, సేవ మున్నగునవి సగుణోపాసనగ కట్టుపడును.

ఆత్మభావముతో "ఓమ్" యుచ్చారణ, ఆత్మభావముతో ప్రజానీకపు, దేశపుసేవ, ఆత్మ లేక బ్రహ్మభావముతో "ఓమ్" యొక్క మానసిక జపము, "సోఽహం" లేక

"శివోఽహం" పైననో, "అహంబ్రహ్మాఽస్మి" లేక "తత్త్వమసి" వంటి మహావాక్యముల పైననో, "నేతినేతి" సిద్ధాంతము ద్వారా భ్రాంతి కారకసాధనముల (నుపాధుల) త్రోసిపుచ్చి ధ్యానమొనర్చుటయువల్లనహంగ్ర లేకనిర్గుణోపాసన నేర్పడును.

ఉపాసన మనోవస్తువునుమార్చి, రజస్సును, తమస్సును, నాశమొనర్చి మనస్సును సత్త్వము లేక పరిశుద్ధతతో నింపును. ఉపాసన, వాసనల, తృష్ణల, నహంకారమును, కామమును, ద్వేషము, క్రోధము, మున్నగువాని నంతమొందించును. ఉపాసన, మనస్సును లోనకుత్రిప్పి యంతర్ముఖ వృత్తిని ప్రేరేపించి కట్టకడపట భక్తుని భగవంతునితో ముఖాముఖిగ దెచ్చి యా భక్తుని పుట్టు చావుల నెడి చక్రమునుండి విమోచన మొనర్చి యమృతత్త్వమును, ముక్తిని, ప్రసాదించును.

కందురీగ, గొంగళిపురుగు, (భ్రమరకీటన్యాయము) సాదృశ్యము ప్రకారము మనస్సు దేనిపైనైతే నదిధ్యానించునో నదియేయగును. నీవెటుల భావింతువో నటులనే నీవగుదువు. ఇది మార్పుచెందని మనస్తత్త్వపు సిద్ధాంతము. ధ్యాత (Meditator) ధ్యేయము (Meditated) ల నైక్యమొనర్చునట్టి యొక విచిత్రమగు లేక పరికింపరానిశక్తి (యచింత్యశక్తి) యుపాసనలో గలదు.

సగుణోపాసనయే భక్తియోగము లేక నుపాసనాయోగము. నిర్గుణోపాసనయే జ్ఞానయోగము. లేక నాత్మజ్ఞానయోగము. భక్తియోగము, జ్ఞానయోగము కంటె చాల సులభతరమైనది. భక్తియోగములో భక్తుడు భగవంతునితో సన్నిహితమైనట్టి, ప్రియమైనట్టి, సంబంధమును స్థిరపర్చు

కొనును. తనయొక్క మనస్తత్వము, నభిరుచి, శక్తుల ననుస రించి పంచభావములలోను నేదేని యొకదానిని మెల్లగ నభి వృద్ధిచేయును. ఆ యైదుభావములు, శాంతభావము. దాస భావము, (ప్రభువు - సేవకుడు) సఖ్యభావము, (భగవంతు నితో స్నేహము) వాత్సల్యభావము, (పితా - పుత్ర సంబంధము. తండ్రి, కొడుకు సంబంధము) మాధుర్య భావము (ప్రియుడు, ప్రేయసి) నై యున్నవి. చిట్టచివరి భావమే భక్తి యొక్క నత్యున్నత పరిసమాప్తి యైనది. అదియె భగవంతు నిలో నైక్యమగుట లేక లీనమగుట. భక్తుడు భగవంతు నారాధించును. ఆతడా జగత్ప్రభువును నిరంతరము జ్ఞప్తి యుంచుకొనును. (స్మరణ) ఆ యీశ్వరు (ప్రభు) నామము (కీర్తన) నాతడు గాన మొనర్చును. ఆ జగద్రక్షకుని మహిమల నాతడు చెప్పును. వాని (భగవానుని) నామము నాత డుచ్చరించును. వాని మంత్రము నాతడు జపించును. ఆతడు ప్రార్థించును. సాష్టాంగ ప్రణామ మొనర్చును. ఆ ప్రభు లీలల నాతడు వినును. ఆతడు పరిపూర్తియైన ననిష్టత లేని నిబంధన రహితమైన శరణాగతి నొనర్చి భగవత్కటాక్షము నొంది యా ప్రభునితో నన్యోన్య సంబంధమొంది కడపట వానిలో (భగవానునిలో) నైక్యమొందును.

జ్ఞానయోగము లేక వేదాంతమార్గములో మోక్షమున కగు నాలుగు సాధనము లవి యేవనగా ! వివేకము, (నిత్యా నిత్య వస్తువులయెడ గల నెఱుక-తెలివి) వైరాగ్యము, (యింద్రియ సంబంధ భోగములం దిహమందును, పరమందును, నుదాసీనత-యుపేక్ష) శమము, (మనోప్రశాంతము) దమము (యింద్రియనిగ్రహము) ఉపరతి(పరిత్యాగము) తితీక్ష (సహన

శక్తి) శ్రద్ధ, (గురువు లేక నాధ్యాత్మిక విద్యాబోధకుని మాటల యందును, శ్రుతులు - ఉపనిషత్తులయందును విశ్వాసము.) సమాధానము, (మనస్సమత్వము లేక మనస్సుయొక్క నేకాగ్రత) నింకను ముముక్షుత్వము (మోక్షము లేక పుట్టు చావుల పరిభ్రమణమునుండి విడుదల యగుటకు తీవ్రేచ్ఛ)ల సాధకుడు సంగ్రహించును. (శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ సమాధానము లనెడి యారును షట్సంపత్తి క్రింద వచ్చును. గాన, నొకటిగానే గణన చేయవలెను.) పరమాత్మను ప్రత్యక్షానుభవ మొందిన బ్రహ్మశ్రోత్రిని, బ్రహ్మనిష్ఠా గురుని నప్పు డాతడు సమీపించి శ్రుతులను వానినుండి వినును. తదుపరి యాతడు పరబ్రహ్మము లేక పరమాత్మపై చింతన మొనర్చి, ధ్యానముచేసి తుదిని నాత్మసాక్షాత్కారము లేక బ్రహ్మానుభవమును (ఆత్మయొక్క ప్రత్యక్షానుభవమును) బొందును.

సగుణ బ్రహ్మము సోపాధికము (నుపాధులతో కూడినది) మాయయే భగవానునియొక్క నుపాధి లేక కారణశరీరము. నిర్గుణ బ్రహ్మము నిరుపాధికము. (నెట్టి యుపాధులు లేనిది) భగవానుడు మాయనుండి స్వతంత్రుడు. సగుణ బ్రహ్మము, సర్వజ్ఞత్వము, సర్వశక్తిమంతత్వము, సర్వవ్యాపకత్వములుగలవాడు, నిర్గుణ బ్రహ్మము తన వినోదము (లీల) కొఱకును, ధార్మిక నిష్ఠాపరులగు భక్తుల కొఱకును, సగుణ బ్రహ్మ రూపమును దాల్చును. నిర్గుణ బ్రహ్మము సూర్యుని ప్రాతినిధ్యపరుచును. సగుణ బ్రహ్మము, సూర్య కిరణముల ప్రాతినిధ్య మొనర్చును. ఎటుల జల మావిరి రూపమున నవ్యక్త స్థితిలో నుండునో నటులనే గూడ నిర్గుణబ్రహ్మ

మవ్యక్తస్థితిలో నుండును. ఆవిరి, జలము, మంచును నొకటియే ఆలాగుననే కూడ సగుణ బ్రహ్మము, నిర్గుణ బ్రహ్మము నొకటియే.

అక్షరబ్రహ్మమే వ్యక్తము కానిది. (అవ్యక్తము) అత డింద్రియముల కవగాహన కాజాలనివాడు. (అకర్ణగోచరము) అతడు సమస్తమగు నుపాధులు లేనట్టివాడు. ఇంద్రియము లకు గోచరమగు (కర్ణగోచరము) దానిని వ్యక్తము లేక సందృశ్యమందురు. అవ్యక్తమైన, నతీతమైన, నిర్గుణ పర బ్రహ్మము సమస్తహద్దులను పైదాటినవాడు. అతడు కాల దేశావస్థల కతీతుడు. ఆతడు నిత్యుడు. నిర్వచ నీయుడు. ఆతడు సమస్త నిర్ణీతముల (Limitations) మీరినవాడు. ఆతడు వాక్కు, మనస్సులయొక్క చేరికకు దూరపువాడు. (అవాఙ్మనోగోచరుడు) ఆతడు వాస్తవముగ చూపబడజాలడు. (అనిర్దేశ్యుడు) ఆతడు నిర్వచింపబడజాల డేలన, నాతడు మాటలు లేదా వాక్కుయొక్క నందుబాటు నకు మించిన వాడు. (అశబ్దగోచరుడు, అనాచ్యుడు)

అక్షరబ్రహ్మ మేల నిర్వచింపబడజాలడు? ఏలననగా నాత డవ్యక్తుడు. అతడు నాలుగుధర్మముల నేవనగా జాతి (బ్రాహ్మణుడువంటి కులము మున్నగునవి) గుణము (నీలి, తెలుపువంటి ధర్మము మున్నగునవి) క్రియ (చదువువాడు, నడచువాడు వంటి క్రియ) నింకను సంబంధము (తండ్రి, కొడుకు మాదిరి జనకాన్యసంబంధమువంటి సన్నిహితత్వము)ల కలిగియుండడు. ఆత డూహింపజాలనివా డెందుచేతననగా స్వరూపరహితుడు, (అవ్యక్తుడు, అచింత్యుడు) ఇంద్రియము లకు గోచరమగున దేదియైనను మనస్సుచేగూడ భావింప

నగును. జ్ఞానావయవముల (జ్ఞానేంద్రియముల) చే పట్టుబడ జాలున దేదియైనను మనస్సుచే కూడ భావింప నగును. (యత్ హి కర్ణగోచరమ్ తత్ మ్యసా ఆపి చింత్యమ్)

సగుణ (లక్షణయుత) నిర్గుణ (లక్షణరహిత) బ్రహ్మో పాసకు లొకే గమ్యస్థానమును చేరుదురు. కాని కడపటి పంథ చాల కష్టమైన దేలన సాధకుడు తన యాధ్యాత్మికానుష్ఠానపు ప్రారంభమునుండి సహితము దేహము నెడగల ననురాగము (దేహాభిమానము)ను విడువవలెను. అక్షరము లేక అవినాశము (పరబ్రహ్మము) ను తమ దేహముపై నభిమానము గలవారికి చేరుటకు బహుకష్టము. పైగా రూపరహిత, గుణరహిత, బ్రహ్మమునందు మనస్సును స్థిరీకరించుట మిక్కిలి బాధ కరము. అక్షర లేక నిర్గుణబ్రహ్మముపై ధ్యాన మతి తీక్ష్ణపు టేకాగ్రయుత, సూక్ష్మబుద్ధిని తప్పనిసరిగ కోరును.

" యేషా సర్వేషు భూతేషు గూఢాత్మా నప్రకాశతే,
దృశ్యతే త్వగ్ర్యాయబుధయా సూక్ష్మయాసూక్ష్మదర్శిభిః

అని శ్రుతి చెప్పును. ఈ యాత్మ సమస్త జీవులలోను దాగియుండియు భాసిల్లదు. కాని యది సూక్ష్మదర్శులచే తమ కుశాగ్ర సూక్ష్మబుద్ధిచేత చూడబడును.

నిర్గుణబ్రహ్మముయొక్క ప్రత్యక్షానుభవ మొందువాడు శాశ్వతానందమును లేక నాత్మసాక్షాత్కారమును లేక కైవల్య మోక్షమును, నవిద్యయు దానియొక్క ఫలముల (కార్యప్రపంచసహిత అవిద్యానివృత్తిపూర్వక నిర్విశేష పర మానంద బ్రహ్మప్రాప్తి) యొక్క నాశము తొలుత చేయబడి పొందును. సగుణబ్రహ్మముయొక్క ప్రత్యక్షానుభవ మొందు

వాడు బ్రహ్మలోకమునకుజని భగవంతునియొక్క సమస్తైశ్వర్య మును భోగించును. ఆతడు తదుపరి హిరణ్యాగర్భుని నుండి కైవల్యరహస్యములలో బోధ (గురూపదేశము) నొంది యెట్టి ప్రయత్నము లేకనే భగవత్కృపమూలమున వేదాంతులచే పొందబడు సమానస్థితియైన కైవల్యమోక్షము నొందును, ఆత్మజ్ఞానము (తత్వజ్ఞానము) ద్వారా సగుణోపాసకుల విషయ ములోకూడ నవిద్యయు దానియొక్క కార్యములును (efforts) (కార్యసహిత అవిద్య) నాశమొందును.

మీారందరు జీవితలక్ష్యమును 'ప్రతీక' లేదా 'అహంగ్ర' ఉపాసనాద్వారా మీాయొక్క మనస్తత్త్వము, సంస్కార ములు, నభిరుచి, సామర్థ్యము, మనోభీష్టము లేక మనోవైఖరి ననుసరించి యీా యొక్క జన్మలోనే పొందుదురుగాక !

## పూజ

అర్చన, వందన, భజనాది వివిధసమానార్థక పదము లచే తెలుపుడుచేయు నైష్ఠిక క్రియారాధన కొఱకుపయో గింపబడు ఉమ్మడి పదమునే "పూజ" అందురు. (వీటిలో కొన్ని పదములు దాని, అనగా పూజకాక ఆరాధనలోని కొన్ని అంశముల నొక్కి చెప్పినప్పటికిని) ఆరాధింపబడు వస్తువు యిష్టదేవతగాని, మార్గదర్శకదేవత (అదిష్టానదేవత) గాని, లేదా వైష్ణవుల విషయములో విష్ణుమూర్తిగగాని. లేదా ఆయన రూపములగు రాముడు, కృష్ణుడుగగాని, శైవుల విష యములో యెనిమిది రూపములుగా నున్న శివునిగగాని, శాక్తుల విషయములో దేవిగగాని, భక్తులారాధన చేయునట్టి నిర్దిష్టరూపమే.

బాహ్యపూజలో నొక ప్రతిమనుగాని, నొకపటమును గాని, విష్ణుదేవుని యారాధనలోని సాలిగ్రామము లేదా శివారాధనలోని లింగమాదిగాగల వస్తువుపయోగింపబడును.

పూజ లేక భగవదారాధనకై వాడబడు వస్తువులను (సామగ్రులను) లేదా చేయబడు పరిచర్య (క్రియ)ల నుపచారము లందురు. అవి లెక్కకు పదునాఱు (16) కలవు.

1. ఆసనము, (విగ్రహము కూర్చుండుటకు-ఉపవిష్టించుటకు స్థానమునొసగుట) 2. స్వాగతము, (దేవత నాహ్వానించుట) 3. పాద్యము, (పాదములు కడుగు కొనుటకు జలము) 4. అర్ఘ్యము, (కలశముతో నీటి నొసగుట) 5. ఆచమనము (త్రాగుటకు-గొంతు తడుపుటకునీరు) 6. మధుపర్కము. (తేనె, నేయి, పాలు, పెరుగు, యొక్క మిశ్రమము) 7. స్నానము, (స్నానమునకై నీరు) 8. వస్త్రము, (ధరించుటకు బట్ట) 9. భూషణము, (ఆభరణములు) 10. గంధము, (సువాసన) 11. పుష్పము, (పువ్వులు) 12. ధూపము (పొగ వేయుట) 13. దీపము, (వత్తులు వెలిగించుట) 14. నైవేద్యము, (ఆహారము) 15. తాంబూలము, (ఆకులు, చెక్కలుమున్నగునవి) 16. వందనము, లేక నమస్కారము, (ప్రార్థన)

## మానసిక పూజ

పుష్పములు మున్నగువానిచే చేయబడు బాహ్యపూజకంటె మానసికపూజ అతి మిక్కిలి శక్తివంతమైనది. భీముడే విధమగు పూజను చేయచుండుట లేదని అర్జునుడు తలచెను. శివదేవునికి తానుచేయుబాహ్యపూజవిషయమై ఆతడుగర్వించియుండెను. ఆతడు బిల్వపత్రములనర్పించెను. కాని భీముడు శివ

దేవునికి యావత్తు ప్రపంచమందలి యావత్తు బిల్వవృక్షముల యొక్క బిల్వపత్రములను మానసికముగ నర్పించెను. భీమునిచే సమర్పింపబడిన బిల్వపత్రములను శివదేవుని శిరస్సునుండి శివ భటులు తొలగింపజాలరైరి. అర్జును డొకప్పుడు బిల్వదళము లతో నిండిన బుట్టలను మోసుకొనిపోవు పెద్దజనసమూహమును గాంచెను. శివునకు తనచే నర్పింపబడిన పత్రములివియే యైయుండవలయునని వారిని సోదరులారా! యెచ్చటనుండి యీ బిల్వపత్రములను మోసుకొని పోవుచుంటిరని ప్రశ్నించెను వారు దానికి సమాధానముగ "ఓ అర్జునా! ఈపత్రము లన్నియు భీమునిచే తనయొక్క మానసిక పూజవలన మా ప్రభువగు శివున కర్పింపబడినవని" పల్కిరి. అర్జును డాశ్చర్య చకితుడయ్యెను. ఆతడు బాహ్య పూజకంటె మానసిక పూజ యొక్కవ శక్తివంతమైనదనియు, భీముడు తనకంటె గొప్ప భక్తుడనియు, తెలిసికొనెను. వాని గర్వము నాశన మాయెను. ఆతడు వినమ్రుడాయెను.

సాధనలో నున్నతిని పొందిన విద్యార్థులచే మానసిక పూజ చేయబడవచ్చును. సాధనలో ప్రారంభకులు (ప్రారంభ సాధకులు) పుష్పములు, గంధము, ధూపము, మున్నగు వానితో తప్పక నారాధించవలెను. మానసిక పూజ చేయు నపుడు నీ కమితమగు ధారణలేక ఏకాగ్రత కలుగును. వజ్రములు, ముత్యములు, మాణిక్యములు, మున్నగు వానిచే పొదుగ బడిన సింహాసనముపై మానసికముగ భగవాను నధిష్ఠింపుము. జగత్ప్రభువున కాసనమిమ్ము. నుదురు (ఫాల భాగము) నకును, శరీరమునకును, గంధము లేపన మొన ర్పుము. ఆర్ఘ్యము, మధుపర్కము, వివిధములగు పుష్ప

ములు, వస్త్రములు, మున్నగు వానిని సమర్పింపుము. ధూపము వేయుము. హారతినిమ్ము. నీరాజన మిమ్ము. వివిధము లగు ఫలములు, మిఠాయి దినుసులు మహా నైవేద్యము నర్పింపుము. భగవంతునికి ప్రపంచమందలి యావత్తు ఫలముల నొసగుము. మానసిక పూజలో కూడ లోభివి గాకుము. మానసిక పూజలో నొకడు ఎండిమాగిన అరటి పండును, ఒక గుప్పెడు పప్పు దినుసును సమర్పించెను. నిజముగ నతఁడ పరమలోభియే. మానసిక పూజలో సహితము దాతృత్వ యుతుడుగను నుదారుడుగను నుండజాలక పోయెను ఈ ప్రపంచమంతయు నిట్టి కనికరింపదగు పిసిని గొట్టులతో నిండియున్నది. అంత్యమున మానసికముగ,

"కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్వభావాత్
కరోమి యద్యత్ సకలమ్ పరస్మై
నారాయణాయేతి సమర్పయామి."

అని యుచ్చరింపుము. శరీరము చేతను, వాక్కుచేతను మనస్సు చేతను, యింద్రియముల చేతను, బుద్ధిచేతను, లేదా స్వాభావికమగు ప్రకృతి చేతను, నేనేమి యొనర్చితినో వాటి నంతయు పరబ్రహ్మ స్వరూపుడగు నారాయణుని కర్పించు చున్నాను. "ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు" అని కూడననుము. ఇది నీ హృదయమును పవిత్రమొనర్చి ప్రతిఫలాపేక్ష యనెడి మచ్చను తొలగింపచేయును.

## చతుర్విధ భావములు

సాధకునియొక్క స్వతహాగా గల వేర్వేరు స్థితులు. స్వభావముల కనుగుణ్యముగ నాలుగు విధములగు నుపాసన

పెడబొబ్బలుపెట్టును. నీటిబయటకువచ్చుటకాతడు తహ తహ లాడును. ఒక మనుష్యుని గృహము నిప్పంటుకొనినపుడు గృహయజమాని నిప్పు (మంట) నార్పుటకై యగ్ని సంరక్షక దళము (Fire Brigade) వారిని తెచ్చుటకు పురపాలకసంఘపు కచేరీ (Municipal Office) యొద్దకు తక్షణము పరుగెత్తును. తీక్షణవిధానముల తీసికొనును. నీటిలోనికి తిరిగిచేరుటకు గల చేపవలెను, నీటిబైటకువచ్చుటకు ఆసక్తిగల కుఱ్ఱవానివలెను. గృహదాహమగు నప్పుడగ్నిరక్షకదళమును తెచ్చుటకుగల యింటి యజమానివలెను, నట్టిపిపాసయే నట్టియనుభవమునే, నట్టిమనఃపూర్వకత లేక నట్టితీవ్రతనే భగవదనుభూతికి (For realising God) సాధకుడు కలిగియుండుచో నీయొక్కక్షణ ముననేభగవత్సాక్షాత్కారమగును. ఈవిషయమైసందేహము లేదు. ఓ సాధకులారా! భక్తి సాధనలలో (అభ్యాసములలో) చాలతీవ్రముగను, మనఃపూర్వకముగను నుండుడు. భగవంతుని పాదపద్మములవద్ద కిప్పుడేపరుగెత్తుడు. ఎవరైతే తమ భక్త్య భ్యాసములలో తీవ్రముగను, శ్రద్ధగనునుండరో వారి ప్రపంచ మును నిటుప్రక్కను, భగవంతుని యటుప్రక్కను బోగొట్టు కొనినవారుగనున్నారు. వారు త్రిశంకువలె తలక్రిందులై గాలిలో వ్రేలాడువారు. తుచ్ఛపు రకములు, వారిస్థితి కనికరింపదగినది.

ఆధ్యాత్మిక దిన చర్య పట్టీ (Spiritual Diary) నుంచుము. ఇతరులనెడ నీవాగ్రహ పరుడవగునపుడును, మఱియు నితరుల మనోభావముల (Feelings) నీవు నొప్పించునపుడును, దినచర్యపట్టీలో గుర్తించుము. ఇది చాల చాల ముఖ్యము. నీవు కోపమును వ్యక్తపఱచుచో లేదా

నితరుల బాధించుచో నీపై నీవు స్వకీయశిక్షను (Self punishment ) విధించుకొనుము. రాత్రివేళ భోజనము మానుము. అధికముగ 50 (ఏబది) మాలల జపమొనర్చుము. "నేనీ దినమున రెండు పర్యాయములు మానవునిలో భగవంతుని చూచుట మఱచితి "నని డనపట్టిలో వ్రాయుము. ఒకటి లేక రెండు సంవత్సరములవరకు నీవీ విధముగసాగుచో నిస్సందేహముగ నెన్నదగిన శాంతిని, నద్భుతమగు నాధ్యాత్మికోన్నతిని ( Progress ) మఱియు దృఢమగు నిచ్ఛాశక్తిని ( Will Power ) పొందుదువు. వివిధములగు బాధలు, కష్టములు, మానసికచీకాకులు, (యిబ్బందులు) నంతమొందును, భక్తి పెంపొందును. త్వరగా నీవున్నతి నొందుదువు. పరివర్తనకాబడిన మనుష్యుడవగుదువు. పృథివిపై నీవొక నిజమగు భగవంతుడగుదువు. ప్రియమిత్రులారా ! ఈ సంకల్పలచదువు మీరీదినమునుండియే నభ్యసింతురా ! వారమున కొకతూరి దినచర్య పట్టీపుటల త్రిప్పుము. నీవనుదినము నియమవితప్పిదముల చేయుచో దినచర్యపట్టి (Diary ) నుంచుకొను పక్షమున నాలుగునెలల తరువాత దినమున కైదుమాత్రమే నొనర్తువు. ఒకమంచి సమయమువచ్చును. మఱియు దినమున నీవొకతప్పిదమైనను చేయకుందువు. బెంజమిన్ ఫ్రాంక్లిన్ (Benjamin Franklin) యీ విధమగు దినచర్య పట్టీనుంచుకొనెడువాడు.

భగవంతుని నీకు సాయముచేయుమనికోరుచు సోమరిగ కూర్చొనకుము. కాని లేచినిలుచుని పనిచేయుము. యేలన తమకుతాము సాయముచేసికొనువారికి మాత్రమే భగవంతుడు సాయపడును. ప్రహ్లాదుని జీవితమునుండిభగవంతుని, కేవలము

భగవంతుని మాత్రమే ప్రేమించుపద్ధతిని నేర్చుకొనుము. ప్రహ్లాదునివలె భగవంతుని ప్రేమించుము. నీవు చేయగలిగి నంత యుత్తమముగనొనర్చుము. మఱియు భగవంతునికి మిగిలినది వదలుము. ఇదియేయున్నతమ రూపమగు సుపాసన. (Worship) ప్రహ్లాదుని పాదజాడల ననుసరింపుము. భగవత్కృపవలన సంతోషము, శాంతి, సుఖము, పరిపూర్ణతను మఱియు నమరత్వము (మోక్షము) పొందుదువు.

## ఆ త్మా ర్ప ణ

ఆత్మార్పణయే శరణాగతి లేక ఆత్మనివేదన నవవిధములగు భక్తిలో నిదియొకటి. భక్తిశ్రవణము లేక భగవంతుని లీలలు, గుణముల వినుటతో ప్రారంభించి భక్తియోగమందలి వివిధ మెట్లను నెమ్మదిగ నెక్కి మదిని మిక్కిలి యున్నతమైన నాత్మ నివేదనను చేరును. భక్తునియొక్క యిచ్ఛ విశ్వపుటిచ్ఛతో నేకమగును. భక్తుడు భగవంతునితో నేకమయి భగవంతునియొక్క సమస్త దివ్యైశ్వర్యముల ననుభవించును. ఎనిమిదిసిద్ధులు, తొమ్మిదిబుద్ధులు, వానిపాదముల క్రిందదొర్లును. భక్తునియొక్క ఆజ్ఞలనడ్డులేక మన్నించుటకై నవిజోడించినచేతులతోనిలబడును. భక్తుడు రాముని లేక శ్యామునితనశరీరపుప్రతివెంట్రుకనంచియందును, ప్రతియణువునందును, కణమునందును ననుభవమొందును, చూచును. ఈస్థితి యచింత్యము. (ఊహింపరానిది) యనిర్దేశ్యము (వర్ణింపరానిది) భక్తునియొక్క వివిధావయవములద్వారా, వానియొక్క అహంభావము సంపూర్తిగ నాశమైనందున భగవానుడను రాముడిప్పుడు ప్రత్యక్షముగ మాటలాడును. పనిచేయును.

ఆత్మార్పణకు ప్రతిబంధకములుగా నిలిచియుండు సద్దుణములు, కోరికలు, నహంభావమునైయున్నవి. ఆత్మార్పణ పరిపూర్ణముగ దాపరికములేనిదిగ, మనస్ఫూర్తియైనదిగ, నిర్ణయరహితముగనుండవలెను. ఒక్కొక్కప్పుడు భక్తుడు తనస్వకీయ సంతృప్తికొఱకు కొన్ని కోరికలనుంచుకొనును. ఎందుచేత నాతడుసంపూర్ణమైన నాత్మార్పణ నొనర్చి తన యిష్టము (రక్షకదైవము) యొక్క దర్శనమును పొందజాలడనిన నదియే కారణము. అహంభావము చాల మొండిది. మూర్ఖమైనది. అది గట్టి పాషాణశిల వంటిది. భక్తియనెడి సమ్మెటతో నిరంతరము చితుకకొట్టుట ద్వారా దానిని వ్రయ్యలొనర్పవలెను. మిక్కిలి దృఢమగు వజ్రము సహితము వేఱొక పదార్థము (వస్తువు) చే గ్రుచ్చ బడును. నింకను వజ్రమునందలి రంధ్రముగుండ సన్ననితీగ కంఠాభరణము చేయునప్పుడు జొనుపబడును. ఆవిధముగనే నీ కఠినమగు నంతఃకరణము లేక హృదయ మాత్మార్పణగుండ గ్రుచ్చబడి, హృదయరంధ్రముద్వారా భక్తియనెడి మృదువైన దారమును చొప్పింపవలెను. అప్పుడుమాత్రమే భగవానుడగు రామచంద్రుడు తనయొక్క భక్తుని హృదయములో వాసనము గొనును.

భక్తుడు తనంతట తనకొఱకుగాను నాత్మార్పణ చేయుటకు భగవంతుని సహితము కాంక్షించును. ఇది కేవలము మూఢత్వము మాత్రమే. ఆత డాత్మార్పణను తనంతటనే చేసికొనవలసియుండును. ఈ విషయమును బాగుగ గుర్తుంచుకొనుడు.

తమస్సు లేక జడత్వ మాత్మార్పణగ దురూహింపబడును. పతంజలి యోగసూత్రములలో "ఈశ్వర ప్రణిధా

నాద్యా" యను నొక సూక్ష్మోక్తి కలదు. (aphorism) అల్ప మగు నాత్మను నొకనియొక్క కర్మఫలములను భగవంతుని పాదములవద్ద సమర్పించుటచే సమాధి నొందవనగును. క్రియా యోగముయొక్క మూడంగములలోను నాత్మార్పణ మొకటి. "తపస్స్వాధ్యాయ యీశ్వర ప్రాణిధానా, క్రియాయోగా, తపస్సు, గ్రంథపఠనము, నాత్మార్పణములయొక్క కూడికయే క్రియాయోగమగును." మఱియు నింకా "నియమము" లోని నైదంశములలోను నాత్మార్పణ మొకటి. క్రియాయోగము పంచక్లేశములను (కష్టములను) నాశమొనర్చి భగవంతునితోడ నైక్యమునకు మనస్సును తయారు చేయును.

గీతలో భగవానుడగు కృష్ణుడు "సమస్త విధికృత్యముల విడిచిపెట్టి యాశ్రయమునకై నావద్దకు మాత్రమేరమ్ము. విచార మొందకుము. నిన్ను సమస్తపాపములనుండి విమోచన మొందింతున" ని యనును. ఈ శ్లోకముయొక్క భావమును నిరంతరము తన మనస్సుముందఱ నుంచుకొనుచో భక్తునికి స్వకీయాత్మార్పణ కలుగచేసికొనుటలో సహాయపడునట్టిదైన దిదియొక మహిమాన్వితమైన శరణాగతి మంత్రము.

శ్రీరామభక్తులయొక్క "శ్రీరామశరణంమమ" శ్రీరామునికి నన్ను నే నర్పించుకొనుచున్నాను; శ్రీకృష్ణభక్తులయొక్క "శ్రీకృష్ణ శరణంమమ" శ్రీకృష్ణునికి నన్ను నే నర్పించుకొనుచున్నాను; శ్రీహరిభక్తులయొక్క "శ్రీమన్నారాయణం శరణం ప్రపద్యే" భగవానుడగు నారాయణునికి నన్ను నే నర్పించుకొనుచున్నాననెడి శరణాగతి మంత్రములకిది ప్రతిసరియగును. ఎవరు పై మంత్రముల భావముతో నుచ్చరింతురో వారు భగవత్కృపను త్వరలో బొందుదురు. వారు పరిపూర్ణమగు

నాత్మార్పణ నొనర్పజాలుదువు. "శిష్యస్తేహం శాధిమాం త్వాం ప్రపన్నమ్". నేను నీ శిష్యుడను. నిన్ను ప్రాధేయపడుచున్నాను. బోధింపుము" ఇదికూడ నొక శరణాగతిమంత్రమే. నీవు దీనిని మనఃపూర్వకత, భావములతోడ నుచ్చరించుచో శ్రీకృష్ణమూర్తి యనుగ్రహము నీపై నవతరించును.

ఈ దిగువ మంత్రములయొక్క నుచ్చారణకూడ పరిపూర్ణముగ నాత్మార్పణ నొనర్చుటకు నీ కుపకరించును. "నాప్రభూ (భగవంతు నుద్దేశించి) నేను నీవాడను. సమస్తము నీదియే. నీదియే యొనర్పబడును. నీయొక్క హృదయాంతర్యమునుండి, మధ్య ఆంతరంగికపుటునికినుండి యేకాగ్రభక్తితో నీయొక్క నూటికి నూరుపాళ్ళ మనస్సుతో లేక 16 అణాల మనస్సుతో "నాజగదీశా ! నేను నీవాడ" నని యొక్క పర్యాయము నీవు చెప్పినప్పటికిని భగవంతునినుండి నిన్ను వేఱుపరచు నఖాతముపై తత్క్షణమే వంతెన కట్టబడును. మనస్సు, చిత్తము, హృదయము, బుద్ధి, నాత్మయు నైక్యముగకూడి యర్పణనెడ పనిచేయవలెను. అప్పుడుమాత్రమే నాత్మార్పణ వాస్తవమైనది, పరిపూర్ణమైనది, దోషరహితమైనది యగును. మనస్సు "నాస్వామీ, నేను నీవాడన"ని చెప్పుచో, బుద్ధి "నేను ఫలానివాడను, నేనొక శాసనసభ్యుడను (M. L. A.) నేను సమస్తము యెరుగుదును. నేనొక శక్తివంత న్యాయాధిపతి (Judge) న" ని చెప్పుచో, చిత్తము "నే నేది కోరినను పొందుటకువలయుసిద్ధిని నేను కలిగియుండవలెన" ని చెప్పుచో మఱియు నాత్మ "నేనొక గొప్ప భక్తుడన" ని చెప్పుచో నీవొక డాంబికుడవు (Hypocrit) మాత్రమే. నీ వెవ్విధమైన నాత్మార్పణమును చేసియుండలేదు. నైతికాధ్యాత్మికగర్వము

నెడ జాగ్రతపడుము. మాయ వివిధములగు సూక్ష్మరూప ముల వహించును. ప్రాపంచిక చిత్తపుజనముయొక్క ధనాధి కారాంతస్థులవలన నొందెడి సాధారణ గర్వముకంటె సాధకు లయొక్క నైతికాధ్యాత్మికగర్వ మెక్కువ హానికరమైనది.

భక్తిలో నంతస్థులు

|

సత్సంగము

|

శ్లాఘనీయత

శ్రద్ధ (విశ్వాసము)

|

దైవభక్తి (సాధనభక్తి)

నిష్ఠ (ఆస్తిక్యత)

|

రుచి (ప్రీతి)

|

రతి (అమితానురాగము)

|

స్థాయీభావము (స్థిరత్వము)

మహాభావము (ప్రేమమాయ)

సత్సంగము, స్వాధ్యాయము (భక్తిసంబంధగ్రంథపఠన) ద్వారా భగవంతునికై శ్లాఘనీయత యొదవును. శ్లాఘనీయత

నుండి శ్రద్ధ (విశ్వాసము) యబ్బును. శ్రద్ధనుండి భగవంతుని యెడ భక్తి ప్రాప్తించును. తమపరి భక్తుడు, సాధన, భక్తి యేవనగా, జపము, స్మరణ, కీర్తన నభ్యసించును. ఆతడు తన భక్తినొందుటకు పై యనుష్ఠానము మూలమున పాపములను నష్టంకులను దగ్ధపఱచును. సాధన భక్తినుండి యాతడు నిష్ఠను (ఆస్తిక్యతను) పెంపొందించును. నిష్ఠనుండి భగవన్నామముల మహిమల వినుటకు, గానమొనర్చుటకు, రుచి లేక ప్రీతి కలుగును. తమపరి రతి (అమితానురాగము) వచ్చును. రతి హృదయమును మృదుత్వ మొనర్చును. రతిని తీవ్రాధిక్యపరచినప్పుడు దానిని స్థాయీభావస్థిరత్వము లేక భక్తిరసముయొక్క శాశ్వతరూపము అందురు. స్థాయీభావమును తీవ్రోగ్ర మొనర్చినపుడు దానిని మహాభావము లేక ప్రేమ, మాయ యందురు. ఇప్పుడు భక్తుడు ప్రేమరసము నాస్వాదించుచు భగవంతునిలో జీవించును. అట్టి భక్తుడు ప్రపంచమునకును, దానియొక్క నాకర్షణలకును, మృతుడై (చచ్చినవాడై) యుండును. ఆతడు తన శరీరకృత్యములలో సహితము సంబంధపడనివానివలె నిలిచియుండును. ఆతడు జీవన్ముక్తి లేక బ్రతికియుండగనే మోక్షముయొక్క స్థితిని చేరును.

---

# ద్వితీయాధ్యాయము - ప్రేమ (భక్తి) యొక్కతత్త్వము

## ప్రేమ యన నేమి ?

ప్రేమ అందఱి హృదయముల నైక్యమొనర్చు నట్టి యొక విచిత్రమగు భగవత్సంబంధమైన బంక (జిగురు - glue) యై యున్నది. అది యత్యధికమగు శక్తి గలిగిన దివ్య రోగ నివారణయగు అసాధారణ నుపశన కారియై యున్నది. శ్రద్ధ, ప్రేమ, భక్తి లేనట్టి జీవనము విషాదపూరితము నిష్ఫలము. అది నిజమగు చావు. ప్రేమయనునది భగవత్సంబంధ మైనది. ప్రేమయే పృథ్విపై నొక గొప్ప శక్తి. అది యెదురాడ (డీకొన) రానిది. ప్రేమ మాత్రమే మానవుని హృదయమును వాస్తవముగ జయింప గలదు. ప్రేమయే శత్రుని వశమొనర్చు కొనును. (లోబరచుకొనును) ప్రేమ క్రూర జంతువులను మచ్చిక జేసుకొనగలదు. దానియొక్క మహిమ అనంతము. దానియొక్క లోతు తెలిసికొనరానిది. దాని స్వభావమువచనా తీతమైనది. దాని శోభ వర్ణనా తీతము.

స్వార్థరహితమగు సేవ, మహాత్ములయొక్క సత్సంగము, ప్రార్థన, గురుమంత్రోచ్చారణ, మున్నగు వానిచే మనము విశ్వప్రేమను క్రమేణ పెంపొందింపవలెను. తొలుత స్వార్థముచే హృదయము సంకుచిత మయినప్పుడు మానవుడు తన భార్యను, బిడ్డలను, కొలదిమంది స్నేహితులను, బంధువులను మాత్రము ప్రేమించును. ఆతడు క్రమోన్నతి నొందు కొలది తన స్వీయమగు జిల్లాలోని ప్రజలను, పిమ్మట తన స్వీయమగు రాష్ట్రములోని ప్రజలను ప్రేమించును. తదుపరి కాలక్రమమున తన స్వీయమగు దేశమందలి ప్రజల కొఱకు

ప్రేమనభివృద్ధి పరచును. చివరను వివిధదేశము లందలి యితర జనుల నాతడు ప్రేమించుట ప్రారంభించును. తుట్ట తుదను నందఱి నాతడు ప్రేమించును. ఆతడు విశ్వప్రేమను వృద్ధి నొందించును. అన్ని యడ్డంకులు ప్రయ్యలోనర్చబడును. హృదయ మనంతమునకు వ్యాప్తిచెందును.

విశ్వప్రేమనుగూర్చి మాట్లాడుట సులభము. మీరు దానిని వాస్తవమగు నాచరణలో పెట్టదలచుకున్నప్పుడు నది యమితముగ కష్టమగును. అన్ని విధములగు నల్ప సంకుచిత మానసికత్వము (Petty mindedness) త్రోవలోనిలుచుండును. గడచిన కాలమున నీయొక్క దురూహాలచే నీవు సృజించు కొనిన పురాతన, దుష్ట సంస్కారములు తప్పుడు (జారుడు) రాళ్ళు (Stumbling blocks) గా పనిచేయును. తీవ్ర సంకల్పము, దృఢమగునిచ్ఛ, ఓర్పు, కార్యదీక్ష, (కార్యపటుత్వము (perseverance) విచారము (సద్విమర్శనము) ల ద్వారా నన్నియాటంకములను పూర్తిగా సునాయాసముగా మీరు జయింపవచ్చును. నా ప్రియమిత్రులారా! మీరు మనః పూర్వకముగ నుండువారగుచో భగవత్కృప మీా పై నవత రించును.

విశ్వప్రేమ ఋషులు, జ్ఞానుల (seers and sages) యొక్కనుపనిషదీయ చైతన్యము లేదా నేకత్వముయొక్క అద్వైత సమైక్యతలో నంత మొందును. పరిశుద్ధ ప్రేమ యొకగొప్ప (నిమ్నోన్నతముల సరిచేయు) మట్టుకాడి. (Leveller) అది సమానత్వమును, విశ్వదృష్టి (Cosmic vision) ని దెచ్చును. మీరా, గౌరాంగుడు, తుకారాముడు, రామ దాసు, హాఫీజు, కబీరు, యందఱును నీవిశ్వ ప్రేమను చవి

మూచిరి. విశ్వప్రేమయొక్క యేకైక కౌగిటిలో నన్ని విభేద ములు, నల్ప భ్రాంతి కారకములగు తేడాలు కఱగిపోవును. ప్రేమమాత్రమే నుత్కృష్టముగ పాలించును.

ప్రేమకంటె నున్నతమగు సుగుణము లేదు. ప్రేమ కంటె మించిన ధనము లేదు. ప్రేమకంటె నధికమగు జ్ఞానము (Knowledge) లేదు. ప్రేమకంటె నతిశయ మొందిన ధర్మము లేదు. ప్రేమకంటె మీరిన మతము లేదు. యేలన ప్రేమయే సత్యము. ప్రేమయే దేవుడు, ఈ ప్రపంచము ప్రేమనుండియే బయలు వెడలినది. ఈ ప్ర పం చ ము ప్రేమలోనే నిలిచియున్నది. మరియు నీప్రపంచము తుదిని ప్రేమలోనే నంతమొందును. భగవంతుడు ప్రేమయొక్క మూర్తిత్వము. ఆ పరాత్పరునియొక్క ప్రతియంగుళసృష్టిలోను వానియొక్క ప్రేమను మీరు వాస్తవముగ గ్రహింప గలుగుదురు.

ప్రేమలో జీవింపుడు. ప్రేమలో శ్వాసింపుడు. ప్రేమలో గానమొనర్పుడు. ప్రేమలో భుజింపుడు. ప్రేమలో త్రాగుడు. ప్రేమలోమాట్లాడుడు. ప్రేమలోప్రార్థింపుడు. ప్రేమలోధ్యానిం పుడు. ప్రేమలో యోజింపుడు. ప్రేమలో చరింపుడు. ప్రేమలో మృతినొందుడు. ప్రేమాగ్నిలో మీతలంపులను, భాషణ లను, కర్మలను, పవిత్రమొనర్చుకొనుడు. పవిత్రమగు ప్రేమ సముద్రమందు స్నానమొనర్చి మునుకవేయుడు. ప్రేమమధు వును పానమొనర్పుడు. మరియు ప్రేమయొక్క అవతార మూర్తికండు.

ప్రారంభావస్థలో భక్తుడు భగవంతు నుపాసించును. ఇతర దేవతల నుపాసించు నన్యతెగల (రకముల) భక్తుల

యెడ నాతడయిష్టతచూపును. ధనమునొందుటకొఱకో, లేదా పుత్రునికొఱకో, లేదా రోగములయొక్క బాధా నివృత్తి కొఱకో, భగవంతునెందుకు భక్తుడుపాసించునో నదియే "సకామ్యభక్తి" సకామ్యభక్తితుదకు "నిష్కామ్యభక్తి" గా నంతమొందును. ప్రారంభమున ధృవుడుసహితము "సకామ్య భక్తి" ని మాత్రమే కలిగియుండెను. శ్రీహరిదర్శన మాత పొందినపుడు వాని కోరికలన్నియు మాయమయ్యెను. పరా భక్తి నాతడు పెంపొందించెను. పరాభక్తి యన్నిపైహిక కామ్యములను దగ్ధమొనర్చునట్టి నొకనగ్నియై యున్నది. తన బాల్యమునుండియు పవిత్రమగు నిష్కామ్యభక్తిని గలిగి యుండినవాడు ప్రహ్లాదుడు మాత్రమే. ఎంమలో భక్తుడు భగ వంతుని కొంతకాలమును, తనపరిభార్యను, బిడ్డలను, నాస్తిని కొంతకాలమును,నారాధించునో లేదా ప్రేమించునో నదియే వ్యభిచారిణీభక్తి. భగవంతునిమాత్రమే సర్వకాలములందును సర్వావస్థలయందును. ప్రేమించుటయే నవ్యభిచారిణీభక్తి. ప్రహ్లాదుడు భక్తియొక్క నున్నతావస్థయందు తన స్వకీ యాత్మపైననే శ్రీహరిగా ధ్యానించెను. ఇదియే నభేదభక్తి.

సాధువులు. నింకను భక్తులతోడి సత్సంగము లేక సాంగత్యము విశ్వప్రేమను వృద్ధిపరచుటకు చాలదూర ముప కరించును. భక్తుల సహవాసమున భగవంతునిపై సంభాష ణలు తటస్థించును. ఇవి హృదయమునకును, శ్రోత్రముల కును, చాలసంతసము కలిగించును. గడపుచుండెడి మిక్కిలి పాపిష్ఠిజీవనమునుండి, జగయ్, మధయ్, ల యొక్కయు, దోపిడి గాడగు రత్నాకరునియొక్కయు, విడుదల సాధుసంగ మనేమి చేయగలదో గు ర్తింపదగు నుదాహరణల నొసగును.

ప్రియమిత్రులారా! లేచి నిలువబడుడు. తీవ్రముగ కృషిచేయుడు, ముందుకుసాగుడు, అహంభావము, స్వార్థపరత్వము, గర్వము, ద్వేషముల, నంతమొందింపుడు. సేవింపుడు. ప్రేమింపుడు. ఇండు. "దత్త-దయ-దమ ఇచ్చుట. కరుణగల్గియుండుట. యింద్రియములవశము" యనెడి పదత్రయము (Triplet) ను జ్ఞప్తియుంచుకొనుడు. దీనినికూడ నభ్యసింపుడు. నీవొనర్చు సేవలకై కృతజ్ఞత, సమ్మతి, (మెప్పు) పొగడ్తలను, సహితము నపేక్షింపకుము. భగవంతుని పాదపద్మములనొద్ద సమస్తమును సమర్పింపుడు, "ప్రేమకొఱకు ప్రేమ" "పనికొఱకు పని" యను మార్గదర్శక నుడి (Motto) ని గలిగియుండుడు.

పాదముల దిగువమట్ట (త్రొక్క) బడు గడ్డిపోచకంటె నమ్రతగను, వృక్షముకంటె నెక్కుడోర్పుగను, నితరుల నుండి గౌరవమును లక్ష్యముచేయకుండనే పైగనందఱను గౌరవించుచును, హరినామమును సర్వవేళల గానమొనర్చుచును, మానవానీకము (humanity)ను సేవించుచును, వ్యక్తమయిన భగవంతునివలె నొక వాస్తవికవైష్ణవులుకండు. మీరు త్వరలోవిశ్వానురాగము లేక ప్రేమనువృద్ధిపొందింతురు. హరి యొక్కదర్శనమును మీరొందెదురు. నేను మీకు దృఢపర్చుచున్నాను. ఇదిమాత్రమే మీకు మోక్షమును, ననంతమగు శాంతినినొసగును.

## ప్రేమ సందేశము

మోక్షము, శాశ్వతసౌఖ్యముయొక్క వాసస్థానమును, కాలము తనవినాసకశక్తిని ప్రయోగింపజాలనట్టిదియు, మాయ తనముఖమును చూపలేనట్టిదియు, నగు పరంధామమునకు

నీడ్చుకొనిపోవు నీప్రేమమార్గమే సరియగురాజబాట. ఇదియే భగవంతునివద్దకుజనుస్పష్టమగు, బాహాటమగుత్రోవ. ప్రేమ, చావు, పుట్టుకల పరిభ్రమణమునుండి భక్తునివిడుదల చేయును. సౌఖ్యము, ప్రేమయొక్క చెలికత్తె. ప్రేమయే సత్యస్నాత మగుసిద్ధి. స్వకీయానందమునకై భక్తుడెట్టికోరికనుగోరడు. ప్రేమ నిమిత్తము భగవంతుని ప్రేమించుటయు, భగవత్ప్రీత్యర్థము భగవంతునిసేవించుటయు, వానియొక్క యేకైకతీవ్రాభిలాష. భక్తుడిట్టిప్రేమను పెంపొందించునపుడు భగవంతుడు వానికి సేవకుడగును.

పవిత్రమగు స్వార్థరహితమగుప్రేమయే ప్రేమలేక భగవద్భక్తి. పవిత్రమగుప్రేమయే నొక అరుదగు వ్యాపార వస్తువు. దానిని క్రమేణఅలవచ్చుకొనవలెను. అది సర్వకాల ములనుండునది. లేకనిలుచునది. ఎట్టి విభేదము లేదాఘర్షణ లేదావిసుగుముఖము లేక చిట్లింపు (Frowning) యిచటనుండ జాలవు. క్షీణతలేకతగ్గుటలేదు. వృద్ధిచంద్రునివలె లేదా వర్షర్తువునందలి గంగానదివలె నదిసర్వకాలముల వృద్ధి నందుచుండును.

పరిశుద్ధమగు ప్రేమమాత్రమే మానవుని మానవుని నుండి వేరుపఱచునన్నియడ్డంకులను తొలగించగలదు. పవిత్ర ప్రేమయే సర్వవిధములగు కారణరహితములగు నయిష్టము లను వైమనస్యతలను, అసహ్యతను, మఱియు ద్వేషమును రూపు మాపగలదు. పవిత్రప్రేమమాత్రమే యహూదు (jew) ను, కిరస్తాను (Christian)ను, హిందువును, ముసల్మానును, కాథ లిక్ ను, ప్రొటస్టెంటును. బ్రాహ్మణుని, బ్రాహ్మణేతరుని, వైష్ణవుని, శైవుని, సనాతనుని, సామాజికు (Samajist) ని,

శాక్తుని, రామానందుని, యింగ్లీషువానిని, యిటలీవానిని, చీనావానిని, జపానువానిని, సన్యాసిని, వైరాగిని, నొకేఉమ్మడి వేదికపై నైక్యముచేయఁగలదు. మఱియు వారిహృదయము లందలి జాగ్రత (అభిలాష Care) నుకూడఁ కూర్చును.

ప్రపంచములోని సత్యోత్తమ మిత్రులుసహితము తమ లోతాము కొట్లాడుకొందురు. చాలకాలమువఱకు కలసి మెలసి యుండు భార్యాభర్తలు సహితము తమలోతాము తగవు లాడుచుందురు. తండ్రులు, కొడుకులుకూడ జగడము లాడు చుందురు. కాని పవిత్రమగు ప్రేమలో నిరంతరత్వమున కెట్టి విచ్ఛేదము (break) ను లేదు. పవిత్రప్రేమ దివ్యమైనది. పవిత్రప్రేమయే దేవుడు. భగవంతుడు పవిత్ర ప్రేమయే. స్వార్థపరత్వముయొక్క యెట్టి మరక లేదా దుర్భిణియంత్రపు (microscopical) జాడవగిన దాని జాడఁగాని పవిత్రప్రేమలో నెన్న డుండఁజాలదు. అదియే కారణముగ నది యెల్లప్పుడు నిలుచును. ప్రేమ యొక గొప్ప మనోపవిత్రకారి.

ప్రేమ యొక బలమగు శక్తి. తనయొక్క అధికార ప్రభావముక్రిందకు వచ్చు ప్రాణులపై నద్భుతమగు శక్తి నది యమలుపరచును. ప్రేమ యొక గొప్ప నిమ్నోన్నత సమ కారి. (Leveller) రెంటిమధ్యనుండు సర్వవిభేదములు మాయ మగును. ప్రేమించువాడు (ప్రేమికుడు - lover) మఱియు ప్రేమింపబడునది (ప్రేమ_beloved) సమానఅంతస్థులో నుంచ బడుదురు. పవిత్రమగు స్వార్థరహితమగు ప్రేమ భగవంతుని మానవునిక్రిందను, మానవుని భగవంతునిక్రిందను మార్చ గలదు. పృథివిపై ప్రేమనుమించిన శక్తిలేదు. ప్రేమప్రభావము వలననే నియమములు లేక కట్టుబాట్లు విచ్ఛేద్యమగుచున్నవి.

సత్యమునకు లేదా భగవత్సామ్రాజ్యమునకు లేదా నిరంతరమగు శాంతిసంతోషములయొక్క విస్తృతమ మండలమునకు ప్రేమయే తక్షణమగు మార్గము. అదియే సృష్టియొక్క జీవతత్త్వము. అదియే నాత్మశక్తియొక్క నత్యున్నతమగు వ్యక్తీకరణము. (Expression) అదియే మతముయొక్క అన్నివిధులయొక్క సంపూర్తియగు మొత్తము. అదియే యావత్ప్రపంచమును జయింపగల్గు భక్తునిచేతిలోని మంత్రబెత్తము. (Magic wand) మీరా, రాధ, తుకారామ్, తులసీదాస్, గౌరాంగ, ఏసు, (Jesus) ప్రభువు, భగవమన్మత్తులగు సుఫీలైన "మంసూర్" మఱియు "షామ్సు టాబ్రియజ్" ల వెనుక నడపుచుండెడి (ప్రేరేపించెడి) శక్తియు నదియే.

ఎవడు తనసోదరుని ప్రేమించునో నాతడు దివ్యప్రకాశము (దివ్యజ్యోతి) యందుండును. కృత్యము (Deed) సత్యము (Truth) లలోతప్ప మనము మాటల్లో చలించవద్దు. నాలుకతో నంతకంటెను. మనమొకరి నొకరము ప్రేమించుకొందుము. భగవానుడు మనలోనుండును. మఱియు నాపరమేశ్వరుని ప్రేమ మనలో పరిపూర్ణత్వము చెందును. ఎవడైతే ప్రేమతోనుండునో నాతడు భగవానునిలోనుండును. మఱియు భగవానుడు వానిలోనుండును. ప్రేమ ఈవిధముగ భగవంతుని వద్దకుపోవు విస్పష్టమైనట్టి బాహ్యమైనట్టి మార్గమెయున్నది, మఱియు నిదెంత సామాన్యముగ, పరిపూర్ణముగ, నుండినను మఱియొక విస్తృతమగు త్రోవను వెదకుచు దానిని చాలమంది కనుగొనజాలిరని భక్తుడగు జాన్ (St. John) చెప్పెను.

ప్రేమ అత్యధికమగు తృప్తినిచ్చును. భక్తుడు భగవంతునితో నెదురుగ ముఖాముఖిగ నుండుటకు వచ్చినప్పుడు

అనగా భగవదర్శనమగునపుడు వాని హృదయముత్కృష్టమగు సౌఖ్యము, సంతోషములతో నిండియుండును. వానియొక్క అన్నికోరికలును తృప్తిచెందియుండును. ధృవునిమాటలవినుము. "అద్దపు ముక్కకుచూచు (వెదకు) మనుష్యుడు ప్రకాశించు మణి (Gem) ని యెటుల డీకొనునో నటులనే నోప్రభూ! రాజ్యసింహాసనాన్వేషణకై తపస్సాచరించిన నేను నిన్ను పొందితిని. నేను సంపూర్తిగ తృప్తిచెందితిని. నేనెట్టి వరము కోర" నని యాతడనును.

నీజీవికా ప్రయాణము (Life's Journey) తుదికి రాబోవనున్నప్పుడు నీకొక సాధువు లేక మహాత్ముని సాంగత్యము లభించును. వానియొక్క సహవాసములో నీవు క్రమేణ భగవంతునియెడ భక్తిని పెంపొందింతువు. ప్రాపంచిక విషయములపైననురాగమువీడుదువు. అంతఃప్రేరణశక్తి(Inspiration) నాకర్షింతువు, మఱియు మానసికోన్నతిని పొందుదువు. భగవంతుని పాదపద్మములకు బద్ధడనైయుందువు. భగవద్భక్తుని సంపర్కముచేతను, వాని యాశీర్వచనములచేతను, భగవదునికియందు దృఢమగు . నమ్మకమును, భగవద్భక్తియెడ స్థిరమగు విశ్వాసమును, నీవుపొందుదువు. మహాత్ములయొక్క ప్రత్యక్ష సాంగత్యములేనిదే నీకు భక్తియుండజాలదు. భగవద్భక్తుల (Saints) యనుగ్రహము లేనిదే ప్రాపంచికపు సంకెళ్ల కట్లుబాట్లనుండి నీయంతట నీవుతప్పించుకొనజాలవు. తపస్సు, వైదికమగు యజ్ఞము, ధర్మకార్యములు. పురాణ (Scriptures) పఠన, సూర్య, యింద్ర, అగ్నులయొక్క ఉపాసనయు నీవొనర్చి నప్పటికిని నీవు భగవంతుని పొందజాలవు. భగవంతుని సామ్రాజ్యము లోనికి తిన్నగ ప్రవేశించుటకు

మహాత్ముల సత్సంగముద్వార మాత్రముననే ప్రవేశాధికార పత్రమును (Pass Port) పొందుదువు. జగత్ప్రభువును మఱచిన వానికి నటగాని, నిటుపైనగాని, నిజమగు సౌఖ్యములేదు. స్వార్థయుతమగు జీవితము గడుపువానికి, గర్వము, అహంభావము. మూలమున నితరులనుండి తన్నుతాను వేఱుపరచుకొనువానికి, శాశ్వతమగు శాంతియుండదు. భగవంతుని యొక్క నిరంతర స్మరణ (Rememberance) సమస్త బాధల, దుఃఖముల పోగొట్టి మోక్షమును, సౌఖ్యమును, శాంతిని, భక్తునికి ప్రసాదించును. ఆత్మబలిదానము (self sacrifice) స్వార్థపరత్వమును, అహంభావమును, నశింపచేయును. భగవదైక్యమునకు మిక్కిలి దగ్గఱ మార్గము "ఆత్మబలిదానమే".

"ఆహార" మనగ భోజనము. ఇది సారస్వతా (వాచ్యా) ర్థము. విశాల భావమున "వేర్వేరు యింద్రియములచే నేదేది గ్రహింప బడునో నది" యని యర్థము. మనస్సునకాధ్యాత్మి కాహారమును నీవియ్యవలెను. అప్పుడు మాత్రమే మనస్సైకాగ్రచిత్తత నొందును. అప్పుడు మాత్రమేనది మలిన రహితమగును. అప్పుడు మాత్రమే నీవాత్మ సాక్షాత్కారము నొందజాలుదువు.

నీ యిష్టము (యిష్టదేవుని) యొక్క బొమ్మను లేదా యే యితర పవిత్రమగు వస్తువునుగాని కండ్లు విధిగ చూచుచుండవలయును. ఉపనిషత్తులు రామాయణము లేక భాగవతమును చెవులు విధిగ వినుచుండవలయును. భగవంతునికి సంబంధించిన దేదియో నా విషయమును నాలుక విధిగ పలుకుచుండ వలయును. ఇంద్రియములకు మనస్సునకు పవిత్రమగు నాధ్యాత్మి కాహారము లివియే.

నీవు నిజమగు భగవదన్వేషకుడ వగుచో నాపరమాత్మ నొక క్షణములోననే కలిసికొందువు. ఆ భగవానుని యెల్ల వేళల జ్ఞప్తియుంచుకొమ్ము. వాని (భగవంతుని) నామము వలననే బ్రతుకుము. వాని (భగవంతుని) కీర్తనల (స్తుతుల) గానము చేయుము. నీ హృదయములో వానిని (నాపరాత్పరుని) వెదకుము. నీ యాత్మకాధారమును, యావత్తు ప్రపంచమున కేకైక భూమండలాధిపతియును, నీ హృదయము నందలి యంతర్యామియును, నాంతర్య పాలకుడు (నంతర్యామి - Inner Ruler) ను, నగు భగవంతుని ప్రేమించు, సేవించు విధమును భక్తుల వద్దనుండి నేర్చుకొనుము.

ఉపాసన (భక్తి) ని "ప్రేమ" తో కలుపుము. అప్పుడు నిజమగు భక్తిని పెంపొందింతువు. ఉపాసన (భక్తి) ప్రేమను సంరక్షించును. వృద్ధిపొందించును. తీవియుతముగ (హోదాగ) చేయును. విశాలత్వ మొనర్చును, నీయొక్క విశ్వాసమును, భక్తి, ప్రేమల విషయమగునటుల యత్నింపుము. నీదైనిక జీవనములో నిట్టి "ప్రేమించుభక్తి" (ప్రేమయుతమగు) సిద్ధాంతము (Religion) నభ్యసింపుము.

ప్రతిశ్వాసలోను భగవన్నామము నుచ్చరింపుము. వాని (పరమేశ్వరుని) యొక్క పాదకమలములపై నీభావనల కేంద్రీకరింపుము. గోస్వామి, తులసీదాసువలె మనఃపారిశుద్ధ్యముకై ప్రార్థింపుము. శరణాగతి (Surrender) కీర్తనలను "మీరా" వలెపాడుము. భగవంతునికై పవిత్రమగు నిస్స్వార్థమగు ప్రేమను గలిగియుండుము. ప్రతిదినమును దాని నెక్కువ యెక్కువగ పెరుగనిమ్ము. సిద్ధులు, ప్రాపంచికవస్తు

సంపత్తి (worldly possessions) కాదు మోక్షము కొఱకయి నప్పటికిని భగవంతుని కోరవద్దు.

నీయొక్క యిష్టదేవతయొక్క ఆకృతిని నీ వేర్పఱచు కొనజాలనిచో నీచే జపింపబడు మంత్ర శబ్దమును వినుటకు గాని, లేదా మంత్రాక్షరములపై వరుసక్రమమున ధ్యానించు టకుగాని, నీవు యత్నింపవచ్చును. ఇది నీయొక్క మానసిక తిరుగుడు (చంచలత్వము) నాపుచేయును.

నీ హృదయమునందలి గదులలో భగవాను డధిష్టించి నటు లనుభవమొందుటకు యత్నింపుము. నీయొక్క స్వాభావి కపుటూహచే సృజింపబడిన భగవత్స్వరూపము నీధ్యానమున నుత్తమముగ తగియుండుచో నాస్వరూపమునైననే నీవు ధ్యానింపవచ్చును. స్వరూపముయొక్క (కలగాపులగపు) గజి బిజి, కనుజాడమాత్రమే నీవు కలిగియున్నప్పటికిని, నిరంతరా ధ్యాసమువలన నొక స్పష్టముగ కత్తిరించబడిన, బాగుగ నిర్వ చింపబడిన యాకారమును క్రమేణ నది పొందును. నీయొక్క ధ్యానములో క్రమబద్ధముగ నుండుము. స్వరూపము ప్రకాశ వస్త్రలముచే నావరింపబడినటులను, మఱియు నీమనస్సులోని యంధకారమును నీదివ్యప్రకాశముచే తొలగింపబడినటులను నూహించి భావించుము.

భగవంతుని పాదపద్మములను తుమ్మెదవలె పట్టుకొని ప్రేలాడుము. ప్రేమ (భక్తి) కు త్రోవదీయు మార్గమును గను గొనుము. దివ్యప్రేమ యనెడి తేనె (మధువు) నాస్వాదింపుము ప్రేమమయుడ వగుము. ప్రేమమూర్తివి కమ్ము. ప్రేమలో నశింపుము, ప్రేమలో చరింపుము. ప్రేమలోననే నీ యునికిని సైతము కలిగియుండుము.

## విశ్వాసము

గీతలో "దేహధారులయొక్క సంతస్యాతమగు శ్రద్ధ స్వాభావిక ప్రకృతిరీత్యా త్రివిధము- సాత్త్వికము, రాజసికము తామసికము, ఓ భారతా! ప్రతివానియొక్క శ్రద్ధ వాని యొక్క స్వీయప్రకృతి ననుసరించి రూపొనర్పబడును. మానవుడు వానియొక్క శ్రద్ధనే గలిగియుండును. వానియొక్క శ్రద్ధ యేదియో వాడదిమాత్రమే నగు" నని శ్రీకృష్ణుడు చెప్పెను.

విశ్వాసము (శ్రద్ధ) మానవునియొక్క శీల మెట్టిదో చూపును. వాస్తవమగు, పరిపూర్ణమైన, సజీవమైన, నచంచలమైన, విశ్వాసమును భగవంతుని యందును, నా పరాత్పరుని కృపయందును నా జగత్ప్రభునామ మహిమయందును, గలిగి యుండుము. ధ్యానింపుము. మఱియు దివ్య ప్రకాశమునకు నీవు తెఱచుకొని యుండుము. నిన్ను నీవు దివ్యమూర్తిగ (భగవంతునిగ) పరివర్తింప బడుదువు.

విశ్వాసము (నమ్మిక) పర్వతముల కదలింప గలదు. విశ్వాసమద్భుతముల నొనర్పగలదు. విశ్వాసము నిన్ను భగవంతునియొక్క సాంతర్య గుహలోనికి తీసుకొని పోగలదు. విశ్వాసము నిన్ను దివ్యునిగ (భగవదీయునిగ) నొనర్పగలదు. విశ్వాసము నీకు శాంతిని, సాంతర్యమగు నాధ్యాత్మికశక్తిని, సంతోషమును, స్వేచ్ఛను, మోక్షమును, నానందమును, నివ్వగలదు. కాన భగవమునికియందును, శాస్త్రముల యందును, గురువాక్యములందును, నీయొక్క స్వకీయాత్మయందును, వాస్తవమైన, సజీవమైన, విశ్వాసమును గలిగియుండుము.

విశ్వాసమొక యెన్నరాని, విలువగల సరుదైనవుష్పము. నీహృదయోద్యాన మందది పెంచబడవలెను. అది యను

దివము మనఃపూర్వకతయనెడి జలముతో పోషింపబడవలెను. సందేహము, నపనమ్మకము లనెడి కలుపు మొక్కలను సంపూర్తిగ నాశమొందింపవలెను. అప్పుడది లోతువేళ్ళు చొచ్చి, పుష్పించి భక్తియనెడి ఫలమును త్వరగ కాయును.

విశ్వాసము, సత్సంగము (జ్ఞానులు, భక్తులతోడి సాంగత్యము) ప్రార్థన, నాత్మపరిశుద్ధత, ధ్యానము, శాస్త్ర పఠనలద్వారా దృఢపరచబడనగును. ఆధ్యాత్మిక నిచ్చెన మెట్లను కేవల ముగ్రమగు దృఢవిశ్వాసము సహాయమున నీ వెక్కనగును. ఎప్పుడైన సందేహములు నిన్నె మమ్ముచో వాటిని నిర్దయగ త్యజింపుము. సమస్త జ్ఞానమునకు, సమస్త ప్రకాశమునకు మూలమైన దివ్యజ్యోతికి నీ హృదయమును తెరువుము. పసిబిడ్డంతటి సరళుడవగుము. నీ హృదయాంత ర్యామినుండి ప్రార్థింపుము, జ్వాల తిరిగి కాంతివత్తరముగను ప్రకాశవత్తరముగ నగును.

ఆత్మసాక్షాత్కార మొక సర్వోత్కృష్టమగు ననుభవము. సత్యము (ఆప్తవాక్యము) ననుభవమొంది యాత్మ జ్ఞానమునొందిన జ్ఞానుల వాక్యములందు ప్రశ్నింపరాని విశ్వాసముంచుటచే మాత్రము నీ నాధ్యాత్మికపంథాలో ముందుకు సాగ గలవు.

శ్రుతులు "శ్రద్ధ, భక్తి, ధ్యానయోగదాప్నై ఆ పరాత్పరుని శ్రద్ధ, భక్తి, ధ్యానములచే నెరుగుదువ"ని నొక్కి వక్కాణించును. శ్రద్ధ (విశ్వాసము) తొలుత వచ్చును. శ్రద్ధ లేనిదే నేకాగ్రచిత్తత (ధారణ) ను లేదా ధ్యానమును నీ వనుష్ఠింపజాలవు.

కాళహస్తి యందలి బోయవాడగు కన్నప్ప పరమేశ్వరుడగు శివునియందు నిజమగు సజీవమైన విశ్వాసమును గల్గియుండెను. పరమేశ్వరుని కడవి మృగముల మాంసము నను దిన మాతడు సమర్పణగ నిచ్చుచుండెను. శివుడు కన్నప్ప యొక్క మనఃపూర్వకత నొకరోజున పరీక్షించెను. పరమేశ్వరుని కుడికంటినుండి (శివలింగమునందలి) యశ్రువులు (బాష్పములు) ప్రాలెను. కన్నప్ప తీవ్రముగ నలజడి నొందెను. తనయొక్క కుడికంటి నూడబెఱికి శివలింగమున నతికెను. మఱురోజున లింగముయొక్క నెడమకంటిలో బాష్పము లుండెను. కన్నప్ప తన యెడమకంటి నూడబెరికి లింగమున నతికెను. తక్షణమే పరమేశ్వరుడగు శివుడు కన్నప్ప నెదుట ప్రత్యక్షమై వాని నాశీర్వదించెను. ఆతడు వెంటనే నూతనమగు చక్షువుల (కండ్ల) కలిగియుండి శ్రీశివుని సామ్రాజ్యమును మోక్షమునకు, శాశ్వతానందమునకు ధామమునైన కైలాసము నొందెను. కన్నప్ప కలిగియుండినంతటి యచలనీయమగు చిరస్థాయియైన విశ్వాసమును నీవు కలిగియుండవలయును. అప్పుడు మాత్రమే శాశ్వతమైన పరబ్రహ్మముయొక్క చిరమగు శాంతిని నీవనుభవింపగలవు.

ప్రహ్లాదుడు తనతండ్రిచే వేర్వేరురీతుల బాధింపబడెను. ఆతడు పర్వతాగ్రమునుండు దొర్లింపబడెను. ఆతడు ఏనుగు పాదములక్రింద మట్టింప (త్రొక్కింప) బడెను. ఆతడు సముద్రములో విసరివేయబడెను. ఆతడు మరగు (ఉడుకు) నూనె గల పెద్దపాత్ర (Vessel) లో నుంచబడెను. త్రాచుపాములు వానిపట్ల విసరబడెను. తన స్వకీయమగు తల్లిచే వానికి విషము పెట్టింపబడెను. అయినప్పటికిని నాతడు శ్రీమన్నారాయణు

నందలి విశ్వాసమును గోల్పోవలేదు ఆతడు జలగవలె శ్రీహరి యందు గట్టిపట్టుగలిగి వ్రేలాడుచుండెను. వాని విశ్వాసము వెనుదగ్గనిది. కంపింపరానిది, భగవత్సాధకులయొక్క విశ్వాస మట్టిదియై యుండవలెను. నీవుభగవంతునిచే, పలువిధముల పరీక్షింపబడుదువు. ఉత్కృష్టమగు కఠినపరీక్షలు, కష్టముల క్రింద సహితము నీవు నీవిశ్వాసమును విడువరాదు. విశ్వాసమే నీయొక్క అపాయసంరక్షక లంగరు. (పట్టుకొమ్మ) ఇరువురు బాలభక్తులైన ప్రహ్లాద, ధ్రువుల నమరుల (మృత్యురహితుల) నొనర్చినది తప్పరాని విశ్వాసమే. వారియొక్క విజయ సంపాదన విశ్వాసమనెడి సూక్ష్మరహస్యముయొక్క కార్యమే. సమస్తమైన నష్టంకులు, కష్టములును, నవియెంతటిగొప్పవియు, బలవంతమైనవియు, నైనప్పటికిని మనఃపూర్వక, సజీవ విశ్వాసము ముందట సంపూర్తిగ మాయమగును.

మనస్సుయొక్క వాణిని (Voice of the mind) వినకుము. ఈవాణి (వాక్కు) నిన్ను మోసగించును. నీయాత్మయొక్క వాణి ననుసరింపుము. ఈ వాణి నిన్ను పైకి లేవనెత్తి లక్ష్యమునకు తీసికొనిపోవును.

నీయొక్క విశ్వాసమును చంచలపఱచు, నీయొక్క విశ్వాసమును చలింపచేయు నుపన్యాసములు లేక ప్రసంగముల నీవు వినునప్పుడా స్థలమును వెంటనే విడిచిపెట్టుము. నీవభివృద్ధి చెందువఱకును, దివ్య ప్రేమ యనెడి శిలయందు నీవు దృఢపడువఱకును నీవట్టి మనుష్యులతో సహవాసముండకుము. నీయొక్క ప్రస్తుతస్థితినుండి యొకంగుళమైన నెన్నడు జరుగకుము, విశ్వాసమనెడి మూలశిల (bedrock) పై దృఢ

ముగ నిలబడును. ప్రహ్లాదునియొక్క నుగ్రమగు సజీవ విశ్వాసమును నీవు కలిగియుందువుగాక !

దుర్బలము, చంచలము నగు విశ్వాసముతో ఘనము, నుత్కృష్టము, పుణ్యప్రదము నగు దేనినైనను నీవు సాధింపజాలవు. ప్రతిమెట్టునకును చలించెడి విశ్వాసముతో జీవితలక్ష్యమును నీవు చేరజాలవు. నిర్వీర్యమగు జడమగు విశ్వాసముతో నిర్వికల్పసమాధి లేక మహాభావసమాధి యగ్రమును నీవధిరోహింప (ఎక్క) జాలవు. నీయొక్క విశ్వాసము హిమాలయములు లేదా సుమేరుపర్వతములంతటి దృఢముగ నుండవలెను. గాలిలేని స్థలమందు నిశ్చలముగ మండెడు దీపమంతటి నిశ్చలతగ నది యుండవలెను.

సర్వవిధములగు తప్పుడు విశ్వాసములను, దుర్బలతను మూఢనమ్మకములను, దురభిప్రాయములను, నసాధ్యముల నెడి యూహలను త్యజింపుము. భగవత్సాధ్యములందుగల విశ్వాసమునకు గట్టిగ పట్టుకొనుము. దివ్యజీవనమున విశ్వాసము కలిగియుండుము. భగవంతునిలో జీవించుటకు తీవ్రముగ, నిరంతరముగ కాంక్షింపుము.

విశ్వాసరహితునికి వేదములయొక్కయు, మహావాక్యములయొక్కయు, ప్రత్యక్షప్రాముఖ్యత(Express Significance) బురదలో ముంచబడిన వస్తువు వంటిది. అది యాకసమునైపు విసరబడిన కంఠ్లతోగల కుక్కయొక్క మొఱుగువంటిది.

మాయ సంశయముగుండా చెడుగొనర్చును. సంశయము తీవ్రముగ బాధించుచు మనోశాంతిని కలత చెందించును. ప్రమాణ విషయకమగు (ప్రమాణగత సంశయమును)

సంశయమును) శ్రవణము లేక గురువునుండి శ్రుతుల వినుటచే తొలగింపనగును. ప్రమేయ విషయక సంశయమును (ప్రమేయ గత సంశయమును) మననము లేక వినినదానిపై చింతన ద్వారా తొలగింపనగును. విపరీత భావనను నిరంతర నిధి ధ్యానస లేక నమృతమగునాత్మ పై ధ్యానముచే తొలగింప నగును.

భగవంతునియందు విశ్వాసమును, పురాణములయొక్క సరియగు నర్థజ్ఞానమును కలిగియుందుము. మూఢజనుల పరిశుద్ధ హృదయముల తోడను, విపరీత బుద్ధుల తోడను భగవద్గీతను, రామాయణమును లేదా భాగవతమును పఠించుచో దోషదృష్టి మూలమున వారు తప్పులను వెదకుటకు మాత్రమే యత్నింతురు. నిష్ప్రయోజన విషయము లేవనగా "అడవిలో తపస్సాచరించెడు శూద్రుని రాముడేల చంపెను? ఇది సమర్థింప దగినదా? కృష్ణు డిది యది యెందుకు చేసెను? అవతార మెందుకిట్టి తప్పిదము లొనర్చెను?" వీటినిగూర్చి వారు చర్చను ప్రారంభింతురు. అట్టి జనులు పవిత్రమగు పురాణముల పఠనచే ప్రయోజన మొందరు. వారి మనస్సులు జల్లెడ (Sieve) వంటివి. వారు గ్రహించదగిన సారమును విడిచివైచి తప్పుడు జ్ఞానములో మరభిప్రాయ మొందుదురు. తమ మనస్సులను పవిత్రమొనర్చుకొనినవారు మాత్రమే పురాణములయొక్క నుపదేశముల వాస్తవిక ప్రాముఖ్యతను గ్రహింప గలుగుదురు.

శ్రీరాముడు శూద్రుని చంపెను. శూద్రుడిట్టి ప్రాముఖ్యమగు శిక్ష కర్హుడయ్యెను. నేలన నాతడు బ్రాహ్మణకుమారుని వధించెను. న్యాయము, పద్ధతి, ధర్మము, నిలుపుటకు రాముడా

పనినొనర్చెను. సర్వజ్ఞుడును, జీవులయొక్క కర్మలతీరుననుస రించి కర్మఫలప్రధాన మొనర్చువాడును, నగు జగత్పరిపాలకుని పట్ల నేతస్వనైన నీవు కనుగొనగలవా? కొందరు చాదస్త (Orthodox) సంకుచిత చిత్తపురుషులు సత్యమును మెలిపరచి యుపకార మొనర్తురు. అదిపురోహితపన్నాగము (Priestcraft) మోసమునైయున్నది.

శ్రీరాముడు పరమాత్మ. అంతర్యామి. సర్వజీవరక్ష కుడు. ఆతడు సర్వజ్ఞుడు. సర్వసామర్థుడు, సర్వత్రవ్యవస్థితుడు. (Ominipresent) ఆతడు శ్రీహరియే. ఆత డెప్పుడును పుట్టి యుండలేదు. శ్రీహరి లోకసంగ్రహ మొనర్చుట కొరకు శ్రీరాముని రూపములో మామూలుగ వ్యక్తమయి తమపరి మాయమయ్యెను. ఆతడు చైతన్య శరీరమును (సర్వదృక్కు లకు నది మాంసమువలె కనబడినను) కలిగి యుండెను.

శ్రీరాముని లేదా శ్రీకృష్ణుని సాధారణమానవజీవి యం తస్థునకు తెచ్చివానియొక్క కార్యములు సమర్థింపదగినవియా లేక కాదా యని మాట్లాడుట కేవలము తెలివితక్కువ తనము. కొంతఱుసోమరులనవసరప్రసంగములు, వాదనలలో కాలముగడుపుటకును, తాముకూడ విజ్ఞులము, నాధ్యాత్మిక చిత్తులమని తమ్ముతాము కనబఱచుకొనుటకును, మాత్రము వినోదము కొఱకట్టిసంభాషణలలోమగ్నులగుదురు.

ఈ తరగతి మనుష్యులేవిధమగు సాధనచేయరు. వారికి వైరాగ్యము లేదు. పైగ తమకాలమును వ్యర్థగోష్ఠిలో వృథపుత్తురు. వారుపురాణములయొక్క సక్రమమగునర్థగ్రాహ్య తను, భగవంతునియందును, వాని లీలలయందును, విశ్వాస మును లేకయుందురు. ఈరోజులలో ననుష్ఠానవేదాంతము లేదు.

వేదాంతగోష్ఠిమాత్రమే కలదు. శ్రీరాముడు మహాత్ము మొనర్చెనని చెప్పుటదైవనిందయే. వాస్తవికసాధకుడెన్నడును సత్క్రియల్పు భాషణలలో మునిగి యుండడు. కాలము త్వరగ పరుగిడు పోవుచున్నది. ఆపరమేశ్వరుని యారాధన, సేవలలో ప్రతిక్షణము సద్వినియోగ మొనర్పబడవలెను. వాదులాడుటలో ప్రయోజన ములేదు. ఆచరణీయమైన దేదియైన నీవుకొంతచేసి యీ యొక్క జన్మలో నేనీ మోహాసముద్రమును త రిం ప వ లె ను. మతము ప్రత్యక్షానుభవమైయున్నది. ప్రతిక్షణమును నాయా దర్శముగనాధ్యాత్మికజీవనమును మనముగడుపవలయును. ఎప్పు డైన మిత్రులట్టి విషయములలో నిమగ్నులగుచో పెదవి విప్పుము. మౌనము వహింపుము. లేదా నాస్థలమును శీఘ్ర ముగ విడువుము. నీవు శాంతిననుభవింతువు. నీయొక్క ఆధ్యా త్మికసాధనకై నీవు చాలకాలమును పొదుపుచేయుదువు.

సమితిబల్ల (Club table) చుట్టును చర్చకై మతముండ లేదు. భగవంతుని తెలిసికొనుటకును, నారాధించుటకును, వలయు విశ్వాసమేమతము. ఉగ్రముగ విజృంభించెడి యింద్రి యముల వెనుకకులాగి మనసును వశమొనర్చినతరువాత సంవ త్సరములతరబడి మనఃపూర్వక, దీర్ఘసాధనద్వారా శాశ్వత మైన నాత్మయందలి యాచరణపూర్వక జీవనమేమతము.

రంగునీరు స్వేచ్ఛగను (ధారాళముగను) నందముగను, నొకస్వచ్ఛమగు తెల్లగుడ్డముక్కలో నెటుల జొరునో నటులనే జ్ఞాని (Sage) యొక్కబోధలు సాధకులయొక్క హృదయములలో వారి మనస్సులు ప్రసాంతముగనుండునపుడు, భోగములకొఱకు కోరికలు లేనప్పుడు, వారిమనోమలినములంత మొందింపబడినప్పుడుమాత్రమే ప్రవేసింపగలిగి స్థిరముగ పాదు

కొనగల్గును. సాధకుడు శ్రుతులయొక్క శ్రవణము, మననము, (ఆత్మచింతన) ధ్యానములనభ్యసించుటకు పూర్వమువివేకము, వైరాగ్యము, శమము, దమము, శ్రద్ధ, ఉపరతులయొక్క అర్హతల పొందుటకుగాను యెందులకు కోరబడుననగా కారణ మదియే. సత్యము, భగవత్సాక్షాత్కార (God realisation) ముల పంథలో క్రమశిక్షణ, మనస్సుయొక్కయు, నింద్రియ ములయొక్కయు, పారిశుద్ధ్యతయు, సాధకునియొక్క తొలి యావశ్యకములు.

భగవంతుడు విశదపరుపబడునప్పటికిని తమ దోష ములు, మలినముల ప్రక్షాళనమొనర్ప నింద్రుడు, విరోచనుడు మున్నగువారి విషయమువలె నపనమ్మకము లేదా దురూహ నొనర్తురు. కాన బోధింపబడిన తెలుగున జ్ఞాన మెవనికైతే నీ జన్మలో లేదా చాల పూర్వపుజన్మలలో తపస్సు మున్నగు నవి యొనర్చబడుటద్వారా తన్నుతాను పరిశుద్ధ మొనర్చు కొనెనో వానిలో నుదయించును. "ఎవనిభక్తి భగవంతుని నెడ ఘనమైనదో, తన గురుని నెడ నెవని భక్తి భగవంతునెడ యంతటి ఘనమైనదో నట్టి మహాత్మునికి విశదీకరింపబడిన నీ రహస్యములు ప్రకాశమానమగున" ని శ్రుతి చెప్పును.

సజ్జన సంరక్షణమునకును, దుష్క్రియ లొనర్చువారి (దుష్టుల) ధ్వంసమునకును, ధర్మమును స్థిరముగ స్థాపించుట కొఱకును, శ్రీహరియే, శ్రీరామ, శ్రీకృష్ణుల రూపములలో వ్యక్తమయ్యెను. "సర్వజీవుల యొక్క మహా ప్రభువు నైన నాయొక్క నుత్కృష్టస్వభావమును తెలియమిచే మూఢులు నన్ను మానవాకృతి ధరించి నపుడు తృణీకరింతుర" ని శ్రీకృష్ణుడు చెప్పెను. గీత, రామాయణము, భాగవతము,

నితర పురాణములు, పఠించి క్రమముగ సద్జ్ఞానము కలిగి యుండుము. విజృంభించెడు యింద్రియములచేతను, విప్ర యోజకమగు స్నేహితుల ప్రభావములచేతను, జోముకి చర్చల చేతను, మోసుకోని పోబడకుము. భక్తి, విశ్వాసములద్వారా తత్త్వసారమున నా పరమేశ్వరు నెరిగి, వాని కృపమూలమున నుత్కృష్టమగు నానందమును, నుత్కృష్టమగు శాంతిని, నుత్కృష్టమగు జ్ఞానమును నొందుము. భగవంతుడు నిన్నా శీర్వదించుగాక !

## ప్రేమికుల పంథ

వేదాంతి లేక రాజయోగియొక్క మార్గమెంతకష్టమో ప్రేమికుని, ప్రేమోపాసకుని (lover) యొక్క మార్గమును నంత కష్టమే. ఏస్రోవయును చాల సులభమైనదికాదు. ఆధ్యాత్మికత్వములో రాజబాటలేదు. సాధకుని ప్రోత్సహించుటకు మాత్రమే భక్తి లేక ప్రేమమార్గ మత్యంత సులభమైన దని ఋషీశ్వరులు (Seers) చెప్పుదురు. ప్రతి పంథ (స్రోవ) లేదా ప్రతి యోగమును నహంభావముయొక్క సంపూర్ణ వినాశము, నధికారయుతముగ (నిర్బంధముగ) కోరును. కర్మ యోగి స్వార్థరహితమగు సేవద్వారా తనయొక్క అహంకారమును చంపును. భక్తుడు తనయొక్క అహంభావము నాత్మ నివేదన (Self surrender) లేక నాత్మసమర్పణ (శరణాగతి) ద్వారా చంపును. వేదాంతి తనయొక్క అహంభావమును స్వీయ నిరాకృతి (Self denial) లేక స్వీయ వైరాగ్యము (Self abnegation) ద్వారా నశింపచేయును.

ఈ ప్రపంచములో వేఱొక మానవుని సంతసింపచేయుటకును, వానియొక్క ప్రేమానురాగములను బొందుటకును

నెంతకష్టము ! భర్త అత్యుత్తమమైన వస్తువులను తన భార్య కిచ్చును. ఆపెకై విలువగల వస్త్రములను, భూషణములను, (Ornaments) కొనును. వివిధమగురీతుల పగటిపూటల, రాత్రిపూటల, నామెను సేవించును. ఐనప్పటికిని సంపూర్ణ ముగ నాపె నాతడుసంతృప్తి పరుపజాలడు. కచేరిలోని గుమస్తా కచేరిలో ఉదయమునుండి సూర్యాస్తమయమువఱకు పని చేయును. ఐనప్పటికిని తనయజమాని నాతడు రంజింప చేయ జాలడు. ఇంకను ప్రేమను పొందజాలడు. ఒకస్వల్పమగు తప్పిదమునకై వానికి నౌకరీ నివృత్తికొఱకు 24 గంటల యుత్తరువు జారీ చేయబడును. దివాను (ప్రధానమంత్రి) తన యొక్క అత్యుత్తమమగు నున్నతస్థితిలో మహారాజును ప్రీతి చేయుటకును, వానియొక్క ప్రేమను సంపాదించుటకును, యత్నించును. ఐనప్పటికిని వానిని పరిపూర్ణముగ నానందింప చేయుటయందు తప్పును. ప్రాపంచిక ప్రేమ విషయములో నిట్లుండ, భగవంతుని ప్రేమనొందుట యందెట్టి భీకరమగు పరీక్షగుండ భక్తుడు జనవలసియుండదు ? ఉత్కృష్టమగు ప్రేమసీమ (Domain) ను జొచ్చుటకు ముందెట్టి తీరుగల బాధల నాతడు యోర్పుతో సహింపవలసి యుండదు ?

రాజప్రతినిధి (Viceroy) లేదా రాజుతో సందర్శన మును (Interview) నీవుకోరుచో ననుజ్ఞ యుతమగు నేర్పాటు (Appointment) నొందుటకది యెంతకష్టము ? ఆంతరంగిక కార్యదర్శి, (Private Secretary) శ్రీఘనయుతుల (His Excellency) గు రాజప్రతినిధులు లేక శ్రీవైభవ సంప న్నుల (His Majesty)గు చక్రవర్తులు నీరోజులలో చాల కార్యనిమగ్నులై యున్నారు. ఒక పక్షమువరకు వేచియుం

డుము. "యని వ్రాయును. ఉప వ్యవహారకర్త (Deputy Commissioner) ను నీవు చూడదలచుచో, ప్రత్యేక సైని కోద్యోగియగు సిపాయి (Orderly) "శ్రీవారు (Sahib) చాల తొందర పనులలో మునిగియున్నారు. రేపటి తరువాత దిన మున రండ" ని చెప్పును, ప్రాపంచిక విషయములలో నిట్టిది స్థితియైనచో ముజ్జగములకు ప్రభువగు శ్రీకృష్ణభగవానుని సం దర్శనమున కదియెంత కష్టమైయుండి యుండదు ?

ప్రేమ (భక్తి) మార్గము కఠినము, కంటక (ముండ్ల) యుతము, నగాధమునై యున్నది. అది పదునైన కత్తి మార్గము. అది యమితముగ నిరుకుకూడను నైయున్నది. అది యొకనినిమాత్రమే ప్రవేశపెట్టగలదు. భగవానుడున్నప్పుడు "నేను" లేదు. "నేను" యున్నప్పుడు భగవానుడు లేడు. గారడీ విద్యగాడు (acrobat) సన్నని తీగపై నడచును. అత డజాగ్ర తగనుండుచో నేక్షణముననైన దిగువనగల లోతగు నఖాతము (abyss) లోనికి పడిపోవచ్చును. పైగా మాయయొక్క ఖడ్గము వాని కంఠమునకుపైన వ్రేలాడుచుండును. దిగువగల లోతగు నఖాతములో మొసళ్ళు కలవు. ముందుభాగమున నొక పెద్ద అగ్ని కలదు. వెనుకను తేళ్ళు, త్రాచుపాములు (Cobras) కలవు. అట్టిచో నెంత ధైర్యముగ సాధకుడుండవలయును. అదృశ్యమగు పరబ్రహ్మముయొక్క దృగ్గోచరముకాని హస్త ములచే నాత డెల్లవేళల పట్టుకొనబడును.

హృదయగుహాలలో (Chambers) గల ప్రేమయొక్క ఊట (fountain) నుండి యమృతము సర్వదా కారుచుండును. భక్తుడు దానిని పానమొనర్చి ప్రతియడుగు (మెట్టు) వద్దను భగవంతుని వెచ్చని సుఖపూర్వకమగు కౌగిలి ననుభవించును

ఎందు కాతడు నిర్భయ స్వభావముతో నామార్గము (పంథ)న ముందుకు సాగునన నదియే కారణము భగవత్కృప లేక వానిచే యుద్ధము గెలువబడజాలదు.భగవంతుని సహాయము, కరుణ లేక విపత్తియుతమగు త్రోవలో నొక యంగుళమైన నాతడు నడువజాలడు.

ప్రేమ (భక్తి) మార్గము నంతమగునోర్పు, తితీక్ష (క్షమ) ల నిర్బంధముగకోరును. తుదిని భక్తుడు లేక భగవత్ప్రేమి భగవత్కృపచే తనరణమున మద్దెల (drum) వలయపు చుట్ట (Ring) జారుడుపట్టె (Slippery plank) మున్నగు వాని గుండజనినతరువాత, అడ్డంకుపందెము (Obstacle Race) లో ప్రథమబహుమాన సంపాదకుడు విజయవంతుడై వచ్చునటుల జయమందివచ్చును. అదేమాదిరి భక్తుడును శుష్కారణ్యములు గాలివాన తుపానులగుండ పోవలసివచ్చును. ఆతడుగ్రమగు నుఱుగులుగ్రక్కుచాల సెలయేళ్ళనుదాటవలసివచ్చును. ఆతడు నిట్రమగు (Precipitous) పర్వతశిఖరముల చాలనధిరోహించవలసివచ్చును. ఈ జీవితపు తుపాను సముద్రమందలి చాల సుడిగుండములనుండి చుక్కానుతో సరిగ త్రిప్పవలసి యుండును. ఆత డుగ్రమగు హింసలను శాంతముతో సహింపవలసి యున్నది. వేయొక్క (1001) కష్టములున్నప్పటికిని యేడ్పునకు లేదా నిరాశకు త్రోవ లేదు. సాధకుడు మనఃపూర్వకత పట్టుదలగలిగియుండుచో నాతడు దృఢమగు నిశ్చయము, నుగ్రమగు తీర్మానము, కలగియుండుచో, నాతడు తనప్రార్థనలు నుపాసనలందు క్రమబద్ధముగనుండుచో సూర్యునిముందు భిన్నమొనర్చబడిన మేఘములు లేక మంచువలెనన్నియు (అడ్డంకులు) కరగిపోవును.

అన్ని ప్రక్కలనుండి చాలమందిచే నాతడు రాళ్ళు రువ్వబడినపుడు సాము తెలిసిన మనుష్యుడెంత ధైర్యవంతుడు! అతడు ప్రతిరాయిని చాలనేర్పుతో తప్పించుకొనుచు తన్నుతాను నత్యద్భుతమగురీతిని రక్షించుకొనును. అటులనే భక్తుడు ప్రేమ (భక్తి) మార్గమును త్రొక్కునపుడు ధైర్యముకలిగియుండవలెను. భక్తుడహంభావముయొక్క కనిష్టమగుఛాయ లేక జాడనువిడిచిపెట్టినపుడు సంపూర్ణమగు నాత్మార్పణముగావించుకొనినప్పుడు, మాత్రమే భగవంతుడు ప్రత్యక్షమగును. వివిధమగురీతుల నాతడుపరీక్షచేయబడును. ద్రౌపతి భగవత్సహాయముపైమాత్రము పరిపూర్ణముగ నాధారపడినప్పుడు, నాపె సంపూర్ణముగ శ్రీకృష్ణునిపాదములపై తన్నుతానుంచికొనినపుడు, ద్వారకానాథుడాపెరక్షణకై తత్క్షణమేవచ్చియాపెవస్త్రములపెంపొందించెను. ఆప్రియమగు కృష్ణునతిశయమగు ప్రకాశము, శోభలతో నెచటపాలించునో నట్టియుత్కృష్టమగు ప్రేమసీమయొక్క ద్వారములలోనికి ప్రవేశించుటకుముందు మీరాయుగ్రమగు కఠినపరీక్షల ననుభవింపవలసివచ్చెను. అన్ని విధములగు హింసలనాపెయనుభవించెను. రాజపుటానాయందలి మండుటిసుకయందు చెప్పులు లేని నగ్నపాదములతో నడచెను. భిక్షపైయాపె జీవించెను. ఆపె భూమిపైపరుండెను. వరుసగా నెడతెరపిలేక పస్తుండెను. ఇట్టి కష్ట పరీక్షలైనప్పటికిని నాపెభగవత్కృపచే నెల్లవేళల నానంద పరవశముతో కూడిన సంతోషముతో నుండియుండెను.

దేవుని కృపచే ప్రహ్లాదుని కగ్ని హిమముగా మార్పబడెను. క్రాగుచున్న నూనె వానికి శీతలమగు గంధతైలము

పలె నుండెను. గిరిధారి గోపాలుని కృపచే త్రాచుపాము శ్రీకృష్ణవిగ్రహము (సాలిగ్రామము, పూలమాల) గ మీరాకై మార్పబడెను. విష మమృతముగ్రింద మార్పొందెను. నింకను వాడిగల మేకుల పదుపు గులాబిపుష్ప శయ్యగను నయ్యెను. మాధవుని కృప మూగవానిని వక్తగను, కుంటివానిని హిమాలయములందలి యత్యున్నత శిఖరముల నెక్కువానిగ చేయును.

భక్తుడు తన కుడికాలి యెముకలను సన్నని గుండ (పొడి)గ చితుకగొట్టి దానినుండి తైలమునుతీసి యటువిమ్మట నెడ తెగకుండ నాలు నెలలవర కీనూనెతో నొక వత్తిని వెలిగించవలెను. (అఖండదీపము) అప్పుడు మాత్రమే భగవంతుని ప్రేమ నాతడు పొందగలడు. అప్పుడు మాత్రమే నాతడు స్వేచ్ఛగా భగవంతుని సామ్రాజ్యమున చొరగలడు. అప్పుడు మాత్రమే నాతడు తన భగవానునిలో నెల్లవేళల వసింపగలడు. అప్పుడు మాత్రమే భగవంతుడు చుక్కాను (Rudder) ను జాగ్రతవహించి తన భక్తుని పడవ నవతలి యొడ్డునకు సురక్షితముగ నడపును.

ఈ దివ్యప్రేమయననేమి ? అది వేరొకరినుండి యేదైనా నొకదానిని పొందునట్టి ప్రాపంచికచిత్తులగు మనుజుల స్వార్థపరత్వపుప్రేమగాదు. అది కన్యయొక్కసుందరమైన మొగము లేక నాపె దూసుకొనుపోవుచూపులు, లేదా నాపెమనోహర మగుదుస్తులు చూచుటకైనప్రేమగాదు. అదియేదోనొక సందిగ్ధమగు మనోవికారపు తాత్కాలికావిర్భావముకాదు. ప్రేమయొక్కభాషయే కన్నీటియొక్కభాష. అదియుచితపదములో వర్ణింపబడజాలదు. అదృష్టవంతుడగు భక్తుడుమాత్రమే నీమధురప్రేమను తనలో తానసుభవించును. పిపాసగొను భక్తుని

హృదయములలో నహోరాత్రము దివ్యప్రేమయొక్క జ్వాల మండుచుండును. అతడు తన యాహార పానీయముల సరకు గొనడు. అతడు కృశించి యుండును. భగవంతునియొక్క వియోగము (ఎడబాటు) నకై నాతడు దుఃఖించును. రాత్రి నిద్ర జనదు. తన ప్రియుడగు భగవాను డెప్పుడు దర్శన మిచ్చునో వానికి తెలియదు. కాన రాత్రియంతయు నాతడు జాగరణ ముండును. భక్తుడు తనయొక్క అహంభావమును సంపూర్ణముగ చంపుకొనినప్పుడు నెట్టి దాపరికము లేక తన తృప్తికై నెట్టి గుప్తమగు వాంఛ లేక పరిపూర్ణమగు నాత్మార్పణము గావించుకొనినపుడు తన ప్రియుడగు భగవానుని కలిసికొనుటకై నీటివెలుపలి చేపవలె కాంక్షించునపుడు, భగవంతునినుండి వేఱుబాటును తీవ్రముగ నాత డనుభవించునపుడు, విరహాగ్ని వాని నత్యమితముగ దహించునపుడు భగవానుడు భక్తుని మ్రోల నగుపడును. అప్పుడుమాత్రమే భగవానుడు వాని కన్నీటిని తుడుచును, తన స్వహస్తములతో వానిని తినిపించును. ఇంకను తన భుజములపై వానిని మోయును.

సంపూర్ణమగు, దాపరికములేని (నిష్కపటమగు) నాత్మార్పణములో నష్టములేదు. అది యెంతమాత్రము చెడు బేరము (ఒడంబడిక) కాదు. అది వాస్తవముగ నొక గొప్ప లాభమే. నీయొక్క శరీరము, మనస్సు, ఆత్మ, ఇంకను నాస్తుల నా భగవానునికై నీ వర్పింపవలయును. భగవానుడు తన్నుతాను నీ కర్పించుకొనును. భగవానునియొక్క యావత్తు యైశ్వర్యము నీకు చెందును. భగవానుడు తనకుతానే నీస్వంత మగును. భగవానునికై నీప్రేమను చూపించుటవలన నా జగత్ప్రభువును నీవు కొనివైచితివి. ఆ పరాత్పరు డిప్పుడు నీబానిస.

శర్కర (పంచదార) నీటిలో కరగించినపుడు నీటితో నేకమైనటుల నీవు భగవానునితో నేకమగుదువు. ఆ పరమేశ్వరుడు కోరున దేమన పరిశుద్ధ ప్రేమతో సంపూర్తిగ నింపబడిన నీయొక్క పరిపూర్ణహృదయమే. భక్తుడు "నేను నీవాడను మరియు నీవు నావాడవుకూడను" నను అత్యల్పపు స్వార్థపరత్వపు ఛాయ యున్నప్పటికిని నీవు వానిని (భగవంతుని) పొందజాలవు.

పరమశ్రేష్ఠమగు ప్రేమను (పరాభక్తి) ని పెంపొందించినట్టి భగవత్ప్రేమి పద్ధతులకు, నాచారములకు, బానిస కాడు. ఆతడు సంఘనియమములచే కట్టుబడడు. బాహ్య ప్రదర్శన ఆడంబరముండదు. గంటలు వాయించుటుండదు. ప్రపంచపు ఉపహాస్యపు విశేషవచనముల కాతడు లక్ష్య పెట్టడు. వానిస్థితి వర్ణనాతీతమైనది. ఆతడు తనప్రియుడైన భగవానునిపై తనప్రేమ నొలుకబోయును. ఆప్రేమ స్వతస్సిద్ధమైనది. ఆప్రేమ ప్రవాహమొక యెడతెగని నేఱువలె వేగముతో స్రవించును. దానికి నిలుపు (భంగము) లేదు.

ఒక్కొక్కప్పుడాతడు తనప్రియుడగుభగవానునియొక్క వేఱుబాటు (వియోగము) వలననగు తీక్ష్ణవేదన ననుభవించు నపుడాత డగ్నికుండముపై నుండు వేడిమూకుడులో తాను వేయింపబడినటుల భావించును. తక్షణమే దివ్యామృతము బొట్లుబొట్లుగా కాఱును. అప్పుడాతడు గంగానది యొడ్డున చల్లనినీటిలో మునుక వేసినటు లనుభవమొందును.

భగవత్ప్రేమి తనప్రియుడగు భగవానుని యొక్క నెడబాటు నొక్కక్షణము సహితము సహింపజాలడు. ఒక క్షణ

కాలపు వియోగము వానికి మరణవేదనయే. ఒక క్షణము వానికొక సంవత్సరమువలె నగుపడును. ఎల్లప్పుడును గలిగినప్పుడాతడు వానిసన్నిధి (సమక్షము) కై కాంక్షించును. నింకను నెగయూపిరి తీయును, వాని హృదయములో మంట యున్నప్పుడు వానికండ్లు శూన్యమగును. నింకను ముఖము శుష్క (వట్టి) దగును. ఆతడు తన యాహార, పానీయ, నిద్రల విసర్జించును. ఆతడు కలత చెందియుండును. ఆతడు విస్తారమగు ప్రేమాశ్రువుల రాల్చును, ఆతడు కన్నీటిలోనే దుఃఖోపశమనమును గనుగొనును. వానితృష్ణ యొకింత శాంతి చేయబడును. ఆతడు తన కన్నీటిద్వారా మృదువును, శ్రేష్ఠమునైన ప్రేమతీగ (లత) ను పుష్టిచేయును. తన ప్రియుడగు భగవానునిది తప్ప నాతడాలోచనను గలిగియుండడు. వాని హృదయములోని ప్రేమయొక్క చెలమ (ఊట) సర్వదా నిండియుండును. అది యెన్నడును నెండిపోదు. లోనున్న యూటనుండి యొక యెడతెగని ప్రవాహముగ ప్రేమ బైటకు వడిగ ప్రవహించును. అది యుత్కృష్ట ప్రేమయొక్క శాశ్వతమగు ప్రవాహము. ఏదియు దానిపారుదల (అణచ) నడ్డజాలదు.

ప్రేమ (భక్తి) మార్గము నిస్సందేహముగా కష్టములతో నావరింపబడియున్నది. కాని తన నిశ్చయమందు కఠినముగను, తన సాధన, వైరాగ్యములం దుగ్రముగను, నుండునట్టియు, తనను, తన సర్వమును భగవంతునకు సమర్పించినట్టియు, పరమేశ్వరుని సర్వవేళల జ్ఞప్తియుంచుకొనునట్టియు, భక్తుడు సమస్త కష్టములను బొత్తిగ సునాయాసముగ దాటిపోవును. ఆతడు ప్రతి మెట్టునందును, ప్రతి యంతస్థునందును

భగవత్కృప నొందును. ఆతడు సర్వవేళల భగవంతునిలో జీవించును.

భక్తుడు "నేను నీవాడను (భగవంతుని విషయమై) అనును. వేదాంతి "నేనే వాడిని (ఆ పరమేశ్వరుడను)" అనును "నేను నీవాడను" యనునట్టి భక్తుడంతిమమున "నేనే వాడిని" యను సూత్రముయొక్క తాత్పర్యము (ప్రాముఖ్యభావము)ను ప్రత్యక్షానుభవ మొందును. ఆతడు పరాభక్తి లేక నుత్కృష్ట ప్రేమను పెంపొందించునపుడు "దాసోఽహమ్" యనునది "శివోఽహమ్" లేక "సోఽహమ్" లేక "గోపాలోఽహమ్"గా నున్నతస్థితి నొందునపుడు పరిణమించును. ప్రేమ (భక్తి) యొక్క ఫలము జ్ఞానము. ప్రేమ రెంటితో ప్రారంభించి యొకటిగా నంత మొందును.

ఓ ప్రియమగురాముడా! భగవన్నామమునుపట్ల నానందాశ్రువుల నెల్గ్రక్కుహృదయమును నీవు పెంపొందించవా? నీహృదయములో ప్రేమయొక్క అలలనిరంతరము లేవనిమ్ము. భగవంతుని కౌగలియొక్క వెచ్చదనము ననుభవింపుము. భగవత్ప్రేమ (భక్తి) యనెడి దట్టమగు సూర్యకాంతియందు చలికాచుకొనుము. శాశ్వతప్రేమయొక్క బ్రహ్మానందమును చవిచూడుము. దివ్యప్రేమామృతమును గాఢముగ త్రాగుము. యింకను సర్వదాసుఖముగనుండుము.

## విరహము

భగవంతునినుండి వియోగమువలన భక్తుడనుభవించు బాధయే విరహము. నీ యిష్టదైవము (Beloved) యొక్క దర్శనమునుగోరుచో మనఃపూర్వకతతో విస్తారముగ కన్నీటిని

రాల్చవలసియుండును. నీవా జగదీశుని చిరునగవులచే జయింప జాలవు. చైతన్యమహాప్రభుని జీవితమును చదువుము. వేసనా శ్రువులతో ధూళిలో తన్నుతానుదొర్లెడువాడు. అది విరహాగ్ని. అది నిజమగుభక్తి. నా ప్రియమగుపాఠకుడా! నీప్రియదైవపు దర్శనమునకేడ్చుట కిష్టపడునీవు మృదుహృదయము గల్గియుంటివా? నిన్ను నీవు మోసగించుకొనకుము. నీవా పరాత్పరుని మోసగించలేవు. ఏలన నాతడు నీయొక్క సర్వభావన సంకల్పములకుసాక్షి. నీహృదయమింకను కఠినమైనచో శ్రీరామజపము, కీర్తన, భాగవతపఠనము, సత్సంగము, సేవలగుండా దానిని కరిగించుము. ఒక్కక్షణమునహితము జాగు సేయకుము. ఓ సుశీలుడా! పైకినిలబడుము. నడుము బిగించుము. సాధననొనర్పుము. ఏకాంతస్థలమునకుజని హృదయపూర్వకత, భావము, విరహాగ్నితోడ నేడ్వుము. భక్తిని పెంపొందించుటకుగల మార్గములలో నేడ్చుడొకటి. అది వాస్తవికమైనదియై నుండవలయును. అది భగవంతునికొఱకుగల పిపాసనుండిరావలెను.

భక్తుడు ప్రేమనిమిత్తము మాత్రమే ప్రేమను గల్గియుండును. వానిలో బేరమాడుటలేదు. సమావేశన్యాయాధిపతి (Sessions Judge) యొక్కభార్య లేకకొడుకు న్యాయాధిపతినెడ నపరాధితులు వానిపట్ల గొప్పభయమువహించునప్పటికిని నెటుల భయమొందరో నటులనే వాస్తవికభక్తుడు భగవంతునినెడ లేక నితరుని నెడ భయమొందడు. (దుష్టత్వపు) ప్రతిక్రియనెడగల పూర్వపుభయమిప్పుడు మాయమయ్యెను. ఆతడు భగవంతునితప్ప నేవస్తువునైనను నిర్లక్ష్యయముచేయును. ఆతడు భగవంతుని సర్వపదార్థముల

లోను జూచును. ఆతడు భగవంతుని నిమిత్తమూమాత్రమే జీవించును. ఆతడు ప్రతివస్తువును భగవంతునిదిగనే భావించును. ఆతడు తన్ను తాను సంపూర్తిగ భగవదిచ్ఛకు లొంగి యుండును. ఆతడు తన దేవుని సృష్టులలోను చూచుచున్నందున నాతడందరిని గౌరవించి. సేవించును, ఒక్కొక్కప్పుడాతడేడ్చును. నొక్కొక్కప్పుడపరిమితానందమున నాతడు నృత్యమొనర్చును. భగవంతునినుండి తన యెడబాటు నొక క్షణమునకైన ననుభవించునప్పుడాతడు చాలతీవ్రముగ దిగులొందును. ఇదియే విరహాగ్ని యని పేర్కొనబడును.

భక్తుడు విరహము (భగవంతుని నుండి యెడబాటు వలనిబాధ) చే పీడితుడైనపు డాత డుగ్రముగ వెక్కి వెక్కి యేడ్చుచు దుఃఖించును. ఆత డశ్రుపూరితుడుగ నుండును. ఒక్కొక్కప్పు డాతడు "నాప్రియుడగు ప్రభు వేడీ? నాప్రియుడగు హరియేడీ? బృందావనమందలి నా మధురమగు బన్సీవాలా (మురళీ ధరుడు) యెక్కడ? అయోధ్య యందలి నాధనుర్ధారి (విల్లు ధరించినవాడు) యెక్కడ? ఒక క్షణము సహితము నా పరమేశ్వరుని వియోగమును నేను సహింప జాలన"ని బిగ్గఱగ నరచుచు కేకలు పెట్టును. అశ్రువులతో నిండిన కండ్లతో నొక్కొక్కప్పుడు తన ప్రక్కవానివైపు నిశ్చల దృష్టితో నాతడు చూచును. ఒక్కొక్కప్పుడు వాని దేహము స్వేదము (చెమట) తోడ స్నాన మొనర్చబడి యుండును. ఒక్కొక్కప్పు డాతడు పగ లెప్పుడు తెల్లవారునో రాత్రి యెప్పుడు పడునో నెఱుగడు. ఒక్కొక్కప్పు డాతడు "హరి, హరి, హా రేరామ! హా రేకృష్ణ" యనుచు పెద్దగ నుచ్చరించును. ఒక్కొక్కప్పుడు వాని దేహము వణకును. ఒక్కొక్కప్పు

డాతడు క్రిందపడి నేలపై దొర్లును. ఒక్కొక్కప్పు డాతడు నవ్వుచు "గోవింద రామ్‌రామ్, గోపాల హరిహరి" యని బిగ్గఅగపాడును. ఒక్కొక్కప్పు డాతడు గెంతుచు పైకెత్తబడిన చేతులతో చుట్టును నృత్య మొనర్చుచు భావము ననుసరించి చేతులతో వివిధరీతులగు నభినయముల (సంగచలనముల) ప్రదర్శించును. ఒక్కొక్కప్పు డాతడు పైకి లేవనెత్తబడిన చేతులతో గాలిలోని కెగురును. ఒక్కొక్కప్పు డాతడు తీవ్రముగ నేడ్చును. భగవంతునితో సాంగత్య మొందు నున్నత భక్తులయొక్క హృదయముల, మనోభావముల గ్రహించుట మామూలు మనుష్యులకు చాల కష్టము. వారి స్థితు లవర్ణనీయములు. వాస్తవిక భక్తుడు మాత్రమే వేఱొక భక్తుని తెలుసుకొన గలడు. ఒక్కొక్కప్పు డాతడు క్రింద పడిపోయి మూర్ఛ (మూర్ఛసమాధి) పోవును. కొంతకాలము వఱకు శ్వాసయాగి మెల్లగా వెనుకకుతిరిగి వచ్చును. నీవునవద్వీపము, బృందావనము, దర్శించి యచ్చట కొన్ని దినములుండుచో పై చిహ్నముల వ్యక్తపఱచు నుత్తమ భక్తుల నీవు కలుసుకొందువు. అట్టి భక్తులకు జయము, జయము! వారి జాతి (Race) కి జయము, అవును. వారు నివసించు ప్రదేశమునకు శోభ, జయము.

జపము, కీర్తన, భాగవతుల సేవ మున్నగు ననుష్ఠానముల ద్వారా వెన్నవలె నంతటి మృదువైన హృదయమును భక్తుడు కలిగియుండును. విరహాగ్ని వాని హృదయమును కరగించును. నింకను నదియే వాని బట్టలను సహితము తడుపునట్టి విస్తారమగు నశ్రువుల ప్రవాహములుగా కార్పించుటలో వ్యక్త మొనర్చు చున్నది. మనఃపూర్వకమగు కన్నీళ్లు చెక్కిళ్ళ

నుండి క్రిందకు జారునపుడు భగవంతుడు భక్తుని ముందు ప్రత్యక్షమగును. ఈప్రేమాశ్రువులే నవతార మవతరించుటకు కారణమగును. విరహముయొక్క నీ భక్తియశ్రువులే నుపాసకులయొక్క భగవదారాధన, ధ్యానములకై నిర్గుణబ్రహ్మమును సగుణరూపము వహించుటకు నిర్బంధపెట్టును.

బృందావనమందలి గోపికలు (పాలవృత్తిచేయుగొల్ల కన్యలు) నిజముగ విరహాగ్నిచే తపింపచేయబడిరి. శ్రీకృష్ణుని యెడ వారెంత భక్తిగనుండిరోకదా ! ఒకక్షణము సహితము వారు వియోగమును సహించలేకుండిరి. ఒక్కొక్కప్పుడు శ్రీకృష్ణుడువారి హృదయపూర్వకతను పరీక్షించెను. ఆప్రభువు తనంత తానకస్మాత్తుగ దాగొనుచుండువాడు. వారిటునటు బృందావనమందలి వీధులలోను, బొదరిండ్లలోను, (Bowers) తిరుగుచుండువారు. వారు కదంబవృక్షములను "ఓకదంబవృక్షములారా ! మాప్రభుని (జగత్ప్రభుని) మీరుచూచియుంటిరా? మేము విరహాగ్నిచే తపింపచేయబడితిమి ? మీరా సర్వేశు నుండి యేమిసందేశమును తెచ్చితిరి ? ఆయనిప్పుడెక్కడున్నాడు? ఆయనెంత నిర్దయుడు? మేమాయన దర్శనమునకై బాధపడుచుంటిమి " యనుచు సంభోధించుచుండెడివారు. వారు వియోగ (యెడబాటు) సమయమున కన్నీటిని విస్తారముగ కార్చుచుండెడివారు.

వారు దేహచైతన్యము కలిగియుండలేదు. వారు రాత్రి తమ దీపముల వెలిగింప నారంభించినపుడు కొందఱు తమ వ్రేళ్ళను సహితము చెడ్డగ కాల్చుకొనిరి. మఱియు వారు దీని నెఱుగరైరి. వారి మనస్సులు వారి ప్రియునిపైమాత్రమే నిండియుండెను.

వారు మధురమగు నాత్మసంచలన మొనర్చు శ్రావ్యమగు మురళీనాదమును నమృతాత్ముడగు శ్రీకృష్ణునియొక్క పాటనువినినప్పుడు తక్షణము వారు చిందరవందరయైన చింపిరి జుత్తు (తల) తో క్రిందకు పడిన (జారిన) వస్త్రములతో నా జగత్ప్రియుని కలుసుకొనుటకు పరుగిడిరి. వారు కృష్ణునియొక్క ప్రేమలో మునిగియుండిరి.

విరహముచే బాధనొందు భక్తునియొక్క మనోభావములు మాటలచే వర్ణింపబడజాలవు. నీయంతట నీవు దాని ననుభవించవలెను. విరహము నిజముగ భక్తుని కొక చాల బాధకరమగు ననుభవమైనప్పటికిని నది భగవంతునిపట్లగల వాని ప్రేమను తీవ్రాధిక్యపఱచును.

ఒక గోపికవగుము. ఒక గౌరాంగుడవగుము. ఒకమీరా వగుము. అప్పుడుమాత్రమే నీవు విరహమన నేమో ననుభవించి తెలిసికొనగలవు. విరహములేనిదే నీవు భగవంతుని కలుసుకొనజాలవు. నీ వాయన దర్శనము నొందజాలవు.

మీరా, తన విరహముయొక్క ననుభవముల నీదిగువ పద్యములలో వెల్లడించెను. అవి ప్రతి పాఠకునియొక్క హృదయమును గ్రుచ్చుకొనును.

(పద్యములయొక్క ప్రతిపంక్తిభావ మీ దిగువ పొందుపఱచబడినది.)

ప్రేమలతను నేను నాకన్నీటితో తడిపినాను. ఇప్పుడా లత పెరిగినది. ఫలమానందమయి తీరును. నాహృదయనాధుడు జాగుచేయుచున్నాడు. దుఃఖమేఘములు నన్నావరించుచున్నవి. చెదురుమేఖములు వచ్చియున్నవి. కాని, యవి

నా ప్రియునినుండి యేవార్తను తీసికొనిరాలేదు. ప్రేమయనెడి ద్రాక్షను నాటినాను. దానిని తిరిగి తిరిగి కన్నీటి జలముతో సాగుచేసినాను. జగమంతయు నిద్ర బోవుచున్నది. నేనొక్క తెను మాత్రమే నా ప్రియుని కలుసుకొనుటకు మేల్కొని కూర్చొనినాను. నావలె తన భవనములో నొకతె కూర్చొని యొక ముత్యాల కంఠహారమును గ్రుచ్చుచున్నది. వేరొకతె కన్నీటి పూలమాలను గ్రుచ్చుచున్నది.

నా ప్రియమగు గిరిధర నగరమును నేనెప్పుడు కలుసు కొందును ? ఎప్పుడా నందకుంజము (Bower) వచ్చును ? హృదయములోని నాబాధ నా ప్రభుని కలుసుకొనుటచే మాత్రము మాయమగును. నా ప్రభూ ! నేను విశ్రాంతి రహిత ముగనున్నాను. నీదర్శనమునకై నాకన్నులు వాంఛించుచున్నవి.

నేనొక రాత్రిని యర్ధసంవత్సరముగ యనుభవమొందు చున్నాను. ఓ ప్రభూ ! నేనెవరికీ యెడబాటు బాధను చెప్పు కొందును. ? ప్రతి శబ్దమునకును నాయురము (Bosom) పై కెగురుచున్నది. ఓ ప్రభూ ! ఎప్పుడు నీవు నన్ను కలుసు కొం దువు ? నేను బాధ నింకనేపాటి యధిక కాలమును సహింప జాలను.

ఓ ప్రభూ ! నీ వెందులకంత నిర్దయగ నుందువు ? రాత్రి యంతయు నేను నిద్రలేక యున్నాను. నా ప్రియుని కలుసు కొనుటకు రాత్రియంతయు కాచుకొని యున్నాను. నా దేహము శుష్కించియున్నది. ఓ ప్రభూ ! నీనామము నా పెదవులపై నున్నది. చాతకపక్షి మేఘములకు చూచువలెను, చేప నీటికై బాధనొందు దానివలెను, మీరా తన ప్రియుని కలుసు కొనుటకు తపించుచున్నది. ఎడబాటువలని బాధ నా హృద

యము మండించుచున్నది. నా ప్రియుడు లేకుండ నేనెట్లు జీవించగలను ? నీదర్శనము లేనిదే నా హృదయము విశ్రాంతి రహితమైనది.

ఓ నాప్రియుడా ! నీసుందర మొగమును నేనెప్పుడు చూతును ? నీమధురమగు కంఠధ్వనిని నేనెప్పుడు విందును ? ఓ ప్రభూ ! నేను పరిపూర్తిగ విశ్రాంతి రహితురాలను. నీవు నన్ను వెంటనే కలిసికొనుము. నేనింక నే యధికతర కాలమును కాచుకొని యుండజాలను. రహస్యమగు ప్రేమబాణము నాహృదయమును చొచ్చుకున్నది. అది యువతల ప్రక్కనుండి వచ్చినది. నాభగవంతుని నుండి వియోగము వలన నాగుండె మండుచున్నది. నా యాకలిపోయినది. నా నిద్ర గతించినది. ఓ గిరిధర నగరమా ? నాకండ్లలో వసింపుము. నా హృదయమున నాసీనుడవగుము. నీమురళిని నన్ను విననిమ్ము. నన్ను ప్రతిజీవములోను నిన్ను చూడనిమ్ము. నీయొక్కచూపునకై నేను నాట్యమొనర్చుచు, గానమొనర్చుచున్నాను. నేనెంతగ యత్నించినను నేను నా కన్నీటి నణపజాలకున్నాను. అవి సెలయేఱులవలె ప్రవహించి నాబట్టలను తడుపుచున్నవి. నిన్ను కలుసుకొనుటకు రాత్రియంతయు నిరీక్షించుచున్నాను. ప్రతిశబ్దము నన్నులికి పడచేయును. గుండె యెగురుచున్నది. కండ్లు పొట్లుగ నున్నవి. హృదయము మండుచున్నది. నాకన్నీటిలో నోదార్పును, నాదాహములో శమనమును, నీజ్ఞప్తియందుత్సాహమును, నీనామమున సంతోషమును, నీ నృత్యమున నానందమును, నీస్తుతికీర్తనయందు సౌఖ్యమును నే గనుచున్నాను. మీరా యొక్క ప్రభువు గిరిధరుడు. ఆయన లేనిదే నాపె జీవింపజాలదు.

నీవు తీవ్రముగ ప్రార్థించునపుడు దయాళుడవగు నో హరీ! నిష్కపటముగ నాకు చెప్పుము.

గౌరాంగ ప్రభుని విషయములోవలె నీయెడ వాస్తవిక భక్తిచే నాకండ్లనుండి ధారానుగ నశ్రువు లుగ్రముగ ప్రవహించి నాబట్టల తడుపునా? ఓహరీ, హేకృష్ణా, యని యఱచి, భగవదానంద పరవశమున భూమిపైదొర్లి నా దేహమును, బంధువులను, పరిసరములను, సర్వభేదములను, మరచి సుఖస్మృతికి చెందిన పూర్వకాలపు భక్తుడైన ప్రహ్లాదునివలె నెల్లెడల హరిని, హరిని మాత్రము చూచునట్టియు, దినము దగ్గఱ భవిష్యత్తులో నొకదినము నాకు వచ్చునా? యని భగవంతుని కోరుము.

ఓ ప్రేమమూర్తీ! నన్ను లోనికి లాగుకొనుము. నన్ను నీమనోహర వక్షస్థలము లోనికి, నేను నీలో సర్వదా లయమొందునట్లు గొంపొమ్ము.

## కృష్ణునికై గోపికల ప్రేమ

కొందఱు అవివేకిజనులు "కృష్ణుడు భగవంతుడుకాడు. అతడొక అవతారముకాదు. గోపికలతో కామముతో క్రీడించిన నొక మదయుతమగు పశులకాపరి" యందురు. ఆ సమయమున శ్రీకృష్ణుని వయస్సెంత? ఆత డేడేండ్లబాలుడుకాడా? వానిలో కామపుఛాయ యుండగలదా? ఉత్కృష్టమగు భక్తి ఆత్మనివేదన, లేక భగవంతునికి సంపూర్ణశరణాగతి (Total Surrender) యొక్క పర్యవసానమగు రాసలీల, మాధుర్యభావములయొక్క రహస్యము నెవరుగ్రహించగలరు? నారదుడు, శుకదేవుడు, చైతన్యుడు, మీరా, హాఫీజు (Hafiz)

రామానంద, సఖియలు, లేక గోపికలు, మాత్రమే రాసలీలల యొక్క రహస్యము (అంతర్భావము)ను తెలిసికొనగలిగిరి. సఖియలుమాత్రమే దీనికియర్హులగుదురు. బాలుడైయుండగనే నాపరాత్పరుడు విచిత్రముల (Miracles) జరిపియుండ లేదా? ఆతడు శ్రీహరియొక్క అవతారమని నాపరమాత్మయేచూపించ లేదా? ఆతడు పసిబిడ్డడైయుండగనే తనతల్లికి విరాట్టుదర్శనమును ప్రదర్శింపలేదా? కాళియసర్పము పడగపైనిలుచుండి యాపరమాత్మ దానిని సుమ్మిరింపచేయలేదా? ఆపరమాత్మ యగణ్యమగు కృష్ణుల క్రింద గుణీకరించ (విజృంభించ) లేదా? గోపికలెవరు? వారు, కృష్ణునిమాత్రమే సర్వత్రచూచుచు తమ్ముకూడా తాము కృష్ణునివలెచూచుచు భగవదున్మత్తత నొందిన వ్యక్తులుకారా? మురళీనాదము వారిని దివ్యమగు నానందపరవశత్వము లేక పవిత్రైక్యతాస్థితిలో పడద్రోయ గలిగెను. వారు దేహచైతన్యమున కతీతముగనుండిరి.

శ్రీకృష్ణుడు బట్టల (వస్త్రముల) నెత్తుకొనిపోయి వారిని నగ్నలనొనర్చెను. దీనిలో గొప్పతత్త్వముగలదు. "ఓ గోపికలారా! దేనికైనను (ఏవస్తువుపైనను) ననురాగముంచకుడు. దేహభావమును, లింగభావమునువిడిచి దేహరహితమును, లింగరహితమును, నగు మరణవర్జితమగు (నమృతంబగు) నాత్మనుపొందుడ"ని, యాతడు బోధించెను.

బృందావనమందలి గోపికలు భగవానునియొక్క నద్భుతమగు భక్తురాండ్రు. వారు తమంతట తాము భగవంతునికి సంపూర్ణముగ నర్పించుకొనిరి. (లొంగిపోయిరి.) తమ యొక్క గాఢమగు ప్రేమచేదేవతలగు (Devas) గోపికలు కృష్ణునితో మిళితమయియుండిరి. కృష్ణునియెడ వారు వహించు

ప్రేమ దివ్యమగు ప్రేమయే. వెన్నెలరాత్రి (చంద్రవిరాజితమగు రాత్రి) లో శ్రీకృష్ణుడు తన మురళినిపాడెను. తమప్రేమికుడు (Lover) యెచ్చటనుండెనో నటకు గోపికలు తక్షణమే పరు గిడిరి. వారిమనస్సులు కృష్ణునిలోమగ్నమయినవి. మురళిని వినినప్పుడు సమస్తమును వారుమఱచియుండిరి.

ఆవులు పితుకుచుండగ తమయిండ్లను కొందఱువిడి చిరి. తమభర్తల కాహారము వడ్డనచేయునప్పుడు కొందఱు తమయిండ్లనువిడిచిరి. అగ్ని (పొయ్యి) నుండియుడికిన యన్న మును కొందఱుక్రిందకు దింపనేలేదు. పాలుకాగి పొంగువచ్చు వఱకు కొందఱాగరైరి. కొందరు తమపసిబిడ్డలకు పాల నిచ్చు చుండిరి. కొందఱు భోజనముచేయుచుండిరి. కొందఱతిథులకు భోజనము వడ్డించుచుండిరి కాని వారందరు తమపనిని సగము పూర్తిలోవిడిచిపెట్టిరి. వారి వస్త్రములు, తలవెంట్రుకలు, భూషణములన్నియు చిందర వందరయైయుండెను. శ్రీకృష్ణుని వీక్షించుటకు వారుపరుగిడిరి. కృష్ణుడే కేవలప్రాణము, నాత్మయై యుండెను. వారొకక్షణము సహితమును వానియొక్క వియో గమునుభరింపజాలరైరి. గోపికలెంతభక్తి పరులైయుండిరి! నీవూహించగలవా? అది సమస్త ఊహాతీతమైనది.

శ్రీకృష్ణుడకస్మాత్తుగా మాయమయినప్పుడు వారొక యడవి (వనము) నుండి వేఱొక యడవి (వనమునకు) తిరిగిరి. వారు వృక్షములను తమ ప్రేమికుని (Lover) చూచితిరా యని యడిగిరి. ప్రాకులతలను, (Creepers) భూమిని, లేళ్లను (Deer) భోగట్టా చేసిరి. వారు వానిచర్యల ననుకరించుచు తమ్ము తాము కృష్ణుడనియు పిలుచుకొనిరి. వారి భావన లన్నియు కృష్ణునివైపు మాత్రమే ప్రసారింపబడినవి. ఆ పర

మాత్మ్యుని గుఱించి మాత్రమే వారు సంభాషించిరి. ఆ జగ
దీశుని చర్యలగుఱించి మాత్రమే వారంతయు గానమొనర్చిరి.
వారందఱు కృష్ణునితో పరిపూర్ణులైరి. వానియొక్క ప్రేమ
యందు వారు మునిగియుండిరి. వారన్యచింతనలెవ్వియు కలిగి
యుండలేదు. వారి కితరమగు నభిలాషయులెవ్వి లేవు. తమ
గృహముల లేదా బంధువులవారు తలపెట్టియుండలేదు. వారు
యమునానదియొడ్డునకు జని యేకైకకంఠముతో కృష్ణునిగూర్చి
గానమొనర్చి వాని తిరుగురాక (return) కై మనఃపూర్వక
ముగ ప్రార్థించిరి.

వారిభక్తికి సంతసించి కృష్ణుడు తక్షణము వారియెదుట
ప్రత్యక్షమై వారి నిటుల సంబోధించెను. "స్వాగతము, మీ
యట్టి ఘనులారా! మీకు నేనెట్టి శ్రేయస్సు నొనర్పగలను?
వ్రజభూమిలో నందఱు క్షేమమా? మీరిచ్చటకు వచ్చుటలో
గల నుద్దేశ్యమును తెలుపుడు. రాత్రి భయానకముగ నున్నది.
మఱియు క్రూరజంతువులు చుట్టుప్రక్కల చరించుచున్నవి.
వ్రజభూమికి తిరిగి పొండు. ఇది స్త్రీలకొఱకగు స్థలముకాదు.
మీరు మీతల్లులను, తండ్రులను, పుత్త్రులను, సోదరులను,
భర్తలను గలిగి యున్నారు. వారు మీకొఱకు వెదకుచున్నారు
ఎవనికి బాధకలుగ చేయవద్దు. ఇంకను యేమిటనిన యమునా
నది యందలిగాలిచే మెల్లగ కదల్పబడు చుండిన వృక్షములు
వానియున్నితమగు శాఖలు (branches) తమయొక్క సంపూర్ణ
మగు శోభతో నిలుచుండి యుండ పుష్పములతో నలంకరింప
బడినట్టి, పూర్ణచంద్రుని మృదువగు కిరణములచే విరాజిత
మయినట్టి యీయడవిని మీరిప్పుడు చూచితిరి. సద్గుణవతు
లగునో కన్యలారా! త్వరగా మీరిప్పుడు మీయింటికి వెను

కను జని మీ భర్తలపట్ల జాగ్రతవహింపుడు. దూడలును, మీబిడ్డలును, నేడ్చుచున్నారు. పోయి వారికి (త్రాగుటకు) నీరుయిమ్ము. మీరు నాయెడగల ప్రేమచే నిర్బంధితులై నిటకు వచ్చియుండినచో నది యుక్తము, తగునదియు మాత్రమై యున్నది. యేలన నందఱును నాయెడభక్తి గలిగియుందురు. భర్తయెడ భక్తి గలిగియుండుటే స్త్రీలకొక గొప్పధర్మము. (Religion) వారు తను మిత్రుల క్షేమమును కోరుచుండ వలయును. నింకను తమ బిడ్డలపెంచవలయును. భర్త క్రూరుడుగాని, ముదుసలిగాని, రోగిగాని, లేక పేదగాని, కావచ్చును. కాని యుత్తమ లోకములను కాంక్షించువారు తమ భర్తలవిడువరాదు. భర్త కానివానితోనుండు సంబంధము అపకీర్తికరమును, ననుచితమును నైయున్నది. ఇట్టి సమీపపు చేరికకంటె వేఱువిధముల మీరు నాయెడ ప్రేమను వహింపవచ్చును. కావున మీ యిండ్లకు మఱలుడు.”

గోపికలు కొంతకాలము వఱకు వాగ్బంధన మొనర్పబడిరి. వారు విచారమునకు లోబడిరి. వారు కృష్ణుని కొఱకై సర్వమును త్యజించిరి. యింకను వారిట్టి కఠినవాక్కుల వినుటకు సహింపజాలరైరి. తుదకు “ఓ భగవానుడా! (ప్రభూ!) ఇట్టి నిర్దయవాక్కుల పలుకుట నీకుకాదు. మేము సర్వవస్తువుల (విషయముల) త్యజించి నీపాదముల నన్వేషించితిమి. చేర కష్టసాధ్యమగునో తండ్రీ! నీవు మమ్ముల విడువకుము. కాని మోక్షాన్వేషుల గూర్చి యాదిపురుషుడు విచారించు నటులనే, నీవును దయయుంచి విచారింపుము. ఓ ప్రేమమూర్తివో! నీనొక ధార్మిక గురువైనటుల భర్తలు, పుత్రులు, మిత్రులయెడ మావిధులచెప్పెదవు, కాని యా

ధార్మిక విషయకాదేశములయొక్క గమ్యస్థానమవు నీయంతట నీవే అయియున్నావు. కానవానిని నీలో విశ్రమించనిమ్ము. నీవు సమస్త జీవులకు నుత్తమమగు మిత్రుడవు. యేలన పరమేశ్వరుడవగు నీవు వాస్తవముగ వాటి స్వీయమగు నాత్మవు మాత్రమే. దుఃఖమూలము లగుటచే భర్తలు లేదా పుత్రుల కొఱకు మేమేల శ్రద్ధ వహింపవలెను. సౌఖ్యమునకు నిరంతర మూలమవగు నీకు మేము సంధింపబడితిమి (attached) యని వక్కాణించిరి. ఈ మాటలలో శ్రీకృష్ణు నెడగల తమయొక్క గాఢతమమగు ప్రేమను వెల్లడిచేసిరి. వాస్తవమగు భావములోగల పరిపూర్ణ శరణాగతి (ఆత్మ నివేదన)ని గోపికలలో మనముకనుగొందుము. తమ జీవితములను సహితము వారులక్ష్యపెట్టలేదు. అట్టిచో తమ బంధువులకు, స్నేహితులకు, పశువులకు, వారెటుల లక్ష్యముంతురు?

కృష్ణుని నీవుపొందగోరుచో నీవువానిని గోపికవలె సేవించవలయును. గోపికయొక్క మానసికవృత్తి (వైఖరి)తో వానిని నీ వారాధించవలయును. గోపికాభావముతో శ్రీకృష్ణుని పూజించుభక్తుడు మాధుర్యరసము ననుభవించును

అధర్మ వినాశము కొఱకును, ధర్మసంరక్షణము కొఱకును, నవతరించిన శ్రీకృష్ణుడు గోపికలయెడల లైంగిక ప్రేరణావృత్తి (Sexual instinct) లేదా కామముతో సంపర్కమొనర్ప బడజాలడు ఆతడు తనభక్తుల యొక్క బానిసయై యున్నాడు.

కేవలము భక్తిద్వారా మనము భగవంతునియొక్క నను గ్రహమునుపొంది సంసారమును తరింపగలము. "ఓం శ్రీకృష్ణగోవింద హారేమురారే-హేనాథ నారాయణవాసుదేవ"

యనెడి శ్రీకృష్ణునినామమును మనమిప్పుడు గానమొనర్చుదుము. "ఓం కృష్ణాయ వాసుదేవాయ-హరయే పరమాత్మనే ప్రణతః క్లేశనాశాయ గోవిందాయ నమోనమః॥" పరమాత్మ వగు నోహరీ! యో గోవింద! వసుదేవుని (సర్వప్రాణుల యాంతరంగిక ప్రభువు) పుత్త్రుడవును, నీకు సాష్టాంగ ప్రణామములాచరించువారి క్లేశములను తొలగించునట్టి వాడవగు నోకృష్ణా నీకు సాష్టాంగవందనముల"ను నట్టిదియు, నుత్కృష్టమగు శాంతిని, ననంతమగు సౌఖ్యమును, మనకుప్రసాదించునట్టిదియు, నగు భాగవతమందలి మంత్రమును మనమెల్లవేళల జప్తి యందుచుకొందము.

భాగవతులకు జయము! వ్యాసునికి జయము! భక్తులకు జయము! శ్రీకృష్ణభగవానునికి జయము! శ్రీకృష్ణుని యొక్కయు, భాగవతుల యొక్కయు, నాశీర్వాదములు మీ యందఱిపై నుండుగాక!

## భగవంతుడు భక్తుల బానిసయగును,

భక్తులయొక్క భక్తియుతమగు ధ్యానమునకై నిర్గుణ బ్రహ్మము సగుణము, మరియు సాకార బ్రహ్మము యొక్క రూపుదాల్చెను.

భగవంతుడు తన భక్తులను ప్రారంభమున వివిధములగు మార్గముల పరీక్షించును. వారి నాపరమేశ్వరుడు తీవ్రమగు కష్టములకు, పరీక్షలకు, నుంచును. చివరకా ప్రభువు భక్తులయొక్క బానిస యగును. "నేను నావశములో లేను నా భక్తులయొక్క సంపూర్ణమగు నదపు (వశము) లో నే

నున్నాను. నా హృదయమును యావత్తును వారు వశపఱచు కొనిరి. కేవలము నాకొఱకే వారు ప్రతిదానిని త్యజించి నప్పుడు నేనెటుల వారిని విడువగలను ?" అని శ్రీకృష్ణ భగవాను డనును.

కృప, ప్రేమ, కనికరములతో భగవానుడు భరితుడై (నిండి) యున్నాడు. పరమేశుడు "కరుణా పయోనిధి" (సాగరుడు) యని వర్ణింపబడియెను. గంగ యొక్కయు, యమున యొక్కయు, ప్రవాహములవలె నాపరాత్పరుని కృప పొర్లాడును. చెప్పవలెనన్న తన భక్తులకు తా నమ్ముడు పోయినటుల భగవానుడు చిత్రింపబడి యుండెను. తన భక్తుల బాధల నుపశమింప చేయుటకు నాప్రభువు బుద్ధిపూర్వకముగ ననంతమగు బాధలను ప్రపంచముయొక్క దృష్టిలో ననుభవించును. ఆభరణముగ భృగునియొక్క కాలితాపుచే విడువబడిన హృదయమునందలి మచ్చ నాస్వామి వహించును. ఆ ప్రభువు తన భక్తులయొక్క పుఱ్ఱెలను (Skull) తన కంఠము చుట్టును మాలవలె ధరించును, గజముల కధిపతియగు గజేంద్రుని కేక వినినప్పుడు మొసలి రూపముతో నున్న యసురుని హత మార్చుటకు పరుగెత్తెను. మఱియు వానికి మోక్ష మిచ్చెను. (గజేంద్ర మోక్షము)

అయోధ్యకు చెందిన "రూప్ కళాజీ" యను నాయన రామచంద్ర ప్రభుని పూజయందు గాఢ నిమగ్నుడై యుండి, తన తనిఖీపని యావత్తు మఱచియుండగ పాఠశాలల తనిఖీదారువలె (Inspector of Schools) నాప్రభు డభినయించి చిఠ్ఠా (Register) లో సంతక మొనర్చెను.

పంజాబులోని తన సిపాయి భక్తుడు తన కర్తవ్యమును విడిచి సంకీర్తన బృందమున హాజరయినప్పుడు శ్రీరామ ప్రభు వా సిపాయి వేషము వేసికొని కాపలాపనిని చేసెను.

తంజావూరు జిల్లా (దక్షిణ హిందూదేశము) లోని "త్రివడి"కి చెందిన తనభక్తుడగు గతించిన ప్రఖ్యాత గాయకుడు భక్త త్యాగరాజుయొక్క పల్లకిని శ్రీరామచంద్రుడు మోసెను. భక్తునియొక్క తర్పణము (Ablution) కై నా జగదీశుడు నీటినికూడా మోసెను.

శ్రీరాముని యొడిలో చనిపోవుచున్న జటాయు వృద్ధి నపుడు, లంకకురాజగు రావణాసురుని గ్రస్తముల (బంధముల - Clutches) నుండి సీతామహాదేవిని విడుదలచేయు సాహసిక యత్నములలో చచ్చునట్లు గాయపడిన యా పక్షిని బుజ్జగించుట మీాకందఱకు తెలియును. దానిశరీరమును తనశిరోజబంధము (జడ) తో తుడిచెను. తన భక్తునియెడ శ్రీరామునికిగల యసమానమగు, సానుభూతిపూర్వకమగు శ్రద్ధానురాగముల నిట గమనింపుడు.

బాలుడగు నామదేవుడు పండరీపురభగవానునియెదుట నాహారపళ్లెరము నుంచినపుడు విఠోబా (శ్రీకృష్ణభగవానులు) తక్షణమే దాని నారగించుటకు మానవాకృతిని వహించవలసి వచ్చెను.

శ్రీకృష్ణపరమాత్మ యుద్ధక్షేత్రమున నర్జునునియొక్క నిపుణుడగు సారథి (Charioteer) యాయెను. ద్రౌపదియొక్క కనికరింపదగు రోదనను వినినపుడు నామె వస్త్రముల పెంపొందించుటకు ద్వారకనుండి యా పరమాత్ముడు త్వరపడి నగ్న పాదములతో పరువెత్తెను.

నదిలో "మీరా" ఆమెయంతటాపె మునిగి చనిపోవ నున్నపుడు శ్రీకృష్ణ డాపెముందు ప్రత్యక్షమై ఆమెను తన యొడిలోనుంచుకొనెను. శ్రీకృష్ణు డంధుడగు "బిల్వమంగళు"ని బృందావనమునకు తన (పరమాత్మ) చేతితో కఱ్ఱ పుచ్చుకొని దారి చూపెను. తనయొక్క మంగలిభక్తుడు జబ్బుగా నున్న పుడు రాజుయొక్క దేహమర్దన (ఒడలుపట్టుట) విధిని భగవానుడు చేసెను. మంగలి హాజరుకాని యన్నిదినములలో నాతడే (భగవానుడే) రాజుయొక్క పాదముల నొత్తెను. ఆతడే "నరసీ" యొక్క కూతుని వివాహకార్యమును జరిపెను. "నరసీ" యొక్క తండ్రి శ్రాద్ధమునకు నా భగవానుడే నేయిని తీసుకవచ్చెను. మఱియు "నరసీ" యొక్క భార్యయొక్క చీవాట్ల నతి శాంతముగ సహించెను.

దామాజీ యను తన భక్తుని ఋణముల చెల్లించుట కొరక నవాబునొద్దకు సొమ్మును మోసుకొనిపోవుటలో నౌకరు పాత్రను శ్రీకృష్ణభగవానుడు నిర్వహించెను. పండరీపురములో తన భక్తునికొఱకు కొక నూతిని త్రవ్వెను. ఇటు చూడుడు. భగవంతుడు తానుకూడ యెట్టిపనినొనర్చెనో ! పని (సేవ) యే ఆరాధన (ఉపాసన) పని (కృషి) యే నారాయణుని పూజ.

భగవంతు డెంత దయామయుడు ! వానియొక్క కృపా తత్త్వము నూహించునపుడు నా వెంట్రుకలు కొనలపై నిలుచును. (నాకు రోమాంచమగును) నేను మౌనముగ, మూగగ నుందును. ఓయీ ! ప్రేమస్వరూపా ! నేను నిజముగ యా నిరీశ్వరవాదులును, పరమాత్మరహితమగు ప్రపంచో పాసకులను, (Agnostics) చార్వాకులను, మఱియు వారి కాప్తమిత్రులగు శూన్యవాదులను, భగవదునికి నిరాకృతులను

(Athiests) భౌతికులను, భౌతికవాదులను (Materialists) సామాజికుల (Socialists) ను, బోల్షెవిస్టులను, మున్నగువారిని కనికరింతును. భగవానుడు వారియం దుత్తమమగు వివేచన మును, నానందయుతమగు సౌఖ్యమును ప్రసాదించుగాక !

దక్షిణహిందూస్థానములో తిరునల్వేలి (Tirnevelly) వద్ద "నమ్మాళ్వార్" యను పేరుతో నొక వైష్ణవభక్తుడుం డెడివాడు. ఆతడు చాలకీర్తిగాంచెను. చింతచెట్టుదిగువన సమాధిలో నాతడు ప్రవేశించుచుండెడివాడు "మధురకవి" యొక ముముక్షువు. (aspirant) ఆతడు బాహ్యప్రకాశమగు జ్యోతిని నాకశమున వరుసగ మూడుదినములు గాంచెను. తొలిదినమున నాతడీపరిణామము (Phenomenon)ను గ్రహింప జాలకపోయెను. అది (జ్యోతి) మూడుదినము లిటుల సాగి నందున విచిత్రముగ భగవంతుడు తనకు సాయముచేయ నెంచె నని యాతడు తలపోయనారంభించెను. దక్షిణముగ మధుర నుండి తిరునల్వేలికి జ్యోతిర్గమనము వైపు తనయడుగులత్రిప్పెను. చింతచెట్టుదిగువన నాసమయమున సమాధిలోనుండిన "నమ్మాళ్వార్" కడకాజ్యోతి వానిని తీసుకువచ్చెను. "మధురకవి" రెండు రాయిబెడ్డల కొట్టి వాని సమాధిని భంగపఱచెను. తనభక్తుడగు మధురకవికెటుల భగవంతుడు సాయమొనర్చెనో యిటగు ర్తింపుము.

విఖ్యాతమహారాష్ట్రభక్తుడగు నేకనాథుడు విచారావస్థలోనున్నప్పుడు తన్ను "స్వామి జనార్దను"ని వద్దకు జనుమని కోరినటుల యాకసమునుండి యొక ఆకాశవాణి నాతడువినెను. భగవదాజ్ఞల ననుసరించి "స్వామి జనార్దను"ని యొక్క

శిష్యునై శ్రీకృష్ణభగవానుని దర్శనమునొందెను. ఇది భగవంతుడు తనభక్తునికి సాయముచేసినట్టి మఱియొక పద్ధతి.

"దేవ్" గ్రామమునకు చెందిన "భక్త తుకారాముడు" వానియొక్క స్వప్నములో శ్రీకృష్ణభగవానునిచే "రామకృష్ణ హరి" మంత్రముయొక్క రహస్యములను నుపదేశింప బడెను.

భగవంతుని యొక్క విచిత్రమగు మార్గముల గమనింపుము. పరమేశ్వరుని యునికిని సర్వత్ర నీలియాకాశములోను, నాకుపచ్చని భూతల ప్రకృతి (Verdure) లోను, సూర్యకిరణములలోను, దూరమునగల పసిబిడ్డ యేడుపులోను, కోకిల (Nightingale) యొక్క ధ్వనిలోను, గంగానది యొక్క సంగీతయుతమగు ప్రణవధ్వనిలోను, ననుభవింపుము. ఆ జగద్రక్షకుని సుందరాకృతియొక్క నిరంతర ధ్యానముచే వానిలో నైక్యముకమ్ము.

## అవతారములు.

ధర్మముయొక్క క్షయమును, అధర్మము యొక్క వృద్ధియు, నెప్పుడైన నుండుచో శిష్టజన (the good) రక్షణమునకును, దుష్టజన (wicked) నాశనమునకును. మఱియు ధర్మస్థాపనమునకును భగవంతుడు తనంతటతాను వ్యక్తమగును. శ్రీరామచంద్ర ప్రభువునకును, శ్రీకృష్ణ భగవానునకును, భౌతిక (Physical) దేహములు లేవు. వారి శరీరములు పంచతత్త్వములతో (elements) సృజింపబడలేదు. వారు దివ్యస్వరూపములు కలిగియుండిరి. వారు చిన్మయ (అప్రాకృతిక) దేహములు కలవారు. మానవులవలె వారికి నిజమగు జనన మరణములు లేవు. యోగివలె వారగపడి మాయమగుచుండిరి. వారి

దేహము లీ ప్రపంచమున విడువ బడలేదు. వారి దేహములకు నాశము లేదు.

మానవోన్నతికై భగవదవతరణ (descent) యగును. అవతారములు భగవంతుని యొక్క అంశలు. (Rays) ఈశ్వరుడు లేక హిరణ్యగర్భుని నుండి వారుజనన మొందిరి. లోకసంగ్రహ కార్యము ముగియుట తోడనే వారి జగత్తు నుండి మాయమగుదురు, సంపూర్ణ కళల (Rays) తో పూర్ణావతారములు కలవు. భాగయుతమగు నంశావ తార ములు కలవు. మాయా గుణావతారములు కలవు. సృష్టి లో నీ మాయా గుణావతారములే తపస్సు (Tapas) బ్రహ్మ, ఋషులు, తొమ్మండుగురు ప్రజాపతులునై యున్నారు. స్థితి (రక్షణ-Preservation) లో వారే ధర్మము, విష్ణువు, మనువు దేవతలు, పరిపాలకులునై యున్నారు. ప్రళయము (నాశము) లో వారే యధర్మములు. శివుడు, సర్పము, నసు రులునై యున్నారు. మానవజాతి యెడగల దయచే వారికి యుత్కృష్టమగు శ్రేయస్సు నొనర్చుటకై కరుణా సాగరుడగు భగవాను డవతరించును. తన స్వేచ్ఛాపూర్వకమగు నిచ్ఛచే శరీరమును వహించును. భగవానుడు తన యోగమాయను బఱపి క్రీడలు లేక లీలలలో తనంతటతాను నిమగ్నుడగును. అవతారములయొక్క రహస్యములను, విచిత్రములను, నెవ రూహింపగలరు? ఎచ్చట, యెప్పుడు, యేవిధముగ, నెన్నెన్ని రూపములుగ నాజగత్ప్రభువు క్రీడించుచున్నాడు? విరహముచే చెంపలనుండి జారు భక్తుని నిజమగు కన్నీరవతారరూపమున భగవదవరోహణమును (Descent) దెచ్చును, భక్తుడెట్టి శక్తి మంతుడు? వాని తపస్సెంత మహిమాన్వితమైనది?

పూర్వకాలపుఋషులు విశ్వప్రభువు పదునాఱువెం ఘాంశకళలతో (వ్యక్తీకరణపుటంశలు లేక సంకేతములు) నుండుననియు, వాని జీవితముయొక్క నొక అంశము జంగమ సామ్రాజ్యము (Vegetable Kingdom)న వ్యక్తమగుననియు, రెండు జంతువు (Animal) నందును, అయిదునుండి యెనిమిది వఱకు మానవునియందును వరుసమెట్లలో నొక కొననుండు యనాగరికునినుండి వేఱొకచోగలత్యున్నతస్థితికి మనము జనుకొలదిని యుండుననియు సిద్ధాంతమును వెల్లడిచేసిరి భగవంతుని వ్యక్తీకరణము తనయవతారములలో తొమ్మిది (9) నుండి పదునాఱు (16) అంకములు లేక కళలువఱకు మాఱుచుండును. మఱియు శాస్త్రములు పది (10) అంక ములు లేదా పండ్రెండు (12) లేక పదునాలుగు (14) అంక ముల చెప్పను. వేనిలో పదునాఱు(16) కళలుండునో నవియే అవతారములును, పూర్ణావతారములును, నైయున్నవి. శ్రీకృష్ణభగవానుడొక పూర్ణావతారము దివ్యజ్ఞానసమాజికులు (Theosophists) కూడ తమ ప్రభువు (Master) యొక్కయు, నిపుణుల, (Adepts) యొక్కయు, నాధ్యాత్మికోన్నతి యొక్కస్థితిని గూర్చి వర్ణించునపు డేడు (7) కళలు, పండ్రెండు (12) కళలు మున్నగునవి చెప్పుదురు.

చతుర్వింశతి (యిరువది నాలుగు) లీలావతారములు కలవు.

1. వరాహ:- నీటినుండి పృథ్విని లేవనెత్తుటకు (ఉద్ధరించుటకు) వరాహ (పంది) రూపమును శ్రీహరి వహించి దైత్యుడగు హిరణ్యాక్షుని తన దంష్ట్రల (Tusks) తో నంతమొందించెను.

2. యజ్ఞః:- స్వామి రుచికిని ఆకూతికిని నుదయించెను. యజ్ఞుని నుండి సుయామ దేవతలు జననమందిరి. ఆతడు త్రిలోకిని యొక్క భయమును బాపెను.

3. కపిలః:- ఆతడు కర్దమప్రజాపతికిని వాని భార్యయగు దేవహూతికిని జననమందెను. వేదాంతము నందలి సాంఖ్య సిద్ధాంతము నాతడు స్థాపించెను. తన తల్లికి బ్రహ్మవిద్య నుపదేశించెను.

4 దత్తాత్రేయః:—ఆతడు బ్రహ్మ, విష్ణు, శివు లనెడి త్రిమూర్తులయొక్క అవతారము.

5 కుమారులు:—సనక, సనందన, సనాతన, సనత్కుమారులు. వారు నలుగురు బ్రహ్మయొక్క మానసపుత్రులు (బ్రహ్మయొక్క సంకల్పముచే పుట్టిన మానసిక పుత్రులు) వారు వివాహ మొనర్చుకొనుట కిచ్చించలేదు. నైష్ఠికబ్రహ్మచారులు (అకళంక యువకులు) గ వారు తపస్సు, ధ్యానములకై నరణ్యమున కరిగి యాత్మసాక్షాత్కారము నొందిరి. బ్రహ్మవిద్యను లేక నాత్మజ్ఞానమును వ్యాపింప జేసిరి.

6 నర-నారాయణః:—ధర్ముని కిని వాని భార్యయగు దక్షుని పుత్రికయగు మూర్తికిని పుట్టిరి. బదరికాశ్రమము (బదరీనారాయణము) లో వారు తీవ్రమగు తపస్సానర్చిరి. దేవలోక అప్సరసలు (Celestial mymphs) వారిని మోహింప (వంచింప) జాలరైరి.

7 ధ్రువ:—ప్రహ్లాదునివలె నాతడొక బాల భక్తుడు. తన సవతితల్లిమాటల నాతడు సహింపజాలక పోయెను. ఆతడరణ్యమున కరిగి యుగ్రమగు తపస్సాచర్చెను. ఆతడు నారద

ఋషినుండి యుపదేశము నొందెను. "ఓం నమో భగవతే వాసుదేవాయ" యనెడి ద్వాదశాక్షర మంత్రము నాతఁడు వానినుండి గ్రహించెను. స్వామియగు శ్రీహరియొక్క ప్రత్యక్ష దర్శనము నొందెను. ఆతఁడు ధృవలోకము (ధృవనక్షత్రమండలము) నొందెను. ప్రహ్లాదునియొక్క భక్తి మాత్రము కేవలము నిష్కామ్యపద్ధతివంటిది. శ్రీహరిని, హరినియొక్కనినే నాతఁడు కోరెను. ధృవుఁడు ప్రారంభమున సకామ్యభక్తి కలిగియుండెను. ఆతఁడు రాజ్యముల నభిలషించెను. తమపరి వాని హృదయము పరిశుద్ధి నొందినపుడు నాతఁడుకూడ నిష్కామ్యభక్తిని పెంపొందించెను.

8 పృథు:—భూమినుండి సంపత్తి (Riches) ని ఖాద్యముల (Eatables) ను వెలుపలికి తీసెను.

9 ఋషభ:—ఆతఁడు నభికిని (Nabhi) సుదేవి లేక మేరుదేవికినిజన్మించెను. పరమహంసతీరున నాతఁడుతిరుగాడెను.

10 హయగ్రీవ:— ఈ యశ్వముఖునియొక్క అవతారము వైదికయజ్ఞములలో (Vedic Yagna) నగపడి వేదముల ప్రచార మొనర్చెను.

11 మత్స్య:—సమస్త జీవులను, వేదములను, ప్రళయ జలములనుండి యాతఁడు రక్షించెను.

12 కూర్మ:— సముద్ర మహామథనమున కమఠము (తాబేలు) దృశ్యమై మంధరపర్వతము నుద్ధరించెను.

13 నరసింహ:— "మానవ - సింహ" అవతారము స్థంభమునుండి యగపడి ప్రహ్లాదుని తండ్రియగు హిరణ్యా

కశిపుని నాశమొందించెను, స్థంభమునుండి స్వామియొక్క ఆవిర్భావము భగవంతుడు సర్వవ్యాపియని తెలియజేయును.

14 హరి:—గజేంద్రమోక్షముయొక్క విఖ్యాత కథ యందలి గజరాజగు గజేంద్రుని యాతడు కాపాడెను.

15 వామన అవతారము:— ఆతడు బలియెదుట ప్రత్యక్షమై తన రెండడుగులతో త్రిజగములను కొలిచెను

16 హంస:—ఆతడు నారదఋషికి భక్తియోగమును, జ్ఞానమును౹ భాగవత పురాణమును వర్ణించెను.

17 ప్రతి మన్వంతరము యొక్క అధిష్ఠాన దేవత (Presiding deity)

18 ధన్వంతరి:—వైద్యశాస్త్రము (ఆయుర్వేదము) ను వెదజల్లెను.

19 పరశురామ:—బ్రాహ్మణులను, పవిత్రమగు వేదములను, తృణీకరించిన క్షత్రియుల నాతడు దునిమెను.

20 రామ:—ఆతడు రావణుని వధించెను.

21 కృష్ణ:—ఆతడు కంసు నంతమొందించి యర్జునునకును, నుద్ధవునకును, బ్రహ్మవిద్య నుపదేశించెను.

22 వ్యాస:—ఆతడు వేదముల నుడివి వాటిని సక్రమములో నుంచెను. అష్టాదశ (పదునెనిమిది) పురాణముల నాతడు వ్రాసెను.

23 బుద్ధ:—వేదములయొక్క రహస్యములను, విచిత్రములను, నసురులు తెలియజొచ్చిరి. వారు ప్రజల బాధించిరి.

బుద్ధుడవతారమెుందెను. వివిధత్వముల మతాంతర్విభాగముల బోధించి యనుయులలోవిభ్రాంతి (Confusion) నుత్పత్తిచేసెను.

24 కల్కి:—ధర్మమును స్థాపించుటకును, నధర్మము నశింపుచేయుటకును కలియుగాంతమునకు పూర్వ మాతడు వెలువడును.

## రాధ యను పదముయొక్క తత్త్వము

మురళీకృష్ణు డిప్పటికిని కూడ విహరించు పవిత్రకుంజ మగు బృందావనధామములోను, నితర స్థలములలోను నాస్తికుల (Athiests) సామాజికుల (Socialists) ఆగూఢశాస్త్రజ్ఞుల (Confirmed Scientists) బిరుసగు భౌతికవాదుల (Rank-materialists) యొక్క రాతిగుండెలను సహితము చొచ్చునటుల మధురమగు విన నింపగు రాగములో "రాధే శ్యామ్" లేక "రాధే కృష్ణ" యనెడి యా పరాత్పరుని జంట నామమును (Jugal name) జనులు గాన మొనర్తురు. అయోధ్యలో తియ్యనైన జంట ధ్వని (Jugal Dhvani) యగు "సీతారామ్" ను మీరు వినుదురు.

పాశ్చాత్య దేశములలో స్త్రీలు తొలుత గౌరవింపబడి సత్కరింపబడుదురు. వారికి యాసనము లివ్వబడును. పాశ్చాత్య్యలోకవిధముగ నిస్పృహులగు (Unconscious) శక్తి యుపాసకులు. స్త్రీలు శక్తియొక్క అవతారములు (వ్యక్తస్వరూపములు - Manifestations)

"రాధేశ్యామ్" మఱియు "సీతారామ్" యనెడి యీ యుగళ (సంయుక్త) నామములలో రాధ లేక సీత తొలుత

వచ్చును. "మీరు నన్ను స్మరియించుకొనుచో, నేను నిరంతరము మీ కెంతప్రియుడగు శ్రీకృష్ణభగవానునితో పరిచయ మొనర్చి, శాంతి, జ్ఞానము, మోక్షముల మీకు లభింప జేసెద" ని భక్తులతో రాధ యనును. "రాధ" యను పదములో నెంతయున్నతమైన తత్త్వబోధ గలదు. మీయెదుట నున్న నల్లబల్ల (black board) పై నొక వృత్తము (Circle) న్నదని యొకసారి యూహించుడు. వృత్తములోన R.A.DH.A. యను నక్షరములు వ్రాయబడును.




దిగువగల A నుండి మీరు చదువుచో నుపాసన యని యర్థమిచ్చెడి ఆరాధ్య (ARADHYA) లేక ఆరాధ్ (ARADH) యను పదమును మీరు కనుగొందురు. ఓ భక్తులారా! నా ప్రియవల్లభుడగు భగవానుడగు శ్రీకృష్ణుని మీరారాధించుచో. నాపరాత్పరునినామమగు "రాధేశ్యామ్" లేక "రాధేకృష్ణ" ను భావము, ప్రేమ మరియు శ్రద్ధా యుతముగ మీరు గానము చేయుచో వానియొక్క దర్శనము మీకు త్వరలో నగును. నింకను మీబాధ లంతమొందున" ని రాధ యనును.

ఎగువగల A నుండి మీరు చదువుచో నూతయని యర్థమిచ్చు ADHAR (ఆధార్) యను పదమును మీరు తెలుసుకొందురు. "ఓ భక్తులారా! ఆపరాత్పరుడే విశ్వమున

కంతకు మూలము లేక ఆధారమనియెడి భావముతో కృష్ణ భగవానుని మీరు భజించుచో జనన మరణము లనియెడి సంసార చక్రమునుండి యాతకు మిమ్ముల శీఘ్రముగ విడుదల చేయున" ని రాధ చెప్పెను.

ఇప్పుడు మీరు DHA (ధ) నుండి చదువుడు. ప్రవాహమని యర్థమిచ్చెడు "DHARA" యను పదమును గనుగొందురు. "కృష్ణ భగవానునెటుల యారాధించవలెనో మీకు నేజెప్పెదను. ధార ఒక పాత్రనుండి వేరొక దానికి పోయబడు తైల లేక నీటియొక్క నిరంతర ధార (తైలధారవత్) వలె మీ హృదయముల నుండి భక్తి ప్రవహించవలయును. సర్వదా (అనన్యచేత - అన్యమును చింతింపకుండుట, సతతమ్ - ఎల్లప్పుడు) భగవంతుని పాదపద్మములపై మీ మనస్సుల స్థిరముగ లగ్నమొనర్ప వలయును. అప్పుడు మాత్రమే భగవంతుని నిరంతర స్నేహము (సాంగత్యము) ను మీరు పొందుదుర" ని రాధ యనును. ఇచట పరాభక్తి యొక్క వర్ణన నాపె యిచ్చుచున్నది.

ఐంద్ర జాలిక పదములగు (Magic Words) RADHA, ARADHANA, ADHARA, DHARA, (రాధ, ఆరాధన, ఆధార, ధార,) లను మీరు పొందియుంటిరి. మీరీ చతుర్వర్గములు (Quadruplets) లేక నాలుగు పదముల జ్ఞప్తి యుంచుకొందురా? భక్తిని పెంపొందించుటకు మీకిది సహాయపడును.

ఆతడే యీ విశ్వమున కాధారమను భావముతో కృష్ణ భగవానుని మీ రుపాసించు నపుడు దానిని "తదాశ్రయభక్తి" యందురు. తమ కేవల జీవితముల నిలుపుకొనుటకు జల

ప్రాప్తమగు సరస్సునై తామర పుష్పమును, హంసలును, వెన్నెల చకోరపక్షి యెట్లనో యట్లనే భక్తుడు తనయొక్క-జీవిత పోషణమునకై కృష్ణభగవానునిపై నాధారపడియుండును. శ్రీ కృష్ణుడు తన ప్రాణనాథుడు లేక ప్రాణవల్లభుడని యాతడు భావించును.

తరువాత "తద్రూప భక్తి" వచ్చును. మత్స్యము (చేప) నీటిలో నగాధముగ ముంపబడినటులను, దానిని నీటి బైటకు తీసినప్పుడది జీవింపజాలనటులను, నటులనే భక్తుడుగ్రమగు సాధన ద్వారా భగవంతునిలో నిమగ్నుడగును. ఒక క్షణ మాత్రమైనను నాజగదీశుని లేకుండ నాతడుండజాలడు. ఇదియే సారూప్య ముక్తి.

తృతీయావస్థ "తన్మయభక్తి." నెలిగించినప్పుడు కర్పూర మొటుల యగ్నితో నేకమగునో నటులనే భగవంతునితో భక్తుడు నైక్యమగును. "ధ్యానించువాడు, ధ్యానించబడునది" "ఊహించువాడు, ఊహింపబడునది," "ఉపాసకుడు, ఉపాస్యము" నేకము సమానత్వమగును, ఇదియే "సాయుజ్య ముక్తి" తొలుత నజ్ఞానియగు భక్తుడు "దాసైవాహమ్-నేను ఆ పరాత్పరునికి (చెందిన) వాడను" యనును. భక్తియందాతడు పెంపొందునపుడు "తవైవాహమ్"–నేను నీకు చెందిన వాడను"యని యాతడనును. "తన్మయభక్తి" నాతడు పెంపొందించునపుడు "త్వమేవాహమ్ – నేను నీవు"యని సంతోష సుఖాతిశయముచే నానందమున నాతడఱచును. బృందావన పొదరిండ్లలో వెదకుచుండెడి గోపికలు భ్రమరకీటసారూప్యము (Analogy) మాదిరి తాము "తన్మయభక్తి"ని పెంపొందించునప్పుడు తుట్టతుదిసి తమంతట తాము కృష్ణులైపోయిరి.

రాధకు జయము! కృష్ణభగవానునికి జయముజయము! భక్తులకుజయము ! పవిత్రారణ్యమగు బృందావనముధన్యము! "రాధేశ్యామ్" "రాధేకృష్ణ" యను యాపరమేశ్వరుని నామము గానముచేయువారు ధన్యులు ! ఆపరాత్పరుని నామమునకు శోభ (జయము.)

## భాగవతునియొక్క మహిమ

భగవానుని నాత్మానుభవమొందిన లేదా దర్శించిన వాడెవడో నాతడే భాగవతుడు. ఆతడొక ముక్తాత్మ (Liberated soul) వేదాంతులు "జీవన్ముక్త"యను పదమును వాడుదురు. భక్తులు "భాగవతుడ"ను పదమును పయోగింతురు. ఈ రెండుపదములు హిందూస్థానీలోని "పానీ" (జలము)వలెను, నాంగ్లములోని "వాటర్" (జలము) వలెను నైయున్నవి.

భాగవతునియొక్క నున్నతస్థితిని మాటలు తగినంతగ వర్ణింపజాలవు. వానియొక్క కరుణాపూరితమగు దృక్కు లక్షలకొలది జనముల వేదనల తొలగించును. వాని మధుర మగు వచనములు వానిని పరివేష్ఠించియుండువారికి సంతసము ఊరట, బలము, శాంతుల గొనితెచ్చును. వాని భావన (సంకల్పము) లన్నిప్రక్కల శాంతి, శ్రేయోకాంక్షలయొక్క సందేశముల ప్రసరింపజేయును. వానియొక్క కేవలపుటునికి నిరాశులగువారి కాశయును నిరుత్సాహులగువారికి బలమును దెచ్చును. ఇంద్రుడును, నితర దేవతలును, చేతులు కట్టుకొని తగు గౌరవమర్యాదలతో వాని నాహ్వానించుటకు నిలబడి యుందురు. సిద్ధులు, ఋషులు, వాని పాదములక్రింద దొర్లా డును, రాజులు, మహారాజులు, చక్రవర్తులు, తమ హస్త

ములు వాని పాదపద్మములవద్ద నుంతురు. వాని నడకలో నొక విచిత్రమగు రీతియును, ముఖములో నందమును, శోభయును, వాక్కు (సంభాషణ)లో మాధుర్యమును, నాజూకును (సుకుమారమును) నడకలో గాంభీర్యమును నుండును. వాని జాలియుతమగు చూపు మృతుడగు మానవునిలో జీవమును బోయును. వాని కీర్తమండలి ధూళి వివిధములగు కుదరరాని జబ్బుల (రోగముల) తొలగించుటయందొక యౌషధమయి యున్నది.

ఛాందోగ్యోపనిషత్తులో భాగవతునియొక్క శోభాయమానమగు వర్ణన విశదీకరింపబడినది.

ఆ పితృ (తండ్రి) లోకమును గోరుచో వైభవముతో దాని నాతడు బొందును. నేలన నాతడు దానినికోరు యుత్తర క్షణమునందే పితృలు వానిని స్వాగతముతోడ నాహ్వానింతురు.

"తదుపరి మాతృ, (తల్లి) లోకమును గోరుచో వైభవముతో దానినాతడు బొందును. నేలన నాతడు దానినికోరు యుత్తరక్షణమునసె మాతృలు వానిని స్వాగతముతోడ నాహ్వానింతురు."

"తదుపరి. భ్రాతృ (సోదరుడు) లోకమును గోరుచో వైభవముతో దానిని నాతడుబొందును. నేలన దానినాతడు కోరు యుత్తరక్షణమునసె భ్రాతృలు వానిని స్వాగతముతోడ నాహ్వానింతురు."

"తదుపరి స్వసృ (సోదరి) లోకమును గోరుచో వైభవముతో దానిని నాతడుబొందును. నేలన దానిని నాతడు

కోరు యుత్తరక్షణముననె శ్వశ్రూలు వానిని స్వాగతముతోడ నాహ్వానింతురు."

"తదుపరి, సఖుల (స్నేహితుల) లోకము గోరుచో వైభవముతో దానిని నాతడు బొందును. నేలన దానినాతడు కోరు యుత్తరక్షణముననె సఖులువానిని స్వాగతముతోడ నాహ్వానింతురు."

"తదుపరి, గంధమాల్య (సౌరభములు, పూదండలు) లోకమునుగోరుచో వైభవముతోడ దానినాతడుబొందును. నేలన దానినాతడుకోరు యుత్తరక్షణముననె గంధమాల్యములు వానిని స్వాగతముతోడ నాహ్వానించును."

"తదుపరి, యన్నపాన (ఆహార - పానీయములు) లోకము గోరుచో వైభవముతోడ దాని నాతడు బొందును. నేలన దానినాతడు కోరు యుత్తరక్షణముననె అన్నపానములు వానిని స్వాగతముతో నాహ్వానించును."

"తదుపరి, గీతావాదిత్ర (కీర్తన - సంగీతములు) ముల లోకమును గోరుచో వైభవముతోడ దానినాతడుబొందును. నేలన దాని నాతడుకోరు యుత్తరక్షణముననే గీతా, వాదిత్రములు వానిని స్వాగతముతోడ నాహ్వానించును."

"తదుపరి, స్త్రీ (ఆడుది) లోకమును గోరుచో వైభవముతో దాని నాతడు బొందును. నేలన దాని నాతడు కోరుయుత్తర క్షణముననే స్త్రీలు వానిని స్వాగముతోడ నాహ్వానింతురు"

"ఎద్దియైన దేశము (Country) నాత డిచ్ఛించుచో వైభవముతోడ దాని నాతడు బొందును. నేలన నాతడు

కోరినచో యుత్తర క్షణముననే వాని కొఱకది వసించి (సృజించి) యుండును."

భక్తు డన్నిజగములలోను స్వతంత్రుడుగ నుండును. వానియొక్క కేవల సంకల్పము (యిచ్ఛ) చేతనే వానియొక్క తండ్రి, తల్లి, సోదరులు, సోదరీలు, స్నేహితులు, వచ్చి యెవరంతట తాము వానితో సంబంధ మొనర్చుకొందురు. ఆతనికి శుద్ధప్రకృతి (స్వభావము) అందువలన వాని సంకల్పము, భగవంతుని దానికివలె తప్పరానిది. ఆత డేస్థలమునకైన నాసక్తుడైనను, పైనుడువ బడిన వాటికిపైగా దేనినైనను నాతడు తన కేవలసంకల్పము (యిచ్ఛ)చే నభిలషించినను, నన్నికామ్య స్థలములును, వస్తువులును, వాని వద్దకు వినగవచ్చును. అందుమూలమున నసంపూర్తి నొందిన (నసంతుష్టి నొందిన) కోరిక లెవ్వియు లేనందునను, తాను కోరినవాని నన్నిటిని పొందియుండి నందునను, నాతడు సౌఖ్యముగను, ఘనముగను, నుండును.

ఆత డాత్మపరిపాలకత్వము (Self-lordship) నొందును. ఆతడు వాక్కునకు ప్రభువు. చక్షువు (కన్ను) నకు ప్రభువు. శ్రోత్రము (చెవి) నకు ప్రభువు. వివేకము (understanding) నకు ప్రభువు నగును. అందఱు దేవతలు వానికొఱకు కానుకకు తెత్తురు. వేదాంత సూత్రములోని నాలుగవ స్కంధము (chapter IV) నాలుగవ ఆధ్యాయము పదునేడవ పేరా(Para) అధ్యాయ విభాగము - (Adhyaya IV) లో "జగద్వ్యవహార మగు సృష్టితప్పించి భాగవతుడు సమస్త ప్రభు (ఆధిపత్య) శక్తులను కలిగి యుండుటను మీరు కనుగొందురు. ఆతడు సమస్త ప్రపంచ వ్యవహారమునకు దూరముగ నుండును. నేలన

ముక్తాత్ములు (Released souls) చిత్తముల (minds) గలిగి యుంగాను. అవి వేర్వేఱు చిత్తములయి యుండవచ్చును. మఱియు నందొకరికి ప్రపంచమును రక్షించు నుద్దేశ్యముండి యుండగా వేఱొకరు దానిని విధ్వంస మొనర్చుటను కోరి యుండవచ్చును. ఒకరి కోరికలు వేఱొకరి వాటికి స్థిరముగ సరిపడునని యూహించు కొనుటచే నిట్టి యభిప్రాయ భేదముల మాత్రము త్యజింపవచ్చును. మఱియు దీనినుండి భగవంతుడు తక్క నన్నియితరాత్మలును సర్వోత్కృష్టుడగు భగవంతునిపై నాధారపడుదురని దానంతటది తెలియును.

భక్తులయొక్క యిచ్ఛ సాధారణ మానవుల యొక్క యిచ్ఛనుండి స్వభావములో భేదించును. ప్రత్యేకోద్దేశ్యమునకు వలయునట్టి స్థిరత్వము (Stability) కలిగిన నేదియో నొకదానిని జనింపజేయు శక్తి దానికిగలదు. ఒకదివ్వె (lamp) యందలి జ్వాల (Flame) మూలజ్వాలనుండి వెలిగించిన బహుళమగు జ్వాలలుగా నెట్లుజనునో, నేలన దానంతటది వికారమునొంద గల శక్తి దానికిగలదు. నటులనే భాగవతుని యొక్క ఆత్మ యును, నొకటి మాత్రమే అయినప్పటికిని దానియొక్క ప్రభు (ఆదిపత్య) శక్తివలన దానంతటది క్రమాభివృద్ధి నందినాటి యన్ని శరీరముల (దేహముల) లో ప్రవేశించును. ఏలన నీ విధముగనొకటి బహుళ మనవచ్చునని శాస్త్రము (Scripture) చెప్పును. "ఆతడొకరెట్టి మూడురెట్లు, అయిదురెట్లు, ఏడు రెట్లు" ఛాందోగ్యోపనిషత్తు 7-26-2 వాస్తవమగు కోరికలు (సత్యకామము, సత్సంకల్పము) కలిగియుండు స్వభావము కలిగి యున్నందున పరమాత్మ మూలమగు నొక అంగము (Organ) నకు సరిపడునటుల యంతరాంగములతో (Internal organs)

నానాదేహముల సృజించునని యూహింప బడవచ్చును. మఱియు పరమాత్మ తనయొక్క ఉపాధుల (limiting adjuncts) యొక్క విభజనముచే దానంతటనె విభజన మొందుచు ప్రతి సృజింపబడిన దేహమునకు నొకజీవాత్మ నొసగుట సాధ్యమైయె యుండవచ్చును. జీవాత్మకు వివిధదేహముల తోగల సంబధమును వివేకీకరించునట్టి యధ్యాయములలో యోగవిషయక ప్రశ్నకములు చర్చించు శీర్షిక (topic) యిదియే.

భాగవతుడు శరీరము నొకదాని నభిలషించు నప్పుడాతడొకదానితో నగపడును. శరీరవర్జితుడై యుండగోరు నప్పుడాత డొకదానితో నుండడేలన వానికి చాల కోరికలు గలవు. మఱియు నన్ని కోరికలును సిద్ధిపొంద బడినవి.

ఈపృథ్విపై యగుపడు, చరించునట్టి దేవతలగు నిట్టి యుత్కృష్టమగు భాగవతులకు శోభ, జయము!

# తృతీయాధ్యాయము - భక్తిలో నావశ్యకతలు సారము నాస్వాదింపుము

సముద్రపుటొడ్డునందలి యిసుకవలె నన్ని మత తెగలీ ప్రపంచమున గలవు. జనులు మతముయొక్క వాస్తవిక సారమును దృష్టినుండిగోల్పోయిరి. వారల్పమైన నిశ్చితాభిప్రాయములకును, బాహ్యములకును, విధికానివాట్ల (అనావశ్యకముల)కును, ననవసరముగ తగువులాడుదురు. ఒకరినొకరు దూషించుకొనుచు వారసహ్యకరమగు పత్రముల ప్రకటింతురు. బాహాటోపన్యాసవేదికపై నొకమతబోధకుడు వేఱొక తెగకుచెందిన మఱియొకమతబోధకుని దూషించును.

ఒకానొక భావనాపద్ధతికి చెందిన మతబోధకు డొకడు బాహ్యముగ వేఱొక భావనాపద్ధతియందలి దోషముల నెల్లడించును. చదువుకొనినవారు అనబడే (Socalled) వారు సహితము తములో తాము నిర్లజ్జగ పోట్లాడుకొందురు. కుంభమేళములలో కఱ్ఱమోదులు (Lathi-Charges) రక్తపాతము సంభవించును. ఇదంతయు నేమిటి ? ఈ దినములలో నిట్టి విచారింపదగు స్థితిగల వ్యవహారములు నడచుచున్నవి. మతముపేరిట నిట్టి స్థితిగల వ్యవహారములఁజూచుట భయానకము.

కైలాసపర్వతమును వేర్వేఱు త్రోవలగుండ నాల్మోరా మీదుగను, గంగోత్రిమీదుగను, బదరీనారాయణము మీదుగను, జోషిమఠము మీదుగను, కాశ్మీరము మీదుగను, మున్నగువానిగుండ నీవు చేరవచ్చును. త్రోవలు వేరైనప్పటికిని గమ్యస్థాన మదియే (సమానమే). సమస్తనదులకును తుది గమ్యస్థానము సముద్రము. చెన్నపట్టణమునుండి కలకత్తాను రైలుబండిద్వారా లేక పొగయోడ (Steamer) ద్వారా లేక మోటారుకారుద్వారా లేదా విమానముద్వారా నీవు చేరవచ్చును. ఏమి విశిష్టత (భేదము) యున్నది ? గమ్యస్థానము సమమైనదే.

వివిధతీరులగు మనస్సులుకలవు. మానవులకు వివిధమగు నభిరుచులు, స్వభావములు, మనస్తత్త్వములు, నభీష్టములు, సామర్థ్యములు, సాధనకొరకైగలవు. కాన విభేదమైన త్రోవలు విధిగ నవసరము.

ద్వైతపద్ధతి, యద్వైతపద్ధతి విశిష్టాద్వైతపద్ధతి, దివ్యజ్ఞానము సూఫీమతము, షింటోమతము, కన్ఫ్యూషియన్ మతము, మజ్దా మతము, నింకను నెన్నో యధికమగు మతములు, నార్యసమా

జము, బ్రహ్మసమాజము, ధర్మసమాజము, పైగ చాలనధిక మగు సమాజములు కావలసివచ్చెను. మనస్సులయొక్క రీతు లంతేవవైనన్ని బహు సమాజములు, మతములు, మండవల యును. మనస్సును వశీనపర్చుకొనుటకు కోట్లకొలది త్రోవలు లేక మార్గము లున్నవని శ్రీ శివుడు చెప్పెను.

త్రోవ లుండుటవలెనే సిద్ధాంతములు కూడ నంత విస్తృతముగ నొకదానితో నొకటి వేఱుపడును. కాని చేర నగు లక్ష్యమనగా నాత్మసాక్షాత్కార మెల్లకాలములందును సమానమే.

అసూయగల నసహనీయులగు సంకుచిత హృదయము గల నల్ప మనస్కులగు జనులు మాత్రమే తమలో తాము స్వల్ప విషయములకై దెబ్బలాడు కొందురు. ఒకని హృద యము వ్యాకోచ (విస్తృత) మొందినపుడు నొకడు భగవత్సా క్షాత్కార మొందినపుడు భేదములు కరగిపోవును. ఆత్మ సాక్షాత్కార మొందిన పురుషులెన్నడును తగవులాడ జాలరు. వారు సమదృష్టి కలిగియుందురు. వారందరియెడ సమమగు ప్రేమ కలిగియుందురు. వారు ప్రతి మత తెగ (Sect) లేక కక్ష (Cult) యొక్క సర్వత్ర సమమైన నావశ్యకములను చూతురు.

ప్రతి మతము, ప్రతి మతకక్ష, ప్రతి మత తెగయు, "సత్యధర్మ మొకటేగలదు. దానిని సత్యము పలుకుట చేతను నందఱిని ప్రేమించుట చేతను. బ్రహ్మచర్య జీవనము గడుపుట చేతను, పారిశుద్ధ్యత, ఆత్మ నిగ్రహముగల జీవనమును నిర్వ ర్తించుట చేతను, ధారణము, ధ్యానము, భక్తి చేతను, చేర నగు"నని ప్రకటించును.

నలుగురు గ్రుడ్డి మనుష్యులొక యేనుగును తొలి సారిగా తాక నారంభించిరి. ఒకడు యేనుగు చెవులను పట్టు కొని "యేనుగొక చెరుగుడు వినకర్ణ (చేట) వలె నున్నదని చెప్పెను. ఇంకొకడు కాళ్లను పట్టుకొని "యేనుగొక స్తంభ మువలె నున్నద" ని చెప్పెను. వేరొకడు తోకను పట్టుకొని "యేనుగొక పెద్ద కొఱడావలె నున్నద" ని చెప్పెను. తమ యనుభవముల గూర్చి తమలో తాము కొట్లాడు కొను చుండిరి. అదే విధముగ తొలిపర్యాయముగా నిప్పునార్పు యంత్రము (Fire brigade engine) ను చూచిన కొందరు గ్రామీణులు తమలో తాము దెబ్బలాడ నారంభించిరి. ఒక మనుష్యుడు "ఇది యంతయు నిప్పేన" నెను. వేఱొకడు "యిదియంతయు నీరేన" నెను. మూడవవాడు "యిదంతయు నినుమేన" నెను. భీకరమగు నజ్ఞానమే తుచ్ఛపు తగవు లాటలకు కారణము. తమలో తాము స్వల్ప విషయములకై తగవులాడుకొను నీచ మనస్కులగు బుద్ధివిహీనులైన జాతి వాదుల (Sectarians) తోడి విషయమును నట్టిదియే.

కొండ శిఖరమునెక్కిన మనుజున కొక వృక్షము సమానయెత్తుగ నున్నటు లెటుల కనబడునో నటులనే గూడ దివ్యచైతన్యము, భావసమాధుల యుత్కృష్టపు టౌన్నత్య ముల చేరిన నాత్మదర్శన మొందిన భాగవతునకు సమస్త మత తెగలును, సమస్త జనులును, నొకే మాదిరిగ నగు పడుదురు.

బ్రహ్మ మొకటియే సత్యము లేక భగవంతు డొకడే. శ్రుతులొకటియే, వేదము లొకటియే, సద్గుణము, భక్తి, ధారణ, ధ్యానము, సమాధియు నొకటియే. కర్మ యొకటియే

ధర్మమొకటియే. ఆత్మసర్వసము, వాస్తవిక మతము, ప్రేమ యొక్క మతము నాత్మ సాక్షాత్కారముయొక్క మతము సర్వము నొక్కటియే. శక్తి (Energy) యొకటియే. సూర్య లోకమే, చంద్రలోకమే, ఆకాశ మొకటియే, భావలు వేరై నప్పటికిని మానవ ప్రకృతి యొక్కటియే కనుక, హృదయ, పూర్వకతయు నొకటియే. అమెరికా దేశీయ మనఃపూర్వకత లేదా జపాను దేశీయ నిష్కపటత యనునట్టి వస్తువెద్దియును లేదు. శక్తి యొకటియే. ఇంగ్లాండులోను, చైనాలోను, ఆఫ్రికాలోను, అది పంచ భూతములతో (Elements) డనే తయారు చేయబడినది. రక్తమొకటియే, చైనా దేశీయుని, ఆఫ్రికా దేశమందలి నీగ్రోమనుజుని, ఆంగ్ల దేశపు ధనాధికార వర్గీయుని, (English Aristo-crat) లేదా అమెరికా దేశమందలి కోటీశ్వరుని, యొక్క రక్తము సమానమే. అది సమానమైనట్టి రక్తద్రవము. (Blood Plasma) రక్తకణముల రంగు పదార్థము (Homo-globin) ఎర్రకణములు (Red Corpuscles) తెల్లకణములు (Leococytes) కలిగియుండును. మనోనుభవ మందరిలోను సమానమే నీ వేయొక్కరినైనను మూర్ఖుడని లేదా తిరుగు బోతని (Vagabond) పిలువుము. అతడు కోపవంతుడగును. ప్రతి యొక్కడును ఆకలి, దాహము, మలవిసర్జన, (Defecation) మూత్ర విసర్జన, ఆనందము, విచారము, సుఖదుఃఖ మనోవైఖరుల నొందును. హృదయము, ప్లీహ (Liver) యకృత్తు (Spleen) మలవిసర్జన వాహిక, కర్మ, అనుభవము, (జ్ఞానము) యొక్క సేంద్రియములు, గ్రహిం చునట్టి బుద్ధిసామర్థ్యము, నందఱిలోను సమానమే. అందఱి

చేతను చేరునది లక్ష్యమనగా భగవత్సాక్షాత్కారము కూడ సమానమే. దాని మానుము. నడచు (నూతకు నడకకిచ్చు) కఱ్ఱ (Walking Stick) నైనను నారాధించుటచే నీవీ సంసార సముద్రమును దాటి గలుగుదువో, నా ప్రియమిత్రుడా! నితరు లేమి పరిశీలించి (Remark) నను, లక్ష్య పెట్టకుము. ముందుకు జనుము. నీ స్వీయమగు త్రోవలో నడువుము. దివ్య ప్రేమమొక్క మధుర దినుసుల (Sweets) నీవు విధిగ ననుభవించితీరుదువు. ధైర్యముగ నుండుము. ఉత్సాహముగ నుండుము. ఆధ్యాత్మిక మార్గమున నిర్భయముగ ముందుకు సాగుము. జనాభిప్రాయమునకు లక్ష్యపెట్టకుము.

సారము, సాంతర్యము, (Core) లేక మూలవస్తువును తీసుకొని నిర్దయగ, తొక్కను లేదా చిప్పను పారవేయుము. గింజ (grain)ను వదలి ఊక (chaff) కొరకు దెబ్బలాడుటలో తమ కాలమును వృథ పుచ్చువారు మూర్ఖులుకారా? నేను వారిని కనికరింతును. వారు మానవజాతియందాశ లేని మొండి రకములు.

జీవితము స్వల్పము. కాలము త్వరగ పరుగిడుచున్నది, నీ వీ భౌతిక దేహమును గైకొనినందులకు గల లక్ష్యమును, నుద్దేశ్యమును, జ్ఞప్తియందుంచుకొనుము. నీవిచ్చటకు వచ్చి యొనర్పవలసిన యుద్దేశ్యమును నెఱవేర్చుటయందు గట్టిగ యత్నింపుము. రైలుబండి లేక టాంగా (గుఱ్ఱపు బండి) మోటారుకారు లేక విమానముద్వారా కానిమ్ము. లక్ష్యము పట్ల ధైర్యముగ నందఱును ముందుకు సాగుదురుగాక! సర్వ మత తెగలు లేదా కక్షలు లేక పక్షములలోను ప్రాధాన్య

ముగ సకలసమాజములయొక్క వాస్తవిక మతమువెంబడి సర్వులు చరించెదరుగాక !

సరి యిప్పుడు మిత్రమా ! సర్వమతములయొక్క సారము నొకటేయైనను సమానమయితే మత భేదములమధ్య నీ వాదన, పోట్లాట లేమి యుండకరించును ? కాన మానవజీవితముయొక్క నా ముఖ్యోద్దేశము, సర్వమతములయొక్క వాస్తవిక ధ్యేయము నయిన జననమరణములయొక్క సాంసారిక చక్రమునుండి మనల విముక్తుల చేయించునదియు, నుత్కృష్టజ్ఞానము, నమితానందము, మహాశాంతి, శాశ్వతసంతృప్తి, మోక్షముల మన కిచ్చునట్టిదియునైన కేవలము భగవంతునియొక్క దివ్య ప్రేమ లేక భక్తినెడ ననురాగము సంపాదించుటయందు సరియగు మనస్ఫూర్తితో మన మందఱము యత్నింతముగాక !

## యౌవనముననే నాధ్యాత్మిక బీజమును నాటుము

భక్తి యనునది వయస్సు, కులము, స్థితి, హోదా లేక లింగముతో నెంతమాత్రము నిమిత్తము లేదు. సాధారణముగ ప్రపంచమునందలి మనుష్యులు ధ్యానము, భక్తి మున్నగు వానిని యుద్యోగవృత్తులనుండి విరమించినతరువాత సాధింతుమనెదరు. ఇదియొక తీవ్రమగుతప్పు. నౌకరీవృత్తిలో నీయొక్క యావత్తు శక్తి పిండివేయబడిన తరువాత నీ వెట్లుగ్రమగు నాధ్యాత్మికసాధన నొనర్పగలవు? పదునైదు నిమిషములు కూడ కూర్చొనజాలవు. ఇంద్రియముల నదపులో నుంచుటకు వలయు బలము నీకు లేకున్నది. నీ చిన్నతనమందే, నీ హృదయము సుకుమారముగను, నిష్కళంకముగను, నున్నపుడే నాధ్యాత్మిక భక్తిబీజమును నీ హృదయములో వెదజల్లవల

యును. అప్పుడుమాత్రమే వేళ్ళలోనికిజొచ్చి పుష్పితమైవృద్ధుడవయి, నౌకరీవృత్తినుండి విరమించుసరికి ఫలభరిత మొన ప్పును. అప్పుడు మాత్రమే మృత్యువునకు ప్రభువగు యముడనిన నీవు భయపడవు. వానిని చిరునగవుతో తార్కొందువు.

మూర్ఖపు తల్లిదండ్రులు భక్తియుతమగు మనోభావనలు గలిగిన తమ సుపుత్రుల నెవ్విధమగు నాధ్యాత్మికసాధనల నింటివద్ద చేయనియ్యరు. వారి త్రోవలలో కఠినమగు నడ్డంకుల నుంతురు. వారిండ్లు విడిచిపెట్టి సన్న్యాసము స్వీకరింతురని వారు భయపడుదురు. వారు భగవద్గీతనుగాని లేక యే యితర ధార్మిక (మతవిషయక) పుస్తకమునుగాని, చదువుచో వారి మాతాపిత లట్లు గావించుట కాటంకపఱతురు. ఎంత సిగ్గు చేటు! లాహోరునందలి యొక యువకుడగు వకీలు హరిద్వారమునకు బోవుటకు కూడ వాని తండ్రి వాని నడ్డుపెట్టునని నాతో చెప్పెను. తమ బిడ్డల ఆధ్యాత్మికాభివృద్ధిని యడంగద్రొక్కు వృద్ధ తల్లిదండ్రులస్థితి యిటులున్నది. వ్యవహారస్థితి యెంత నిందనీయముగ నున్నది! ఇరువది సంవత్సరముల వయస్సునకు లోపలనే వారి నాడుల గిలిగింత లొనర్చుటకు మాత్రము వివాహ మొనర్చి వారి జీవితములను, భావిని పాడుచేయుదురు.

సమస్త జీవులకును మానవజన్మ లభించుటయును, పైగా పురుషదేహములో మఱియును, దానికంటె నరుదుగ బ్రాహ్మణత్వమును, నింకను నరుదుగ నాధ్యాత్మిక పంథ (త్రోవ) నెడ నభిరుచి గల్గియుండుటయును నింకను చాల అరుదుగ నాధ్యాత్మిక వికాసానుభవమును బడయుటయును దుర్లభము. భగవత్కృపవలన నిక్కముగ నఱుదుగ నుండు

మూడు వస్తువులు గలవు. అవి యేవనగా, మానవజన్మము, శ్రీహరిదర్శనమునకై వలయు తీవ్రేచ్ఛ. సిద్ధుడగు భాగవతుని [illegible] రక్షించు భాగ్యతయునై యున్నవి. ఏదో విధముగ పురుషదేహముతో మానవజన్మమునంది, వేదములపై నాధిపత్యము గలిగియుండి, భగవత్సాక్షాత్కారమునకు యత్నింపకుండుటయన నాత్మహత్య నిక్కముగ చేసికొనునట్టే యగును. యేలన నశాశ్వతమగు వస్తువులకై పట్టుకొని ప్రేలాడుటన తన్ను తాను చంపుకొనుట యగును. అరుదగు మానవదేహమును, అందులోకూడ పురుష దేహము నొందియు, నీజీవితము నందలి సత్యోద్దేశము నొందుట కుపేక్షించు మానవునికంటె నధికుడగు నవివేకి యెవడున్నాడు? మానవులు పురాణముల వాకొనినట్లు యేకైక కౌపీనముతో చతుర్ధామములైన బదరీ నారాయణము, ద్వారక, పూరీజగన్నాథము, రామేశ్వరముల దర్శించి ప్రపంచమంతయు ప్రదక్షిణించినను, శ్రీహరియొక్క ప్రత్యక్షదర్శనము లేనిదే యెవనికిని ముక్తిలేదు. ధనసంపత్తిచే మోక్షమునొందు నాశయులేదు. కాన వివేకము, విశ్వాసము గల మానవుడు బాహ్యవస్తువులనుండి సుఖముల నొందుట కభిలాషను త్యజించి యుత్తముడగు, నుదారుడగు, సిద్ధుడగు భాగవతుని సక్రమముగ సమీపించి శ్రీహరియొక్క పాదకమలములయందు మనసును లగ్నముచేయుచు భగవత్సాక్షాత్కారమునకై తనకు వీలైనంత యెక్కువగ యత్నింపవలెను.

## ఎవరైనను భక్తులు కావచ్చును

భక్తిసామ్రాజ్యములో జాతి (కులము) లేక వర్ణము లేక లింగము యొక్క తారతమ్యతకు చోటులేదని గుర్తించ

వలయును. "నీచజాతుల (కులముల) కు చెందు స్త్రీపురుషు లకు సహితము భక్తికై హక్కు గలదని" శాండిల్యుడు కూడ తన సూత్రములలో చెప్పెను. అంత్యజాతులైన లోకములకు చెందు పరమ పాపిష్ఠి, గొంతుకోయునాడు (విశ్వాసఘాతకుడు) సహితము భక్తిని పెంపొందింప వచ్చును. ఎవ్వనికిని నిస్పృహ చెందుటకు త్రోవలేదు. "నిర్వ్యాజకమగు(undivided) హృదయముతో మిక్కిలి పాపిష్ఠియైనను నన్ను పూజించుచో నాతనిగూడ సన్మార్గునిగ నెంచవలసియుండును. నేలన నాతడు సక్రమమగు నిశ్చయము చేసినవాడు. త్వరగా నాతడు విధేయుడై శాశ్వతమగు శాంతికి జనును. "ఓ కౌంతేయా! నాభక్తుడెన్నడును నశింపడని నిశ్చయముగ తెలిసికొనుము. ఓ పార్థా! పాపులగు స్త్రీలు, వైశ్యులు, లేదా శూద్రయోనులకు సంబంధించినవారైనను నెవరైతే నన్ను శరణుజొత్తురో వారుకూడ సత్యోత్తమ మార్గమును త్రొక్కినవారే యగుచున్నారు" అని శ్రీకృష్ణభగవానులనును.

తన హృదయమున భక్తి యున్నచో చండాలుడైనను భగవంతునితో సఖ్యమొనగూర్చు కొనవచ్చును. ఉన్నత కులముల వారమని దంభములు పలుకు ప్రాపంచిక మగ్నులగు మానవుల దృష్టిలో మాత్రము మిక్కిలి నీచకులమునకు జెందిన "నందన్" యను నొక మాలవాడనురాగయుతుడగు భక్తుడై దక్షిణ హిందూదేశములోని చిదంబరము నందలి నటరాజస్వామి దర్శనమును పొందెను. భాగవతులు తమిళ జిల్లాలలో నిప్పటికిని వాని కథను జరుపుదురు.

ప్రసిద్ధికెక్కిన "తిరుక్కురాల్" యొక్క గ్రంథకర్తయగు తిరువల్లువార్ కూడా నధమకులమునకు చెందినవాడే.

"దాదు" యను సాంతర్య విజ్ఞాని (Mystic) యొక సాలె వాఁడు. అతనివలెనే "కబీరు" కూడను. అవివాహితయును, నొక గొప్పభక్తురాలును, నగు "అవ్వయార్" యను నామె యొక నీచ కుటుంబములో జన్మించెను. "గుహనిషాదుడు" ను కూడ తక్కువ కులమునకు చెందినవాఁడే. వానికి శ్రీరాముని యెడ నమితమగు భక్తిగలదు. శ్రీరాముడు దేశాంతరమున కేగుచున్నపుడు గుహనిషాదుడు (నిషాదుడగు గుహుడు) శ్రీరాముని మనఃపూర్వకమగు ప్రేమతో నాహ్వానించెను. భగవానుడగు శ్రీరామచంద్రుడు స్వేచ్ఛగా వాని యాదర సత్కారముల నంగీకరించెను. గుహనిషాదుడు శ్రీరామునితో సమానభావముతో సహితము సంచరించెను. "రాయ్‌దాస్" యను వస్నె కెక్కిన భక్తుడొకడు చర్మమును బాగుచేయు మాదిగవాడు (Cobbler). భీలినియగు "శబరి" శ్రీరాముని యొక్క పరమ భక్తురాలు. ఆపెచే ముందుగ చవి చూడ బడిన పండ్లను సహితమాతడు తినెను. "సాధన" యను నొక కసాయి వాఁడొక ఉత్తమ భక్తుడు. స్త్రీలు కూడ భగవంతుని చేరగలరు. సహజముగ ప్రేమార్ద్ర హృదయము కలవారుకాన వారు త్వరగను, సునాయాసముగను, గూడ భగవత్సాక్షాత్కారమును బడయగలరు. వారు పురుషుల కంటె నెక్కువ భక్తిపరులు. స్నేహవృత్తి (అనురాగము) వారిలో నగ్రస్థానము కలది. "సూర్‌దరిజ్" యను నొకగొప్ప వివాహితయగు భక్తురాలు, తన మామగారితో బృందావనారణ్యముల కొకపరి జనెను. ఆపె సమాధి (కృష్ణభగవానునితో నైక్యము) లో నుండెను. ఒక మహమ్మదీయు డాపెను బాధించుటకు వచ్చెను. శ్రీకృష్ణ భగవాను డొక పులి రూప

మును దాల్చి వానిని గ్రమింగెను. భగవంతుని కొఱకు నిజ మగు భక్తియును, నిరంతరజ్ఞప్తి (స్మరణ) యును, నొకని కుండుచో నాతడు సర్వవేళల పరమేశ్వరునిచే రక్షింప బడును. దీని గుఱించి యెట్టిసందియము లేదు.

## భగవంతునితో బేర మాడవద్దు.

నిజమగుభక్తుడు "నేనేమియు నాప్రియుడగుభగవంతుని వద్దనుండికోరను. నామనస్సును భగవంతుని పాదపద్మములపై నెల్లప్పుడు స్థిరముగనుండనిమ్ము. నాయాత్మ సర్వదా యా పరమేశ్వరుని పట్టుకొని వ్రేలాడనిమ్ము" ననును. భక్తుడొకసారి దివ్యమగు భగవత్ప్రేమయొక్క మాధుర్యమును చవి గొనుచో, నాపరాత్పరునిదక్క నన్యమేలగోరును ?

హరిని ధ్యానించి యాధిపత్యమునొందుట కడవికిజనిన బాలుడగు ధృవుడు "నాకు రాజ్యమక్కఱలేదు. నాప్రియుడగు భగవానుడు నాతోనిప్పుడున్నాడు. శ్రీహరి దర్శనమగుటతోడనే నామనోభీష్టములన్నియు నెఱవేరినవి. నామన స్సైహికసంపత్తికై యిక నెంతమాత్రమపేక్షింపద" నెను.

ప్రహ్లాదుడొక నిజమగు భక్తుడు. భగవానుడగు హరి ప్రహ్లాదునితో "ప్రియమగు ప్రహ్లాదా! నీయొక్క మనఃపూర్వకభక్తికి సంతసించితిని. ఏదేని నీయిష్టమువచ్చినవరమును గోరుకొనుము. ఈక్షణముననే నొసంగెద"ననెను. ప్రహ్లాదుడు "హే ప్రభూ! వరములిచ్చి మోహపఱచకుము. నాకోరిక లన్నిటినంతమొందించి నీయెడ పవిత్రమగు ప్రేమ కలిగియుండుటకును, ప్రేమను ప్రేమనిమిత్తమే కలిగియుండుటకును, నేను నిన్నాశ్రయించితిని, ఏదియో దరిచేరరాని యుద్దేశము

మాత్రము దృష్టిలోనుంచుకొని భగవంతుని నారాధించువాడు నిజముగ భక్తుడుకాడు" అనెను.

భగవంతునితో దుకాణపుపని చేయుటను, వర్తక వ్యవహారము నొనర్చుటను, లేదా బేరమాడుటను, లేదా వాణిజ్యవ్యాపారముల కొనసాగించుటగాని, మానుము. ఎవడైతే తన యిష్టదైవమునుండి ప్రేమ భక్తిని తప్పించి యొక వరమునుగాని, లేదా దేనినైనగాని, కోరుచో యాతడు నిజముగ భక్తుడుకాడు. ఒక కళాశాలవిద్యార్థి భగవంతునితో బేరమాడును. ఆతడు "ఓ శ్రీగణేశా! ఈ సంవత్సరము నా పరీక్షలో నుత్తీర్ణుడను కానిమ్ము. నేను నీదేవాలయములో 108 (నూటయెనిమిది) కొబ్బరికాయల నర్పింతున"నును నీవు దీనిని పవిత్రమగు దైవికప్రేమయందువా? ఇది కేవలము ధనాపేక్షితవ్యాపారము వంటిది. పవిత్రమగు దేవాలయమును చౌరింఘీ (Chowringee) గాగాని, హజరత్ గంజ్ (Hazarat ganj) గాగాని, మార్చకుము. స్వల్పమగు నైహికవస్తువులకు గాని, లేదాకొన్నిప్రాపంచిక సేకరణలకైగాని, భగవంతునితో బేరమాడునాతడు బాహాటమైన పరమడాంబికుడు. నిజమగు భగవత్సేవకుడు లేదా భక్తుడుకాడు.

## ఈశ్వర ప్రణిధానము

ఈశ్వరుని స్తుతించుటను, నా పరమేశ్వరుని వాక్కులచేతను, మనోభావములచేతను, కర్మలచేతను, వానియెడ తప్పరాని భక్తిచేతను, స్మరించుటను, నారాధించుటను, నీశ్వర ప్రణిధానమని పిలుతురు. మానవుని జీవితపుటునికి సర్వమును, నుద్దేశ్యసర్వమును, నైన (ముఖ్యాశయమైన)

ట్టియు, రెంటిలో నాతడు చెప్పుచున్నట్టుల భక్తివశ్యత్వ (నారాధ్యము) నంపు లీనుడగుచున్నట్టియు, ప్రేమ భగవత్ప్రాప్త ములనెడ నవిచ్ఛిన్న ప్రవాహప్రేమయే ఈశ్వర ప్రణిధాన భక్తి.

మధుసూదనసరస్వతి దానినొక మనోస్థితిగను, మనస్సు సంపూర్ణముగ నాశ మొందబడి, లీనముచేయబడుటకు ప్రాప్తి మందని భగవంతుని లేక ప్రభుసిస్వభావమును వహించునదిగను కూడ వర్ణించెను.

పతంజలిమహర్షి తన రాజయోగతత్వమున "ఈశ్వర ప్రణిధానద్వా అధ్యాయము I సూత్రము 23" యని చెప్పెను.

ఈశ్వరునియెడభక్తిచే సమాధియందలి జయము త్వరగ కూడనుండును. (ఈపదమనగా నీశ్వరత్వము – కొందఱచే భగవంతునియొక్క సర్వస్థితిత్వమునసుభవమొందుటగతర్జుమా చేయబడినది.) యోగసూత్రములందలి రెండవయధ్యాయము ననుసరించి క్రియాయోగముయొక్క మూడంగములు లేక భాగములలోను "నీశ్వర ప్రణిధానమొకటి. ఇచ్చట నీశ్వర ప్రణిధానపదము కర్మఫలముల భగవంతునికి నివేదనచేయుట లేక నర్పించుటనియర్థమిచ్చును. ఏదైన నొకదానిని వేఱొక దానిక్రింద సంపూర్ణ పరిమితిగ నుంచుటని పదముయొక్క మూలార్థము. ప్ర=పరిపూర్ణత, ణి=క్రింద, ధాన=ఉంచుట." "సుందరము లేక వికృతము, మంచి లేక చెడ్డ, కామ్యము లేక నిష్కామ్యముగ నేనేమిచేయుచున్నను దానినంతయు నీనిమిత్తము త్యాగమొనర్చుచున్నాను. నీవు విధేయతతో సమస్తవిషయముల నే నొనర్తును." ఫలత్యాగమనగా కర్మ మును దానిసంబంధముతోబాటు దానినుండి పొందనగుఫలము

మోహింపకుంత నొనర్చుటయే." నీవ్యవహారము కర్మతో మాత్రమే. దానిఫలములతో నెన్నడుగాదు. కాన కర్మ ఫలము నీయుద్దేశ్యముకాకుండుగాక. నీ వకర్మమునకు (కర్మ ముచేయమికి) నాసక్తుడవుగా నుండకుందువుగాక! (గీత-అధ్యాయము 2 శ్లో 47) యని శ్రీకృష్ణు డెందుకుచెప్పెననగా నదియే కారణము.

ఇంకను తిరిగి రాజయోగతత్త్వముప్రకారము నీశ్వర ప్రణిధానము నియమములయొక్క నైదంశములలోను నొకటి. ఇటనది భగవదారాధనని యర్థము. పతంజలిమహర్షి రీత్యా దుఃఖము, కర్మఫలితములు, కోరికలచేస్పృశింపబడని ప్రత్యేక పురుషుడే నీశ్వరుడు.

## దారిద్ర్యముయొక్క ప్రయోజనములు మధురము.

"షేక్స్పియరు" (Shakespeare) యొక్క వ్రాతలలో "ఒక విధమైన పామువలె వికృతమును, విషవంతము నైనప్ప టికిని దాని తలపై నొక విలువగల మాణిక్యము (Jewel) ను వహించునటుల దారిద్ర్యము యొక్క ప్రయోజనములు మధురమైనవ" ని నీవు కనుగొందువు. ఈ ప్రపంచమున నత్యు త్తమమైన వస్తువు బాధలేక దారిద్ర్యము. బాధయందు మాత్రమే మానవుడు భగవంతుని జ్ఞప్తి యుంచుకొనును. బాధయే చక్షురావిష్కారి. (కన్ను తెఱచునట్టిది) భగవం తునియొక్క నన్వేషణ బాధనుండియే ప్రారంభించును. వేదాంతపు టారంభ బిందువు బాధనుండియే నైనున్నది. ఈ ప్రపంచములో బాధ యుండనట్లయితే మానవుడు ముక్తి (మోక్షము) కొఱకెన్నడును యత్నించి యుండడు. అతడే

యైహిక జీవితముతో మాత్రము సంతృప్తి పడుచుండి యుం డును. బాధను తొలగించుటకు యత్నించుటలో నాతడు సత్యా మును లేక శాంతి నిలయము, పరంధామునును కలుసుకొనును ఆతడు ప్రార్థన, జపము, దాన ధర్మము, నిష్కామ్యసేవ, ఆధ్యాత్మిక గ్రంథపారాయణ మున్నగునవి ప్రారంభించును. భక్తులు సర్వదా భగవంతుని "ఓ భగవానుడా! మేము నిన్నెల్లప్పుడు జ్ఞప్తి యుంచుకొను నట్టుల నెల్లప్పుడు మాకు బాధల నిమ్ము." అని ప్రార్థింతురు. కుంతీదేవి శ్రీకృష్ణుని "హే ప్రభూ! నామనస్సు నీపాదపద్మములపై సర్వదా లగ్న మగునట్టుల నాకనవరతము దౌర్భాగ్య (దారిద్ర్య) మొండ నిమ్మ" ని ప్రార్థించెను. దారిద్ర్యము సహనశక్తిని, నిచ్ఛా బలమును, పెంపొందించును. దారిద్ర్యము దాతృత్వ హృద యమును కల్పించి భగవంతుని నెడ భక్తిని ప్రేరేపించును. దారిద్ర్యము మారువేషమున నొక భగవదాశీర్వాద మే. కావున నీవు దురదృష్ట (దారిద్ర్య) పరిస్థితులలోనున్నప్పుడు, భయపడకుము. దారిద్ర్యము దానియొక్క స్వకీయమైన సుగుణముల కల్గియున్నది. జీవితపు దురదృష్ట (ప్రతికూల) స్థితులనుండి యధికారమునకును, హోదాకును, ప్రజలు వేచి యుండిరి. దురదృష్టము మానవుని గట్టిగ కష్టపడి పని చేయు నట్టులొనర్చును. మద్రాసు నందలి యున్నత న్యాయ స్థానపు ప్రధాన న్యాయాధిపతియగు స్వర్గీయ సర్. టి. ముత్తు స్వామి అయ్యరుగారు దురదృష్ట పరిస్థితులలో నుండి యుం డిరి. ఆయన రాత్రిపూట పురపాలక సంఘ వీధి లాంతరు క్రింద చదువు చుండెడివారు. ఇంగ్లాండు దేశపు చాలమంది ప్రధానమంత్రులు జీవితపు దౌర్భాగ్యపు స్థితులనుండి పైకి

లేచిరి. దౌర్భాగ్య పరిస్థితులలో సమస్త మతబోధకులు, (Prophets) మునులు, ఫకీరులు, భక్తులు, పూర్వకాలపు యోగులు, నెట్టముగ కష్టపడ వలసివచ్చెను. శంకరులు, జ్ఞానదేవులు, రామకృష్ణుడు, తుకారాముడు, నందఱును దౌర్భాగ్య పరిస్థితులలో నుంచబడిరి. వారందఱును దౌర్భాగ్యము (దురదృష్టము) చే నున్నతముగ ప్రయోజన మొందిరి. వారి శేషాని భోగపూరితమగు పరిస్థితులలో నుంచ బడినచో వారెన్నడును ఘనతను, వైభవోపేతమగు నాధ్యాత్మికపు టౌన్నత్యముల నెన్నడును సంపాదించి యుండెడి. వారు కారు.

భగవంతుడు తన దర్శనమిచ్చుటకు ముందు తన భక్తులను తీవ్రమగు పరీక్షలకు, కఠోరమగు సోదా (trial) లకు బెట్టును. తులసీదాసు, రామదాసు, సూరదాసు, నందఱును వివిధ రీతులగు పరీక్షలకు లోబడిరి. భగవంతుడు భక్తుని పరీక్షించుచో యదే సమయముననే నా జగత్ప్రభువు వాని కమితమగు నాంతర్యబలమును, సహనశక్తిని, నాధ్యాత్మిక క్షమయునుగూడ ప్రసాదించును. రాజకుమారుడగు సురేంద్ర నాథుడు నాతో "స్వామిజీ, త్యాగము (సన్న్యాసము) లో నేనేమియు శ్రేయస్సును చూచుటలేదు. సమస్త సాధువులు, సన్న్యాసులు, మహాత్ములు కూడ రోగములతో బాధపడుదు ర"ని చెప్పెను.

నేను "ప్రియమగు రాజపుత్రుడా! నీవు యువకుడవు. సాధువులు సంపూర్తిగ నుదాసీనులుగ నుందురు. నీవు వారి యాంతరంగిక స్థితిని గ్రహింపజాలవు. వారు తమ దేహములతో తాదాత్మ్య మొందించుకొనరు. వారు పైకి యేడువ

వచ్చును. కాని, వారి జ్ఞానస్థితి విచ్ఛిన్నము కాదు. వారు తమ బ్రహ్మనిష్ఠయందు దృఢముగ నుందురు. వారికి బాధ లెంత మాత్రమును లేవు. ప్రక్క నిలుచుండువారు (ప్రేక్షకులు) మూఢముగ వారు బాధ ననుభవించుచున్నారల నూహింప వచ్చును. వారి మనస్సులు భగవంతుడు లేక పరబ్రహ్మము నందు స్థిరపరుపబడునవి. వారియొక్క దృఢనిశ్చితాభిప్రాయ మేమన దేహమే భూతము, వర్తమానము లేక భవిష్యత్తు నందు లేదనియు తాము సర్వవ్యాపియైన నాత్మ లేక శుద్ధ చైతన్యమేననియు నైయున్నది. స్వామి రామకృష్ణపరమహంస గొంతులో కొరుకుపుండు (Cancer) కలిగి యుండెను. వాని మనస్సెల్లప్పుడు కాళీమాతపై స్థిరముగ లగ్నమైయుండుటవ నాతడే బాధను నెన్నడు ననుభవించి యుండలేదు. తన దేహమునుగూర్చి తలచుటకైనను నాతనికి వ్యవధి లేకుండెను. త్యాగి, సాధువు లేక సన్న్యాసి ప్రాపంచిక మానవునికి పరి పూర్ణముగ తెలియనట్టి తన యాంతరంగిక శాంతి, సంతో షము, దివ్యానందములు కలిగియుండును. నీవు వారికి రాజ్యము ధనము, మున్నగువాని నిచ్చియుండినను వారు వాటిని నిర్దయగ తృణీకరింతురు. వారి కండ్లముందట ధనసంపత్తికి విలువ లేదు. వారు వాటియొక్క నిష్ప్రయోజక స్వభావము నెరుగుదురు. నా ప్రియమగు రాజకుమారా! సన్న్యాసియొక్క సుఖజీవన మును గూర్చి నీకు వాస్తవమైన యభిప్రాయము లేదు. నీ హృదయములో నాకింత భక్తిజాడ యున్నప్పటికిని నీ వింకను ప్రాపంచిక చిత్తుడవ"ని బదులు పలికితిని.

రాజ పుత్త్రికగు సురేంద్రనాథుడు "స్వామీజీ! మిమ్ముల చాల నధికముగ నమస్కరించుచున్నాను. నేనిప్పుడు

మీయొక్క నుద్దేశ్యమును బాగుగ గ్రహించితిని. విషయ మిప్పుడు సంపూర్తిగ స్పష్టమయినది. నేను నిజముగ విచా రించుచున్నాను. నేను సురభిప్రాయము కలిగియుంటి" న నెను.

రాజకుమారుని వలె సురేంద్రనాథుడా! ఇరువురు భక్తులయొక్క నీస్వల్పగాథ నిప్పుడు సరిగవినుము. రూప, సనాతనులు రాజపదవుల ననుభవించుచున్నప్పటికిని, గౌరాంగ ప్రభుని యాజ్ఞపైని తమరాజ్యమువిడిచి తమ కన్వేషింపకుండ వచ్చిన (యదృచ్ఛాలాభ సంతుష్టి) నాహారముపై నాధార పడుచు తమ మిగిలిన దినములు చెట్లక్రింద గడపిరి. జనులు సహింపరానివని తలచునట్టి సమస్త బాధలను వారుపొంది యుండిరి, అయినప్పటికినివారు, తమ స్వకీయమగు ఋజువు (సాక్ష్యము) ప్రకారము, రాజభవనములలో నివసించినప్పటి కంటె చెట్లక్రిందనుండినప్పుడే నధికతరమగు సౌఖ్యముగల్గి యుండిరి. ప్రాపంచికమనుజులెరుగనట్టి స్వర్గీయ సంతోషములు (ఆనందములు) భక్తుడు కల్గియుండును. "సురేంద్రనాథుడు" "స్వామీజీ ప్రస్తుత విషయమున అమిత ప్రకాశము కలుగ జేసితిరి. నాసందేహము లిప్పుడు మాయమైనవి. నేను సత్య ముగ కృతజ్ఞుడన" నెను.

## సంపుటీకరణ (సమన్వయ) పద్ధతి

నామదేవుడు, ఏకనాథుడు, రామదాసు, తులసీ దాసు, తుకారాముడు, మీరా, మధుసూదనస్వామియును, భగవంతుడు వారికి దర్శనమిచ్చినట్టి యొక కొద్దిధన్యాత్ములు. ఈ భక్తులుయోగభ్రష్టులైయుండిరి. (యోగమునుండి పతన

నైరి.) వారు ప్రపంచములోనికి యాధ్యాత్మిక సంస్కారముల యొక్క గొప్ప ధనసంపత్తితో వచ్చియుండిరి. హృదయ పూర్వకభక్తితో వారు భగవంతుని చాలజన్మలలో నుపాసించి యుండిరి. వారు తమయంత్యజన్మ లేక నవతార పరిగ్రహణ మున నధికమగు సాధనచేయలేదు, భక్తియందలి పూర్వసంస్కారముల బలముమూలమున వారిలో భక్తిసహజమును స్వతస్సిద్ధమైనదియు నైయుండెను. భక్తిని శీఘ్రముగ పెంపొందించుటకు సామాన్యజనులు తీవ్రమగు, ప్రత్యేకోపాయములను, ప్రత్యేకసాధనలను నవలంభింపవలెను, ప్రాచీనపు, రాతి, భక్తి హీనపుహృదయమున క్రొత్తనెఱియలు (Grooves) క్రొత్త మార్గములు, క్రొత్తత్రోవలు చెక్కవలయును. భక్తిని గరిష్ట స్థితికి వృద్ధిపఱచుటకు వివిధపద్ధతులు మైత్రిగ (ననువుగ) సంపుటీకరణ (సంయోగ) మొనర్పబడవలెను. ఒకపద్ధతి భక్తిని రగుల్కొల్పుటకు తప్పినచో నీ వితరపద్ధతులను గూడ నాశ్రయింపవలసియుండును. వైద్యుడెటుల శరీరమండలమును పాదరసముచే వివిధరూపములుగా వేర్వేఱు త్రోవలుగుండా నెటుల, పంపునో అనగా పాదరసమలాము (Ointment) ను చర్మములోనికి రుద్దుటవలనను, చర్మములోనికిచ్చు సూదిపోటు (Injection) పద్ధతివలనను, నరముల (Veins) గుండా నరముల యాంతర్యపు (Intravenous)పద్ధతివలనను, నోటిగుండానౌషధ మిశ్రమముల రూపమున వక్త్రపద్ధతివలనను, ముంచెత్తునో నాలాగుననే నీవుకూడ నీహృదయమును, ప్రార్థన, జపము, కీర్తన, బక్తులసేవ, దానధర్మము, స్వాధ్యాయము, సద్గుణ సంపత్తి, తపస్సు, సమాధి, మున్నగు వానిచేత భక్తి ముంచెత్తవలయును.

ప్రాణాయామము మనస్సునుస్థిరపరిచి మనోవిక్షేపము (చంచలత)ను తొలగించును. కాన భక్తిని వృద్ధిపొందించుట కదియొకసహకారి. వేటిమూలమున, వృత్తులు లేక మనో వికారము లణచిపెట్టబడి పరబ్రహ్మపు సాన్నిధ్యము ననుభ వించుటకు మనస్సును తగినదానిగ నొనర్చునో, అట్టిసమస్త భౌతిక భౌతికాతీతవస్తువులన్నియు యోగమందిమడ్చబడి యున్నవి. నీటిలోని సూర్యునియొక్క ప్రతిబింబమును, సరస్సు నందలి నీటిలో నలలున్నప్పుడు. నీరు కలతచెందిన స్థితియందు న్నప్పుడు చూడజాలనో నటులనే మనోసరస్సునందు అలజడి నున్నప్పుడు నీవు స్వయంప్రకాశమగు భగవంతుని చూడజాలవు. మనస్సును శాంతింపచేయుము. బుద్బుద భావములను నిలుపుదలచేయుము. మనోభావముల నిశ్శబ్ద మొనర్పుము. నీవు భగవంతుని ముఖాముఖిగ చూడగలవు. యోగము ఉపాసన లేక ఆరాధన యందొక సహకారి.

## చతుర్థాధ్యాయము - సంకీర్తనము

### సం కీ ర్త న మ న నే మి ?

భగవంతునియొక్క స్వరూపమేసంకీర్తనము. ధ్వనియే సంకీర్తనము. వేదములయొక్కసారమే సంకీర్తనము. నాదము (ధ్వని)నుండి చతుర్వేదములు నుద్భవించినవి. నాలుగు విధ ములగు ధ్వను లేవనగా! వైఖరి, (వక్త్రిసంబంధముగలది) మధ్యమ (గొంతునుండి) పశ్యంతి (హృదయమునుండి)నింకను పర (నాభినుండి)యు కలవు. నాభినుండి శబ్దముత్పన్నమగును. వేదములుకూడ నాభినుండియే నుద్భవించును. సంకీర్తనమును,

వేదములును, నొకేనొక సమానమైన మూలస్థానమునుండియే పుట్టినవి.

జనులుకలిసి కూర్చుండి భగవన్నామమును మైత్రితోను, ఐక్యతతోను శుద్ధ లేక దివ్యభావముతోను, గానమొనర్చుట. ఇదియే సంకీర్తనము. "సం" అనుపదము "కీర్తనము" నకు ప్రయోగమించు (ముందుజను) నటుల వాద్యధ్వనుల మ్రోతచే సంకీర్తనమనుసరింపబడును. సంకీర్తనమొక (సరియైనట్టి) ఖచ్చితమైనశాస్త్రము. అది మనస్సును త్వరగా దేవశక్తి భావమును గ్రహింపగలుగునంతటిస్థాయికి నతి త్వరగాజేర్చును.

"నామమును" "నామి" యును వేఱువేఱుపదాలనివి. నామము నామికంటెను ఘనతరమైనది. ప్రపంచానుభవములో సహితము మనుష్యుడు చచ్చును. కానివాని పేరు (నామము) చాలకాలమువఱకు జ్ఞాపియుంచుకొనబడును. నేటికినికూడ కాళిదాసు, వాల్మీకి, తులసీదాసు, మున్నగువారు స్మరింపబడుదురు. నామము చైతన్యముతప్ప మఱేమియు కాదు. భగవన్నామమును భావము, ప్రేమ లేక అనురాగ దివ్యానుభవముతోడ కీర్తించుటయే సంకీర్తనము.

సంకీర్తనము జరుపబడునప్పుడు పరిపూర్ణమైనమైత్రియైక్యతలును, నొకేస్వరము, నొకే తాళమును నుండవలయును. అప్పుడుమాత్రమే నాహ్లాదము (ఆనందము) మనోన్నతియును నుండును. మండలుల, సభల, సభ్యులందఱును తమ సత్వరాభివృద్ధికై నియమముల విధిగ పాటింపవలెను. వారిధమము రెండుమాలల (2 × 103 = 216)తే మంత్రముయొక్క జపమునైనను చేయుచు, నేకాదశినాడుపవాసము నవలంబించుచు, ప్రతిదినమును రెండుగంటలవరకు మౌనము లేక నిశ్శబ్దదీక్ష

వహింపుము, సాత్త్వికమితాహారమును గొనుచు, లైంగిక సంభోగమంతయు చాలమోతాదు (మితము) నొనర్చుచు, నను దినమును భగవద్గీతయందొక యధ్యాయమును పారాయణ మొనర్చవలెను. వారు బ్రహ్మముహూర్తమున నుదయము నాల్గుగంటలకు లేచి, జప, ధ్యానముల నొనర్చవలెను. వారు తమ ఆదాయము(రాబడి)లో నొక పదియవభాగము (1/10) ను ధర్మముగా వినియోగింపవలెను. వారేతీరునైనప్పటికిని మాంసమును, మత్తుపదార్థమును, విడిచిపెట్టవలెను. వారు సత్యమునుపలుకవలయును. వారితరుల మనోభావములను నొప్పింప కూడదు. వారు నిందనువర్జింపవలెను. (యితరులదూషించుట) ఇది చిత్తశుద్ధి శీఘ్రముగ కలుగజేయును. వివాహము, వింకను ఇతరస్వల్ప శుభకార్యములలో సంకీర్తనము జరుపబడవలెను. ఇది లాహోరు, మధుర (Muthra) మీరట్, హర్డోయి, ఇంకా ఇతర ప్రదేశములలో నాచరింపబడుచున్నది. అట్టిసమయముల నైతికవిరోధములు (బూతు) వాటలను పాడునట్టి ప్రస్తుతపు ఆచారములు సంపూర్తిగ వర్జింపబడవలెను.

## సంకీర్తనశాస్త్రము

భగవంతు డొక విచిత్రము. ప్రపంచమొక విచిత్రము. సంకీర్తన మెటుల మానవ స్వభావమును దివ్యస్వభావముగ పరివర్తించునది. ప్రాచీన దుష్టసంస్కారముల నది యెట్లు సంస్కరించునది, మనోవస్తువు నెటులది మార్చునది, యసుర స్వభావమును పరిశుద్ధ సత్త్వస్వభావముగ నది యెటుల త్రిప్పునది లేక పరిమార్చునది, భక్తుని భగవంతునితో ముఖాముఖిగ నది యెటుల తెచ్చునదియు కూడ నొక విచిత్రమే. శాస్త్ర

మును, తర్కబుద్ధియు. సంకీర్తనము పనిచేయు విధానమును విశదపరుపజాలదు. తర్కబుద్ధి పరిపూర్ణము కానట్టి యొక పనిముట్టు. దుర్బలబుద్ధిగల మానవుడు దృఢతరబుద్ధిగల మానవునిచే నోడింపబడవచ్చును. తర్కబుద్ధి చాల జీవిత సమస్యలను స్పష్టీకరింప జాలదు. ఆంతర్య మనోజ్ఞానము (Intuition) తర్కబుద్ధి నతిక్రమించును. కాని యది విచారణ (తర్క) బుద్ధిని కాదనజాలదు. ప్రతిమాట (పదము) లోను గొప్ప శక్తి కలదు. "వేడిపకోడీ" యను పదముయొక్క కేవలపు టుచ్చారింపు నోటిలోనికి లాలాజలము (Saliva) ను తెచ్చును. మానవుడు తన యాహారమును గొనునపుడు నీవు కాని యమేధ్య (యశుద్ధ) మను మాట యనినచో నాతడు తక్షణము వాంతి చేయును. మామూలు మాటలతోడ నట్టి స్థితి యైనప్పుడు భగవన్నామములనట్లు నేమి చెప్పవలయును! భగవంతునియొక్క ప్రతినామమును వివిధములగు దివ్యశక్తుల తోను, నమృతముతోడను నిండియున్నది.

ఒక యధిక్షేపకుడు "నేను పటికిబెల్లము, పటికిబెల్ల మ"ని చెప్పుచో నేను దానిని పొందగలనా? నేను కేవలము "రామ, రామ" యనుచో భగవంతుని నే నెటుల చూడగల న"ని యనును. పటికిబెల్లము విషయములో పటికిబెల్లము బాహ్యముగ నున్నది. కాని భగవంతుడు వాస్తవికముగ నీ హృదయ గుహయందే వసించుచున్నాడు. ఆతడు నీ సమీప మున నున్నాడు. రామ, రామ యని పునరుచ్చరించుటచే మనస్సేకాగ్రమగును. అది నిశ్శబ్దము కఱిగిపోవును. పైగ నీవు హృదయములో భగవంతుని దర్శన మొందుదువు. భగవం తుని యంతటివలెనే భగవన్నామమును నంత యుత్తమమైనది

భగవంతుని దివ్యచైతన్యమైనటులనే వాని దివ్యనామముకూడ నై యున్నవి. ఇతర పదార్థములు లేక నితరపదార్థముల పేర్లు యెంత నది యటులకాదు.

ఒక మనుష్యుడు గాఢ నిద్రయందుండెను. ప్రాణములు వానిలో, వానితో నున్నవి. నీవు వానిని "ప్రాణమా, ప్రాణమా" యని సంబోధించుచో వాడు నిన్ను వినడు. సరిగ వానిని రామా లేక శ్యామా యని వాని పేరున పిలువుము. అతడు నిన్నువిని తన నిద్రనుండి లేచును. నామము యొక్క మహిమ యట్టిది. భగవన్నామము మూర్తీభవింప చేయబడిన చైతన్యము తప్ప మరేమియుకాదు.

సమస్త వస్తువుల కంటెను (పృథ్వి) గొప్పది. భూమి యాదిశేషునిపై నిలిచియుండును. కాన, నాదిశేషుడు భూమి కంటెను గొప్పవాడు. సర్పము జగత్ప్రభుడగు శివుని హస్తాభరణము. కాన, శివుడు సర్పమైన నాదిశేషుని కంటె గొప్పవాడు. పరమశివుడు శ్రీరామునిపై ధ్యానించును. గాన రాముడు పరమశివుని కంటె గొప్పవాడు. రామునియొక్క నామము నేటి కింకను స్మరింప బడుచుండుటచే రామ నామము స్వయముగ రాముని కంటెను గొప్పది. రాజసిక మనోద్రేకము తోడను, దుష్టవాంఛలతోడను నిండినట్టి మనస్సుపై భగవన్నామ సంకీర్తనము నత్యద్భుతమగు ప్రభావము కలదు. అది యెన్నరాని ప్రయోజనముల గొని తెచ్చును. దీని గూర్చి యే సందేహమును లేదు.

భగవంతుని యొక్క తొలి వ్యక్తీకరణ (Manifestation) మాకాశము లేక శబ్దము. శబ్ద మాకాశము యొక్క గుణము (స్వభావము) శబ్దములన, స్పందనములు, (చలన

ములు (Vibrations) అవి విశిష్ట (Definite) రూపముల నేర్పఱచును. ప్రతి శబ్దమును స్వకీయప్రపంచములో నొక రూపము నుత్పత్తి చేయును. మఱియు శబ్దపు కలయికలు గజిబిజి (Complicated) యాకారముల సృజించును. వైజ్ఞానిక శాస్త్ర గ్రంథములు కొన్ని వాద్యపు పనిముట్ల (Instruments) చే కలుగ చేయబడు స్వరము (Notes) ఇసుకతిన్నె (Bed of sand) పై విశిష్టమగు రేఖాగణిత (Geometrical) చిత్తరువుల (Figures) ను జాడపఱచు (గుర్తించు) నని చూపునట్టి కొన్ని ప్రయోగముల వర్ణించును. క్రమ బద్ధపు టింపగు (Rythmical) స్పందనములు సక్రమమగు రేఖాగణిత చిత్తరువుల లేవదీయునని యీవిధముగ ఋజువు చేయబడినది.

పుస్తకములు విస్పష్టముగ వర్ణించునట్టి వివిధ సంగీత స్వరములు, (Tunes) రాగములు, రాగిణులును, యొక్కొక్కటి ప్రత్యేకరూపమును గలిగియున్నటుల హిందూ సంగీత శాస్త్రములు మనకు చెప్పును. ఉదాహరణకు మేఘరాగ మేనుగుపై నాసీనుడయ్యెడి శివుఁడగుమూర్తిని వహించునని చెప్పబడును. వసంతరాగము పుష్పములచే నలంకరింపబడిన మనోహరమగు యువకునిగా వర్ణింపబడినది. ఇదంతయు ప్రత్యేకరాగము, లేక రాగిణి, సరిగ తూచా తప్పక పాడబడినప్పుడు ప్రత్యేకరూపమును సృజించు వాయుమయ ఆకాశ సంబంధ శబ్దతరంగముల (Vibrations) నుత్పత్తిచేయునని యర్థమగును. (Voice figures కంఠస్వర చిత్తరువుల) యొక్క ప్రజ్ఞావంత గ్రంథకర్త్రియైన వాట్సుహ్యూగ్సు సతీమణి (Mrs. watts Hughes) చే కొనసాగింపబడిన ప్రయోగములనుండి ఈ యభిప్రాయ మిటీవల దృఢీకరణల (Corroborations) నొందినది.

చాల సంవత్సరముల యోర్పుతో గూడిన పరిశ్రమల ఫలితముగ తానవతరించిన (వెలసిన) సుందరమగు వైజ్ఞానిక ప్రబోధముల (ఆవిష్కరణల - (Discoveries) ఋజువొనర్చు టకై లెయిటన్ ప్రభుకార్యాగారము (Studio)న నెంపుడు జనమెదుట హ్యూగ్స్ సతీమణి యుదాహరణపూర్వకో (Illustrated) పన్యాసమొసగెను. హ్యూ గ్స్ స తీ మ ణి (Mrs. Hughes) యొక గొట్టము, గ్రాహకము వంగెడిపొర (Membrane) లను కలిగియుండు "ఐడోఫోన్ (Eidophone)" యను సామాన్య వాద్యపు పనిముట్టున పాడగా నాపె సున్నిత మైనట్టియు, చలించునట్టియు, నూతనపనిముట్టు (medium) గుండా బయలుపఱుపబడినవిధమున ప్రతిస్వరమును విశిష్టమగు స్థిరమగు నాకృతి నొందుటను కనుగొనెను. తన యుపన్యాస ప్రారంభమున నాపె చిన్ని విత్తుల (seeds)వంగు పొరపైనుంచగా నాపె ధ్వనియొనర్చిన (నూదిన) స్వరములచే కలుగచేయబడిన వాయుతరంగములు (Vibrations) వాటిని ప్రత్యేక రేఖాగణిత సంబంధమో స్తరులుగా గెంతింపించెను. తరువాత నాపె వివిధ రకములగు పొడుల (dusts)ను ముఖ్యముగ ననువగునటుల కనుగొనబడిన నొకవిధమగు సన్ననిగుండను (Lycopodium) నుపయోగించెను. వార్తాప్రసారకుడొకడు (Repoter) స్వర ముల యాకృతులవర్ణించుచు వాటినిగూర్చి యెన్నదగిన రేఖా గణిత, దృశ్య, ఛాయావిష్కరణలు (Revelations)గా చెప్పను ఆకర్షణీయమగు క్రమపద్ధతితో గూడిన చిత్తరువులసంపత్తిలో నక్షత్రములు, చుట్టలు, పాములు, చక్రములలోని చుట్టలు నూహాకల్లోలము - తోలుత నేవి చూపబడినవన నిట్టివియె. ఒకానొకప్పుడు హ్యూగ్స్ సతీమణి యొక స్వరమును పాడు

చుండగా నొకరీతిపుష్పము (Daisy)కనబడి మాయమయ్యెను. అంతనాపె "నేను తుదిని విజయమొందుటకు పూర్వము వార ములతరబడి దానినె తిరిగి పాడుటకుయత్నించితిని" నెను. ఒక రీతిపుష్పమగు (daisy) ప్రత్యేకస్వరపు ఖచ్చితమగు స్వర సవ రింపుల నామె ఇప్పుడు తెలుసుకొనెను. నింకను నారోహణావ రోహణల బుజ్జగింపు, పరిమాప్పులయొక్క విచిత్రపద్ధతిచే నడి స్థిరముగ, విశిష్టముగ నొనర్పబడెను. కొన్ని యనుసరించు వరు సలుతోడి పూల రేకుల, కొన్ని తేలికగాచూడబడిన పూల రేకుల గలపుష్పముల (daisies) వరుసక్రమమును శ్రోతకజన మానంద పరవశమైచూచిన నసంతరమితరస్వరములనువారుచూపబడిరి. యంత నవి యధిక మనోహరమగు పుష్పముల (Pandies)యి యుండెను. "ఎట్టి యాశ్చర్యము! ఎట్టి సుందరము! యను నవి గతించిన లెయిటన్ప్రభువు కార్యాగారములో (Studio) వినదగిన కేకలయియుండెను. నింకను తెఱపై నమోఘమగు నాకృతులను నమోఘమగు నాకృతి వెంబడించుచుండెను. పుష్పములు సముద్రరాక్షసులు (Sea-monsters) నుబ్బినవర్ణ లనుగల పాముచుట్టయాకారములతోడను, వెలుతురు,ఛాయ, వివరములతోడను, నిండి వెంబడింపబడి దృశ్యమును మైళ్ళ కొలది పెంచుచుండెను. ఈ స్వరములు వచ్చినతరువాత చెట్లును, పడుచున్న పండ్లుగలచెట్లును, శిలలుగల ముందు స్థలముతోకూడిన చెట్లును, వెనకప్రక్క సముద్రముతోకూడిన చెట్లును, నుండియుండెను. "ఏమి! జపానుదేశము దర్శనీయ మగు భూప్రదేశము (landscape)ల వలె సరిగానున్నవ"ని శ్రోతబృందమునందలి జను లఱచిరి.

ఫ్రాంసు దేశములో నున్నప్పుడు బ్రహ్మచారిణియగు (పవిత్రమగు) మేరీ (Virgin Mary) గూర్చిన స్తోత్రమందు గౌరవనీయమగు ఫిన్‌లాంగుసతి (Madame Finlang) యొక్క పాట 'O Eve-Marium' యనునది తన మదిలో నుంచుకొన బడిన బిడ్డనగు జీసస్ (యేసుక్రీస్తు)తో కూడిన మేరీ యొక్క రూపమును దెచ్చెను. మరియు నింకను కాశీకిచెంది ఫ్రాంసు దేశములో చదువుచున్న బంగాళీవిద్యార్థి చే భైరవునికిచెందిన స్తుతియొక్క పాట భైరవుని, వాని వాహనమగు కుక్కతోడి భైరవునియొక్క చిత్రపు నిర్మాణమునకు లేవదీసెను.

ఈవిధముగ భగవన్నామమును పునరావృత్తి నొనర్చు గానము నీ వెవరి నారాధింపకోరుదువో నా దేవతలయొక్క స్వరూపములను లేక భగవంతునియొక్క ప్రత్యేకావతారములను, (Manifestations) క్రమ క్రమముగ సృజించును. మఱియు నివి కీర్తనకారు డుపాసించువానిలో కేంద్రమునుండి ప్రసరించి చొచ్చుకొనిపోవు పరమాత్మయొక్క ననుగుణ్య ప్రభావముపై ధారణొనర్చుటకొక బిందువు (focus గా నుపకరించును.

ఒకడు ధ్యానస్థితిని ప్రవేశించునప్పు డాంతర్యవృత్తి ప్రవాహమె యెక్కువగ వృద్ధిచెందును. ధ్యానమందు గాఢతరముగ పోవుకొలదిని ఫలిత మెన్నతరముగ నుండును. ఊర్ధ్వముగ నొనర్చు మనోధారణ తలయొక్క నుపరిభాగముగుండా నీ శక్తియొక్క యుద్ధృతము (Rush)ను పంపును. మఱియు ప్రతిబింబు మృదువగు చుంబకత్వము (magnetism) యొక్క సన్నసివర్షముగ వచ్చును. అధోముఖశక్తిచే లేచునట్టి మనోభావము శరీరముగుండ విచిత్రమగు ప్రకాశమును బంపును.

పైగ నొకడు సున్నితరకపు విద్యుచ్ఛక్తిలో స్నాన మొనర్ప బడినటుల ననుభవ మొందును.

పై ప్రయోగములు దిగువ నుడువబడిన సత్యముల రూఢిపరచును.

1. ధ్వను లాకృతి (ఆకారము) కలుగచేయును.

2. ప్రత్యేకస్వరములు ప్రత్యేకరూపము (ఆకారము)ల లేవ నెత్తును.

3. నీవొక ప్రత్యేక రూపమును పునరుత్పత్తింపదలచుచో నీవొక ప్రత్యేక స్వరమును ప్రత్యేక ధ్వని యూర్ధ్వత్వము (Pitch) లో గ్రహింపవలెను.

4. ఆ యుద్దేశమునకు నితరస్వరము, నితర ధ్వని యూర్ధ్వత్వము, నదే సమయము నైక్యమైన స్వరోచ్చారణ సహితము పనికిరాదు. ఉదాహరణకు "అగ్నిమీళే పురోహితమ్" "వహ్నిమీళే పురోహితమ్" సరిపడును. కాని "యిళ్లే అగ్నిం పురోహితమ్" కాదు. అటులొనర్చుటలో మంత్ర ప్రభావము పోయినది. కాన నీవు మంత్రమును క్రమ మార్చి నర్చుట లేక భాషాంతరీకరించుటను చేయజాలవు. నీవు దాని నొనర్చుచో నది మంత్రమగుట మానును. మంత్రము స్వరములోగాని లేక వర్ణమునగాని దోషముండుచో నది తప్పుగ త్రిప్పబడును. నింకను చాల నుద్దేశింపబడిన దానికి సరిగ ప్రతికూలమగునట్టి ఫలితమును కలుగచేయును. కాని రామనామము లేక నేదైన భగవన్నామ మనగా శివ, కృష్ణ లేక హరితో నట్టి విషయముగాదు. ఈ నామముల నేలాగున నైన, ప్రతి విధమున గాన మొనర్పవచ్చును. "ఉల్టానామా జపాత్ జగా

జనా! వాల్మీకి భాయే బ్రాహ్మణా సమానా" వాల్మీకిముని (పూర్వమందు దుండగీడు రత్నాకరుడని తెలియబడినట్టి) రామ, రామకగాను తలక్రిందు నామమైన మరా, మరా యని నుచ్చరించుటచే సహితము బ్రహ్మము (జగత్ప్రభువు)తో నైక్యమయ్యెనని జగమంతయు నెఱుగును. "రామనామజపే రహోరిక్షు భజో యూఖజ్. ఉల్టాపుల్టాఊజ్పేజ సాధ ర్ణీకోబిహో" కాన భగవంతునియొక్క నామమును జపింపుము. దానిని ప్రేమచే (మనోసుభవము, భావముతోడను) లేక కోపముచే నుచ్చరింపుము. విత్తనములు సక్రమముగ జల్లినను లేక పొలములలో విసరివేసినను నేవిధముగ చేయుటకు వ్యవసాయదారుడిష్టపడినను, మొలకెత్తిపెరిగి తీరవలయురీతిని నది దానియొక్క సరియగు ఫలితమును, కలిగియుండును.

## సంకీర్తనయొక్క ప్రయోజనములు

సంకీర్తన చేయునతడు దేహమును, ప్రపంచమును, మఱచును. సంకీర్తనము దేహాధ్యాస (దేహముతో సమైక్యత)ను తొలగించును. అది యతీత ప్రత్యక్ష దృష్టిజ్ఞానమును దెచ్చును. తుకారాముడొక వ్యవసాయదారుడు. ఆతడు తనపేరును సహితము సంతకముచేయలేడు. చేతులలో తాళములు (Cymbals) తో శ్రీకృష్ణనామమైన "విట్టల, విట్టల" యొక్క సంకీర్తనము నాతడెల్లప్పుడు చేయుచుండెను. ఆతడు భౌతిక రూపములో శ్రీకృష్ణుని దర్శనమునొందెను. సంకీర్తనముచే వానియొక్క నాంతర్యదృష్టి (జ్ఞానచక్షువు) తెఱువబడెను. వానియొక్క నావేశపూరితమొనవ్చు నభంగములు బొం. బాయి విశ్వవిద్యాలయపు ఎమ్ ఏ విద్యార్థుల పాఠ్యగ్రంథ

ములైయున్నవి. ఎన్నుటనుండి నిరక్షరకుక్షియు, విద్యావిహీనుడగు తుకారాముడు తన జ్ఞానమును గ్రహించెను? సంకీర్తన ద్వారా జ్ఞానమూలము నాతడు పట్టెను. గాఢమగు సంకీర్తనముచే తేటపడిన భావసమాధిగుండా నాతడు భగవదాధారము (Divine Source) లోనికి వచ్చెను. ఇది భగవంతుడు జ్ఞానియు, భగవంతునియొక్క స్వరూపము జ్ఞానమనియు, జ్ఞానమొందుటకు సంకీర్తనమున కద్భుతప్రభావము కలదనియు, స్పష్టముగ ఋజువుచేయదా ?

ఈ కలియుగములో సంకీర్తనము భగవంతుని దర్శనమును లేక దివ్యచైతన్యప్రాప్తిని యిచ్చును. సంకీర్తనము ప్రేమను పెంపొందించును. పరమాత్ముని చైతన్యమొందుటకు సంకీర్తనము మిక్కిలిసులభమైన, మిక్కిలినిశ్చయమైన, మిక్కిలిభద్రమైన, మిక్కిలి శీఘ్రమైన, మార్గము. మానసికానందముకొరకు ప్రారంభమున సంకీర్తనమొనర్చువారు కొంతకాలము తరువాత సంకీర్తనయొక్క పరిశుద్ధికారక ఫలితముల గ్రహింతురు. యింకను పిదపవారు తమంతటతాము భావము, శ్రద్ధలతోడ దానినొనర్తురు. భగవన్నామములో నొకవిచిత్రమగుశక్తిగలదు. మానవుడు రొట్టె (ఆహారము)పై మాత్రము జీవించలేడు. కాని యాతడు భగవన్నామముపై జీవింపగలడు.

భగవన్నామముల కీర్తించుట (గానమొనర్చుట)చే కలుగజేయబడు మైత్రియుత శబ్దతరంగములు (Vibrations) భక్తులకు తమ మనస్సుల ననాయాసముగ వశపరచుకొనుటకు సహాయపడును. వారి మనస్సులపై నవి యానుకూల్యప్రభావమును కలుగచేయును. అది మనస్సును దాని పురాతన

స్రోతలు లేక నెఱియలు (grooves) నుండి యాధ్యాత్మిక ప్రకాశము, వైభవములయొక్క ఘనమగు నౌన్నత్యములకు లేవనెత్తును. ఒకడు హృదయాంతర్భాగమునుండి సంపూర్ణ మగు భావము ప్రేమలతోడ సంకీర్తన మొనర్చుచో వృక్షములు, పక్షులు, జంతువులు, సహితము గాఢముగ ప్రభావ మొందింపబడును. అవి యనుకూలముగ వర్తిల్లును. సంకీర్తనము యొక్క శక్తి వంతమగు ప్రభావ మట్టిది. సంకీర్తనమెచ్చట జరుపబడునో, నాస్థలమును ఋషులు, సిద్ధులు, దర్శింతురు. పందిరి గుడారము (pendal) చుట్టంతటను ప్రకాశవంతమగు దీపములను నీవు చూడగలవు. ఈ ప్రయోజన కారక ఫలితముల నదియెటుల తెచ్చునో, భక్తు నది భగవంతునితో నెటుల ముఖాముఖిగ దెచ్చునో నిప్పుడు విశదపరుప బడినది.

జీవాత్మ లేక వ్యక్త్యాత్మ (Individual) పరమాత్మ లేక వ్యక్త్యాతీతాత్మ (Supreme soul) తో నాదోపాసన ద్వారా క్రమోన్నత పద్ధతి లేదా నాధ్యాత్మిక నిచ్చెన యొక్క వివిధ మెట్ల యారోహణ (యెక్కుట) గుండా నేకమవగలదు. నాదము రెండు రకములు, యేవనగా స్థూలము (దట్టమగు లేక వ్యక్తమైన లేక ననాహతము) మఱియు సూక్ష్మము (సన్నని లేక నవ్యక్తమైన లేక ననాహతము) తొలుతటిది తరువాతిదానికి దారి చూపును. జీవాత్మ పరబ్రహ్మముతో నైక్యమొందగోరుచో లేక సత్యున్నతమగు నిర్వికల్పసమాధిని పొంద దలచుచో మానవ జీవిలోని యనలము లేక నగ్నితో ప్రాణముయొక్క సంయోగము లేక నైక్యత తప్పని సరిగ నవసరము. మూలాధారమందలి వహ్ని లేక నగ్ని "రా" బీజమునువ్యక్తపఱచును. "మ" బీజమును వ్యక్తపఱచు

మూర్ధము లేక బ్రహ్మరంధ్రమునందుండియుండెడు ప్రాణమును కలుసుకొనుటకై నది పైకెగబ్రాకును. దీనిచే జీవాత్మ నిర్భయత్వము, నమృతత్వము (మోక్షము) అనెడి యవతలియొడ్డునకు దాటి శాశ్వతసుఖము, పరమానందముల నొందునో నట్టి తారకబీజమే రామ యొక్క కూడిక. సూక్ష్మనాదమునకు నంత్యమున భగవత్సంసర్గమునకును సంకీర్తనమొక సులభమగు చేరుదల. (approach)

సూక్ష్మపదార్థము, పదార్థమూలముల సూక్ష్మతత్త్వములతో నంతఃకరణము చేయబడును. ననగా తన్మాత్రలంతఃకరణముగా కూడుటకు జనును. వాయుతన్మాత్రనుండి మనస్సు యేర్పఱుపబడును. జలతన్మాత్రనుండి చిత్తమొన గూర్పబడును. పృథ్వీ తన్మాత్రనుండి యహంకారము నిర్మింపబడును.

తత్త్వము సూక్ష్మతరమగుకొలదిని నది యధికమగు శక్తియుతమగున దగును. జలము భూమికన్న నెక్కువ శక్తియుతమైనది. యేలన నది భూమికంటె నెక్కువ సూక్ష్మమైనది. జలము భూమిని తొలగించును. అగ్ని జలముకంటె సూక్ష్మతరమైనది. అగ్ని సమస్త పదార్థమును నెండించును. వాయు వగ్నికంటె నెక్కువ మహిమవంతమైనది. యేలన నది యగ్నికంటె నెక్కువ సూక్ష్మమైనది. వాయు వగ్నిని నూదివేయును. (తరమి) వేయును. వాయువుయొక్క నుపరిస్థలము లేక నాకాశము వాయువుకంటె నెక్కువ సూక్ష్మమైనది. యేలన నది వాయువుకంటె సూక్ష్మతరమైనది. వాయు వాకాశమున విశ్రమించును. వాయువున కాకాశ మాధారము. ఆకాశము నుండి వాయు వుదయించినది. వాయువునుండి అగ్ని జనించి

నది. అగ్నినుండి జల ముద్భవించినది. జలమునుండి పృథివి (భూమి) పుట్టినది. విశ్వప్రళయకాలమందు భూమి నీటిలోనికి నెట్టబడును లేక గ్రహింపబడును. నీరు అగ్నిలోనికిని, అగ్ని వాయువులోనికిని వాయు వాకాశములోనికిని నొనర్పబడును

మనస్సేను విషయముల ననుభవించును. మానవుని పరమాత్మ లేక నతితాత్మనుండి వేరుపఱచునట్టి యడ్డంకు మనస్సే. అంతఃకరణముయొక్క శరీరమును కూడియుండు భూమి, నీరు, అగ్ని, వాయువు, నాకాశమనెడి నీయైదు సూక్ష్మ తత్త్వములును నాత్మరత్నము (Jewel) ను దోపిడిచేసిన నైదు గురుదొంగలు. ఆకాశము దొర్జన్యాధిపతి. నీ వాకాశమును వశపఱచుకొనుచో. దౌర్జన్యాధిపతిని నీ వణచగల్గుచో నితర నాల్గుతత్త్వములు లేక దొంగలు నీ స్వాధీనములోనికి వత్తురు. నీవీ యైదుతత్త్వములను లొంగదీసుకొనగల్గుచో నీవు మనస్సును చాల సులభముగ వశము చేసికొనగలవు. ఆకాశము యొక్క కార్యాచరణధర్మము శబ్దము. హరియొక్క నామమును మధురస్వనమున క్రమస్థాయీపద్ధతి(Rhythm)మైత్రితో నీవు కీర్తించగలుగుచో నీ వాకాశతత్త్వమును, దానినుండి యితరతత్త్వములను, మనస్సును, వశ మొనర్చుకొనగలవు. కాబట్టి సంకీర్తనము మనస్సును సులభముగ వశముచేసికొను టకును, దానినుండి భగవచ్చైతన్యమును బొందుటకును, సాధకునికి సాయపడును. శ్రీహరి యెవడేనియొకడు తన (పరమేశ్వరుని) నామమును గానమొనర్చునపు డత్యధికముగ సంతుష్టుడగును.

మధురమగు సంగీతము నరముల ప్రశాంతమొనర్చును అమెరికాలో వైద్యులు సంగీతముచే రోగముల కుదుర్తురు.

“తనలో సంగీతములేనట్టి, మధురస్వనముల యొప్పిదలచే చలింపబడని మానవుడు రాజద్రోహము, కుట, దోపిడులకు తగును. వాని జీవశక్తి చలనములు రాత్రివలె మందముగను, వాని యనురాగములు “ఎరెబస్ (Erebus)” వలె చీకటిగ నుండును. అట్టిమనుజుడు విశ్వసింపబడకుండుగాక. సంగీతమును గుర్తించు”మని షేక్స్పియరు చెప్పెను.

నిరంతర సంకీర్తనముచే మనస్సు పరిశుద్ధినొందును. అది యుత్తమమైన శుద్ధభావనలతో నిండును. అనుదిన సంకీర్తన ముత్తమసంస్కారముల సృష్టించును. ఉత్తమ, పవిత్రభావనల భావించుటలో తన్నుతాను శిక్షణొనర్చుకొను మానవునిమనస్సు యుత్తమ పవిత్రభావనల భావించుటకొక యభిలాషను పెంపొందించును. వాని శీలము నిరంతరవు ఉత్తమభావనలచే రూపొంది పరివర్తనమొందును. సంకీర్తన కాలమందు మనస్సు భగవంతుని విగ్రహము నూహించుచో మనోవస్తువు నిజముగ భగవంతుని విగ్రహముయొక్క నాకారములోనికి మారును. వస్తువుయొక్క చిహ్నము (ముద్ర) మనస్సులో విడువబడును. ఇది సంస్కారము. ఈకృత్యము చాలతఱచుగ పునరావృత్తినొనర్చుచో, సంస్కారము పునరావృత్తిచే బలమువహించి యొక మాములు లేక నలవాటు మనస్సులో నేర్పడును. భగవంతునిగూర్చిన భావనల వహించు వాడు నిరంతర భావనాధ్యానములచే తనంతటతాను వాస్తవముగ భగవంతునిగా మార్పొందును. వాని భావమును, మనోతీరును, పరిశుద్ధిచెంది, దివ్యత్వమొందును. ధ్యానము చేయువాడు (ధ్యాత) ధ్యానము చేయబడునది (ధ్యేయము) ఉపాసకుడు, ఉపాసింపబడునది (ఉపాస్యము) భావించువాడు,

భావింపబడునది (భావము)నొకటియై సమానమగును. ఇదియే సమాధి. ఇదియే సంకీర్తన లేక ఉపాసనయొక్క ఫలము.

నా ప్రియమిత్రులారా! అనుదినము సంకీర్తన మొనర్పుడు. దూరముగ నంతట సర్వత్ర సంకీర్తన భక్తిని వెదజల్లుడు. సంకీర్తనద్వారా విశ్వప్రేమను వృద్ధిపొందింపుడు. సర్వత్ర సంకీర్తనమండలులను స్థాపింపుడు. సంకీర్తన మొనర్చుటచే ప్రతి యింటిలోను పృథ్విపైన వైకుంఠమును దెండు. మీ యొక్క సచ్చిదానంద స్థితిని గ్రహింపుడు.

## సంకీర్తకులారా మేల్కొనుడు

ఈ కాలపు సంకీర్తన మండలులు లేక సమాజములు సంగీతసమితి (music club) ల రూపమును దాల్చినవి. సమాజకసభ్యులు మానసికోల్లాసము కొఱకుమాత్రమే సంకీర్తన మొనర్తురు. అందు దివ్యభావముగాని, లేక శుద్ధప్రేమగాని, లేదు. అచ్చట నామమునెడ రుచిగాని, లేక భగవన్నామ మహిమలో మనఃపూర్వక విశ్వాసముగాని లేదు.

సంకీర్తనకాలమున సంగీతముకాని, లేదా హార్మోనియము వాయింపుకాని, లేనప్పుడు సమాజికులా స్థలమును వెంటనే విడుతురు. హాజరు (ఉపస్థితమగుట) చాలబీదగ (దుర్బలముగ) నగును. చాలమంది సంకీర్తనము నాహ్లాదము (మనోరంజనము) కొఱకు లేదా శ్రోత్రనాదులు లేక శ్రోత్రేంద్రియముయొక్క నల్పసంతుష్టికొఱకభ్యసింతురు. కాననే సంకీర్తన ప్రచారమందు వాస్తవికాభివృద్ధిలేదు. కుక్కగొడుగు (mushroom) వలె సంకీర్తన సంఘములు జీవించి

చచ్చును. సంకీర్తనకారులెట్టి వాద్యపు (సంగీతపు) పనిముట్టులు లేకనే సంకీర్తనమొనర్పవలెను. హార్మోనియము లేక తబలా లేనప్పుడు సంకీర్తనకారులు కీర్తనమొనర్చుట కష్టముగ గ్రహింతురు. ఇది యొక తీవ్రమగు సనర్థకము లేక దుర్బలత. వాద్యపు పనిముట్లులేకనే సంకీర్తనమొనర్చునపు డసాధారణమగు, నవర్ణనీయమగునట్టి యానందముండును. హృదయ పవిత్రత గలిగిన యున్నత విద్యార్థులు వాద్యపు పనిముట్టులను నవి సహకారులుగాన, నుపయోగింపవచ్చును. పవిత్రత లేనిచో సంగీతము మానవుని నవివేకను, నంధకారమనెడి గాఢమగు నగాధములోనికి త్రోసివుచ్చి మనస్సును తమస్సు, రజస్సుల తోడ నింపును.

సంకీర్తనము బ్రహ్మముహూర్తమున నుదయాత్పూర్వము నాలుగునుండి యారుగంటలవఱకు నొనర్పబడవలెను. మీరప్పుడమిత ప్రయోజనము లందగలరు. ఎట్టి యత్నము లేదా శ్రమలేకయే భావము వ్యక్తమగును. సంగీతపు వాయిద్యములతో రాత్రివేళ సంకీర్తన మొనర్చునపుడు, తిర్యగ్జంతువులవలె (horizontal beings) గొప్పగనో లేక కొద్దిగనో నున్నట్టి కొంచఅధ్యాత్మిక పరిణామములేని మోహమైన నసురాత్మలలో తమబుద్ధి ప్రవృద్ధియున్నప్పటికిని వారిలో పశుస్వభావము లాధిక్యతనొందినందున నాసంగీతము కామము (passion) నుద్రేకింపవచ్చును. విస్తారపాండిత్యముగల సంస్కృత విద్వాంసుడును, ఎమ్. ఏ., పి హెచ్ డి (M. A., P H D.,) డిగ్రీతోనుండిన పరిశోధనా పండితుడును, వాని మనస్సు పశుతృష్ణతో (animal passion) నిండి నప్పుడొక నిరాశాజనకమగు బలిపశువగును.

లోకులాశ్చర్యకరమగు నుత్సాహము, పటుత్వము లతో నొకసంవత్సరము లేక రెంటివరకు సంకీర్తమొనర్తురు. కాని తనుపరి వారట్టి సమానమగు ప్రీతిని కనబరచరు. వారు సోమరిగను సంశయాత్మగను నుందురు. ఇది కాంక్షింప దగినదికాదు. అసదిసమానమగు నుత్సాహము యావజ్జీవితమును నిలబెట్టబడవలయును. ఆహారపానీయము లెటుల నొక దినముసహితము మాన్పబడవో నటులనేకూడ సంకీర్తన మొక దినము సహితము మాన్పబడకూడదు. సంకీర్తనము వాస్తవముగ నొక యాధ్యాత్మికాహారముకాదు. అదియొక శారీరక, మానసిక బలవర్ధకౌషధము కూడనైయున్నది. సంకీర్తనముపై నీవు జీవించగలవు.

సంకీర్తనప్రచారము క్రమ క్రమముగ (గెంతులు - దాట్లుగ) పెంపొందుచున్నదని నేడు మీరు సంపూర్ణముగ నెరుగుదురు. హిందూదేశమందలి చాలప్రాంతములలో వివిధ మండలులు స్థాపింపబడినవి. మరియు చాలమంది యాంగ్ల విద్యాభ్యాస మొందినవారు, నాస్తికులు, నిరీశ్వరవాదులు, (Agnostics) నిశ్చయవాదులతో (determinists) కూడుకొని తమ చేతులలో కరతాళములు, తాళములతోడ తీవ్రమగు సంకీర్తనము సల్పుచున్నారు. బులాండ్ షెహర్, బండా, గ్వాలియర్, రూర్కి, సహారాన్పూర్, జలంధర్, లాహోర్, జమ్ము, యింకా నితరస్థలములలో పలు సంకీర్తనోత్సవ సమ్మేళనములు జరుపబడుచున్నవి. కాన కొద్దికాలములోపల నొక గొప్పయవతారము నిరీక్షింపబడుచున్నది. స్థలము తయారొనర్పబడుచున్నది.

ఈరోజులలో చాల మిక్కిలిభక్తులచే సఖీభావము దురూహింపబడుటొక గొప్ప విచారము. వారి భౌతికశరీరమును సఖిగా తీసుకొందురు. వారు కన్యలవలె వస్త్రధారులై వివిధ, అసంబద్ధ, హాస్యాస్పదమగు కృత్యముల నొనర్తురు. ఇది యొక గొప్ప తీవ్రమైన, విషాదనీయమగు తప్పిదము. జీవచైతన్యము లేక జీవాత్మ నిజమగుసఖి. సఖీభావము సంపూర్తిగ నొక యాంతరంగికస్థితి. అది కేవలమొక బాహ్యప్రదర్శన కాదు. జీవాత్మాత్మార్పణ లేక నాత్మనివేదనద్వారా పరమాత్మలోకలియును. ప్రేమించువాడు, ప్రేమింపబడునదియు నేకమగును. ఇదియే భక్తియొక్క అగ్రము లేక చేరదగు శిఖరబిందువు. భక్తి రెంటితో ప్రారంభమయి, నొకదానిలో నంతమగును. కొందఱుజనులు సఖీభావముయొక్క వాస్తవికార్థమును గ్రహించకుండుటచే కొన్ని సంకీర్తనసంఘములలో నవినీతి సంభవించును. భక్తివృక్షముయొక్క సారద్రవము (sap)ను తినివేయుచు భక్తికిచెందిన సఖీయుపాసకపద్ధతియొక్క నుత్తమత్వమును విధ్వంస మొనర్చుచున్నట్టి యీతీరువుండును (canker) సంకీర్తనసంఘాధ్యక్షులు సంపూర్తిగ వినాశమొనర్ప వలెను.

నీవు హరినామమును కీర్తించునప్పుడు శ్రీహరి నీహృదయములో నాసీనుడైనటులను, భగవంతునియొక్క ప్రతినామమును దివ్యశక్తులతో నిండినట్లును, భగవన్నామమహిమచే పురాతన దుష్టసంస్కారములు, వాసనలును దగ్ధమయినటులను, మనస్సు సత్త్వము లేక పరిశుద్ధతచే భరితమైనటులను, రజస్సును, తమస్సును, సంపూర్తిగ నాశమొందినటులను నజ్ఞానావరణ చింపబడినటులను, ననుభవమొందుము. భగ

వంతునియొక్క రూపము, స్వాభావిక గుణములపై గూఢ ధ్యానింపుము. అప్పుడుమాత్రమే సంకీర్తనయొక్క గరిష్ట ప్రయోజనముల నీవొందగలవు.

## సంకీర్తనములోని పుండు

సన్న్యాసుల దుస్తులతోను, గడ్డములతోను, చిక్కు (జడలుకట్టిన) వెంట్రుకలతోడను, చాలమందియు, బహు బూటకపు యోగులు, డాంబిక కుయోగులు, చాల నబద్ధపు టుపదేశకులు, చాల నసత్య మతోద్ధారకులు, దొంగ యవ తార పురుషులును, నుపన్యాసవేదికపై కనబడి లోకులను వివిధరీతుల భ్రాంతిపఱచి మోసగింతురు. ఒక మతోద్ఘాట కుడు "ఓ నా స్త్రీ శిష్యులారా! పురుషులకును స్త్రీలకును భేదము లేదు. సమస్తమును బ్రహ్మము లేక కృష్ణుడే. నేను కృష్ణుడను. మీరందఱు గోపికలు. మన మందఱము రాసలీల నొనర్చుదమని చెప్పును. ఈవిధముగ నాతడు వాతావరణ మును పాడుచేసి యవినీతి నొనర్చును. ఒక మెట్టవేదాంతి "ఆసి బ్రహ్మన్, తుసి బ్రహ్మన్, నేను బ్రహ్మను. నీవు బ్రహ్మమవు. మనము బ్రహ్మముయొక్క సౌఖ్యము నొందుద మ"ని యనును. వారు శరీరమును పరిశుద్ధమగు నాత్మగా తీసికొందురు. ఆశారహితమగు (పనికిమాలిన) వేదాంతులు. ఈ మురికిదేహము పవిత్రమగు నాత్మగా తీసుకొనబడదగునా?

ఓ ప్రియమిత్రులారా! ఈ దొంగ మతోద్ధారకులు, నసత్యభగవద్దూతలు, బూటకపు యోగులగూర్చి జాగ్రత్తగ నుండుడు. సనాతన ధర్మముయొక్క వాస్తవికదూతలు చేయు నటువలెనే సమానరీతిని వారుకూడ బోధనొనర్చి దెయ్య

(Satan) మాతలు. వారు లోకుల తప్పుత్రోవలు గొంపోయి భక్తులు, యోగులు, సన్న్యాసులు, మస్తుల తమ పొట్టల నింపు కొనుటకు వేయుదు. "ఉదరనిమిత్తం బహుకృతవేషమ్" అనియే సర్వమునై యున్నది. వారు నల్లగొర్రెలు. గౌరవకుటుంబము నకు చెందిన నపకీర్తికారకులు. తీవ్రవిచారణలు సలుపబడి వారు జాలిరహితముగ తెరిమివేయబడవలయును. కాన నే సక్రమ కట్టుబాటయిన నాధ్యాత్మికసంస్థ నేటికాలపు విధి పూర్వకమగు నవసరము.

సంకీర్తనరంగములో గొంత నవినీతి వచ్చెను. అవినీతి యనెడి పురుగు తప్పనిసరిగ తొలగింపబడి, సంకీర్తనక్షేత్రము సంకీర్తనాచార్యులచేతను, మతోద్ధారకులచేతను సురక్షిత మొనర్పబడవలయును. సంయుక్త ప్రాంతములు (United Provinces) బీహారు, పంజాబులలో సంకీర్తనకార్యక్రమము దృఢముగ వృద్ధిచెందుచున్నది. యింకను ప్రతియింటిలోను ప్రతి మొహల్లాలోను, సంకీర్తనము శక్తివంతముగ జరుపబడు టెంతయు ముదావహము.

చాల కల్లసంకీర్తనకారులు తమ జీవితము సాగించు కొనుటకు సంకీర్తన ప్రచారమున చేయుచుండిరి. యింకను సంకీర్తనము వారికొక వృత్తి యయ్యెను. నేలన సంకీర్తనము వారి కిప్పుడు డబ్బు చెల్లించును. చాల కల్ల "మీరా"లు కల్ల సమాధినిష్ఠులు, నిప్పుడు పైకి లేచిరి. వారు బాహ్యముగ నుపన్యాసవేదికపై భావసమాధిని వహించి శ్రీకృష్ణుని తాము దర్శించితిమని చెప్పుదురు. తాము ప్రజలకు శ్రీకృష్ణుని చూపు దుమని చెప్పుచు వారు లోకుల మోసగింతురు. ఇదియంతయు తిన్నని మోసము. లోకు లీ బూటకపు కీర్తనకారులచే మోస

మొందింపబడరాదు. సంతబాలురు లీల నిర్వహణకై శిక్ష ణొనర్పబడి వారు సంకీర్తనవేదికపై పాత్రధారణ నిర్వర్తించుటకు తీసుకొని రాబడుదురు. ఇది ప్రేక్షకుల మనస్సులలో దుష్ప్రభావము నుత్పత్తిచేయును. లీల సక్రమశిక్షణొందబడిన నధికోన్నతిచెందిన, నాత్మలు లేక మహాత్ములు లేక సన్న్యాసులచే యేరబడిన భక్తులమధ్య నొనర్పబడదగును. అది బాహాట వేదికపై పాత్ర నిర్వహణ మొనర్పబడరాదు. ప్రాపంచిక మనస్కులజనులు తీవ్రముగ లీలాకీర్తనపట్ల ప్రీతిగనుందురు. మఱియు వారాలీలను చూచునప్పుడు "వా, వా, వా, (వహ్వా, వహ్వా, వహ్వా.") యని బొబ్బలిడుదురు. వారెట్టి మూఢులు! వారు సునాయాసముగ దెయ్యపు (Satan) దూతలచే మోసగింపబడుదురు.

శ్రీకృష్ణుని దర్శనమంత చౌకగాదు. "మీరా" లు, నవతారములు, నైదువందలసంవత్సరముల కొకపర్యాయము మాత్రముదయింతురు. మహాత్ములసత్సంగమును కలిగియుండుము. మతశాస్త్రముల పారాయణమొనర్పుము. జపముచేయుము. ధ్యానముసల్పుము. "నేనెవరన"ని యాలోచింపుము. సాత్త్విక సద్గుణముల వృద్ధిపొందింపుము. యమ, నియమముల నభ్యసింపుము. నీవు "సాతాన" (Satan) నెడి దయ్యపువానియొక్క దూతలప్రభావమునుండి విడివడుదువు. వారు నినుజూచి భీకరముగ భయపడి పరుగెత్తుదురు.

మీరందఱు కీర్తన, భగవంతునికి సంపూర్ణాత్మ నివేదనలయొక్క సక్రమానుష్ఠానముచే పరిపూర్ణ ప్రకాశస్థితిలోని దివ్యానందపరవశ సముద్రమునమునిగి మనుదురుగాక!

## అఖండకీర్తనము

అఖండమనగా నెడతెగని లేక సష్టులేని యనియర్థము. కీర్తనమనగా భగవన్నామమును గానమొనర్చుట. అఖండకీర్తనమనగా భగవన్నామము నెడతెగకుండ గానమొనర్చుట. అఖండకీర్తన చాల ఫలప్రదాయకమగు నాధ్యాత్మికసాధన. ఈ సమయమందు సమస్త మనోవృత్తుల నాశన ముండును. అఖండకీర్తనముచే మనస్సు సులభముగ వశపర్చుకొనబడ వచ్చును అఖండకీర్తనముచేనింద్రియములు(Sensual objects) పైపోవు మనస్సుయొక్క చంచలస్వభావము (అలవాటు)ను సులభముగ నణికట్టవచ్చును. అఖండ కీర్తనాభ్యాసముచే నింద్రియవిషయముల నూహించుటకు మనస్సునకు కాలము గాని, లేక నవకాశముగాని, యుండదు. అఖండకీర్తనము మనస్సును వశపర్చుకొనుటకొరక శక్తివంతమైన సులభోపాయము. మనస్సుసత్వముతో నిండును. అఖండకీర్తనములో నుత్కృష్టమగు శాంతి, సంతోషములుండును.

అఖండకీర్తనము సంసర్గము (Communion) లేకసమాధిని త్వరగ తెచ్చును. హృదయమును శీఘ్రముగ నది పవిత్ర మొనర్చును. అది యుత్కృష్టమగు మనోపరిశుద్ధతను,నింకను నితర యగణనీయమగు ప్రయోజనముల కలుగచేయును. మూడురోజుల యుత్సవము శాశ్వతమగు మనోభావముల నుత్పత్తి చేయలేకపోవచ్చును. సమాధిని దివ్యానంద పరవశ మనోస్థితిని త్వరగ ప్రేరేపించుట కఖండకీర్తనముకంటె నెక్కువ మహిమవంతమైన నితరసాధనము లేదు. ఝూన్సీ, యింకను సంయుక్తప్రాంతములు (United Provinces) లోను, నితరస్థల

ములలోను, రెండు నెలలు, మూడు నెలలు, నాలుగు నెలలు, ఒక పూర్తిసంవత్సరము సహిత మఖండకీర్తన ముండుచున్నది.

అఖండకీర్తనముకంటె యెక్కువగొప్పదగు యజ్ఞము లేదు. ఈకలియుగమున నుత్తమముగ జరుపబడిన నఖండకీర్తన మొక వంద యశ్వమేధయజ్ఞములకు సమానమగును. త్రాసు నందలి యొకచిప్ప (Scale) లో నఖండకీర్తనము జరుపబడుటచే పొంద బడుఫలమును, వేఱొకచిప్పలో నొకవంద యశ్వమేధ యజ్ఞముఫలమును, నీవు తూచుచో తొలుతటిది క్రిందికి పోవును ఇది ప్రత్యేకముగ నీకలియుగమున కనువైనది. అది నీకేదైన వెలచేయు (ఖర్చునర్చు) నది కాదు. అఖండకీర్తన కాలమందు మహామంత్రమైన

॥"హరేరామ హరేరామ రామరామ హరేహరే।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥"

పునరుచ్చరింపబడవలెను.

ద్వాపరయుగాంతమున ఋషియగు నారదుడు బ్రహ్మ యొద్దకుజని కలియుగమున సంసారసముద్రమును తరించుటకు మిక్కిలి సులభోపాయమును తెలిసికొనగోరెను. పదునాఱు నామములుకలిగిన మహామంత్ర పునరోచ్చారణచే మానవుడు సులభముగ సంసారమును దాటగల్గునని బ్రహ్మ బదులు చెప్పెను. ఆ షోడశ (పదునాఱు-16) నామములును పైనచెప్ప బడినవియే. పదునాఱుకళల (కిరణముల)చే చుట్టబడిన జీవి యొక్క వ్యక్తిత్వభావము నుత్పత్తిచేయునట్టి యావరణ నీనామము లంత మొందించును. అప్పుడు మేఘములు చెదరినతోడ వాత నిండుగా ప్రకాశించు సూర్యమండలమువలె పరబ్రహ్మ మొకటిమాత్రము ప్రకాశించును. యుచ్చారణలో నెట్టినియ

నముల పాటింపనవసరములేదు. "ఎవ్వడైనను పవిత్ర లేక నపవిత్రస్థితిలో వీటినెల్లప్పు డుచ్చరించుచో పరబ్రహ్మము (Brahmam) యొక్క సరిసమాన ప్రపంచమును, సామీప్య మును, లేక సమానరూపమును, లేజా లయమునొందును. ఆతడు తక్షణమే సమస్త బంధ (విలీనము) మునుండి విడుదల చేయబడున"ని కూడ బ్రహ్మ చెప్పెను.

మామూలు సంకీర్తనసముదుమందేదైన నామావళి (భగవన్నామము) నుచ్చరింపదగును. పరమేశ్వరుడగు శివుడు శివరాత్రియు, నితరయుత్సవము (festivities) లందు ప్రార్థింప బడునప్పుడు "ఓం నమశ్శివాయ" యొక్క నఖండకీర్తనమును చేయబడవగును.

సమస్తగ్రామములు, మొహల్లాలు (వీధులు) పట్టణ ములలోను శలవుదినములం దఖండకీర్తనము జరుపబడవల యును. వీలునుబట్టి పండ్రెండు గంటలు, నిరువదినాలుగు గంటలవఱకు నొక వారముపర్యంతము లేక నింకను నెక్కువ సహిత నఖండకీర్తన మేర్పాటుచేయబడవగును. అఖండకీర్త నము తెల్లవారుఝామున నాలుగుగంటలకు (4 A.M.) లేక సాయంత్ర మాఱుగంటలకు (6 P.M.) ప్రారంభింపవచ్చును. మొదటి దెక్కువశ్రేష్ఠము. సమయ (కాల) మెంతగా పొడు గింపబడునో ఫలితమంత యధికతరము.

నీ వఖండకీర్తనము నిరువదినాలుగు గంటల వరకు నలుగురు నాఱుగురు లేక నెనమండుగురు సభ్యుల (Members) తో సహితము జరుపవచ్చును. ఇట జట్లను, (దండు లేక పాళీలను, - Batches) మార్చుట కావశ్యకత లేదు. అం దఱును కలసి కూర్చుని నెడతెగకుండ పాడవచ్చును. కొం

దఱు వారిని మార్గదర్శక మొనర్చు (ముందు నడపు) వ్యక్తి లేకనే యఖండ కీర్తనమును జరుపుట కిచ్ఛగింతురు. అందరు జనులును కలసిపాడుదురు. ఇచ్చట సభ్యులందఱు త్వరగా నలసి పోవుదురు. ఒక మనుజుడు ముందునడపుచో, నడపు వానికిని, నితరులకును గూడ విశ్రాంతి యుండును. ఇది శ్రేష్ఠతరపద్ధతి.

ఇరువది లేక నెక్కువమంది గల జట్లు (Batches) ఖండకీర్తనమును జరుపవచ్చును. ప్రతి రెండుగంట లనంతరము జట్లు మార్చబడవచ్చును. కీర్తనలో నాటంక ముండరాదు. సర్వత్ర పరిపూర్ణమగు సంగీతమైత్రి యామూలాగ్రము నుండవలయును. మహామంత్ర మొక మాధుర్యమగు, శ్రోత్రరంజకమగు, రాగమునపాడబడవలయును. సభ్యులుకీర్తనలో ప్రాథమిక శిక్షణను కొంతకాలము వఱకు కలిగియుండవలయును. శిక్షణ నొందని జను లాటంకముల కలుగచేతురు. ముఖ్యముగ దళమును ముందు నడుపగోరువారు మిక్కిలి యుత్తమమైన శిక్షణను కలిగియుండవలయును. ఆటంకములుండుచో నదికెంతకాల మఖండకీర్తనకాదు. కీర్తనయొక్క నిరంతరత్వము (Continuity) ను నిలుపుటకు గొప్ప శ్రద్ధ తీసుకొన బడవలయును. ముందు నడపు వాడెల్లప్పుడు జాగరూకుడై మెలకువ గలిగి యుండవలయును. వేఱొకదళ మాటంకమొందు (మాను) నట్టి యాయుత్తర క్షణముననే నాతడు తన వంతును తీసుకొనవలయును. సంపూర్ణమగు క్రమశిక్షణ యుండవలయును.

ఒకడు శ్రావ్యమగు మధురరాగమున నామమంత్రము నుచ్చరింప, నితరు లందఱు వాని నేకధ్వనితో ననుసరించుచు

రావలయును. "హరేరామ హరేరామ రామరామ హరే హరే । హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥" యనెడి పదునారు నామములనుగూడి యొక మంత్రమగును. "హరే రామ హరే రామ రామ రామ హరే హరే ।" లేక "హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే"ను రెండు పర్యాయములు నీ వుచ్చరించుట లేక పాడకూడదు. వ్యక్తిగత జపకీర్తనములకు పూర్తిమంత్రము నొకేపర్యాయమున నుచ్చరింపవలయును. కాని యఖండకీర్తనమందత్యధిక శ్రమను, నాటంకమును, మానుటకొఱకు మంత్రముయొక్క మొదటి సగము నేదనగా "హరేరామ హరేరామ రామరామ హరే హరే" కీర్తన ముందు నడపువానిచే నుచ్చరింపబడవలయును. తదుపరి యెప్పుడది యేకస్వరమున దళముచే ననుసరింపబడునో, నప్పుడితర సగము పునరుచ్చరింప బడవలయును. అందుచే సమానమగు సగమును రెండుపర్యాయము లుచ్చరింపరాదు. దళమును నడపువాడు కీర్తనము నంతముగించుటకును, ఇతరులు దానిని బద్ధస్వరమున వాని ననుసరించుటకును, మధ్యకాలమందు కీర్తనమందెట్టి యాటంకమును కలుగచేయరాదు. కొందఱు జనులు మంత్రములో నొక సగము సహితము నాటంకము లేకుండ పాడలేరు. మంత్రములో నొక సగమును మధ్యలో నెట్టి యాటంకము లేకుండ పాడుటకు వారు తమ్ము తాము శిక్షించుకొనవలయును. (శిక్షణ నొందవలయును.) ముఖ్యముగ నెవరైతే కీర్తనమును ముందు నడుపుదురో వారీవిషయమై ప్రత్యేక శ్రద్ధ తీసుకొనవలయును. నటులగానిచో నది యఖండకీర్తన కాజాలదు. ఈవిధముగ

కీర్తనముయొక్క నిరంతరత్వము (కొనసాగింపు) నిలుపబడ నగును.

ప్రతియొక గంట యనంతరము కీర్తన నడపువాడు మార్పబడి వేఱొక మనుజుడు వాని స్థానమును తీసుకొన వచ్చును. ప్రతియొక సభ్యుని కాలవ్యవధియు నొక యరగంట మొదలుకొని నొక గంటవఱకు నుండవచ్చును. నడిరాత్రి యనంతరము నొక్కొక మనుజునికిని నా సమయము వెనుక వానిని నిద్రావహించును గాన నరగంట యుంచుట శ్రేష్ఠ తరము. ప్రతి ప్రత్యేక గంటకును కీర్తనము నిర్వహింపవలయు. వాని గూర్చి కార్యప్రణాళిక (Programme) ముందేర్పఱచబడి తొలుతనే ప్రణాళిక పంచిపెట్టబడవలయును. ఎవరు ముందు నడపుదురో వారు నిలబడి పాడవలయును. ఆతడు నిలబడుటచే నిద్రను జయింపవచ్చును. నిద్రచే నావహింపబడ సిద్ధముగ నుండువారుకూడ నిలబడి పాడవలయును.

అఖండ కీర్తనమున నీవు చాల యున్నత స్థాయి (స్వరము) లో పాడరాదు. నీవు త్వరగా నలసట నొందుదువు. నీవు చాల తక్కువ స్వరములో పాడిన, సభ్యులు మిక్కిలి యాదరము గొనరు. ఎట్టి యుత్సాహమును, సంతోషమును నుండదు. నీవు సుఖకరమగు మధ్యస్వరమున పాడవలసి యుండును.

ఒక్కొక్కప్పుడు కీర్తనము నేకస్వరమున ననుసరించుటకు చాలినంత సంఖ్యగల ప్రవీణత నొందిన మనుష్యు లుండకపోవచ్చును. అట్టిపక్షమున నొకేమనుజునిచే కూడ కీర్తనమును కొనసాగింపనగును. విడుదలచేయువాడు(RelieVer)

వచ్చి వానిని విడుదల చేయునప్పుడుమాత్రమే నాతడు (కార్యక్రమమును జరిగించు) గదిని విడువవచ్చును. కార్యనిర్వాహకమును వహించునట్టి విడుదల కారకుఁడు (Reliever) తను పూర్వమునుండి కీర్తనమొనర్చుచున్న మనుజునితో నథమమైదు నిమిషములవఱకు పాడుచుండవలయును. ఆతఁడు వాతనే తొలిమనుష్యుఁడు కార్యక్రమమును సాగించుగదిని విడువనగును. ముఖ్యముగ ఒక్కమనుష్యుడే కీర్తనమును నిర్వహించునప్పుడు హార్మోనియమనెడి వాద్యవిశేషమును లేదా కర్తాళములు (కరతాళములు)పయోగింప బడవచ్చును. కీర్తనకారులు కూర్చునియైన కీర్తనమును చేయవచ్చును. లేదా కార్యాచరణమగు గదిలో నుంచబడిన విగ్రహమును లేక ఛాయాచిత్రము చుట్టును. జనవచ్చును. గొంతుకు చెంచిన దగ్గు నింకా నితర సహజమగు నష్టంకులందు కీర్తనమును మానసికముగ చేయనగును, కాని యాటంకము కొద్ది క్షణములు (Seconds) మించుచో శ్రమ నివారకుని (reliever) కొంత సంజ్ఞ లేదా నీయుద్దేశమునకై ప్రత్యేకముగ నుంచ బడిన గంట వాయించుటద్వారా పిలువబడవలయును. కీర్తనగదిలోనో, లేక సమీపముననో, రాత్రి మాఱ్పుదలకార్యవర్గకీర్తన కారులు, విధిగ నిద్రించవలయును. వారు మంత్ర స్పందనముల (vibrations)చే నున్నతముగ ప్రయోజన మొందుదురు. కీర్తనకారుడు తనవంతు ముగియువఱకు నెవనితోడను మాటలాడరాదు. కీర్తనమును సాధారణముగ మూసిన (నిమీలిత) నేత్రములతో నొనర్పవలయును. లేదా వేరు ప్రక్కలకు తిరుగుచుండుటను మానవలెను. మఱియు దివ్యమూర్తిని మాత్రమే వీక్షించు చుండవలయును.

నీవు కీర్తన మొనర్చునపుడు భగవానుని - కృష్ణుడు, కాని లేక రాముని యొక్క విగ్రహమును నీహృదయములో నుంచి, యావిగ్రహముపై మనస్సును లగ్నపరచుము. కీర్తన మొనర్చునపుడు నీకండ్లను మూసికొనుము. ఆవిశాలపుగదిలో కార్యాచరణ ముగియువఱకు దేవుని పటము ముందట నఖండ దీపముం (నేతిదీపము) డవలయును. నేతిదీపమునకై శ్రద్ధ వహించి కార్యాచరణమంతయు నయిపోవువఱకు నిరంతర ముగ నది మండునటుల (వెలుగునటుల) చూచుచుండ వలయును.

సంకీర్తనమును మార్గదర్శ మొనర్చు (lead) వారంద ఱును నొకేరాగమున పాడవలయును. రాగముయొక్క మార్పుదల కీర్తనలో నాటంకమును కలుగచేయును. పైగ నను గున్యాత (మైత్రి) యుండదు. అందఱు సభ్యులును మహా మంత్రము నొకే రాగమున శ్రావ్యమగు రీతిని గాన మొనర్చు టలో బాగుగ తరిఫీదు (శిక్షణ) చేయబడవలయును.

సభ్యులను పరీక్షించుటకు నిద్రపు మనుష్యు లుండ వలయును. రాత్రియొక్క చివరి గంటలలో సభ్యులు నిద్రచే నావరింపబడుదురు. మఱియు నీపరీక్షకారులు (తనిఖీదారులు) వారిపై కనిపెట్టికొనియుండి వారిని మెలకువగ నుంచవల యును. చాలమంది తెల్లవారు ఝామున రెండుగంటలకు (2 A-M.) నిద్రించ ప్రారంభింతురు. అఖండ కీర్తనములో భాగము వహించువారు తేనీరు (TEA) తీసుకొనరాదు. వారు నడిరాత్రిని వేడిపాలు తీసుకొనవచ్చును. అఖండ కీర్తన మును ప్రారంభించు, నంతమొందించు సమయమున నందఱు మనుష్యులును హాజరు కావలయును.

అఖండ కీర్తనములో పాల్గొను వారందరును ఖచ్చితమగు పరిశుద్ధ జీవితము (బ్రహ్మచర్యము) ను పాటింపవలయును. వారు సాత్వికాహారమును తీసికొనవలయును. వారు ఫలహారము, పండ్లు, పాలు, బంగాళదుంపలు మున్నగు వానిని తీసికొనవచ్చును. వారుప్పును, పంచదారను, నాలుగు దినములవరకు విడువగలుగుచో నది వారికొక యుత్తమ తపస్సు. ఇప్పు డుప్పును, శర్కరను, నమితముగ నవివేకముగ, నంటిపెట్టికొని యుండుటను విడుచుట కొకతరుణము కలదు. వారు శర్కర లేని పాలు తీసుకొనవచ్చును. ఉప్పు లేని బంగాళ దుంపలు (potatoes) వారు తీసుకొన నగును. ఇవన్నియు దుష్టమగు నింద్రియమైన నాలుకను వశపఱచు కొనుటకు సహకారులు. జిహ్వ జయింపబడినచో నితరేంద్రియము లన్నియు సులభముగ వశపర్చు కొనబడవచ్చును. పై నియమయుత శిక్షణను సహింప లేనట్టివారు తమ మామూలాహారమును తీసుకొనవచ్చును.

అఖండ కీర్తనమందు నాటా వహించువారు తమ స్వకీయమగు చేతులతో నుసకబడిన వస్త్రముల ధరింపవలయును. యజ్ఞమె (సంకీర్తన) చ్చట జరుపబడునో నా స్థలమునకు నగ్నపాదములతో వారు జనవలెను. వారు కీర్తన మయిపోయిన తరువాత తక్షణమే పరుండరాదు.

అఖండకీర్తనమునకు నన్మేళనములు (conferences) జరుపబడునప్పుడు ప్రత్యేక వేదిక (platform) కట్టుండవలయును. అఖండకీర్తన మెచ్చట జరుపబడునో నాస్థలమున మహామంత్రముపైన వ్రాయబడిన నొక యెఱ్ఱనిగుడ్డ వ్రేలా

డింప బడవలయును. స్త్రీలు కూడ ప్రత్యేకముగ తమ నియమిత గంటలందు పాల్గొన నగును.

తరువాత యుదయమున హావనము, మహామంత్రము, గాయత్రి, గీతా శ్లోకములతో నఖండకీర్తనము ముగియవలయును. దశాంగము జవ (యవలు) - (barley) నువ్వుల విత్తులు, నెండుకొబ్బరి ముక్కలు, నెండు ద్రాక్ష లేక కిస్మిస్ (Resins) పండ్లు, నెండుఖర్జూరము, నెయ్యి యివి అన్నియు బాగుగ కలుపవలయును. దీనిలో నొక భాగమందఱు సభ్యులకును నియ్యబడును. ఈ మిశ్రమమును పవిత్ర మంత్రములతో ప్రతి మంత్రము చివరను "స్వాహా" తోడ నుచ్చరించుచు యజ్ఞాగ్నిలో నాహుతిగ లేక నుపాసనా ప్రదానములు (oblations)గ పడ వేయవలయును. అఖండకీర్తనమందు నూరు మాలల (100X108) మహామంత్ర జప మొనర్చ బడుచో, హావనమందు పదిమాలల (10X108) (పదియవ భాగము) యాహుతుల లేక నుపాసనా ప్రదానముల నర్పింపవలయును హావనము పూర్ణాహుతి (ఉపాసన ప్రదానము) తోడ శాంతి మంత్రమైన

"ఓం పూర్ణమద పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే॥"

యొక్కగానముతో నంత మొందవలయును.

పూర్ణాహుతికై నేతితోనిండి చుట్టును నెఱ్ఱగుడ్డ ముక్కతో కప్పబడి నేతిలోముంపబడిన నిండుకొబ్బరికాయ పైమంత్రముతో నగ్నిలో సమర్పింపబడును. హావన భస్మము (పవిత్రమగు బూడిద) నొక తగరపుడబ్బాలో భద్రపఱిచి

సభ్యులకును, ఇతరజనులకును, పంచిపెట్టబడవలయును. శ్రద్ధ, దివ్యభావములతోడ నుదుటి (ఫాలభాగము - forehead) పై నీభస్మప్రసాదకము చాల కుదరదాని జబ్బుల (రోగముల)తొలగించును. కార్యమొరకి, ప్రసాదప్రసంగములతోడ ముగింపవలయును. అఖండకీర్తన యజ్ఞానంతరము మహాత్ములు, సాధువులు, సన్న్యాసులు, బీదలు, సంతృప్తిగ భుజింపజేయబడవలయును.

అఖండకీర్తనము తెప్పటజరుపబడునో నాస్థలము వైకుంఠము. అట్టి యొకధార్మికయజ్ఞము నేర్పాటుచేయువారెవరో వారు ద్విగుణముగ ధన్యులు. ఎవరైతే దానిలోపాల్గొని భగవంతుని మధురనామముల యుచ్చారణచే దివ్యామృతము నాస్వాదింతురో వారు త్రిగుణముగ ధన్యులు. అట్టి మనః పూర్వక వాస్తవికభక్తులకు మంగళము.

# పంచమాధ్యాయము

## శాండిల్యుని భక్తి సూత్రములు

### అధ్యాయము 1 ఖండము 1

శాండిల్యఋషి భక్తియొక్క స్వభావమును గూర్చిన విచారణతో తనసూత్రముల ప్రారంభించును.

అథాతో భక్తిజిజ్ఞాసా. ౧

ఇప్పుడు, అటులయిన భక్తిసిద్ధాంతమును (doctrine) గూర్చిన విచారణ. 1

ఎవరైనను భక్తుడుకావచ్చును. భక్తియోగ మందరికి తెరువబడియున్నది. మోక్షాపేక్ష యొక్కటిమాత్రము

భక్తిని పెంపొందించుటకు, భక్తి యోగమార్గమును గైకొనుటకు, నొకని నర్హతగల మనుజునిగా చేయును. గడచినజన్మలలో చేయబడిన పుణ్యములు మానవుని హృదయములో తమసరి (వెనుకవచ్చు) జన్మయందు భక్తి నుత్పత్తిచేయును. భగవంతునియెడ భక్తికలిగియుండువాడెవడో వానికి మోక్షము వచ్చును.

సా పరా నురక్తి రీశ్వరే. ౨

భక్తియనగా భగవంతుని నెడ నుత్కృష్టమగు ప్రేమయే. ప్రాథమిక (ముఖ్య)భక్తియే భగవంతుని నెడ నధికానురాగము.2

ప్రహ్లాదుని ప్రార్థనేమన "ప్రాపంచికమానవుని విషయములోవలె నీ ప్రాపంచికవస్తువుల నెడ బాహ్యముగ ననవరతము స్రవించునట్లు, నట్టి ప్రేమ నీయెడ నా హృదయములో ననవరతము స్రవించుగాక" యైయున్నది. విష్ణుపురాణము 1-20, 19

ఒకడు భగవంతునియొక్క వైభవము, సౌందర్యము, విభూతులు లేక నైశ్వర్యముల (సహజగుణముల) (attributes) యనట్టి సర్వజ్ఞత్వము, సర్వ సామర్థ్యత్వము, సర్వస్థిత్వత్వములు మున్నగువాటియొక్క జ్ఞానమొందిన ననంతరము ననురక్తి (ప్రేమ) యుదయించును.

తత్సంస్థస్యామృతత్వోపదేశాత్ 3

ఏలన వేదములు (scriptures) భగవంతునిలో వసించువాడమృతుడు (మరణరహితుడు) ని బోధించును.

భగవంతునెడ భక్తి కలిగియుండునట్టి, భగవంతునిలో వసించునట్టివాడు మోక్షము నొందును.

జ్ఞానమితి చేన్న ద్విషతోఽపి జ్ఞానస్యతదసంస్థితేః ౪

జ్ఞానములో భక్తిలేమి కారణమున, ద్వేషము గలిగి యుండువాని కది జ్ఞానముకాదు. 4

పై సూత్రములోని "సంస్థ" శబ్దము బ్రహ్మజ్ఞానమును తెలియచేయుననియు, భగవంతునెడ భక్తిని కాదనియు, బ్రహ్మజ్ఞానమును పొందినట్టివాడు మోక్షమును పొందు ననియు, నొక యధిక్షేపకుడు (objector) చెప్పవచ్చును. ఇది సరియైనదికాదు. "సంస్థ" యను పదము భక్తినిమాత్రమే నర్థమిచ్చును కాని జ్ఞానమును కాదు. గుప్త యను వాని ద్వేషించు మిశ్రా యనువాడు నిశ్చయముగ "గుప్త" పట్ల నాతనికి రెండవవాని (గుప్త) గూర్చి జ్ఞాన మున్నప్పటికిని భక్తి (ననురాగము) గలవాడు కాడు.

తయోపక్షయాచ్చ. ౫

మఱియు నాపె (భక్తి) చే క్షయము (జ్ఞానముయొక్క) మూలమున. 5

భగవంతుని నెఱుగుటన నాతని (పరమేశ్వరుని) ప్రేమించుటయే. భక్తిచే క్రమక్రమముగ జ్ఞానము మందమొనర్ప బడును, ప్రేమ పెరుగునప్పుడది జ్ఞానమును మందమొనర్చును. భక్తి లేక (భగవంతునియెడ) ప్రేమ యుదయించునపుడు జ్ఞానము క్రమక్రమముగ మాయమగును. భక్తి యభివృద్ధి చెందునప్పుడు లేక పెంపొందునపుడు జ్ఞానము సన్నగిలును. లేక తగ్గును.

ద్వేష ప్రతిపక్ష భావాద్రస శబ్దాచ్చరాగః ౬

భక్తియన ద్వేషమునకు ప్రతికూలమయినది కానను. "రస" యను శబ్దముయొక్క నుపయోగము (వాడుక) వలనను నది యనురాగమైయున్నది. 6

భక్తి, ద్వేషమునకు వ్యతిరేకము. కాన నది భగవంతునిపట్ల ననురాగమును తెలియచేయును. ద్వేషమునకు ప్రతికూలించునదేదియో నదియే ననురాగము. భక్తియు, ననురాగమును, సారూప్య (similar) మైనవి. యేలన వాటిలో ద్వేషరాహిత్యత యుండును. కాని భక్తునియొక్క మనస్సు భగవంతునెడ ననురాగము వహించియుండును. ప్రాపంచిక మానవుని మనస్సు ప్రాపంచిక వస్తువులనెడ ననురాగము వహించియుండును. అనురాగరూపమున గల భక్తి భగవత్సాక్షాత్కార ప్రాప్తికి దారిజూపును. "రస" శబ్దము ప్రాపంచిక వస్తువులనెడ రుచిని భగవంతుని కొఱకు యభిరుచిని యర్థమిచ్చును.

నక్రియా కృత్య నపేక్షణా జ్ఞానవత్ 2

కాదు. ఏలన నదికూడ, జ్ఞానమువలెనే కర్మయొక్క తీరుపై నాధారపడి యుండదు. 7

అపవిత్రవాసనలు (ప్రాపంచక కాంక్షలు) నశింప చేయబడునప్పుడు, భగవంతునికై ప్రేమ దానంతటది యున్నదున్నట్లుగ పవిత్రమనస్సులో నుదయించును. కర్మలు భక్తిని లేక ప్రేమను, నవి దానిని పోషించి, శక్తివంత మొనర్చగలిగినప్పటికిని, నుత్పత్తిచేయలేవు.

అత ఏవ ఫలానన్త్యమ్. ౮

కాన దానిఫలము శాశ్వతమైనది. 8

ఈ ఫలమేది? భగవత్సాక్షాత్కారము లేక మోక్ష ప్రాప్తియా? భక్తి కర్మయొక్క వంటిది కానందున దాని ఫలము, శాశ్వతత్వము యొక్క స్వభావము కలది. కర్మ యొక్క ప్రాబల్య మంత మొందినప్పుడు ఫలితము లేక కర్మ ఫలము గూడ నంతమునకు వచ్చును. "విస్తృతస్వర్గ ప్రపంచము ననుభవించి సంచిత పుణ్యము, కర్మఫలము వ్యయమొందిన నపుడు వారు మానవలోకమును బ్రవేశింతురు." గీత IX-21 కాని భక్తియొక్క ఫలము సర్వదా నిలుచును. మోక్షమునకు తుది యెప్పుడు నుండగలదు? బొత్తిగ నసంభవము.

తద్వత్ప్రపత్తి శబ్దాచ్చ సజ్ఞానమితరప్రపత్తివత్ ॥

అది జ్ఞానముకాదు. యేలన (గీతలో) "ప్రపత్తి" శబ్దము భగవంతుని యెడ భక్తుడగు వాని విషయములో "ప్రపత్తి" పద మితర యల్పదేవతల నారాధింపకోరువారి విషయములో వాడబడునటువలె నుపయోగింపబడినది.

"బహుజన్మల యనంతరము జ్ఞానియగు మానవు డిదియంతయు వాసుదేవుడే (అమృతాత్మయే) నని గ్రహించి నావద్దకుచేరును. ఇట్టి మహాత్ముని కనుగొనుట చాలకష్టము. గీత అధ్యా" VII-19.

నా"ఎవరియొక్క జ్ఞానమీ కోరికచే చీల్చబడి తమ స్వీయప్రకృతిచే నడుపబడి యిదియో లేక నదియో ధార్మిక క్రియననుసరించు చుండు వారితర దేవతల యొద్దకు జనుదురు. గీత అధ్యా" VII-20.

"ప్రపత్తి" శబ్దము రెండు శ్లోకములలోను, నాయ దే సమానార్థమున వాడబడెను. రెంటిలో నాఖరి శ్లోకమున

"ప్రపత్తి" యల్ప దేవతల సంబంధమున వాడబడినపుడు వారి యెడ భక్తియను నర్థమిచ్చును. అదే విధముగ "ప్రపత్తి" పదము భగవంతుని సంబంధమున వాడబడినపుడు భగవంతుని నెడ భక్తియను నర్థమిచ్చును.

## అధ్యాయము 1 - ఖండము 2

ఇటుల భక్తియే మోక్షమునకు వాస్తవిక కారణమని ప్రథమఖండమున చూపబడినది. ఇప్పుడు శాండిల్యఋషి భక్తి యోగ, జ్ఞానముల స్వభావమును చర్చింప సాగుచున్నాడు.

సా ముఖ్యేతరాపేక్షి తత్త్వాత్. ౧౦

భక్తియే ముఖ్యసాధన (Means) నేలన నితరసాధన లన్నియుదానిపైనాధారపడును. 10

ప్రకరణాచ్చ. ౧౧

ఇంకను చర్చకిందనుండు శీర్షిక (Topic) నుండి కూడను. 11

స్వప్నేశ్వరుడు చాందోగ్యోపనిషత్తు శ్లోక (మంత్ర) మైన "సవాఏషస్వరాట్ భవతి"ని గూర్చి యీసూత్రమందలి గమనిక (reference) ని చెప్పును.

దర్శనఫలసమితి చేన్నవ్యవధానాత్. ౧౨

అది జ్ఞానముయొక్క-ఫలమని చెప్పబడకూడదు. ఏల? పై శీర్షికావిభాగమైన (Passage) "సస్వరాట్ భవతి"లో "సః" (వాడు) శబ్దము నంతరాయఃమగును. (మధ్యవచ్చును) 12

సంపూర్ణ పాఠ్యము (text) నీదిగువ నుదాహరించినదాని వలె నున్నది.

సవాఏష ఏవం పశ్యాన్నేవం మన్వాన ఏవం విజానన్నాత్మ రతిరాత్మ క్రీడ ఆత్మమిథున ఆత్మానందః సః స్వరాట్ భవతి.

మోక్షము లేక స్వారాజ్యము జ్ఞానముయొక్క ఫలిత మని చెప్పబడగలదా? పై సూత్రమున జ్ఞానమే చర్చింపదగిన ముఖ్యవిషయమని చెప్పబడవలదా? కాదు. ఏలన "సయేషా స్వరాట్ భవతి" యను పాఠ్యమున "స" (వాడు) శబ్దము మధ్యపడును. "స" యను సర్వనామము మిక్కిలి సన్నిహితమైన నామవాచకమేదనగా నాత్మరతి లేక నాత్మానురాగము గలిగినమానవుని కాని దూరముగనున్నదైన "పశ్యన్" జ్ఞానము కలవాని తెలుపుడుచేయదు. స్వారాజ్యము లేక మోక్షము (భగవత్సాక్షాత్కారము) భగవంతుని యెడ నాత్మరతి (భక్తి) యొక్కగాని, భగవంతునిగూర్చిన జ్ఞానముయొక్క ఫలితము కాదు. జ్ఞానము భక్తికి త్రోవచూపును. భక్తి భగవత్సాక్షాత్కారప్రాప్తికి త్రోవచూపును.

దృష్టత్వాచ్చ. ౧౩

పరిశోధన నుండికూడను 13

(భక్తి జ్ఞానముయొక్క ఫలితమనియు, జ్ఞానము భక్తి యొక్క ఫలితముకాదనియు, మనము చూతుము)

సాధారణముగ మానవప్రేమికుల (lovers) లో నొకరికి వేఱొకరి యెఱుక (జ్ఞానము) చే ప్రేమ యుదయించును. పెండ్లికొడుకు పెండ్లికూతుని యందముచూచి యామె స్వభా

వములయొక్క, విష్ణుయొక్క యెఱుక (జ్ఞానము) నొంది తదు పరి యాపెను ప్రేమింప నారంభించును. అటులనే పెండ్లి చూతురుకూడ నొనర్చును.

జ్ఞానము భక్తియొక్క పెంపుదలకు సహకరించును. లేక ననుకూలపడును.

అతఏవ తద భావాద్ వల్లభీనామ్. ౧౪

కాన, దాని (జ్ఞానము) యొక్క కొఱత యుండినప్పటికిని గోపకన్యల (బృందావనపు) యొక్క భగవత్సాక్షాత్కారము తటస్థించెను. 14

జ్ఞానముయొక్క సహాయములేకనే గోపకన్యలు (బృందావనమందలి గోపికలు) శ్రీకృష్ణునియెడ ననురాగము, భక్తి ద్వారా మోక్షము నొందిరి. భక్తికి జ్ఞానమొక సహకారము లేక నుపకారకము మాత్రమేనని నిది స్పష్టముగ తెలియ చేయును. జ్ఞానమొక ప్రధానతత్త్వమయిన దానిపరోక్షమున (absence) మోక్షము లభింపదు.

భక్త్యా జానాతీతిచేన్నా భిజ్ఞప్త్యా సాహాయ్యాత్. ౧౫

అభిజ్ఞప్తి (గీత అధ్యాయము 8 శ్లోకము 55 లోని "అభిజానాతి" శబ్దములో వ్యక్తీకరింపబడిన) పదమునుండి గ్రహింపదగు నూత (help) మూలమున భక్తిద్వారా (గీత చెప్పినటుల) నొకడెరుగునని (భగవంతుని) చెప్పబడినను నది యటులకాదు. 15

అభిజ్ఞానమన పునరావృత్తమొనర్పబడిన జ్ఞానము లేక జ్ఞప్తి యొనర్చుకొనబడిన జ్ఞానము. అది పూర్వమెరుగబడిన

పదార్థముల జ్ఞానము. అభిజ్ఞానముగుండా జ్ఞానము దృఢ పరుపబడునప్పుడు భక్తికూడ పరిపుష్టము, దృఢమునగును.

ప్రాగుక్తంచ. ౧౨

ఇంకను (బ్రహ్మజ్ఞానము) పూర్వమునసే చెప్పబడెను. (గీత అధ్యాయము 8 శ్లోకములు 53, 54 లలో)

53 వ శ్లోకములో బ్రహ్మమునకు తగియుండున" ని మనము కలిగియుందుము. 54 వ శ్లోకములో "బ్రహ్మమయిన పిదప నాయెడ నుత్కృష్టమగుభక్తి నాతడొందును"ని మనము కలిగి యుందుము. తదుపరి 55వ శ్లోకములో "అభిజానాతి" "తత్త్వతో జ్ఞాత్వాయనగా వాస్తవికముగ భగవంతుడనైన నన్నెరుగుచు" ల మనము గల్గియుందుము, అప్పుడుమాత్రమే నొకడుసంపూర్ణ భగవత్సాక్షాత్కారము లేక నేకత్వము లీనము (విశతే) ల నొందును. జ్ఞానము భక్తికిత్రోవచూపును. భక్తి వల్ల (ధాన్యము) నూకచేయుక్రియలో గింజలదంచి, తిరిగి దంచుటవలె నభిజ్ఞానమునకనగా పునరావృత్తి మొనర్పబడిన జ్ఞానము లేక స్మృతికి తెచ్చికొనబడిన జ్ఞానమునకు త్రోవ చూపును.

ఇట్టి గాఢ మొనర్పబడిన పునరాజ్ఞానము (Re-knowledge) పవిత్రమగు, దృఢమగుభక్తికిని తుదకు పూర్తి భగవత్సాక్షాత్కారమునకు త్రోవచూపు సంపూర్ణజ్ఞానము లేదా వాస్తవికమగు లేదా సారభూతమగు నెఱుకకును నడిపించును.

ఏతేన వికల్పోపి ప్రత్యుక్తః. ౧౭

దీనినే తదితరసిద్ధాంతముకూడ నధిక్షేపింపబడెను. 17

జ్ఞానము భ_క్తియొక్క అంగముమాత్రమే. నను పర్యా వసానభావముచే వాక్యములో నేదైననొకటి మోక్షప్రా_ప్తికి చాలు నవెడిసిద్ధాంత మధిక్షేపింపబడెను. ఏలన పూర్ణమును భాగమును నొకేనొక యేదేకార్యము (function) నుత్పత్తి చేయజాలదు. "అపి" శబ్దము సముదాయమును తెలియచేయును. దీనివలన భ_క్తియు, జ్ఞానము రెండునుకూడ సమానముగ మోక్షమొంపు టవశ్యముకాదని స్ఫురింపచేయబడినది.

దేవ భ_క్తిరితరస్మిన్ సాహచర్యాత్. ౧౮

దేవభ_క్తి శబ్దమది (గురుశబ్దము)తోడ వాడబడినందున నితరదేవతలనెడ భ_క్తిని సూచించును. 18

శ్వేతాశ్వతరోపనిషత్తునందు "దేవునెడ భ_క్తిగాను వానికి"వి సిద్ధుల (attainments) ని చెప్పబడును. (VI-23) "దేవభ_క్తి" పదము "గురుభ_క్తి" పదముతో వాడబడినందున "ఉలూక" పదవిషయములోవలె నితరపదములతోడి దాని సాంగత్యమునననుసరించి గుడ్లగూబ లేక నింద్రుడని నర్థమియ్య వచ్చునటుల తొలిపద మల్ప దేవతలనెడ భ_క్తినిగాని నుత్కృష్ట మగు భగవానుని (పరమాత్ముని) నెడ భ_క్తిని గాదని తెలియచెప్పును.

యోగ స్తూభయార్థమపేక్షణాత్ ప్రయాజవత్ ౧౯

తిరిగి యోగము (మనోధారణ) ప్రయాజ యజ్ఞములో వలె రెంటియొక్క లాభము (జ్ఞానము, భ_క్తి) కొఱకై రెంటి లోను దాని యావశ్యకత మూలమున నైయున్నది.

సరిగ నెటుల ప్రయాజ ధార్మికక్రియ వాజపేయ యజ్ఞమునకును, దికషణీయ ((Dikashaneya) యజ్ఞము

సహనము, రెంటికిని ముఖ్యభాగమైనటువంటి కూడ యోగము రెంటి (జ్ఞానము, భక్తి)లో నావశ్యకము. వైరాగ్యము లేక విరక్తికూడ జ్ఞానము, భక్తియొక్క మూలపరణకై నావశ్యకము. జ్ఞాన మొక్కదానితోటకే యోగ మనుష్ఠింపబడినప్పటికిని నిశ్చయముగ నది భక్తియొక్క పెంపుదలకుకూడ నుపక రించును. యోగము లేక మనోధారణ కర్మయోగ (yoga of action) మొకప్పుడుకూడ విఫలమైనది.

గౌణ్యాత్తు సమాధి సిద్ధిః. ౨౦

సమాధి, యెట్టులైనప్పటికిని, ద్వితీయ (పారతంత్ర్య భక్తి (గౌణభక్తి) ద్వారా పొందబడును. 20

ఈశ్వరప్రణిధాన (పతంజలి యోగ సూత్రములు 1-23 చూడుము)ము లేక నాత్మనివేదన సమాధికి త్రోవ జూపును. ప్రణిధానము ద్వితీయ (పారతంత్ర్య) భక్తి కాని ప్రాథమికభక్తి (Primary devotion) కాదు, ప్రాథమికభక్తి లేక పరాభక్తి యొకటి మాత్రము భగవత్సాక్షాత్కార ప్రాప్తికి త్రోవచూపును.

హేయారాగ త్వాదితి చేన్నోత్తమాస్పద త్వాత్ సంగవత్. ౨౧

భక్తి యనురాగము యొక్క స్వభావము వంటిదగుట మూలమున విడువబడవలయునని చెప్పబడుచో మేము కాదందుము మేలన సాహచర్యవిషయములో వలె దానియొక్క లక్ష్యముత్కృష్టమైనది. 21

ప్రాపంచికానురాగముల మాత్రము అవి మానవుని ప్రపంచమునకు బంధించును, గాన విడువబడవలయును.

భగవంతుని యెడ ననురాగము శుభమైనది. అది మానవుని ప్రపంచమునకు బంధింపదు. పైగానది మోక్షమునకు త్రోవ చూపును. సమస్త సాంగత్యము విడువబడదగదు. దుష్ట సాంగత్యము మాత్రమే విడువబడవలయును. సత్సాంగత్యమ పేక్షణీయమైనది. అటువలెనే భక్తి, యనురాగ లక్షణములు లనదగిన కలిగి యున్నప్పటికిని నమితముగ కాంక్షనీయమేల నగా దానిలక్ష్యమత్యున్నత మైనది.

తదేవ కర్మిజ్ఞాని యోగిభ్య ఆధిక్య శబ్దాత్. ౨౨

అది (భక్తి) యొకటి మాత్రమత్యున్నతమైనది. యేలన కర్మ, జ్ఞాన, యోగ మార్గము లవలంబించునట్టి వారికంటె దానియొక్క అనుయాయిల (Followers) యొక్క శ్రేష్ఠత్వమునుగూర్చిన ప్రకటనకలదు. ౨౨

ఇది గీత అధ్యాయము IV_శ్లో 46-47 ల తెలుపుడు చేయును.

"యోగి, సన్యాసుల (Ascetics) కంటె నధికుడనియు, జ్ఞాన (శాస్త్రాధ్యయనము ద్వారా పొందబడిన) వంతులకంటె సహితము శ్రేష్ఠుడనియు. తలచబడును. ఆతడు కర్మిష్ఠుల (men of action) కంటెకూడ శ్రేష్ఠుడు. కాన నోయర్జునా! నీవొక యోగివికమ్ము. గీత అధ్యాయము VI శ్లోకము46."

"మఱియు యోగులందఱిమధ్య నెవడైతే పరిపూర్ణశ్రద్ధతో తనయంతరాత్మ నాలో నైక్యమొందింపబడి నన్నుపాసించునో వాడు నాచే నత్యధికభక్తిగలవాడని భావింపబడును."VI_47

ప్రశ్నచ్చ నిరూపణాభ్యామాధిక్య-సిద్ధేః. ౨౩

ఏలన శ్రేష్టత్వము ప్రశ్నలు, జాబులద్వారా స్థిర పరుపబడినది. 23

ఇది, గీతాధ్యాయము XII- 1, 2 ల సూచించును.

"సంతతస్థిరతగలిగి నిన్నిటుల నుపాసించునట్టి భక్తులు, నవినాశి, యవ్యక్తము, నుపాసించువారు కూడను వారిలో నెవరు యోగమందు బాగుగ నారితేరినవార"ని నర్జునుడ నెను. "ఎవరైతే తమమనస్సును నాపైలగ్న మొనర్చుచు నన్నుపాసింతురో సంతతస్థిరతగలిగి నుత్కృష్టమగు శ్రద్ధతో నొప్పి యుందురో వారు, నాయుద్దేశములో సత్యోత్తములని" భగవానుడు బదులుచెప్పెను. ప్రశ్నలును, జాబులును, నిజముగ కష్టసమస్యయొక్క వాస్తవిక సమాధానమును (solution) చేయుట కత్యున్నతమగు సాధనము.

నైవ శ్రద్ధాతు సాధారణ్యాత్. ౨౪

భగవంతుని నెడ భక్తి దానియొక్క సాధారణ వాడుక మూలమున కేవల శ్రద్ధకాదు. 24

అన్ని మార్గములలోను శ్రద్ధ యొక యుమ్మడితత్త్వము. సమస్తక్రియలలోను నదియొకభాగ మేర్పడును. సామాన్య ప్రాపంచికసంభాషణలలో నొకడు "నా యజమాని నాయం దధికశ్రద్ధ (విశ్వాసము)కలిగియుండును. కాన నాతడు నాకన్ని తాళముచెవుల నంపెచ్చెన"ని చెప్పును.

భగవంతుని నెడ భక్తి యందుకు వ్యతిరేకముగ, నటుల కాదు.

తస్యాంతత్త్వే చానవస్థానాత్. ౨౫

అదియే నిజమగుచో వాదన పర్యవసానము లేమిచే తప్పుడగును. 25

గీత అధ్యాయము VI శ్లోకము 47 లో "మఱియు యోగు లందఱిమధ్య నెవఁడైతే పరిపూర్ణశ్రద్ధతో తన యంతరాత్మ నాలో నైక్యమొందింపబడి నన్నుపాసించునో వాడు నాచే సత్యధికభక్తి కలవాడని భావింపబడున"ని చెప్పబడెను. ఇచ్చట భక్తియు, శ్రద్ధ, నైక్యమగుచో నప్పుడు శ్రద్ధ రూపమునసుంకు భక్తి, శ్రద్ధయొక్క సహకారకము (accessory)గ నుండును. శ్రద్ధకు నుపాధి (సహకారకము) లేనందున ఫలితము పర్యవసాన రాహిత్యమగును. ఆ శ్రద్ధలోనే వేఱొక శ్రద్ధను నీవు కలిగియున్నటు లూహింపుము. ఇదే తార్కిక భ్రమయగు ననావస్థ (అంతులేని వెనుదిరుగుట) నిముడ్చును. "శ్రద్ధా భక్తియుక్తమె" యను సముచ్చయములోవలె గీతా శ్లోకము స్పష్టముగ శ్రద్ధను, భక్తిని విభాగించును.

బ్రహ్మకాండంతు భక్తౌ తస్యాను జ్ఞానాయ సామాన్యాత్. ౨౬

సామాన్యలక్షణమేదనగా కర్మకాండకు దాని తరువాతి వరుసక్రమ మూలమున బ్రహ్మకాండ భక్తిని తెలుపుడు చేయును. 26

జ్ఞాన కాండయు, కర్మకాండయు, పూర్వము తెలియబడినట్టి దానిని తెలియఁచేయుట యందు సామర్థ్యము కలిగియున్నవి. జ్ఞానమునకై నధికార పూర్వకమగు నాజ్ఞగ యుండజాలదు. వేదముల యంతిమ భాగమును జ్ఞానకాండగ పిలుచుటొక తప్పిదము. అది వాస్తవముగ బ్రహ్మకాండమని

నామ మీద బడవలెను. బ్రహ్మకాండ యొక్క యుద్దేశ్య మేమన భగవంతుని యెడ భక్తియే.

## అధ్యాయము II - ఖండము I

భగవంతుని నెడభక్తి యెట్టి క్రియయొక్క ఫలితము కానప్పటికి నది తన సంపూర్ణమగు పెంపుదలకు కొన్ని సాధనలపై నేవనగా జ్ఞానముపై నాంతర్యసాధన (నంతరంగసాధన) గను నల్పతర రకపు భక్తిపై బాహ్యసాధన (బహిరంగసాధన) మీదను నాధారపడి యుండును.

బుద్ధిహేతు ప్రవృత్తి శాపి శుద్ధే రవఘాతవత్ —౨౭

పరిపూర్ణపారిశుద్ధ్య ప్రాప్తివఱకును శుద్ధబుద్ధినొందు సాధనలపట్లధ్యానము ననవరతము దంచి ఊక తీయుటవలె యత్నము కొనసాగింపవలెను. 27

బ్రహ్మము విషయమై స్థిరమగు జ్ఞానమని బుద్ధియను నర్థమిచ్చును. శ్రవణము (ధార్మిక శాస్త్రముల వినుట, లేక పారాయణమొనర్చు,) మననము, (చింతన-విచారము) నిధిధ్యాసనము. (నిరంతర ధ్యానము)ను భక్తి (స్థిరము) పరిపూర్ణమగు వఱకును, పరాభక్తి (ఉన్నతమభక్తి) ప్రాప్తించు వఱకును, ననవరతము కొనసాగింపబడవలెను.

తదంగానాంచ. —౨౮

ఇంకను వాటియొక్క ఉపాధుల (అంగముల) గూర్చి కూడను. 28

గురుని యెడ నమ్రత, వేదముల ననుసరించి వాదించుట, మనస్సు, యింద్రియముల వశమువంటిదగు సహకారక

సాధనలుకూడ తీవ్రముగ నభ్యసింపబడవలెను. భాగములు దోషవంతమగుచో పూర్ణముయొక్క సామర్థ్యత, సైన్యము నిర్వాహకుని (సేనాధిపతి) విషయములో వలె, నిలబెట్టబడ జాలదు.

తమైశ్వర్యాపరాం కాశ్యపః పరత్వాత్. ౨౯

కాశ్యపుడు భగవంతునియొక్క మహావిభవమందు లీనమొందింపబడు చైతన్యమే తుది మోక్షమునకు కారణమని, యూహించును. నేలన భగవంతు డుత్కృష్టపురుషుడు (పురుషోత్తముడు,) 29

పూజ్య గురువైన కాశ్యపుడు, చైతన్యము భగవంతుని యొక్క మహిమ, స్వామిత్వమందు లీనమైనప్పుడు లక్ష్యము లేక మోక్షప్రాప్తికి త్రోవచూపునని చెప్పును.

ఆత్మైక పరాం బాదరాయణః 30

బాదరాయణుడు ఆత్మ (పరమాత్మ) లో సంపూర్ణముగ నైక్యమొందు చైతన్యమే నంత్య మోక్షమునకు కారణమని యూహించును. 30

"వారు పైగా సర్వమును నాత్మయని తెలుసుకొందురు. మఱియు వారు దానినెడ మాత్రమే భక్తికలిగి నందులో లీనమగుదురు. బ్రహ్మసూత్రములు IV-1-3

ఉభయపరాం శాండిల్యః శబ్దోపపత్తి భ్యామ్. ౩౧

శాండిల్యుడు వేదముల యొక్క (అధికార ప్రమాణము) ను బట్టియు, సక్రమ విచారణ (Valid reasoning) ను బట్టియు, రెంటిలోను (ఆత్మ-భగవంతుడు) నైక్యమందు చైతన్యమే నంత్యమోక్షమునకు హేతువని యూహించును. 31

శాస్త్రసంబంధ ప్రమాణము నుదహరించుచును, ప్రబల కారణములచే ఋజువు పఱచుచును శాండిల్యుని రెండు సిద్ధాంతములను సమన్వయ పఱచును. ఛాందోగ్యోపనిషత్తు "నిజముగ నిదంతయు బ్రహ్మమే. బ్రహ్మమేననుభవ మొంద బడ వలయును. బ్రహ్మము హృదయములోని నాత్మయే శక్తి కలిగి యుండువాడు వాస్తవముగ పరమాత్ముని చేయన" ని చెప్పెను. (III-14-1 to 4)

"నా (పరమాత్మ) యందలి యనంతభాగము జీవన ప్రపంచములో జీవాత్మయై...గీత XV -7

నైవం పాదసిద్ధమితి చేన్నాభి జానవద
వైశిష్ట్యాత్ 3_2

పరస్పర విరోధ స్వభావము (జ్ఞానము యొక్క యీ రెండు రూపముల యొక్క లేదా భగవదనుభూతి, యాత్మానుభూతులయొక్క) మూలమున పర్యవసానము తర్కరీత్యా ననుసరింపదని యధిక్షేపింప బడుచో నంగీకృతి ఒప్పుదల విషయములోవలె విరోధము లేకుండా మేము కాదని చెప్పుదుము. 32

ఈశ్వరుడు, జీవుడు యొక్క ఉపాధులైన (Limiting-adjuncts) మాయను, అవిద్యను, క్రమముగ నీవు మినహాయించుచో నంగీకృతకార్యముల విషయములోవలె॥ సోఽయం దేవదత్త - ఇదే - నాసేవదత్తుడు" మాదిరిగ నేకత్వము లేక సమానత్వముండును.

నక్లిష్టః పరఃస్యాదనంతరం విశేషాత్. 33

జీవాత్మ ఆత్మ (పరమాత్మ) ల యొక్క నైక్యతాను భూత్యనంతరం జీవునియొక్క ప్రత్యేక స్థితినిబట్టి పరమాత్మ, బాధలు, దుఃఖములచే మార్పునొందడు. ౩౩

జీవునియొక్క పరిమితోపాధియైన నవిద్య బ్రహ్మతోడి యేకత్వానుభూతిగుండా తొలగింపబడినప్పుడు జీవుని యొక్క హద్దులనుబట్టి సమస్త దుఃఖములు, బాధయు మాయ మగును. సరిగ నెటుల నాకాశము దానియొక్క సూక్ష్మస్వభావమును బట్టి మార్పు చెందదో నటులనే కూడ సూక్ష్మమగు నాత్మబాధ, దుఃఖములచే మార్పు చెందదు.

ఐశ్వర్యం తథేతి చేన్నస్వభావ్యాత్. ౩౪

ప్రకృత్యతీత దివ్యశక్తులు కూడ నామాదిరిగనే నుండు ననిన (పరమాత్ముడగు వానిలో నునికి గలిగి యుండవనిన) మేము కాదందుము. యేలన నివి యాపరమేశ్వరుని యొక్క వాస్తవిక స్వభావము గనే నొప్పారు చుండును.

బాధ, నియమితుడగు జీవుని చలింపచేయును. బాధ యొకయుపాధి లేక నాకస్మిక ప్రారబ్ధవశలక్షణము. అది భగవంతునిలో నుపస్థిత (ఉనికి) మవదు. దీనినుండి ప్రకృత్యతీత శక్తులుకూడ నా పరమాత్మునిలో నుండవని, యనుసరింపదు. సరిగ నెటుల వేడిమి యగ్నియొక్క వాస్తవికస్వభావమో నటులనేకూడ దివ్యశక్తులు భగవంతునియొక్క వాస్తవికస్వభావముగనగుచుండును. సరిగ నెటుల వేడిమి యగ్నియొక్క వాస్తవిక స్వభావమగుటవల్ల నెన్నడును ననుపస్థితమగుట (లేకుండ నుండుట) యుండదో నటులనేకూడ దివ్యశక్తులు పరమాత్మ యొక్క వాస్తవికస్వభావమగుటవల్ల నెన్నడును భగవంతుని

నుండి యనుపస్థితమగుట (లేకుండనుండుట) యుండదు. సరిగ నెటుల నొకవస్తువుయొక్క ప్రకాశ మద్దముయొక్క నునుపి భాగముపైనుండు ధూళిచే మార్పుచెందదో నటులనేకూడ భగవంతునియొక్క నిజమగు వైభవ, మపరిశుద్ధ, మురికిమనస్సులో సంపూర్తిగ ప్రతిబింబించకపోయినను దానిమూలమున నేవిధముగ మార్పుచెందదు.

అప్రతిషిద్ధం పరైశ్వర్యం తద్భావాచ్చనైవ
మితరేషామ్. 34

భగవంతునియొక్క ప్రకృత్యతీతశక్తులు యవి యీ పరమాత్ముని వాస్తవిక స్వభావమగుటమూలమున కాదన బడజాలవు. ఇతరులతో నది యటులకాదు. 35

జీవు డాత్మ సాక్షాత్కారమునొందు నెంటనే వాని యుపాధి (limitant adjunct) యన గానవిద్య తుదికివచ్చును (అంత మొందును.) కాని భగవంతునితో నది యటులకాదు. "మాయ"యని తెలియబడిన భగవంతుని శక్తులెన్నడును నంతమునకురావు. భగవంతునియొక్క మాయాసంబంధిక శక్తి శాశ్వతమైనది. ఏలన జీవులు సంఖ్యలోను, స్వభావము లోనుకూడ ననంతమైయుండును. ఇంకను భగవంతునియొక్క చర్యవారియొక్క ఉపాసనకు, భక్తికిని, పైగనుగూడ నీప్రపంచ మునవారిజీవితముల వాస్తవికకొనసాగింపునకును, సంపూర్తిగ నవసరము. ఈశ్వరుడు విశ్వమునకుచెందిన తండ్రి. ఆ పర మేశ్వరునిశక్తి మాయ విశ్వమునకుచెందిన తల్లి. సమస్త జీవులు నా పరమేశ్వరుని బిడ్డలు. ఆ పరాత్పరుడు సర్వదా తన మహిమను, శక్తులను, వారిని, జననమరణముల భ్రమణ ములనుండి సాయపడి, విడుదలచేయుటకు వ్యక్తపఱచును.

సర్వాంటతే కిమితి చేన్నైవాంబు ద్ధయా
నంత్యాత్. 35

ప్రతిజీవియొక్క మోక్షానంతరము భగవంతునియొక్క శక్తులకొఱ కావశ్యకత లేదని చెప్పబడుచో బుద్ధియొక్క ననంతత్వము(Infinity)మూలమున మేమటుల కాదందుము. 36

సమస్తమగుజీవులు మోక్ష మొందునప్పుడు భగవంతునియొక్క శక్తులకై నావశ్యకత యెచ్చటకలదు ? అది యటులకాదు. జీవులనంతము. సమస్తజీవులు మోక్షము నొందునట్టిన్ని, సర్వత్ర శూన్యము (Void) మాత్రమే నుండునట్టిన్ని, సమయ మెన్నడును రాజాలదు.

ప్రకృత్యంతరాళాద్వైవకార్యం చిత్సత్వే నానువర్త
మానాత్. 38

భగవంతుడు పరిణామరహితుడేలన ప్రకృతి మధ్యస్తము (Medium) గుండా సతతము చైతన్యముచే వెంబడింపబడుచు నాతడు (పరమేశ్వరుడు) పని చేయును. 37

భగవంతుడు సృష్టికి కారణమగుటమూలమున భౌతిక పదార్థములైన మట్టి (Clay) పాలువలె మార్పు లేదా పరిణామమునకు లోబడునని చెప్పబడవచ్చును. ఇది సమర్థింపరానిది యేలన భగవంతుని యొక్క యిచ్ఛకులోబడునట్టి ప్రకృతి సమస్త శారీరక మార్పులకును క్రియలకును కారణము. భగవంతుడు తనంతట తానెట్టి పరిణామము ననుభవింప జాలడు. ఎవడైతే మాయద్వారా సృజించునో నాపరమాత్మడు మాయ యొక్క సృజింపబడిన జీవులవలె మార్పుల (పరిణామముల) నొందజాలడు. మఱియు మాయయొక్క

సృష్టింపుకొజాలదు. కాబట్టి భగవంతుడు పరిణామరహితుడై నిలుచును.

తత్ ప్రతిష్ఠాగృహ పీఠవత్. 38

"పరమాత్మునిలో పృథగాధారము" అను సముచ్చయ పదము "గదిలోని యాసనము" అను సముచ్చయపదమువలె నున్నది.

మాయయే సమస్త సృష్టికి భౌతిక కారణమగుచో నటులయిన శ్రుతులలో "ఆపరమాత్మునిపై సర్వము పృథ ముగ నాధారపడుపబడి యున్నది"ని (తైత్తిరీయోపనిషత్-26) నేల పేర్కొన బడవలెను? సరిగ నటుల నొకమనుష్యుడు, గదిలోని కుర్చీపై నాతడు కూర్చుని యుండినప్పటికిని, గదిలో నాసీనుడగుచున్నాడని మనము చెప్పుదుమో నటులనే భగ వంతునిపై నానుకొనియుండు మాయలో సమస్తపరిణామము సంభవించుననియును, భగవంతుడు తన మాయద్వారా సృజించునప్పటికిని ప్రపంచమునకు సృష్టికర్త యనియును శ్రుతిచెప్పును.

మిథో౽పేక్షణాదు భయమ్. 38

పరస్పరమగు నాధారము (dependence) మూలమున బ్రహ్మమును మాయ (లేక ప్రకృతి) యును రెండును సృష్టికి కారణము. 39

అటులయిన సృష్టికి మాయయే కేవలకారణమనియును పొరబాటుచే మాత్రము బ్రహ్మము సృష్టికర్త యనబడెననియు చెప్పబడవచ్చును. ఇది యటులకాదు. బ్రహ్మమును మాయ

యురెండును కారణమే. ప్రతి యొకటి వేఱొకదానిపై నాధారపడును.

చేత్యా చిత్రీర్న తృతీయమ్. ౪౦

బ్రహ్మమునకు ప్రకృతికిపైగా మూడవయునికి లేదు. 40

చిత్తు (చిచ్ఛక్తి) బ్రహ్మమే. చేత్యము ప్రకృతి. బ్రహ్మము తప్ప తెలియువాడు (జ్ఞాత) లేడు. ప్రకృతి తప్ప జ్ఞానవస్తువు (జ్ఞేయము) లేదు. కావున బ్రహ్మమును, ప్రకృతిని మించిన మూడవ యునికి లేదు.

యుక్తిచ సంపరాయాత్. ౪౧

ఇంకను రెండును సదా నైక్యమయియే యుండును. ఏలననగా రెండును ఆది (ప్రారంభము) లేనివి. 41

మనము గీతలో "పదార్థతత్త్వము ప్రకృతి (Matter) యు, నాత్మయు, (Soul)నాదిలేనివని (అధ్యాయముXIII_శ్లోకము19) నీవు తెలిసికొనుము" ని యున్నది.

శక్తిత్వాన్నానృతం వేద్యమ్. ౪౨

జ్ఞానవస్తువ (ప్రకృతి) సత్యమైనది కాదు. ఏలయనన యీ పరమాత్మునియొక్క శక్తి (వైభవము) 42

సరిగ నెటుల నగ్నినుండి వేడిమి వేఱుకాజాలనిదో, నటులనేకూడ శక్తి (వైభవము) భగవంతునినుండి వేఱు కాజాలనిది. శక్తి, శక్తుడు (శక్తి, శక్తినివహించువాడు) ను నొకటియే. కాబట్టి ప్రకృతి లేక భగవంతునియొక్క శక్తి యసత్యమైనదికాదు.

తత్పరిశుద్ధిశ్చ గమ్యాలోకవల్లింగేభ్యః ౪౩

భక్తియొక్క పరిపూర్ణపవిత్రతను బాహ్యచిహ్నముల నుండి సాధారణమనుజుల ప్రేమవలె తెలియబడనగును. ౪౩

సరిగనెటుల మానవులయందలి ప్రేమను, వారిమాటలు సంజ్ఞలు, చూపులు, నశ్రువులు, నానందముయొక్క గగుర్పాటులు మున్నగువానిచే మనము గ్రహింతుమో నటులనే కూడ భగవంతుని నెడ భక్తిని బాహ్యచిహ్నములనుండి మనము గ్రహింపగలము.

సమ్మాన బహుమాన ప్రీతి విరహేతర విచికిత్సా మహిమ ఖ్యాతి తదర్థ ప్రాణ స్థాన తదీయతా సర్వతద్భావా ప్రాతికూల్యాదీని చ స్మరణేభ్యో బాహుల్యాత్. ౪౪

భగవంతుని నెడ భక్తిచిహ్నము లాదరము, గొప్పదగు పూజనీయత, ఆనందము, వియోగమందలి దుఃఖము, నితర మగు సర్వమునందును నయిచ్ఛ, భగవంతునిమహిమయొక్క నిరంతరగానము, భగవంతునినిమిత్తము మాత్రమే శరీరమును భద్రపఱచుకొనుట సర్వమును భగవంతుని కొఱకునికిమాత్రమే చెందుననను మనోభావము, భగవంతుడే సర్వములోను సర్వమనెడు యూహ, భగవంతునికిని, వాని యిచ్ఛకును ప్రతికూలతయొక్క సంపూర్ణరాహిత్యము, నింకను నీమాదిరివియైనట్టి గొప్ప భక్తులమాటలు, కృత్యముల స్మరించుటనుండి తెలిసికొనబడనగును. 44

అర్జునుడు శ్రీకృష్ణుని గౌరవించెను. ఇక్ష్వాకునృ శ్రీకృష్ణుని ఛాయను కలిగియున్న మేఘములకు సహితము పూజనీయతచూపెను. శ్రీకృష్ణునిసమక్షములో విదురు డానంద మొందియుండెను. గోపికలు శ్రీకృష్ణునినుండి యెడబాటున

దుఃఖ మనుభవించిరి. ఉపమన్యు డితరమగు సమస్తమునకును వయిచ్ఛ కలిగియుండెను. నారదుడు నారాయణుని నామమును సదా గానమొనర్చుచున్నాడు. శ్రీరామునికొఱకు మాత్రమే హనుమంతుడు తనజీవితమును భద్రపఱచుకొనెను. ప్రహ్లాదుడు సర్వమును శ్రీమన్నారాయణునికిమాత్రమే చెందునను మోహ కలిగియుండెను. భీష్ముడు శ్రీకృష్ణునెడ నాతడుతన్ను చంపుటకు ముందు జనినపుడు శత్రుత్వము కలిగియుండ లేదు.

ద్వేషాదయస్తు నైవమ్. ౪౫

కాని ద్వేషము మున్నగునవి అటులకాదు. 45

కోపము, అసూయ, ద్వేషము, లోభము, నింకను నితర దుర్గుణములు భగవద్భక్తులలో. నునికి వహింపవు.

తద్వాక్య శేషాత్ప్రాదుర్భావేష్వపిసా ౪౬

అట్టి యుత్కృష్టమగు పరాభక్తి కూడ వాక్యము యొక్క నంత్యభాగమునుండి (గ్రహింపదగునటుల)భగవంతుని యొక్క నవతారముల పట్ల ద్రిప్పబడును. 46

“దేవతల నుపాసించువారు దేవతల వద్దకు జనుదురు. కాన నాభక్తుడు నావద్దకు వచ్చు”న (అధ్యాయము VII-శ్లోకము 23)ని గీతలోనున్నది.

జన్మ కర్మ విదశ్చా జన్మ శబ్దాత్. ౪౭

భగవంతుని యొక్క జన్మల, కర్మల, యొక్క వైచిత్ర్యముల నెవడు తెలియునో వానికి జన్మలనుండి విముక్తి వచ్చునని శృతి ప్రకటించును. 47

ఇది, గీత అధ్యాయము 4, శ్లోకము 9 ని స్మరింపజేయును. "ఎవడైతే నాయొక్క వాస్తవిక వికాసపు తీరును నాయొక్క దివ్య జన్మమును, కర్మమును, తెలిసికొనునో నాతడు దేహము త్యజించిన తరువాత తిరిగి జన్మింపడు; యర్జునుడా! యాతడు నావద్దకువచ్చును." ఎవడు భగవంతుని యొక్క నవతారములు లేక నావిర్భావముల నెడ ననురాగము కలవాడై వాటి నర్చించునో నాతడును కూడ నుత్కృష్టమగు భక్తిని పెంపొందించును.

తచ్చ దివ్యం స్వశక్తి మాత్రోద్భవాత్. ౪౮

అది (యాపరమాత్ముని యొక్క నవతారము.) యాభగవంతుని యొక్క స్వకీయమగు శక్తినుండి మాత్రమే నునికికి వచ్చుట మూలమున దివ్యమైనది. 48

మనము గీతలో "నేను జన్మించనివాడను. నవినాశ స్వభావము కలవాడ నయినప్పటికిని, నింకను నేను సమస్త జీవుల ప్రభువునైనప్పటికిని, పైగా నాయొక్క స్వీయ స్వభావముపై పాలన మొనర్చుచు నాయొక్క స్వీయమగు మాయ నుండినేనుజన్మింతును" (అధ్యాయముIV శ్లోకము6)ని యున్నది.

ముఖ్యంతత్ స్వహికారుణ్యమ్. ౪౯

ఆపరమాత్మునియొక్క కృప వాస్తవముగ వానియొక్క అవతారమునకు ముఖ్యకారణము. 49

భగవంతుడు వానికి (పరమాత్మునికి) కర్మలొనర్చుట కావశ్యకత లేకపోయినప్పటికిని కర్మలచేయుటలో తన్ను తానేల నిమగ్నుడవవలెను? పని కొఱకైన అవతరించుటకు నిజమైన ముఖ్యకారణము వాని కృపయే.

ప్రాణిత్వాన్న విభూతిషు. ౫౦

ఆపరమాత్ముని విభూతుల(పరమాత్ముని శక్తులయొక్క వ్యక్తీకరణల) నెడ భక్తి శ్రేష్ఠమగు భక్తికాదు. యేలన నవి సృజింపబడిన జీవులు (ఉనికిలు) 50

మనము గీత అధ్యాయము X శ్లోకము 27 లో "మనుష్యులలో నన్ను రాజుగా నెరుగుము." రాజులనెడ భక్తి, యనురాగమును మోక్షమునకు దారిచూపదు.

ద్యూత రాజసేవయోః ప్రతిషేధాచ్చ. ౫౧

ఇంకను, పాచికల (dice) యాట, రాజుసేవ నెడ ననురాగనిషేధము నుండియును. 51

శాస్త్రములలోనివి కొన్ని పరిస్థితులలో నిషేధింపబడినవి కాని, యెచ్చటను నేపరిస్థితులలోను భగవంతునియందలి ప్రేమ నిషేధింపబడలేదు.

వాసుదేవేఽపీతి చేన్నాకారమాత్రత్వాత్. ౫౨

అట్టినిషేధము వాసుదేవునికికూడ వర్తించునని చెప్పబడుచో, పరమాత్ముడు వాసుదేవస్వరూపమును ధారణనొందుటమూలమున మేము కాదందుము. 52

శ్రీకృష్ణుడాయనంతటాయనే పరబ్రహ్మము(Supreme-Lord)

ప్రత్యభిజ్ఞానాచ్చ. ౫౩

మరియు వాసుదేవుడే బ్రహ్మమనెడు యంగీకృతిమూలమున. 53

శ్రీకృష్ణుడే పరబ్రహ్మము. "దేవకియొక్క పుత్రుడు విష్ణువు; మధుసూదనుడు బ్రహ్మము." నారాయణోపనిషత్తు VI- 9.

వృష్ణిషు శ్రైష్ఠ్యేనతత్. ౫౪

వృష్ణివంశజులలో ముఖ్యుడుగా వానిని పేర్కొనుట (గీత అధ్యాయము X శ్లోకము 37) వారిలోవానియొక్క శ్రేష్ఠత్వముమూలముననే నైయున్నది. 54

సమస్తమగుఘనతయు భగవంతునికే చెందునని చూపు యుద్దేశముతో మాత్రమే అట్లు పేర్కొనబడినది.

ఏవం ప్రసిద్ధేషుచ. ౫౫

అట్లేదేనగు సమానఫలితము సమస్త ప్రసిద్ధమగు నవతారములనెడ భక్తినుండియు వెంబడించును. 55

వాసుదేవునివిషయములో నెటులనో నటులనే రాముడు, నరసింహుడు. (నృసింహుడు) మున్నగునవైనట్టి ప్రసిద్ధావతారములనెడ లేదా శివునినెడ భక్తి మోక్షమునకు దారి జూపును.

## అధ్యాయము II - ఖండము II

భక్త్యాభజనోప సంహారాగ ణ్యాపరాహైతద్ధేతు త్వాత్. ౫౬

భజన (ఉపాసన)ను, నది పరాభక్తికి కారణమగుట మూలమున ద్వితీయ (పారతంత్ర్య) భక్తితో సమ్మిళిత మొనర్పుటచేతనున్నా. 56

ఎవరైతే నన్ను భక్తితో భజింతురో వారు నాలో నుందురు. మఱియు నేనుకూడ వారిలోనుందును. గీతాధ్యాయము IX- శ్లోకము 29

సర్వదా నన్ను కీర్తించుచు, నాకొఱకు శ్రద్ధవహించుచు మనోనిశ్చయమందు దృఢతకలిగి, సర్వదా భక్తితో నన్ను వందన మాచరించుచు సదా నాయెడ నమరాగులై వారు భజింతురు. అధ్యాయము IX శ్లోకము 14.

జ్ఞానమును, యోగమును, భక్తికి ప్రత్యక్ష లేక ప్రాథమిక కారణములని చెప్పబడెను. ఇప్పుడు గ్రంధకర్త భక్తి యొక్క అప్రత్యక్ష (పరోక్ష) లేక ద్వితీయ (పారతంత్ర్య) కారణముల వివరణ నిచ్చుచున్నాడు. "భక్త్యా" యనునది ద్వితీయ (పారతంత్ర్య లేక గౌణ) భక్తిని పేర్కొనును. భగవన్నామముల కీర్తించుట, సాష్టాంగవందనము మున్నగునవి భక్తియొక్క ద్వితీయ కారణములు (ముఖ్య) భక్తినొందు త్రోవలో నిలుచు సమస్త అడ్డంకులను ద్వితీయ (గౌణ) భక్తి తొలగించును.

రాగార్థ ప్రకీర్తి సాహచర్యాచ్చే తరేషామ్. ౫౭

భక్తియొక్క ఉత్పత్తిలో భగవన్నామముల కీర్తించుట మున్నగువానిచే నీయబడు సహాయమునుబట్టి ద్వితీయభక్తి యితర సాధనల ఫలితమై యున్నది. 57

మనము గీతలో "ఓ హృషీకేశా! నీయొక్క వైభవమున సరిగ ప్రపంచము నిన్ను స్తుతించుటచే నానందించుచున్నది". (అధ్యాయము XI-36 యని కలిగియుందుము. ఇవన్నియు ద్వితీయ భక్తిని పెంపొందించుటకు పద్ధతులు.

అంతరాళేతు శేషాః స్యురుపాస్యాదౌ కాండత్వాత్. ౫౮

ఇతరములు (భక్తియొక్క ఉపాధులు) న్నియు వివిధ భాగములతో కూడిన నుపాస్యము (భక్తియొక్క వస్తువు) ను ప్రారంభమున గలిగినదాని మధ్యలో నున్నవి. 58

ప్రాథమిక భక్తికి వలయు నుపాధులు (సహాయక ములు) గీతాధ్యాయము IX-14-29 లలో వర్ణింపబడినవి.

తాభ్యః పవిత్రవముపక్రమాత్. ౫౯

ప్రారంభమున (గీతాధ్యాయము IX-శ్లోకము 2) చెప్ప బడినటుల పవిత్రత వాటినుండి వచ్చును. 59

వాటినుండి యనగా ద్వితీయ గౌణభక్తి యని తెలియ బడు ప్రాథమిక భక్తికైన నుపాధులు పాపముల నశింప చేయుట ద్వారా పవిత్రత నుత్పత్తి చేసి భగవంతుని సామ్రాజ్యము తలుపు తెఱచును.

"ఇది పరమ పవిత్రకారి." (గీతాధ్యాయము IX శ్లోకము 2)

తాసుప్రధాన యోగాత్ ఫలాధిక్యమేకే. ౬౦

ఆ సమస్త కృత్యములలోను నామనము (భక్తి) యొక్క పునః పునః (పదేపదే) ప్రయోగము మూలమున కొందఱు శ్రేష్ఠమగు ఫలితము (వివిధ కృత్యములైన కీర్తన మున్నగునవి భక్తితోడ నొనర్చుట నుండి) నొంబడించునని చెప్పుదురు. 60

"ఎవడైతే నాకు భక్తితో పత్రమును పుష్పమును, ఫల మును, జలమును, సమర్పించునో వాడు" (గీతాధ్యాయము IX శ్లోకము 26

"భక్తితో నాకు వందన మాచరించుచు" గీతాధ్యాయము IX-14

భక్తి పదము యొక్క పునః పునః ప్రయోగము కీర్తన మున్నగున నైనట్టి సహకార (ఉపాధి) కృత్యములు హృదయ పూర్వక భక్తితో జరుప బడినప్పుడు అధికతర ఫలితముల నుత్పత్తి చేయునని స్ఫురింప చేయును.

నామ్నేతి జైమినిః సంభవాత్. ౬౧

జైమిని, యది యనుగుణముగ నుండుటనుబట్టి పేరు (నామము) గా చెప్పును. 61

భక్తియనెడి పదము "భక్తితో గానమొనర్చుట" "భక్తితో వందనమాచరించుట"లో వలె నారాధనావిధముల తెలియబర్చుటకు నామముగామాత్రము సరళముగ వాడబడిన దని జైమిని యభిప్రాయము. ఈ వ్యాఖ్య (Interpretation) యనవసర సమానార్థక పునఃపునః ప్రకటన (tautology) ను (పునరుక్తిని) తొలగించుననియు, నింకను నాపదము పూర్వ సూత్రము (Aphorism) లో వర్ణింపబడినటుల ఫలితముయొక్క నెట్టి శ్రేష్ఠత్వమును గోచరింప చేయదనియు, నాతడభిప్రాయము కలిగియుండెను.

అత్రాంగ ప్రయోగానాం యథాకాలసంభవో గృహాదివత్. ౬౨

అచ్చట కీర్తనము, వందనము, మున్నగువానివంటి సహకార క్రియలయొక్క నభ్యాసముగూర్చి సరియగు సమయము, యించుమించునదనులు(అవకాశములు)నుగృహనిర్మా

ణమున వాడబడు సామగ్రివిషయములోవలె నైయుండును. 62

గృహనిర్మాణమునందలి సామగ్రి యవి యవసరమగు నప్పుడు కొన్ని యప్పటికప్పుడును, కొన్ని యొకపర్యాయము నను, మఱికొన్ని వేఱొకపర్యాయమునను, సేకరింపబడివాడ బడును. అదేమాదిరిగ భక్తియొక్క సహకారక్రియలు సక్రమ కాలములోను, సక్రమ పరిస్థితులలోను, ననుష్ఠింపబడవలెను.

ఈశ్వర తుష్టేరేకోఽపి బలీ. ౬౩

ఈ యుపాధుల (సహకారముల)లో నొక్కటి యైనప్ప టికిని చాలినంత శక్తివంతముగ నున్నచో నది భగవంతుని సంతుష్టి పరచగలదు. 63

చాలనుపాధి (సహకార)క్రియ లక్ష్యాదయముతోడను నసంపూర్తి విధమునను, చేయబడినప్పుడు భగవత్కృపనొందు టకు సాధకుని కుపకరించనిదైయుండగా నొక సింధుహృదయ, పరిపూర్తిక్రియ సహితము వానిని భగవత్కృప సంపాదించు టకు సమర్థనొనర్చును.

"ధ్యానముచే సత్యయుగములోను, యజ్ఞములచే త్రేతాయుగములోను, నారాధనచే ద్వాపరయుగములోను, నేది పొందబడెనో నది కలియుగమున కేశవునియొక్క స్తుతుల కీర్తనమొనర్చుటచే నొందబడును." బ్రహ్మపురాణము.

"కలౌ కేశవ కీర్తనాత్" కలియుగములో భగవన్నామ మును, మహిమను, కీర్తించుటచే మనము భగవత్సాక్షాత్కార మొందుదుము.

అబంధోఽర్పణస్య ముఖమ్. ౬౪

కర్మయొక్క సమస్తఫలముల భగవంతునికి సమర్పణ నొనర్చుటమూలమున బంధమునుండి విడుదలయే భక్తికి ప్రవేశద్వారము.

సమస్త కర్మల ఫలములు భగవంతునికి సమర్పణ చేయబడుచో కర్మలు మానవుని బంధింపవు, కర్మఫలమును నివేదన (అర్పణ) మొనర్చుట హృదయమును పవిత్రమొనర్చి కర్మల యొక్క ఫలమును నిర్వీర్య (క్రియాశూన్య) మొనర్చును. మనము గీతలో "ఇటుల, మంచి-చెడ్డ ఫలముల నిచ్చు కర్మల బంధములనుండి నీవు విడుదల చేయబడుదువు." IX-28 యని యున్నది. శాస్త్రముల (Scriptures) చే చూపబడు త్రోవను నీవనుసరించుచో నీవెన్నడును దుష్టకర్మల చేయవు. జీవన (ఆశ్రమ) పద్ధతి (order of life) ననుసరించెడి నిత్య లేక నైమిత్తిక కర్మ లుత్తమమగు చర్యలు.

ధ్యానవియమస్తు దృష్టసీకర్యాత్. ౬౫.

ధ్యానవస్తువుపై మనోధారణ దాని (వస్తువు) ఫలముల ననాయాసముగ పొందుటకే నైయున్నది. 65

ద్వితీయ (గౌణ) భక్తియని తెలియబడు బహు సాధనలమధ్య ధ్యాన మత్యుత్కృష్టమైనది. ధ్యానము భక్తిని త్వరగ పెంపొందించి సమాధికి సులభముగ త్రోవచూపును. మానవుట్టి సక్రమమగు, పద్ధతియుతమగు ననుష్టానముండవలయును. "సూర్యబింబమధ్యమునవసించుచు మణికట్టు భూషణములతోను, సముద్రమత్స్యమైన మకరాకారపు చెవిపోగుల (కుండలముల Ear Rings) తోడను, కిరీటము, మణిహారముల తోడను, నుండి బంగారపుమేనుగలిగి, తనచేతులలో శంఖ,

చక్ర, గదా, పద్మములనుధరించి పద్మాసనమునందాసీనుడై"యి నటుల నా నారాయణుని సదా ధ్యానమొనర్తుము. నారద పంచరాత్రములు.

తద్యజిః పూజాయామితరేషాం నైవమ్. ౬౬

మూలపదమగు "యజ్" (యజ్ఞమునకు) యీ పరమే శ్వరు నారాధన కనువర్తింపబడెను కాని నితరకృత్యములకు కాదు. 66

ఇది గీతాధ్యాయము IX శ్లోకము 25ను సూచించును. "యాంతి మద్యాజినోపిమామ్" మూలపదమగు "యజ్" భగవదారాధనను సూచించును. కాని జ్యోతిష్టోమను మున్నగువానిని కాదు.

పాదోదకంతు పాద్యమవ్యాప్తేః. ౬౭

రాహిత్య (అవ్యాప్తి) దోషముమూలమున పాదోదక మనగా పాదములు కడుగుకొనుటకు జలమనియర్థము. 67

విగ్రహముయొక్క పాదములు ముంచబడిన జలము పాదోదకమనిచెప్పబడవచ్చును. పాదములులేని సాలిగ్రామము కొఱకు వాడబడుజలము నిది రహితమొనర్చు (మినహాయింపు చేయు)ట వలన నిది సరికాదు. పాదోదకమనగా భగవంతుని పాదముల కడుగుటకొఱ కుద్దేశింపబడిన జలమని యర్థము. ఈ యర్థము సర్వమును నిముడ్చుకొనును.

స్వయమర్పితం గ్రాహ్యామవిశేషాత్. ౬౮

నిషేదము లేనందున నైదైతే భగవంతుని కొరక మను జునిచే నర్పింప బడెనో నది వానిచే తీసికొన బడ నగును. 68

భగవంతున కియ్యబడిన సమర్పణ (కానుక) లను సమర్పించు వానిచే స్వతః గ (వానియంతట వానిచే మాత్రము) తీసికొన బడనగును. వాడు వాటిని భుజించినను లేదా ధరించి నను ప్రయోజ కారకముగ నుండును. ఏ విషయములో దాత కానుకగ నియ్యబడిన వస్తువును తిరిగి యనుభవింప జాలడో నట్టి వేఱొక మనుజుని కియ్యబడిన కానుక వంటిది కాదు. "యజ్ఞావ శేషముల (యజ్ఞ సమర్పణా నంతర శేషముల) భుజించు సత్పురుషులు సమస్త పాపముల నుండి విడివడుదురు. "గీత అధ్యాయము III శ్లో 13

నిమిత్తగుణావ్యపేక్షణా దపరాధేషువ్యవస్థా. ౬౯

ఉపాసనయొక్క సాధనలు, కృత్యముల వాడుకలో నజాగ్రతవలన నొందు దోషములు లేక పాపములకొఱకు ప్రాయశ్చిత్తనియమము తేర్పఱచబడినవి. 69

ఒకమనుజుడు వాడుకకనర్హమైన పుష్పముతో నర్చిం చిన ప్రాయశ్చిత్తమవసరము. భగవదర్చనలో ముప్పదిరెండు దోషములుకలవు. ఈ దోషములును, ప్రాయశ్చిత్త సాధన లును. వరాహపురాణము అధ్యాయములు 25, 26 లలో వివ రముగ పేర్కొనబడినవి.

పత్రాదేర్దాన మన్యథాహి వైశిష్ట్యమ్. ౭౦

"పత్రములయొక్క సమర్పణ మున్నగునవి" సమర్ప ణల, సాధారణముగ తెలుపుదుచేయును. నటుల కానిచో వాస్తవముగ పరిమితభావదోషముండును. 70

గీతాధ్యాయము IX శ్లోకము 26 నుండి పత్రములు, పుష్పములు, ఫలములు, జలము, మాత్రమే భగవంతునికి

సమర్పింపవలయునని గ్రహింపకూడదు. ఏదైతే మిక్కిలి ప్రియమైనదో, మిక్కిలి యుత్తమమైనదో, మిక్కిలి యంగీకారమైనదో, నది భగవంతునకు సమర్పింపబడవలెను.

సుకృతజత్వాత్ పరహేతుభావాచ్చ క్రియాసు
శ్రేయస్యః. ౭౧

ఇతరకృత్యములకంటె నీద్వితీయ (గౌణ)భక్తి సంబంధ కృత్యములు యవి సత్కార్యముల ఫలమగుటమూలమునను, నవి ప్రాథమిక (ముఖ్య) భక్తికి హేతువగుట మూలమునను, శ్రేష్ఠమైనవి. 71

భక్తికిచెందిన ద్వితీయ (గౌణ) క్రియలు భూత (గడచిన) కాలపు సత్కర్మములనుండి యుత్పత్తియగును. అవి యనుదిన మొనర్పబడు నితర సామాన్యక్రియలకంటె నిశ్చయముగ శ్రేష్టమైనవి.

గౌణ్యం త్రైవిధ్య మిత రేణస్తు త్యర్థత్వాత్
సాహచర్యమ్. ౭౨

మొదటి మూడుతరగతుల యుపాసకులును, ద్వితీయ (గౌణ) మైనవారు, ఇతరముతో వారియొక్క పేర్కొనుట శ్లాఘనకొఱకే నై యున్నది. 72

గీతలో (అధ్యాయము VII_శ్లోకము 16)

"ఓయీ యర్జునా! నాలుగు తరగతులగు సజ్జనులు దుఃఖితులు జ్ఞానాన్వేషకులు, ధనాపేక్షులు, జ్ఞానులు నన్నుపాసింతురో యీ భారత వంశప్రభూ! యని యున్నది. మొదటి మూడుతరగతుల యుపాసకులు ద్వితీయ (గౌణ)మై నాలుగవదానికనగా జ్ఞానులకంటె నల్పమైన వారు.

బహిరంతస్థముభయమవేష్టి సవవత్ ౭౩

అట్టి ద్వితీయ భక్తి సంబంధక్రియలు రెండును "అవేష్టి" "సవ" లవలె ప్రారంభిక భక్తి యుతముగను, రహితముగను, కూడనున్నవి. 73

రాజసూయములో "అవేష్టి" యజ్ఞమొక తత్త్వము. (అంగము) ప్రత్యేకముగ నది చేయబడుచో నది కొన్ని ఫలిత ముల నుత్పత్తిచేయును. రాజసూయములో నొక తత్త్వము (అంగము)గా నదిచేయబచుచో వివిధఫలితముల నది కలుగ చేయును. అదే మాదిరిగ స్తుతులయొక్క సంకీర్తనము మున్నగునవి యవి స్వతంత్రముగ నొనర్పబడినప్పుడు తమ స్వీయమగు సత్ఫలముల కలిగియుండును. అవి ప్రాథమికభక్తి యొక్క తత్త్వము (అంగము)గనొనర్పబడినప్పుడు, విశిష్టమగు ఫలితముల నవి గలిగియుండును.

స్మృతికీర్త్యోః కథా దేశ్చార్తౌం ప్రాయశ్చిత్త భావాత్. ౭౪

దుఃఖితుల (ఆర్తభక్తి) విషయములో పాపములయొక్క ప్రాయశ్చిత్తముకొఱకు తపస్సులుగా భగవంతుని స్మరించుట, స్తుతులను కీర్తించుట నాపరమాత్ముని గుణములు, లీలల వర్ణనము మున్నగునవి నియమించబడినవి. 74

వివిధరకములగు తపస్సులలో శ్రీకృష్ణుని నిరంతర స్మరణ శ్రేష్ఠతమమైనది. విష్ణుపురాణము II-6 134-155.

ఓ మైత్రేయా! ఖనిజముల (metals) బహు శ్రేష్ఠ ముగ కఱగించునదియగు నగ్ని చందమున భగవన్నామ

సంకీర్తనము వివిధపాపముల వినాశమునకు బహుశ్రేష్ఠమైన సాధనము. విష్ణు పురాణము. VI-7-9

భూయః సామన సుష్ఠితిరితి చేరా ప్రయాణముప
సంహారాన్మహత్స్వపి. ౭౫

దూష్యమగు పాపముల విషయములో నుగ్రమగు తపస్సులయొక్క నాచరణ రాహిత్యముండునని నధిక్షేపింప బడుచో మరణ పర్యంతము దాని నిరంతరాచరణ (క్రియా కలాపము) మూలమున మేమటుల కాదని జవాబిత్తుము. 75

సంకీర్తనము లేక భగవన్నామముల గానము జీవిత మంతటను తెంపు లేకుండ నొనర్పబడవలయును.

లఘ్వపి భక్తాధికారే మహత్క్షేపక మపర సర్వ
హానాత్. ౭౬

భక్తుని విషయములో భక్తికి చెందిన కృత్యము, యది యల్పమైనప్పటికిని మహాపాపముల, సమస్తేతర పాపములనంత మొందించు దాని శక్తికారణమున, ధ్వంస మొనర్పగలదు.

మనము గీతలో "సర్వవిధుల పరిత్యజించి నన్నొకనినే శరణొందుచో నేను నిన్ను సమస్త పాపముల నుండి విడిపింతును! దుఃఖింపకుము." గీతాధ్యాయము XIII శ్లోకము 66. అధ్యాయము IX శ్లోకములు 30-31) లో నున్నది.

"మిక్కిలి పాపవంతుడైనప్పటికిని, నెవడైతే శాశ్వతమగు పరబ్రహ్మముపై నొకక్షణము వఱకు నైనను ధ్యానించునో, నాతడు తిరిగి గొప్ప పవిత్రత కలిగిన నొక తపస్వి గ నగును!! ఒకక్షణము సహితమైనను, వారు భగవంతుని స్మరించుచో,

నరక బాధకు దారిజూపు మనుజుల యొక్క నతిమిక్కిలి దూష్యమగు పాపములు తత్క్షణమే మాయమగును. విష్ణుపురాణము– VI, 8-10

తత్ స్థాన త్వాదనన్య ధర్మః ఖలేవాలీవత్ ౭౭

ప్రాయశ్చిత్తమయ దోషపరిహారము యొక్క స్థానము నది (భక్తి) యాక్రమించును. కాన నూర్పిడిచేయు స్థానమందు నుంచబడిన స్థంబమువలె నాయందే యుద్దేశ్యమునకై నుపకరించును. 77

అశ్వలాయనుని శ్రౌతసూత్రము "నేలమీఁది స్థంభము యాజ్ఞిక స్థంబమగున"ని చెప్పును. ఇచ్చట కొట్టే నేలపై స్థంబమును జంతువులను కట్టుట కొఱకగు యాజ్ఞిక స్థంబముగ వాడ బడుటకు విధింపబడినది. కాని యాజ్ఞిక స్థంబము కొఱకగు నితర సూచన లేవనగా–నది యష్టభుజాకృతిగ నుండ వలయుననుట మున్నగునవి అన్వయింపవు. అదే విధముగ దేహమందలి వెంట్రుకల క్షవర మొనర్చుకొనుట, గోళ్ళుకోసుకొనుట, (కత్తిరించుకొనుట) మున్నగునట్టివైన ప్రాయశ్చిత్తము లేక దోష పరిహారమును గూర్చిన సూచన లిచ్చట నన్వయింపవు. (స్వీయ పరివర్జ్యము (self-effacement) తోడి ధ్యానమే ప్రాయస్సు మఱియు చిత్తమనగా దృఢత. కాబట్టి య్యేదైతే ధ్యానము, స్వీయ పరివర్జ్యముల తోడ దృఢత తోడ ననుసరింపబడునో నదియే ప్రాయశ్చిత్తము.)

అనింద్య యోన్యధి క్రియతే పారంపర్యాత్ సామాన్యవత్. ౭౮

ప్రతి మనుజునకును క్రిందికుండిన మిక్కిలి యల్ప జాతిలో పుట్టిన వానితోసహితము భక్తిమార్గము ననుసరిం

మునకు వారి ప్రాపంచిక ప్రయోజనములకే [illegible] సంబంధం
మున సంపదకు సామాన్యమై [illegible] ఉన్నతవర్ణపు [illegible]
సమాన హక్కు గలదు. 78

మిక్కిలి యున్నతమును, మిక్కిలి నీచమును, తక్కిన [illegible] మానవుల సమానత్వము కలదు. ఉన్నతవర్ణపు (high caste) జనులు శృతులు (వేదములు) ద్వారా పొందినదేదో, దానిని స్త్రీలును, శూద్రులును, స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ద్వారా పొందుదురు. రెంటిలో చివర నుడువబడిన వారు సంపాదించెడి జ్ఞానమునకు శృతులును ప్రాతికమూలముగ గలిగియున్నది. మిక్కిలి యున్నతమును మిక్కిలి యల్పమగు జాతికి చెందిన జనుల కేంద్రం సామాన్యమైనది. అటులనే భక్తియును నైయున్నది. మిక్కిలి గొప్ప వాసిష్ఠులు సహితము పరాభక్తి కర్హులై యుందురు.

అతో హ్యవిపక్ష భావనానుపి తల్లోకే. ౭౯

కాన వాస్తవముగ సేవచేసినతే వారియొక్క భక్తి పరిపూర్తికాలేదో వారిచే పరిపూర్ణభక్తి ప్రాప్తికొరకు భగవంతుని ధామము (నిలయము) న కార్యము లొనర్పబడవలయును. 79

సంపూర్ణభక్తి ప్రాప్తికై భగవంతునిధామమైన శ్వేత ద్వీపమున వారు కర్మ మొనర్పవలసియున్నది. మహాభారతము, శాంతిపర్వము, మోక్షధర్మము, అధ్యాయము. 236-12798-99 చూడనగును.

క్రమైక గత్యుపపత్తేస్తు. ౮౦

కాని లక్ష్యమునుచేరు టింతకుముందునుండి స్పష్టముగ చూపబడినటుల క్రమక్రమమైనది. 80

పరాభక్తిని పెంపొందించువారు తిన్నగా భగవంతుని చేరుదురు. ఇతరు లాదిత్యమండలము (సూర్యబింబము) గుండా జని క్రమక్రమముగ భగవంతుని పొందుదురు. సంపూర్తి భక్తితోడ నొప్పారనివారు క్రమపద్ధతి ద్వారా మోక్షము నొందుగురు.

ఉత్క్రాన్తి స్మృతివాక్య శేషాచ్చ. ౮౧

క్రమమగు పురోభివృద్ధి (progress)స్మృతియొక్క నంత్య భాగముచే ప్రకటింపబడినది. గీతాధ్యాయము VIII శ్లోకములు 10-24 చూడుము. 81

"బ్రహ్మమైన నేకశబ్దమగు "ఓమ్" నుచ్చరించుచు, నన్ను స్మరించుచు, నెవడైతే దేహమును త్యజించి జనునో నాతడు పరమలక్ష్యము (పదము) నొందును." అగ్ని, జ్యోతి, పగటిసమయము, ప్రకాశవంతరమగు శుక్లపక్షము, సూర్యుని నుత్తరమార్గకాలమైన నా రారు నెలలు, నప్పుడుజనుచో బ్రహ్మమునుగూర్చి తెలిసినమనుజులు బ్రహ్మమువద్దకు పోవుదురు. VIII - 24

మహాపాతకినాం త్వార్తౌ. ౮౨

అతిమిక్కిలి గొప్పపాపిష్ఠులు దుఃఖితులయొక్క భక్తి (ఆర్తభక్తి) ననుష్ఠించుట కర్హులగుదురు. 82

వారు పవిత్రమొనర్చబడిన తరువాత నత్యున్నతరూపములగు భక్తికి హక్కు కలిగియుందురు.

నైకాంత భావీగీతార్థ ప్రత్యభిజ్ఞానాత్. ౮౩

గీతోద్దేశముయొక్క సమ్మతినుండి యగుపడు నటుల ప్రాథమిక భక్తియే పరిపూర్ణభక్తత్వము. 83

ప్రాథమిక లేక పరాభక్తిచే నొనకూర్చబడిన భక్తుడు భగవంతునియెడ హృదయైకభక్తిని కలిగియుండును.

పరాంకృత్త్వైవ సర్వేషాం తథాహ్యాహ. ౮౪

ప్రాథమిక లేక శ్రేష్టమగు (పరా) భక్తి మోక్షము నకు దారిచూపును. 84

## అధ్యాయము III ఖండము 1

ఈ యధ్యాయము భక్తియొక్క-లక్ష్యము (వస్తువు) ను గూర్చి చర్చించును.

భజనీయేనా ద్వితీయమిదం కృత్స్నస్య
తత్స్వరూపత్వాత్. ౮౫

ఈ భక్తి భక్తి వస్తువునుండి దాని యొక్క అంతయును దాని వలెనే నదే సమానమగు ముఖ్యరూపము కలిగియున్నం దున వేఱుకాదు. 85

జ్ఞానమేయునికి. జ్ఞానమే బ్రహ్మము. వస్తువులు తమ స్వీయమగు స్వతంత్రపుటునికిని కలిగిలేవు. ఆత్మ, భక్తి, దేవుడు అనగా జ్ఞాత (knower) జ్ఞానము (knowledge) జ్ఞేయము. (knowable) వాస్తవముగ నొకటియే. అవి సమానమైయున్నవి.

తచ్ఛక్తిర్మాయా జడసామాన్యాత్. ౮౬

మాయయే నా పరమాత్మునియొక్క శక్తి. అది జడమైనది. బ్రహ్మముయొక్క శక్తి మాయయని దాని వివిధమగు ఫలితముల (కార్యముల - effects) మూలమున పిలువబడును. 86

కార్యములయొక్క నునికికిచెందిన జ్ఞానమునుండి బ్రహ్మముయొక్క నునికి వెంబడించును.

వ్యాపకత్వాద్వా వ్యాప్యానామ్. ౮౭

వ్యాపకత్వ మొందింపబడిన వాటిలక్షణములు వ్యాపకత్వమొందు వానినుండి సంగ్రహింపబడునవి. 87

సమస్తమునకును భగవంతుడు కారణము. ఆయన సర్వమునకును వాస్తవమైన నట్టడుగుమట్టు (substrateum) లేక మూలము. విశ్వపురుషుని (దేవుని) జ్ఞానము నీవు కలిగియున్నచో వ్యక్తిగత (లేక నిర్దేశ్యపు) జ్ఞానమును నీవు చాల సులభముగ నొందగలవు. నీవు భగవంతునియొక్క జ్ఞానమును కలిగియుండుచో, సమస్తముయొక్క జ్ఞానమును నీవు కలిగియుండగలవు. సమస్త కారణములలో ప్రథమ కారణమైన లేక పరబ్రహ్మముయొక్క జ్ఞానము మోక్షమున కైకైక సాధనము.

న ప్రాణి బుద్ధిభ్యోఽసంభవాత్. ౮౮

దేవఋషులవంటి యుచ్ఛ్రతరజీవులు మానవుని యొుక చైతన్యము - (Intelligence) నుండి రాలేదు. యేలన నది యసంభవము. 88

కాబట్టి సృష్టికర్తయైన భగవంతు డుండవలయును.

నిర్మాయోచ్చావచం(శుతిశ్చ నిర్మిమీతే
పితృవత్. ౮౯

ఉచ్చతర, అల్పతర, (క్రమములైన జీవుల సృజించిన
పిదప నా పరాత్పరుడు వేదములను తండ్రివలెసృజించెను. 89

సరిగ నెటుల తండ్రి తన కొడుకుల కుత్తమసలహా
నిచ్చునో నటులనేకూడ భగవంతుడు సమస్తజీవుల (శేయస్సుల
కొఱకును వేదములను సృజించెను.

మిశ్రోపదేశాన్నేతి చేన్నస్వల్పత్వాత్. ౯౦

ఉపదేశములయొక్క మిశ్రమ స్వభావము మూలమున
నెగువది సత్యముకాదని చెప్పబడుచో నేమవి చాల తక్కువ
యుండుట కారణముచే కాదని సమాధానమిత్తుము. 90

ఆ పరమాత్ముని సిద్ధాంతములు పాపముల నిముడ్చు
కొను జీవితపు బలి దానము (sacrifice) ను కలిగియుండు
టచే దేవుని తండ్రివలె నంతటి దయగలవాడు కాజాలడని
యధిక్షేపింప బడవచ్చును. అది యటుల కాదు.

ఉపదేశములు కొద్ది మాత్రమేనై యున్నవి. జంతువుల
వధచాల నల్ప దుఃఖమును కలుగ చేయునప్పటికిని యజ్ఞము
లధిక సుఖము నుత్పత్తిచేయును. "అహింస" (ఎట్టి జంతువులను
చంపరాదు) యొక్క (ప్రాధాన్యమగు సిద్ధాంతము? తమ జిహ్వా
రుచిని సంతృప్తి పరచుట కెవరైతే జంతువులను చంపుదురో
వారు మాత్రము నరకమునకు బోదురు. అందు మూలమున
నీ నియమముల (గంథకర్త నిర్దయ కలవాడు కాడు.

ఫలమస్మాద్బాదరాయణో దృష్టత్వాత్. ౯౧

కర్మల యొక్క ఫలమూ పరమాత్మని నుండి వచ్చె నని బాదరాయణుడు చెప్పెను. నేలన పరిశోధనా(Observation) ఫలిత మట్టిది.

సరిగ నెటుల యుద్ధములోని కృత్యములును, వాటి ఫలితములును రాజునకు పోవునో, నటులనే కూడ యజ్ఞములలోని కృత్యములును, వాటి ఫలితములు, భగవంతునికి మాత్రమే పోవును. కాబట్టి సమస్త కృత్యములును భగవంతుని ప్రీతి (సంతుష్టి) చేయుట కొనర్తుము. ఆ పరమాత్మని నిమిత్తము మాత్రమే చేయుము. భగవంతుని నీయొక్క పరమ లక్ష్యముగ కలిగి యుండుము. కర్మలను వాటి ఫలములను భగవంతునికి సమర్పింపుము.

వ్యుత్క్రమాదప్యు యస్తథా దృష్టః ౯౨

లయము తారుమారు (తలక్రిందు) (Reverse) క్రమమున సంభవించును. 92

తత్త్వములు విశ్వజగత్తులయొక్క సంకోచ (సంక్షిప్త లేక నిమిడిక) క్రియ (Involution) వ్యాకోచ విస్తృత) క్రియా (evolution) క్రమమునకు తారుమారు క్రమముగ సంభవించును. విస్తృత క్రియయందు (సృష్టి కాలమున) నాకాశమునుండి వాయువు వచ్చెను. వాయువునుండి యగ్నియును, నగ్నినుండి జలమును, జలమునుండి భూమియును నగును. ప్రళయ కాలమందు భూమి జలములో నైక్యమగును. జలమగ్నిలోను, నగ్ని వాయువులోను, వాయువాకాశములోను, నైక్యమగును.

## అధ్యాయము III ఖండము II

జీవుడు లేక జీవాత్మచే బ్రహ్మముయొక్క స్థితి నొందుటయే మోక్షము. ఈ ప్రత్యేక విభాగమున నుపాసనా విధానము, దివ్యత్వము యొక్క స్థితికి లేచుటకు జీవునియొక్క నర్హత, భక్తి, మోక్షమున కెటుల త్రోవచూపు నదియు, చర్చింప బడినవి.

తదైక్యం నానాత్వే కత్వముపాధియోగహానాధాదిత్వవత్. ౯-3

అది (బ్రహ్మము) యేకత్వమే. సూర్యుని విషయములోవలె నుపాధులు లేక హద్దుల (నిర్ణీతముల Limitations) యొక్క నునికి లేక రాహిత్యత మూలమున బహుత్వము లేక నేకత్వమగుపడును.

మనము గీతలో "సరిగ నెటుల నొకేసూర్యుడు సర్వ ప్రపంచమును ప్రకాశింప చేయునో నటులనే కూడ నోయీ భారతా! క్షేత్రస్వామీ (క్షేత్రజ్ఞుడు) సమస్త ప్రపంచమును ప్రకాశింపచేయును (అధ్యాయము XIII - 33) నియున్నది.

ఉపాధులు లేక నిర్ణీతముల ననగా నద్దముల మూలమున నెటుల బహుగ నగపడునట్టి సూర్య డద్దములు తొలగింప బడినవు డొకటిగా ప్రకాశించునో నటులనే గూడ జీవుని యొక్క నుపాధ యనగా నవిద్య లేక మనస్సుచే నసత్యముగ సృజింపబడిన హద్దు తొలగింప బడినప్పుడు బ్రహ్మ మొకటిగ ప్రకాశించి నటులనే గ్రహింపబడును.

పృథగితి చేన్న పరేణా సంబంధాత్
ప్రకాశానామ్ ౯౪

అది వేఱైనదని చెప్పబడుచో మేము కాదందుము. ఏలయన నప్పుడు వ్యక్త పదార్థములకును, భగవంతునకును, మధ్య సంబంధ రాహిత్యముండును. 94

సృజింపబడిన జీవులాపరమాత్మని వలె నుండనిచో భగవంతునిలో నుండజాలవు. కప్పు (మూత) తొలగింప బడినప్పటికి నొక దీపము (Light) వేఱొక దీపముచే వ్యక్త పఱుప బడజాలదు. కాబట్టి మనస్సు స్వయంప్రకాశమైన పరమాత్మను వ్యక్త పరుపజాలదు. పరమాత్మ (Supreme) కే యితర తత్త్వము నుండియు సహాయ మవసరము లేదు. అది స్వయంసిద్ధ (Self - existent) మై యున్నది. అది సమస్తములోను నుండి సమస్తములోను ప్రకాశించు చున్నది.

నవికారిణస్తు కరణ వికారాత్ ౯౫

జీవులు పరిణామము (Change) నకు లోనుగావు. పరిణామ మింద్రియములలోనే యున్నది. 95

ఒక మనుజుడు "నాకు తెలియును" నేను సుఖముగ నున్నాను "నేను కోరుదున"ని చెప్పునప్పు డాయాత్మ తెలియు నదియు, నాత్మ సుఖముగ నున్నదియు, కాదు. మనస్సు ద్వారా తెలియునదియు, ననుభవించు నదియును, నహం (Ego) యే. ఆత్మ సర్వదా పరిణామ రహితమగు సాక్షి. జ్ఞాన మింద్రియ వృత్తుల నుండియు (Sense impressions) నింద్రియముల నుండియు వచ్చును. గాఢ నిద్రలో మనస్సు లేదు. కాన "నేను" యను భావన లేదు.

అనన్య భక్త్యాతద్బుద్ధి బుద్ధిలయా దత్యంతమ్ ౯౬

అవిభాగ (Undivided) భక్తి ద్వారా బుద్ధి యొక్క సంపూర్తి తిరోభవంత (మాయమగుట - Disappearance) నుండి యజ్ఞాన ముదయించును. 96

మనము గీతలో "ఓయీ పార్థా! ఎవనిలో సమస్త జీవులు వసించునో, నెవనిచే నీసర్వము వ్యాపింపబడునో, నట్టి యుత్తమ (పరమ) పురుషుని (భగవానుని) నెడ నచంచల భక్తి ద్వారా మాత్రమే పొందదగున (అధ్యాయముVIII-22) ని కలిగియున్నది.

పరాభక్తి గుండా బుద్ధియంత్యమున సంపూర్తిగ మాయమయి తదుపరి యాత్మ సాక్షాత్కారము తటస్థించును.

పరబ్రహ్మ జ్ఞానముయొక్క ప్రాప్తి లేదా పరబ్రహ్మమైన శాశ్వత సౌఖ్యప్రాప్తి రూపముగ నుండు విముక్తియే యాత్మ సాక్షాత్కారము. సరిగ నెయిల కర్పూర మగ్నిలో లీనమగునోనటుల నేకూడ మనస్సవిభాగ యనన్య-(undivided) భక్తిద్వారా పరబ్రహ్మములో లీనమగును.

ఆయుశ్చిరమిత రేషాంతుహానిర నాస్వ
దత్వాత్. ౯౭

జీవితము పొడుగింపబడును. కాని పరిపూర్ణ భక్తిగల మనుజుని విషయములో భోగమునకనువగువస్తువుల రాహిత్యాత మూలమున పుణ్యము, పాపము, మాయమగును. 97

సమస్త సుకృతము (పుణ్యము- righteousness) పాపములును, పరాభక్తి నొకడొందినపుడు మాయమగును. నేలన

బుద్ధి యదృశ్యమగును. ఇంకను భోగమునకగు వస్తువులు లుప్త (రాహిత్య) మగును. ప్రారబ్ధకర్మ సంపూర్ణముగ వ్యయము(ఖర్చు) చేయబడువరకు జీవితము కొనసాగును. ఆతడానందస్థితిలో నుండును. సుఖము దుఃఖము, పుణ్యము (merit) పాపము (sin) వాని నంటజాలవు. ఆతడొక జీవన్ముక్తుడు. ఆతడు జీవించియుండగనే విముక్తి చేయబడినవాడు. సమస్త కర్మలును వాటి యుత్పత్తి శక్తులతోడ సంపూర్ణముగ దగ్ధమొనర్పబడును. మనస్సు పరబ్రహ్మములో లీనమగును.

సంసృతి రేషామ భక్తిః స్యాన్నాజ్ఞానాత్
కారణాసిద్ధేః 98

జ్ఞానముయొక్క కొఱతనుండికాక భక్తియొక్క కొఱతనుండియే జననమరణములు కారణమగును. జ్ఞానముకొఱత కారణముతో ననుగుణ్యముగ నుండుటచే పునర్జన్మములు, మరణములును, నుత్పత్తిచెందును.

త్రీణ్యేషాం నేత్రాణి శబ్దలింగాక్ష భేదాద్రు
ద్రవత్. 99

సమస్తజీవులకును రుద్రుని (శివుని) విషయములో వలె మూడునేత్రము లేవనగా, వేదములు, సంజ్ఞ (symbol)మఱియు నింద్రియములు కలవు. 99

మూడు నేత్రములనగా జ్ఞానము సంపాదించుటకు మూడు సాధన (ఉపాయము) లనగా మూడువిధములగు ఋజువు ప్రమాణము వస్తువులయొక్క వాస్తవికతత్వము (True Nature) నిర్ధారణచేయుటకై కలవు. శబ్దము పదము లేక శాస్త్ర (scripture) మై యున్నది. సంజ్ఞద్వారా మన

మవగాహన (inference) నొందుదుము. ఇంద్రియముల ద్వారా మనము ప్రత్యక్షదృశ్యము (దృష్టి) నొందుదుము.

ఆవిస్తిరోభావా వికారాఃస్యుః క్రియాఫల
సంయోగాత్. ౧౦౦

కర్మలు వాటి ఫలితములతోడికూడిక(మేళవింపు) లను బట్టి వ్యక్తస్వరూపములును, లయములును, వికారములే (modifications) 100

వస్తువులు లేక పదార్థములయొక్క ప్రత్యక్షత లేక నుత్పత్తియే వ్యక్తస్వరూపము. వస్తువులు లేక పదార్థముల యొక్క నదృశ్యత లేక వినాశమే లయము. భగవంతుడు విశ్వజగత్తుయొక్క సృష్టికారకుడు. సంరక్షకుడు, వినాశకుడు, బ్రహ్మ యీ పరమాత్మునియొక్క సృజనాంశము. విష్ణు వా పరమాత్మునియొక్క సంరక్షకాంశము. రుద్రుడా పర మాత్మునియొక్క వినాశకాంశము. భగవంతునియెడ పరా భక్తి పరబ్రహ్మముతోడి యేకత్వము లేక నైక్యతయొక్క ననుభవముద్వారా నంత్యవిముక్తి (మోక్షము) కి త్రోవ చూపును. 100

ఆనందము, శాంతి, సౌఖ్యము, మోక్షము, యొక్క ప్రదాతయగు శ్రీకృష్ణుడు సర్వదా మీ హృదయములో వసించు గాక! ఆ పరమాత్ముని యొక్క నాశీర్వాదములు మీ యందఱిపైన నుండుగాక !!!

హరిః ఓమ్ తత్సత్.

ఓమ్ శాంతిః! శాంతిః! శాంతిః

# షష్ఠమాధ్యాయము - భక్తికై సహకారులు

## గురుభక్తి యొక్క ప్రాముఖ్యత.

ధ్యానమూలం గురోర్మూర్తిః। పూజామూలం గురోర్పదం
మంత్రమూలం గురోర్వాక్యం। మోక్షమూలం గురోర్కృపా॥

గురుస్వరూపము ధ్యానమున కాధారము. ఆపరమాత్మ స్వరూపుడగు గురునిపాదము లర్చనకు మూలము. ఆ పరమాత్మస్వరూపుడగు వానిమాటలు మంత్రమున కుత్పత్తి స్థానము. మఱియు నాపరమాత్మస్వరూపుడగు వానికృపయే మోక్షము (విముక్తి) న కాదికారణము

ఎవడైతే సంపూర్ణమగు నాత్మ ప్రకాశమునొంది, మోహావఱుపబడిన జీవుల యజ్ఞానపుముసుగును, తొలగించ గలడో నట్టి యొకడేగురువు. గురువు, సత్యము, బ్రహ్మము, ఈశ్వరుడు, ఆత్మ, ఓమ్, అన్నియునొకటే. ప్రపంచముండు నంతటివఱకును నాత్మ సాక్షాత్కారమార్గమున శ్రమించు జీవులముందు నడపుటకు గురువులును, వేదములును, నుండును. సత్యయుగముతో పోల్చినప్పుడు కలియుగములో నాత్మ సాక్షాత్కారపురుషులు తగ్గియుండవచ్చును. కాని వారు సాధకులకు సాయమొనర్చుటకు సర్వదా నుండియే యున్నారు. వారు సర్వదా సక్రమమగు నధికారులను లేక సర్వాతకలిగిన సాధకులను వెదకుచు నేయున్నారు.

గురు వాయనంతటాయన పరబ్రహ్మమే. గురువే యీశ్వరుడు. గురువే దేవుడు. వానినుండి యొకమాట భగవంతునినుండియొకమాట యే. ఆయ నేమియు బోధింపనవసరము

లేదు. వానియొక్క సమక్షము లేక సహవాసము సహిత మౌన్నత్యకారకము. నుత్సాహకారకము. సంచలనకారక మైనది. ఆ వాస్తవికసాంగత్యము దానంతటదే నాత్మప్రకాశము. వాని సహవాసమున వసించు టాధ్యాత్మిక విద్య (శిక్షణ)యే. ఏది వాని పెదవులనుండి బైటకువచ్చునో నది యంతయు వేదము లేక సందేశ (gospel) సత్యమే. వానియొక్క మూర్తీభవమే. (embodiment) గురువే నీయొక్క మార్గదర్శకుడు లేక నాధ్యాత్మికోపదేశికుడు. నీనిజమగుతండ్రి తల్లి, సోదరుడు, బంధువు, నింకను సన్నిహిత స్నేహితుడునై యున్నాడు. ఆయన, కరుణ, ప్రేమలయొక్క మూర్తీభవము.

వానియొక్క మృదువగు చిరునవ్వు, ప్రకాశము, సౌఖ్యము, సంతోషము, జ్ఞానము, శాంతులను ప్రసరింప చేయును. ఆయన బాధిత జనకోటికొక నాశీర్వాదము. ఆయన చెప్పిన దేదైన నుపనిషద్బోధయే. ఆయన నాధ్యాత్మిక మార్గము నెఱుగును. ఆయనకు త్రోవలో నుండు పతనమున కగు గోతులును, వలలును తెలియును. ఆయన విద్యార్థులకు సకాలమగు హెచ్చరిక (Warning) నిచ్చును. వారి శిరస్సులపై నాయన తన కృపను వర్షించును. ఆయనయొక్క కేవల సమక్షమున సమస్త బాధలు, దుఃఖములు, కష్టములు, ప్రాపంచిక దోషములు (మఱకలు) మున్నగునవి మాయ మగును.

అల్పమగు జీవత్వమును ఘనమగు బ్రహ్మత్వము లోనికి పరివర్తించు వాడాయనయే. సాధకులయొక్క పురాతన, దోషయుత, దుష్టసంస్కారముల సంస్కరించి యాత్మజ్ఞాన ప్రాప్తికి వారిని మేల్కొల్పు వాడాయనయే. జీవులను

దేహము, సంసారమనెడి బురదనుండి లేవనెత్తి, యవిద్య యనెడి తెఱను, సమస్త సందేహములను, మోహము, భయము. మున్నగువానిని తొలగించి, కుండలిని శక్తిని మేల్కొల్పి ప్రత్యక్ష జ్ఞాన (Intuition) పుటాంతరంగిక చక్షువును తెఱచు వాడాయనయే.

గీతలో "దీనిని శిష్యత్వము చేతను, విచారము చేతను, శుశ్రూష చేతను, నీవు నేర్చుకొమ్ము. జ్ఞానులును, వస్తుసార ద్రష్ట (seer) లును, జ్ఞానమునకీకు బోధింతురు" (అధ్యాయము IV శ్లోకము 34) ని, మీరు కనుగొందురు.

గురువు, బ్రహ్మ శ్రోత్రియుడుమాత్రమేకాకుండ బ్రహ్మ నిష్ఠుడు సహితముకూడ నయియుండవలయును. కేవల పుస్తక పఠన నొకనిని గురువును చేయజాలదు. వేదముల నెవరు పఠించిరో, ననుభవముద్వారా నాత్మయొక్క ప్రత్యక్షజ్ఞానము నెవరు కలిగియుందురో, వారుమాత్రమే గురువుగా జాబితాలో లిఖింపబడవలెను. ఒక మహాత్ముని సమక్షమున నీవు శాంతిని కనుగొనుచో, నింకను వానియొక్కనునికి (సమక్షము) యందు నీ సందేహములు నివారింపబడుచో, నీవు వానిని నీయొక్కగురువుగా తీసుకొననగును. గురువు తగినశిష్యులకు మంత్రమును ప్రసాదించు నప్పుడాయన దానిని తన స్వకీయ మగుశక్తి, సాత్వికభావములతో నిచ్చును.

సరిగ నెటుల నదిలో జలము ప్రవహించుచుండునో నటులనేకూడ జ్ఞానమును, భక్తియును, నాయననుండి యన వరతము ప్రవహించును. దాహముగల మనుజుడుమాత్రమే జలమున్ద్రాగును. తనగురువునందు ప్రశ్నింపరాని శ్రద్ధకలిగి

యీాయన యుపదేశముల చాల నాతురముగ నిముడ్చుకో గలిగిన సాధకుడుమాత్రమే వానినుండి యమృతము నాస్వాదించును. విద్యార్థి తనగురువునుండి యీాయన నెడగల శ్రద్ధ యొక్క తీవ్రత అంతస్థులకనుగుణ్యముగ నిముడ్చు (గ్రహించు) కొనును.

గురువు విద్యార్థుల (శిష్యుల)వివిధరీతుల పరీక్షించును. కొందఱువిద్యార్థు లాయనను సరిగా తెలుసుకొనలేక యీాయన నెడ తమశ్రద్ధను పోగొట్టుకొందురు. కానవే వారు ప్రయోజన మొందబడుటలేదు. ఎవరైతే ధైర్యముగ పరీక్షలకు నిలుతురో వారు తుదిని విజయవంతముగ వత్తురు.

ఋషుల (Sages) యొక్క నాధ్యాత్మిక విశ్వవిద్యాలయమున సామయిక పరీక్షలు నాస్తవముగ చాల కఠినముగ నుండెడివి. పూర్వపు రోజులలో పరీక్షలు చాల నుగ్రముగ నుండియుండెను. ఒకా నొకప్పుడు గోరఖ్‌నాధుడు తన విద్యార్థులలో కొందఱను నొక పొడుగగు చెట్టునెక్కి చాల వాడిగల త్రిశూలముపై తలక్రిందుగ వారంతట వారినిపడుమని కోరెను. చాలమంది విశ్వాసరహితులగు విద్యార్థులు మౌనము వహించియుండిరి. కాని యొక విశ్వాసముగల విద్యార్థి తక్షణమే మెఱుపు (Lightning) వేగముతో చెట్టునెక్కి తనంతట తాను క్రిందపడెను. ఆతడు గోరఖ్‌నాధుని యదృశ్య హస్తముచే కాపాడబడెను. ఆతడు తక్షణమగు నాత్మ సాక్షాత్కారము నొందియుండెను. ఆతడు తన దేహము కొఱకు దేహధ్యాస కలిగియుండలేదు. ఇతర విశ్వాసరహిత విద్యార్థులు తమ దేహముల నెడగాఢమగు మోహము లేక సనురాగము కలిగియుండిరి.

ఒకప్పుడు గురుగోవిందసింగు తన విద్యార్థుల పరీక్షించెను. ఆయన "నా ప్రియ శిష్యులారా! మీరు నాయెడ వాస్తవిక భక్తి కలిగియుండుచో మీలో నాపగురు ముందుకు వచ్చి నాకు మీ తలలనిండు. అప్పుడుమనము మనయత్నమున విజయము కలిగి యుండగలము" ని యనెను. ఇరువురు విశ్వాసముగల విద్యార్థులు తమ తలల సమర్పించిరి. గురుగోవింద సింగు వారిని బసలోనికి తీసుకొనిపోయి వారికి బదులుగ రెండు మేకతలల నఱకెను.

గురునియొక్క నావశ్యకత విషయముపై చాలమంది లోకులమధ్య నుత్తమముగ నపరిమితమైన వాదన, ఘర్షణ (controversy) గలదు. కొందఱాత్మ సాక్షాత్కారమునకును, నాధ్యాత్మి కోన్నతికిని గురువెంతమాత్ర మవసరము లేదనియు, నాధ్యాత్మి కాభివృద్ధియు నాత్మ ప్రకాశమును, స్వకీయమగు యత్నముల ద్వారా మాత్రమే మానవుడు కలిగి యుండగలడనియు, తీవ్రత, బలములతోడ నొక్కి వక్కాణింతురు. వారు శాస్త్రములనుండి వివిధ భాగములను పేర్కొని వాటిని సమర్థించుటకు వాదనలను, వివేచనా పూర్వక తర్కములను. నప్పగింతురు. ఇతరులు మానవునిలోని నెట్టి యాధ్యాత్మి కాభివృద్ధియు నాతడెంత తెలివైన వాడైనప్పటికిని, నాతడెంత దృఢముగ యత్నించు నప్పటికిని, నాధ్యాత్మిక గురువుయొక్క కరుణా పూరితకృపను, ప్రత్యక్ష మార్గదర్శకత్వమును, నాతడొందిన తప్ప సాధ్యపడ జాలదని ధైర్యవంతముగ పట్టుబట్టుదురు.

ఇప్పుడు మీకండ్లు తెఱచి మన చుట్టునున్న ప్రపంచమున వివిధ కార్యరంగములలో వాస్తవముగ నేమి జరుగుచున్నది

జాగ్రత్తగ పరీక్షింపుడు. వంటవాడు సహితము గురువు (బోధకుని) ను కావలసియుండును. వాడు కొన్ని యేండ్లవరకు (ననుభవనీయుడగు) నుచ్చతరమైన వంటవానిక్రింద పని చేయును. వాడాతనిని ఖచ్చితముగ మన్నించును. వాడు తన గురువును సమస్తమగు సాధ్యమైనంతరీతుల మెప్పించును. (సంతోషింపచేయును) వాడీ విధమున వంట నేర్పరితనము (పనివాడితనము) నేర్చును. వాడు తనగురువైన (ననుభవవంత) యుచ్చతరమైన వంట వాని కృపచే జ్ఞానము (పాచక) నొందును. అల్పతర (అనుభవముగల) న్యాయవాది యధిక తర (అనుభవముగల) న్యాయవాదియొక్క సహాయమును, మార్గదర్శకత్వమును కోరును. గణితము, వైద్యము, యొక్క విద్యార్థులు పాండిత్యమొందిన నాచార్య (Professor) ని యొక్క సహాయమును, మార్గదర్శకత్వమును కోరుదురు. భౌతికస్థలి (Physical plane) యందలి జ్ఞానముయొక్క సమస్త శాఖలలోను సమర్థత గలిగిన గురు వవసరమనియు, శారీరక, మానసిక, నైతికాధ్యాత్మిక కృషియు, నున్నతియు, ప్రవీణత నొందిన గురువు లేక నధ్యాపకుని సహాయము, మార్గదర్శకత్వము గుండా మాత్రము పొందబడదగు ననియు, విశ్వమంతట నంగీకరింపబడును. ఇది యొక విశ్వప్రాపంచిక తప్పనిసరి ప్రకృతి ధర్మము. మిత్రుడా! అటులయిన నాధ్యాత్మిక సీమలో సహిత మీ విశ్వప్రపంచాంగీ కృతమయిన ధర్మమును నీవేల నిరాకరింతువు?

ఆధ్యాత్మికవిద్య గురు పరంపరయొక్క విషయము. అది గురువునుండి వాని శిష్యుని కియ్యబడునది. బృహదారణ్యకోపనిషత్తును పఠింపుము. నీవీ సత్యముయొక్క

విస్తృతావగాహనమును కలిగియుండుదువు. గౌడపాదాచార్యులు తన శిష్యుడగు గోవిందాచార్యున కాత్మ జ్ఞానమును ప్రసాదించెను. గోవిందాచార్యుడు తన శిష్యుడగు శంకరాచార్యునకును, శంకరాచార్యుడు తన శిష్యుడగు సురేశ్వరాచార్యునకును, ప్రసాదించిరి. మత్స్యేంద్ర నాథుడు తన శిష్యుడగు గోరఖ్ నాథునకు జ్ఞానమును ప్రసాదించెను. గోరఖ్‌నాథు నివృత్తినాథునకును, నివృత్తినాథుడు జ్ఞానదేవునకును ప్రసాదించిరి. తోతాపురి శ్రీరామ కృష్ణునకు జ్ఞానమును ప్రసాదించెను. రాజగు జనకుని జీవితమును పరివర్తించిన దష్టావక్రుడే. రాజగు భర్తృహరి యొక్క నాధ్యాత్మిక నిర్ణీతవిధి (Destiny) ని రూపొందించినది గోరఖ్‌నాథుడే. అర్జునుని, యుద్ధవుని, వారిమనస్సుల స్థిరస్థితిలో నున్నప్పుడాధ్యాత్మిక మార్గమున వారంతట వారిని స్థాపననొందునట్లు చేసినది శ్రీకృష్ణుడే.

కొందరు సాధకులు కొన్ని సంవత్సరముల వఱకు స్వతంత్రముగ ధ్యానమొనర్తురు. తదుపరి వారు వాస్తవముగ నొక గురువుయొక్క నావశ్యకత నొందుదురు. వారు త్రోవలో కొన్ని యడ్డంకుల తారొక్కందురు. వారిక ముందెటుల జనవలెనో, నడ్డంకులను లేక తొట్రుపాటుల నెట్లు తొలగించుకొనవలెనో తెలియదు. వారప్పుడు గురువుకొఱ కన్వేషింపనారంభింతురు.

విద్యార్థియు. గురువును తండ్రియు మిక్కిలి నిష్కపటత, భక్తితో గూడిన ననురాగవంతుడగు కొడుకువలె కలసిమెలసి వసించవలయును. సాధకుడు గురువుయొక్క బోధల గ్రహించుటకు నాతురమగు, నాహ్వానక (Receptive)

స్వభావమును గలిగియుండవలయును. అప్పుడు మాత్రమే సాధకుడాధ్యాత్మికముగ ప్రయోజన మందును. అట్టుల కానిచో సాధకునియొక్క నాధ్యాత్మికోన్నతిగాని వానియొక్క పురాతన యాసురిక స్వభావపు సంపూర్తి మార్పుగాని యుండదు.

వేటకాడైన నేకలవ్యుడు తనగురువైన ద్రోణాచార్యుని యెడ నెంతభక్తి యుక్తుడో మీరందఱెఱుగుదురు. ఏల నాతడు విలువిద్యయందు ప్రవీణుడయ్యెననగా నదియే కారణము.

ఆతడు విగ్రహమును మాత్రమే సేవించి యారాధించెను. ఒకప్పుడు శంకరాచార్యుడు తన శిష్యుడగు పద్మపాదుని భక్తినిపరీక్షింపగోరెను. కావేరీనది నిండు ప్రవాహముల (వరదల) లో నుండెను. పద్మపాదు డవతలియొడ్డున నిలుచుండెను. శంకరుడు పద్మపాదుని తత్క్షణము తనవద్దకు రమ్మని సంజ్ఞచేసెను. పడవసహితము లేకుండెను. పద్మపాదుడు తన జీవితముకొఱకు లక్ష్యముచేయక వెంటనే నదిలోనికి దుమికెను. ఆతని కీదుట తెలియదు. ఇదియే వాస్తవమైనభక్తి. శంకరుని కృపద్వారా పద్మపాదుడు సులభముగ నీటిపై నడచుచుండెను. ప్రతియొక్క అడుగునకును నొక పద్మసుమ (పుష్ప) మగుపడెను. అందువల్లనే వానిపేరు పద్మపాదు డనబరగెను. (పాదమున పద్మము)

ఆధ్యాత్మికగురువుయొక్క చికిత్సక, చుంబక, స్పర్శయు, మార్గదర్శకత్వము లేకుండ భ్రమితుడగు (మోహితుడగు) జీవునకు మోక్షముయొక్క ఆశలేదు. మానవులయొక్క కోణదృష్టియందు ప్రాధాన్యమగు మార్పు నొనర్పగలిగి వారిని యాత్మయందలి నిత్యజీవితముయొక్క నుత్కృష్టమగు, నతీత

మహోన్నత్యములకు విశ్వచైతన్యము, దివ్యశోభ, నాత్మిక ప్రకాశము, వైభవములతోడ లేవనెత్తగలుగునది గురువు మాత్రమే.

## సంక్షిప్తముగ భక్తియోగము

నీయొక్క గురువుయొక్క సలహా లేదా స్వకీయాభీష్టము ననుసరించిగాని, లేదా నీయొక్క గ్రహప్రభావము ననుసరించి దేవత నెన్నునట్టి యుత్తమ జ్యోతిష్కునితోడి కార్యవిచారణ (అభిప్రాయము) పై గాని, నొక యిష్టదేవతను శివుడు, రాముడు, కృష్ణుడు, విష్ణువు, దత్తాత్రేయులు, గాయత్రిని గాని, లేదా శక్తినిగాని, నేఱుకొనుము. ఓం నమశ్శివాయ, ఓం నమోనారాయణాయ, ఓం నమోభగవతే వాసుదేవాయ ఓం శ్రీరామ్, జయరామ్, జయజయరామ్, మున్నగువాని వంటి సక్రమ మంత్రమునుగూడ పొందుము. నీ ధ్యానపు గదిలో నా ప్రత్యేక దేవతయొక్క చిత్రపటమును నీ కెదురుగ (ముందుగ) నుంచుకొనుము. ఆరు నెలలవఱకు నా చిత్రపటముపై పదునైదు సెకండ్లనుండి పదునైదు నిమిషములవఱకు త్రాటకము (నిశ్చలదృష్టి) నభ్యసింపుము. చిత్రపటమును జాగ్రత్తగ మనోధారణతో పదునైదు నిమిషములవఱకు రెప్పవాల్చకుండ కన్నీరు విస్తారముగ కారు పర్యంతము చూడుము. ఎడ తెగకుండ భాగవతము, రామాయణము,- నారద భక్తిసూత్రములు, శాండిల్య సూత్రముల పారాయణ మొనర్పుము. ఒక సంవత్సరమువఱకు నయోధ్య, మథుర, పండరిపురము, ఋషీకేశము, (హృషీకేశము) నింకా నితర పుణ్యస్థలములలో వసింపుము. నవవిధభక్తు లభ్యసింపుము.

నిరంతరము నీ గురుమంత్రము నుచ్చరింపుము. నిద్రను మూడు గంటలవఱకు మాత్రమే కలిగియుండుము. నీ కను కూలమగునట్టి భావమును- మధుర, సఖ్య, దాస్యముగాని, లేదా వాత్సల్యము నెంచుకొమ్ము. భగవంతునికి నిష్కపట మైన దాపరికము లేని బాహాటమైన, వాస్తవమగు పరిపూర్ణ మైన, నాత్మనివేదన (శరణాగతి) నొనర్పుము. నీహృదయాధో భాగమునుండి యాంతరిక ప్రార్థనసల్పుము. ప్రార్థన, పర్వ తముల కదలింపగలదు. ఎందులో వివేచనము చొరజాలదో నట్టిసీమను ప్రార్థన చేరగలదు.

ఏకనిష్టను (ఒకేనాదర్శము నెడ భక్తిని)కలిగియుండుము. భక్తి యనన్యము, యవ్యభిచారిణి, (యచంచలమగు, నేకా గ్రమగు, నేక మనస్కమగు భక్తి) యై యుండవలయును. మెల్లగ ననురాగము, ప్రేమ, ప్రీతి, విరహము, (భగవంతుని నుండి యెడబాటువలని బాధ) భావము, మహాభావముల నెంపొందింపుము. మహాభావములో భక్తుడు తన దేహము, ప్రపంచములయొక్క స్పృహ లేనివాడై భగవంతుడు లేక నిష్ట దైవములో పరిపూర్ణముగ లీనమగును. అపర లేక నల్పతర భక్తినుండి భక్తుడు పరా లేక నభేదభక్తికి జనును. భక్తుడు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య ముక్తులగుండా జనినయనంతరము క్రమముక్తి లేక సక్రమాభివృద్ధితో కూడిన మోక్షమును బొందును.

"దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే"
"దేనిచే వారు నావద్దకువత్తురో నట్టివివేచనాయోగమును నేను ప్రసాదింతును." గీత అధ్యాయము X శ్లోకము 10.

అల్పతరముక్తి ననుభవించినపిదప భక్తు డంత్యమున జ్ఞాని సమానస్థితియగు కైవల్యమోక్షము నొందును. ఉత్సాహము (ఓపిక) తో కూడిన మనఃపూర్వకమగు సాధనచే రెండు లేక మూడు (2 లేక 3) సంవత్సరములలో భగవదనుభవ (సాక్షాత్కార) మొందగలడు. నేను మీకు దృఢముగ నొక్కి వక్కాణింతును. హృదయ పూర్వకమగు యత్నమొనర్చి ఫలితముల గనిపెట్టుము.

గీతలోని "మచ్చిత్త", "యుక్త", "మత్పర" పదములలో వర్ణింప బడినటుల శ్రీకృష్ణుని బోధల ననుసరింపుము.

## ప్రేమ యోగము

భగవంతుని నెడ తీవ్రమగు, నిష్కామ్యమగు, పవిత్రమగు, ననురాగమే ప్రేమ, సారభూతమైన (ఘనీభవించిన) ననురాగమే ప్రేమ. ప్రేమ భక్తుని భగవంతునితో ముఖాముఖిగ దెచ్చును. భక్తి (దివ్య) ప్రేమగా పర్యవసానమొందును. ప్రేమ స్వచ్ఛమగు నమృతము. ప్రేమ బాధలను, దుఃఖములను, నాశ మొనర్చు నొకని (మానవుని) నమృతమయునిగ, నానంద పూర్ణునిగ, శాంతియుతునిగ, నొనర్చును. ప్రేమ స్వభావమును వర్ణించుట చాల కష్టము. దానిని నీ యంతట నీవనుభవింపవలెను. దానిని జపము, స్మరణ, కీర్తన, సత్సంగము, భక్తులసేవ, రామాయణ, భాగవతాది పఠన ద్వారా కృషి చేయుము.

స్తోత్రముల లేక స్తుతులయొక్క పునరుచ్చారణ నీ మనస్సు నున్నత మొనర్చి నిన్ను త్తేజ పరచును. అది నీ

మనస్సును భగవంతునితో సమైక్యతగ నుంచును. అది నీ హృదయమున సంతోషము, శాంతి, సుఖముల జొరబెట్టును. స్తుతుల ననువినము గాన మొనర్చి భగవత్కృప నొందుము. ఆ పరమాత్మలో సర్వదా వసింపుము.

కర్మ లేక నుగ్రమగు నాత్మసంయమము (మొక్క రూపముగ నుండునట్టి వివిధ రకములగు తపస్సులలో కృష్ణుని యొక్క నిరంతర స్మరణ యత్యుత్తమమైనది. (విష్ణుపురాణము II - 6 - శ్లోకములు 134-135.

లోహముల నత్యుత్తమముగ కరగించునది యగు యగ్నివలె భగవన్నామ గానము పలు పాపముల నిర్మూలన మునకత్యుత్తమ సాధనము. (విష్ణుపురాణము VI-7 శ్లోకము 9.)

మానవులయొక్క మిక్కిలి నిందనీయమైన పాపములు వారు భగవంతుని నొక క్షణము సహితమైనను స్మరించుచో తత్క్షణమే మాయమగును. (విష్ణు పురాణము VI 8-10)

భగవన్నామమును జపించని వాడెవడో నా మానవుడు వ్యర్థముగ జీవించును. భగవన్నామ రహితముగ జీవించుట కంటె చచ్చుట శ్రేష్ఠతరము.

సమస్త ముఖములలోను భగవంతుని చూచుటకును, సమస్త జీవులలోను దివ్య స్వరూపమును గమనించుటకును నీ కండ్లకు శిక్షణ నొనర్పుము. శ్రీహరియొక్క మధురమగు, శ్రావ్యమైన కీర్తనల వినుటకు నీ శ్రోత్రములకు (చెవులకు) శిక్షణ నొనర్పుము. భగవంతుని స్తుతిని కీర్తించుటకును, మనోహరమగు, ప్రేమింపదగు, సత్యయుతమగు మాటల నుచ్చరించుటకును, నీ జిహ్వకు (నాలుకకు) శిక్షణనొనర్పుము

దాన మొనర్చుటకును, బీదలసేవ చేయుటకును, నీ హస్తము లకు శిక్షణ నొనర్పుము. సదా సంతోష పూరితముగను, శాంతముగ నుండుటకును, నా పరమాత్మ నొకని మాత్రము తలంచుటకు నీమనస్సునకు శిక్షణ మొనర్పుము. ప్రేమను పెంపొందించుట కిది సత్యమైన మార్గము.

పరమాత్మ్యపట్ల సత్యముకొఱ కన్వేషణ, ప్రారంభిక ప్రాతఃసమయముల నిష్టదేవునిపై నొకింతధ్యానము, సక్రమ కట్టుబాటొనర్పబడిన జీవనము, భగవంతునియొక్క నమృత (మరణ రహిత) స్వభావముయొక్క స్మరణ, నీయొక్క స్వకీయమగు, జనాస్పదమగు, బాహ్య (Public) జీవనము లలో సమస్త రూపములలోను, నాపరమాత్ముని యునికి ననుభవించుటకు యత్నమును నీయొక్క జీవితమునకు, నాం తర్యాధ్యాత్మిక బలము. ధైర్యములకును, సరిసమత్వము, మైత్రి నొసగును.

పరమ సత్యమునకై తెంపు లేని భక్తిని గలిగియుం డుము. దాని కొఱకు సమస్తమును బలి యొనర్చుటకు సిద్ధ పడి యుండుము. నీవు దృఢమగు నిచ్ఛాశక్తిని పెంపొందిం తువు. నీవు నిర్భయుడ వగుదువు. సమస్త జీవులయొక్క నాంతర్యవాసి (నంతర్యామి) యైనట్టి యీ పరమాత్ముని నుండి తీవ్రమగు బలమును, ధైర్యమును, నీవు లాగుదువు. నీవు భగవత్సాక్షాత్కార మొందుదువు.

ఒక టే సత్యము. భగవంతుడు మాత్రము కలడు. వే ఱితర మేమియును లేదు, ఈ ప్రపంచ మా పరమాత్ముని యొక్క వ్యక్తీకరణమే. సమస్త క్రియా కలాపములు, సంఘట నలు, కృత్యములు (చేతలు) నాపరమాత్మునివే. సమస్త

మును నా పరమాత్ముడే. ఈ ప్రపంచ మశాశ్వతమైనదియు, జరిగిపోవు ప్రదర్శనము నొకింత కాలమువఱకైనా పరిణామ కార్యము (Phenomenon) మాత్రమే. వ్యక్తిగత యునికి లేదు. వ్యక్తిత్వము కేవల మూహాకల్పితమును, మనస్సు యొక్క నజ్ఞానావస్థయునై యున్నవి.

భగవంతుని నిర్వచించుటన భగవంతుని నిరాకరించుటయే. నీవు పరిమిత వస్తువుయొక్క నిర్వచనము మాత్రము నీయఁగలవు. సమస్తమునకు మూలము నంత్యకారణమునై హద్దులేని (నపరిమితమగు) లేదా ననంతమగు నునికిని (పరమాత్మను) నీవెటుల నిర్వచింపగలవు ? నీవు భగవంతుని నిర్వచించుచో నపరిమితుడగు నొకని నీవు పరిమితునొనర్చుచున్నావు. నీవా పరమాత్మను మనోభావనలో బంధించుచున్నావు. భగవంతుడు స్థూల మనస్సుయొక్క నందుబాటున కవల వాడు కాని యా పరమాత్ముని పవిత్రమగు, సూక్ష్మమగు, నేకాగ్రమగు మనస్సుతోడ ధ్యానముగుండా యాధ్యాత్మానుభవ (సాక్షాత్కార) మొందనగును.

ఆహారముయొక్క పవిత్రత మనస్సుయొక్క పవిత్రతకు దారి జూపును. ఇంద్రియములచే గ్రహింపబడు సమస్థ పదార్థములు పవిత్రమై యుండవలయునని నిది తెలియ పఱచును. చెవులు గీత, రామాయణము, భాగవతము, ల యొక్క శ్రేష్ఠవచనములను, హరి కీర్తనమును వినవలయును. నీయొక్క దుస్తు (Clothing) సాత్వికము, లేదా పవిత్రముగ నుండనిమ్ము. నీయొక్క సంభాషణ (వాక్కు) పవిత్రముగ నుండనిమ్ము. నీ సహచరులు (Companions) సాత్విక పురుషులుగ నుండనిమ్ము. నీవు చదువు గ్రంథములు పవిత్ర

ముగ నుండనిమ్ము. స్థలము సాత్త్వికముగ నుండనిమ్ము. ధ్యానపుగది భగవంతునియొక్క సాత్త్విక బొమ్మల (చిత్రపు పుల) తో నలంకరింప బడనిమ్ము. అప్పుడు మాత్రమే నీవు త్వరగ భగవచ్చైతన్యమునొందుదువు. శాంతిగానము (పాఠము) న గూడ "ఓ దేవములారా! మేము మా చెవులతోడ మంగళ కరమగునదేదో దానిని వినుముగాక! ఆరాధింపదగునో మీ రందఱూ (దేవతలారా) మేము మాకండ్లతోడ మంగళకర మగునదేదో దానిని చూతుముగాక!" యనుటను నీవు గను గొందువు.

భీలిని (మాలది) యగు శబరి వహించినట్టి యదే సమానమగు మానసిక స్వభావముతోడ నీవు నీయర్పణల భగవంతునికి నొసర్పవలెను. ద్రౌపది ద్వారకానాథుని పిలిచి నప్పుడు, లేదా గజేంద్రుడు శ్రీహరిని పిలిచినప్పుడు, వహించినట్టి యదే సమానభావముతోడ భగవంతుని నీవు పిలువ వలయును. ఈభావమును పెంపొందింపుము. భగవంతునిదర్శ నమును తక్షణముకలిగి యుందువు.

ప్రేమలేనిదే మానవుని జీవితము శూన్యము. ప్రేమ లేనిదే మానవుడు వ్యర్థముగ జీవించును ప్రేమ ప్రాధాన్య మైనది. అది సర్వవ్యాపి యైనది. ప్రేమయే ఘనమగు శక్తి. ప్రేమయే జీవితముయొక్క ప్రధాన పోషకరసము. ప్రేమ నొస గుము. అది నీపట్ల నొసగబడును ఈప్రేమను సేవ, జపము, సత్సంగము, ధ్యానముల గుండా కృషిచేయుము.

జపము, కీర్తనము, బీదలసేవ, ధ్యానములద్వారా భగ వంతునిలో వసించుటకు తెంపులేకుండా (నిరంతరము) దృఢ

యత్న మొనర్చుము. అప్పుడు మాత్రమే నీవు కాలమును లేక మృత్యువును జయింపగల్గుదువు.

భగవంతుడు సర్వదా నీతోడనే యున్నాడు. ఆతడు నిన్ను రక్షించి విడుదల చేయును. ఆపరమాత్మునిలో శరణ పొందుము. ఆపరమాత్ముని యాశీర్వచనములు నీజీవితములో నమితముగ పొంగిపొరలి నీమనస్సును, శరీరమును పరివర్తన మొనర్చును. ఆధ్యాత్మిక పదార్థముల యొక్క నీచైతన్యము నభివృద్ధి పఱుపుము. నీయొక్క భావనలు, మాటలు, క్రియలపై నదపు (Control) నములు పఱచుట కనుదినమును ప్రత్యేక ప్రయత్న మొనర్పుము ఆ పరమాత్ముని యునికిని నీగదిలో ననుభవింపుము. ప్రతిదినమును ప్రార్థించి ధ్యానింపుము.

మిత్రుడా! నీహృదయము యొక్క నంతర్యామి (అంతర్యామి) యగుపరమాత్మునిపై నొకింతకాలమువఱకు నీయొక్క లక్ష్యము (శ్రద్ధ) నేకాగ్రమొనర్చి నీమనస్సును లగ్నకరింపుము. ప్రాపంచిక సుఖముల త్యజింపుము. సత్పురుషులచే త్రొక్కబడిన మార్గమును గైకొనుము. ఒకవారము వఱకు పాలు, పండ్లపై జీవింపుము. శీతలమును, నుష్ణమును, నాకలిని, దప్పికను, సహింపుము. అత్యల్పస్థాయి (degree) కైనను నేజీవికిని, హాని యొనర్పకుము. సంతృప్తియైన జీవనమును జీవింపుము. నిందాస్తుతులను సమముగ భావింపుము. నీయాత్మనుండి సుఖమును గ్రహింపుము.

నీవు బ్రహ్మముహూర్తమున 4 A. M. నకు (తెల్లవారుఝామున 4 గంట లగునప్పటికి లేచిన నీవు స్వచ్ఛమైన, ప్రశాంతమైన, మనస్సును కలిగియుందువు. తొలి యుదయ సమయమున నాధ్యాత్మిక ప్రభావమును, విచిత్రమగు నిశ్శబ్ద

తయు, నుండును. సమస్తమగు భక్తులు, (మునులు) యోగులును, నీ సమయమున ధ్యానమొనర్చి యఖిల ప్రపంచమునకును తమ యాధ్యాత్మిక స్పందనముల (Spiritual - vibrations) పంపుదురు. నీవు నీయొక్క ప్రార్థనను, జపమును, ధ్యానమును, నీ సమయమున ప్రారంభించుచో వారి స్పందనముల (vibrations) చే నీ వున్నతముగ ప్రయోజనమొందింపబడుదువు. నీవు శ్రమపడ నవసరము లేదు.

సర్వదా సత్త్వోత్తమ పదార్థములను, సత్త్వోత్తమమైన యాహారమును, సత్త్వోత్తమమగు పండ్లను, సత్త్వోత్తమమగు పాలను, సత్త్వోత్తమమగు వస్తులను, స్నేహితులకు, నిరుగు పొరుగువారికి, ముఖ్య మెరిక లేనివారికి (నపరిచితులకు) నతిథులకు, సేవకులకు, నిమ్ము. నీ వపరిమితమగు సంతోషము, బలము, సుఖముల గ్రహింతువు. దీని నాచరణలో పెట్టి ప్రయోజనముల ననుభవింపుము. నీవు ప్రేమ (భగవత్సంబంధ) నభివృద్ధి పఱతువు.

రోగుల శ్రద్ధగొనుము. ఆర్తుల (దుఃఖితుల) నోదార్పుము. భగవంతునిలో వసింపుము. ప్రేమసందేశమును బోధయొనర్పుము. భక్తియుతముగ, పవిత్రముగ, నుండుము ఇది నిన్ను భగవచ్చైతన్యప్రాప్తికి దారిజూపును.

శ్రీకృష్ణు డుద్ధవునితో "హేళనగ నవ్వు జనుల నెడల లక్ష్యమొసగక దేహమును మఱచి, యవమానము (సిగ్గు) పట్ల నిస్పృహుడై నేమనుజుడేని సాష్టాంగముగ భూమిపై బడి సమస్తజీవులకును క్రింద (అంతస్థున) నుండు కుక్క, చండాలుడు, ఆవు, గాడిద, లకు సహితము వందన మాచరింప వలయున"ని చెప్పెను. అన్యులకు చేయునట్టి సాష్టాంగప్రణా

మములు మానవుని నమస్కరించును. అతడు సాష్టాంగ ప్రణామము లొనర్చునపుడు నారాయణ భావమునుగూడ వహించుచో నిది నాని కేదేని యాతడుచూచినను భగవంతుడే ననియు, భగవంతుడు తప్ప నేదియు లేదనియు. వ్యక్తిస్వరూపము బ్రహ్మముయొక్క విరాట్టుయంశమేననియు, ననుభవ మొందుటకు సహాయ మొనర్చును. నారాయణభావముతోడ నితరులకు సాష్టాంగప్రణామము లాచరించుట భక్తిని పెంపొందించుటకొక గొప్ప సహకారి. ఆవునకు లేదా గాడిదకు లేదా కుక్కకు మానసిక సాష్టాంగ ప్రణామ మొనర్చి నీవు జగత్ప్రభువగు శ్రీహరికి సాష్టాంగప్రణామ మొనర్చుచున్నావని మనోభావ మొందుము. సమస్త ప్రాణికజీవులున్ను, సమస్తపదార్థములున్ను, శ్రీహరియొక్క రూపములుమాత్రమే.

ప్రేమ యోగానుష్ఠానముగుండా మీరందఱును భగవచ్చైతన్యము నొందుదురుగాక! మీ హృదయము భగవంతునియెడ ప్రేమతోడ పూరింపబడుగాక! భగవంతుని యొక్క నాశీర్వాదములు మీ యందఱపై నుండుగాక! మీరందఱును భగవన్నామమును గాన మొనర్చుచు భగవత్ప్రేమను ప్రచార మొనర్చుచు, సంతోషము, శాంతి, సుఖముల సర్వత్ర ప్రసరింప చేయుచు, భాగవతులవలె భాసిల్లుదురు గాక!

## పూజ లేక నుపాసన

భగవంతునియొక్క నారాధనయే పూజ. భక్తుని భగవంతునివద్ద కూర్చొనుటకు, లేదా వాని (నాపరమాత్మునితో) సన్నిహిత సంబంధ మొనర్చుకొనుట కుపకరించునట్టిదియే

నుపాసన. అది హృదయమును పవిత్ర మొనర్చి, మనస్సును స్థిర మొనర్చును. అది మనస్సును శుద్ధభావము, ప్రేమ లేక భగవంతుని యెడ పవిత్రాను రాగముతోడ పూరించును. అది క్రమ క్రమముగ మానవుని దివ్య జీవునిగ పరివర్తించును.

ప్రతిమ లేక మూర్తి (విగ్రహము) సూర్యుడు, అగ్ని, జలము, గంగ (Ganges) సాలి గ్రామము, లింగము, నన్ని యును సాధకులకు మనస్సుయొక్క నైకాగ్రత. హృదయ పవిత్రతల నొందుటకు, సహాయపడు భగవంతునియొక్క చిహ్నములు, లేక ప్రతీకములు. మనస్సును లగ్న మొనర్చుట కొఱకు చిహ్నము సంపూర్తిగ తప్పనిసరి (విధి) యైనది. క్రైస్తవులు కూడ శిలువ (Cross) చిహ్నమును కలిగి యుం దురు. స్థూల మనస్సాధారముగ, లేక నాలంబనముగ, నొక ఘనమగు వ్యక్త (Concrete) చిహ్నమును కావలసియుండును. సూక్ష్మ మనస్సు, భౌతికాతీతమగు (Abstract) చిహ్నమును, వలసియుండును. వేదాంతి సహితము, సంచలన మొనర్చు మనస్సును స్థిరపరచుటకు "ఓమ్" యను చిహ్నమును కలిగి యుండును. ప్రారంభమున చిహ్నము లేనిదే ధారణ లేక ధ్యానము సాధ్యముకాదు.

మనస్సు ప్రారంభమున, దానినొక ఘనరూప వస్తువు లేక చిహ్నముపై లక్ష్మీకరించుట ద్వారా శిక్షింప బడును. అది స్థిరము. సూక్ష్మము, నొనర్ప బడినపుడు దాని ననంత రము "అహంబ్రహ్మాఽస్మి" వంటిదైనట్టి యొక భౌతికాతీత మగు (Abstract) నూహాపై స్థిరీకరింపబడ నగును.

భక్తుడు, ఘనరూపమగు విగ్రహముపై భగవంతుని వాని (నాపరమాత్మని) యొక్క స్వాభావిక గుణములను,

నారోపించును. ఆతడు భగవంతునికై పాద్యము (కాళ్లుకడుగు కొనుటకునీరు) నర్ఘ్యము,నాసనము, (కూర్చొనుటకుస్థానము) స్నానము (దేహముపై పోసుకొనుటకు నీళ్ళు) వస్త్ర సమర్ప ణము, గంధపు ముద్ద పులుముట, పుష్పసమర్పణ, అర్చన, పరిమళ ద్రవ్యము, ధూపము, దీపముల నెలిగించుట, కర్పూ రము (నీరాజనము) త్రిప్పుట, మహానైవేద్యము, మున్నగు నటువంటివైన నమనాఱు రకముల సమ్మానముల నొసగుట, లేక సేవయను షోడశోపచారములను విగ్రహమునకు చేయును. చంచలమగు మనస్సీవిధమగు నుపాసనచే నిప్పుడు స్థిర మొనర్ప బడును. జిజ్ఞాసువు (Aspirant) క్రమ క్రమముగ భగవంతుని యొక్క సమీపత్వము (సన్నిహితత్వము) ననుభవించును. ఆతడు హృదయ పవిత్రతనొంది మెల్లగ తన యహం భావ మును విధ్వంస మొనర్చుకొనును.

పుష్పముల తోడను, నితర యుపాసనా ద్రవ్యముల తోడను, కొంతకాలము వఱకు పూజ నొనర్చిన యాతడు మానసికారాధన (ఉపాసన) ను గైకొన నగును. మానసిక పూజలో భక్తుడు మానసికముగ భగవంతునకు సమస్త కాను కల సమర్పించును. ఇది పెంపొందిన (Advanced) రూపవు టారాధన. భక్తుడు భగవంతునికి "ఓ భగవానుడా! నేను నీవాడను. సమస్తము నీదే. నీదియే యొనర్పబడును. నీవే సమస్తమునై యున్నావు. నీవే సర్వము చేయుచున్నావు. నీవు న్యాయవంతుడవై యున్నావు. నేను నీహస్తములలో పనిముట్టును. నేనేమియు కాదు. నేనేమియు చేయజాలను. నేనేమియు కలిగియుండ లేద" ని చెప్పి యిటుల తన యహం

భావము నంత యుంచుకొని భగవంతునకు నాత్మ నివేదన మొనర్చుకొనును.

ఒక చిన్నవిగ్రహము నారాధించుటలో సహిత మాతడు "పురుషసూక్తము" నుచ్చరించి విశ్వమున కావల కూడా వ్యాపించి. యసంఖ్యాకమగు శిరస్సులు, నసంఖ్యాకమగు నేత్రములు. నసంఖ్యాకమగు హస్తములతో కూడి యుండు విరాట్పురుషుని, యింకను సమస్త జీవుల హృదయములలో వసించు భగవంతుని లేక నాత్మను భావించవలయును.

జిజ్ఞాసువు (Aspirant) తా నారాధించు దైవము విగ్రహములోను, సమస్త జీవుల హృదయములలోను, నీ విశ్వమందలి సమస్త నామ రూపములలోను, కలడని క్రమక్రమముగ ననుభవింప ప్రారంభించును. ఆత డాపరమాత్ముని యునికిని సర్వత్ర ననుభవింప మొదలిడును.

ఉపాసనా కాలమున నాతడు భగవంతుని మంత్రము నుచ్చరించి తన హృదయమును, తన శిరస్సును, జుత్తుముడి (శిఖ) బాహువులు, హస్తములను స్పృశించును. మంత్రము యొక్క ప్రతి యక్షరములోను చైతన్యము కలదు. మంత్రోచ్చారణ, మంత్ర విభాగముల యుచ్చారణ తోడి దేహ భాగముల స్పృశించుట ద్వారా సాధకుడు (జిజ్ఞాసువు) క్రమ క్రమముగ దివ్యత్వ మొసంగబడును. ఆధ్యాత్మిక మేల్కొల్పు (ప్రేరణ) యుండును. ఆధ్యాత్మిక ప్రవాహములు సృజింపబడును. ఆత డుపాసనా వస్తువు (ధ్యేయము) తో నైక్యమగును. ఆతడు భగవంతునియొక్క నదే ప్రపంచమును,

లేదా తోడి సామీప్యమును, లేదా సదృశరూపమును, లేదా లోనైక్యము పొందును.

భక్తునకు లేక జ్ఞానికి (Sage) జడము లేక నచేతన పదార్థమువంటి దెట్టిదియు లేదు. సమస్తమును వాసుదేవుడు లేక చైతన్యము - "వాసుదేవ సర్వమితి" యై యున్నది. భక్తుడు వాస్తవముగ విగ్రహములో భగవంతుని జూచును. నర్సి మెహతా యొక రాజుచే పరీక్షకుంచబడెను. ఆరాజు "ఓ నర్సీ ! నీవు శ్రీకృష్ణునియొక్క హృదయపూర్వక భక్తుడ వగుచో, నీవు చెప్పునటు లావిగ్రహము శ్రీ కృష్ణుడే స్వయముగ నగుచో, నీ విగ్రహమును నడువనిమ్ము" నెను. నర్సి మెహతా ప్రార్థన ననుసరించి యా విగ్రహము నడచెను. శివుని విగ్రహము (మూర్తి) ముందటి పవిత్ర వృషభమగు నంది తులసీదాసుచే సమర్పింపబడిన నాహారమును స్వీకరించెను, మూర్తి (విగ్రహము) మీరాబాయితో క్రీడించెను. ఆపె కొఱకది జీవముతోను, చైతన్యముతోను, భరితమై యుండెను.

హిందూతత్వము (Philosophy) హిందూ యుపాసనా పద్ధతియు నెంతఘనమైనవి! అది విగ్రహారాధనతోడ మాత్ర మాగుట, లేదా ముగియుట లేదు. విగ్రహారాధనగుండా సాధకుడు మెట్టుపైమెట్టుగ (క్రమక్రమముగ) నున్నతర యంతస్థుల భక్తికిని, సమాధి లేక సాంసర్గికైక్యతకును (Comunion) గొంపోబడును. ఆతడు విగ్రహము నారాధించుచుండినను, నాతడు తన మానసిక చక్షువుముందట సర్వవ్యాపియగు భగవంతుని యుంచుకొనవలసియుండును. ఆతడా పరమాత్ముని యునికిని తన హృదయములోను, సమస్త పదార్థములలోను,

గూడ ననుసరింపవలసి యుండును. హిందూ పురాణముల (Scriptures) లో వర్ణింపబడినట్టి యుపాసనావిధములు, నియమములు, పూజావిధి, యుపాసనారహస్యములు, శాస్త్రరీత్యా (శాస్త్రాధికముగ) సరియైనవియు, నత్యున్నతముగ హేతువాద (Rational) మైనవియు నైయున్నవి. పురాణముల పఠింపనట్టియు, భక్తుల (మహానుభావుల) సహవాస మొనర్పనట్టియు మూఢజనులుమాత్రము, విగ్రహముల లేక మూర్తుల యుపాసనను నిందింతురు.

ప్రారంభమున విగ్రహము నారాధించు సాధకుడు, సర్వత్ర భగవంతుని జూచుచు పరాభక్తిని పెంపొందించును. "విశిష్టభక్తి" నుండి యాతడు "రాగాత్మికభక్తి" లేక "ప్రేమభక్తి" కి జనును. ఆత డఖిలప్రపంచమును భగవంతునిగ జూచును. మంచి, చెడ్డ, ఒప్పు, తప్పు, తుంటరి (Rogue) మున్నగు భావనలు మాయమగును. ఆతడు భగవంతుని తుంటరి, బందిపోటుదొంగ, త్రాచుపాము, తేలు, చీమ, కుక్క, చెట్టు, మ్రాను దుంగ (log of wood) రాతిపలక (Block of Stone) సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, అగ్ని, నీరు, భూమి, మున్నగువానిలోజూచును. వానియొక్క దృష్టి లేక ననుభవము వర్ణన నసాధ్యమొనర్చును. భూలోకముపై వాస్తవికదైవము లైనట్టియు. సంసారపంకిలము (బురద) నుండి యితరుల లేవనెత్తి వారిని మృత్యుబంధముల నుండి రక్షించుటకు జీవించునట్టియు, నైనట్టి యట్టి యౌన్నత్య మొందిన భక్తులకు జయము. (మంగళము)!

తులసీదాసు సర్వవ్యాపియగు తత్త్వము (సారము) ను గ్రహించెను. ఆతడు విశ్వచైతన్యమును కలిగియుండెను.

ఆతడు సర్వవ్యాపియై నిరాకారుడగు భగవంతునితో సంసర్గ మొందియుండెను. అయినప్పటికిని తన చేతిలో ధనస్సుతోడి శ్రీరాముని జూడవలెనను వాని తీవ్రకాంక్ష మాయమవలేదు. ఆతడు బృందావనమునకు జని వాని (పరమాత్ముని) చేతులలోనుండు మురళితోడి శ్రీకృష్ణునియొక్క మూర్తిని చూచి నప్పుడాతడు "నేనీ రూపమునకు నాతలను వంచన" నియెను. తత్క్షణమే శ్రీకృష్ణరూపము శ్రీరామరూపమును వహించెను. అప్పుడుమాత్రమే నాతడు తన శిరస్సును వందనరూపముగ వంచెను. తులసీదాసువలెనే, తుకారాముడుకూడ సమానముగు విశ్వానుభవమును కలిగియుండెను. ఆతడు తన యభంగములో "చెఱకుగడయందు మాధుర్యము సరిగ వ్యాపించునటువలె నేను నా దివ్య ప్రభువును (భగవానుని) సర్వవ్యాపిగ చూచుచున్నాన" ని గానమొనర్చెను. అయినప్పటికిని నాతడు సర్వదా కటి స్థలముల (hips) పై తన (పరమాత్ముని) చేతులతో నుండెడు పండరీపురము నందలి తన ప్రభువగు విఠలుని గూర్చి మాట్లాడుచుండును. మీరా కూడ సర్వవ్యాపియగు శ్రీకృష్ణునితోడి యైక్యము ననుభవించెను. నయినప్పటికిని నాపె "నా గిరిధరనగరమ"ని తిరిగి తిరిగి యుచ్చరించుటకు విసుగు చెందలేదు.

అద్వైతానుభవము కలిగినట్టియు, నాత్మయొక్క నేకత్వమును దర్శించినట్టియు, నద్వైత భావమును కలిగినట్టియు మధుసూదనస్వామి తన చేతులలోని మురళితోడి శ్రీకృష్ణుని రూపమున కమితముగ బద్ధానురాగుడయ్యెను. పై సత్యములనుండి యెవడేని మానవుడు మూర్తి లేక విగ్రహము యొక్క నారాధన (ఉపాసన) గుండా భగవంతుని

సాక్షాత్కార మొందగలడనియును సగుణ రూపములోని భగవదారాధన వేదాంతానుభూతికి కూడను, ఇంకను భగవంతుని వానియొక్క సర్వవ్యాపియగు నిరాకారాంశమున ననుభవ మొందుటకును, నొక గొప్పదగు సహకారియనియు. ప్రారంభమున ధారణ, ధ్యానముల యుద్దేశ్యము కొఱకై మూర్తి యుపాసన చాల ముఖ్యమనియు పైగ నట్టియుపాసన భగవచ్చైతన్య ప్రాప్తి కెవ్విధమునను యడ్డు కాదనియు, మూర్తిపూజను తీవ్రముగ నెదుర్కొనువారు దట్టమగు చీకటిలోను, నజ్ఞానములోను, తగవులాడు వారనియు, మీదు మిక్కిలివారు, పూజ, ఉపాసనల యొక్క వాస్తవిక జ్ఞానము కలిగియుండ లేదనియు, తాము పండిత జనులమని ప్రదర్శించుటకు మూర్తి పూజకు విరుద్ధముగ వారనవసర వ్యర్థవాదనలు ప్రసంగమున ప్రవేశింతురనియు, వారెట్టి సత్యమును సాధననేమాత్రమును, చేసియుండ లేదనియు, మనము స్పష్టముగ గ్రహింప నగును. సోమరి (వ్యర్థ) సంభాషణ, దీర్ఘసంభాషణను తమ యలవాటుగను, వృత్తిగను, నొనర్చుకొనిన జనులు వారే. వారు తమ్ము తాము ధ్వంస మొనర్చు కొనిరి. వారసంఖ్యాకమగు జనులయొక్క మనస్సుల నస్థిరత్వ మొనర్చి, వారినికూడ ధ్వంస మొనర్చిరి. నిఖిల ప్రపంచమును నొక కొండొక రూపములో లేదా వేఱొకదానిలో చిహ్నములను మూర్తులను మాత్రమే నారాధించును. ఎవడేని మానవుడు ధ్యానమున పురోగమించునపుడు (ముందుకు సాగునపుడు) రూపము (ఆకారము) రూపరహితము (నిరాకారము)లో కరగి పోయి యాతడు రూపరహితసారము (తత్త్వము) తో నైక్యమగును.

కాళీపాత్రలు (vessels) మాత్రమే నట్టి శబ్దము నొనర్చును. ధ్యానము, యుపాసన నొనర్చునట్టి జ్ఞానము, వాస్తవిక భక్తితో పూరితుడైనట్టి యాచరణ పూర్వక మానవుడు సర్వదా మౌనము (నిశ్శబ్దము) వహించును. మౌనము ద్వారా నాత డితరులను ప్రభావపఱిచి బోధించును. ధారణ (ఏకాగ్రత) కొఱకు ప్రారంభమున మూర్తి యవసరమో కాదో యాతడు మాత్రమె యెఱుగును.

మానవుడెంత బుద్ధిమంతుడైనప్పటికిని ప్రారంభమున నేదియో కొండొక చిహ్నముయొక్క సహాయము లేనిదే నాతడు ధారణ మొనర్పజాలడు. బుద్ధిమంతుడు, విద్యావంతుడునైన మనుజుడు తనయొక్క గర్వము, దర్పము (Vanity) మూలమున "నేను మూర్తి (విగ్రహము) నిష్టపడను. ఒక రూపముపై ధారణ నొనర్చుటకు నేను కోరను" అని మాత్రము చెప్పును. ఆతడు నిరాకరమైన నొక దానిపై ధారణ నొనర్పజాలడు. ఆతడు జనులు తనపట్ల వారు తానొక రూపముపై ధ్యానించు చున్నటుల తెలియవచ్చినప్పుడు, నవ్వుదురని యూహించును. రూపరహితమగు నొక దానిపై నెట్టి ధ్యానము నాతడొనర్పడు. ఆతడు కేవలము సంభాషించును, వాదించును, నటించును. ఆతడు తనజీవితము ననవసర ప్రసంగములలో మాత్రమే వృథపుచ్చును. ఒక ఔన్సు పరిమాణపు వానియొక్క నాచరణ, టన్నులకొలది వైజ్ఞానిక సిద్ధాంతముల (Thearies) కంటె శ్రేష్టతరము. బుద్ధిమంతులగు మానవులలో, విస్తారమగు నధిక సంఖ్యయందు బుద్ధి యొకాంటకమైయున్నది. వారు బ్రహ్మము యొక్కనునికొక యూహాకార్యమ (Guess work) నియు, సమాధి మనస్సుయొక్క

మోహకారక కల్పనయనియు, నాత్మ సాక్షాత్కారము వేదాంతులయొక్క భావన (మనోకల్పన) నియు చెప్పెదరు. భ్రమిత (మోహిత) జీవులు! వా రజ్ఞానములో ముంచబడిరి. ఆత్మ జ్ఞానముతో సరిపోల్చినప్పుడు కేవలము ఊక (Husk) యైనట్టి తమ లౌకిక (ప్రాపంచిక) జ్ఞానముచే వారు గొంపోబడిరి. అట్టి జనులకు మోక్షముయొక్క నాశ లేదు. తొలుత వారి నిండ్య (తప్పగు) సంస్కారములు సత్సంగము గుండా, నుత్తమ సంస్కారములచే కడిగి వేయబడవలెను. అప్పుడు మాత్రమే వారు తమ తప్పిదముల గ్రహింతురు. భగవంతుడు వారిపై స్వేచ్ఛముగు వివేచనా శక్తిని (Under standing) వాస్తవిక జ్ఞానమునకై పిపాస (Thirst) ను ప్రసాదించుగాక.

మీరందఱ అత్యంతాంతర్య తమమైన శాశ్వతా నందము ననుభవింతురుగాక !

## ప్రసాద మహిమ (Greatness of Prasad)

శాంతి కొఱకు సదేవియో ప్రాసాదము. కీర్తన, నుపాసన, పూజ, హవనము, నారతి సమయములందు, బాదము పప్పు, కిస్మిసు, చిన్నద్రాక్ష పండ్లు, పాలు, మిఠాయిలు, వండ్లు, భగవంతునికి సమర్పింప బడును. బిల్వ (మారేడు) పత్రములు, పుష్పములు, తులసి, విభూతిచే పూజ యొనర్పబడి, యివియే భగవంతునినుండి ప్రసాదముగా నీయబడును. పూజ, హవన సమయములందు మంత్రముల గానముచే నవి విచిత్రమగు శక్తులతోడ పూరింపబడును.

ప్రసాద మొక గొప్ప పవిత్రకారి. ప్రసాద మొక సరరోగ నివారిణి. ప్రసాద మొక యాధ్యాత్మిక సుధ. (అమృ

తము) ప్రసాదము భగవంతుని కృపయే. ప్రసాదము శక్తి యొక్క మూర్తీభవమే. ప్రసాదమే వ్యక్తి స్వభావమును నుండు దైవము. (Divinty) ప్రసాద మొకదాని నుండి మాత్రమే చాల మనఃపూర్వకముగ సాధకు లత్యద్భుతముగ ననుభవముల నొందుదురు. చాల కుదరరాని రోగములు నయమొనర్పబడును. ప్రసాదము శక్తివంత మొనర్చును. మనుకుదన పరచును. నింకను భక్తిని జోరబెట్టును. అది గొప్ప విశ్వాసముతో తీసుకొన బడవలెను.

అధునాతన (modern) విద్య, సంస్కృతులలో పెంప బడిన వారెవరో వారు ప్రసాదముయొక్క మహిమనుగూర్చిన సర్వమును మఱచిపోయిరి. ఇదియొక తీవ్రమగు తప్పిదము.

ఒక వారమువరకు బృందావనము, పండరీపురము, లేదా వారణాసి, (కాశి) లో వసింపుము. ప్రసాదముయొక్క మహిమను, విచిత్రఫలితములను, నీవు గ్రహింతువు. ప్రసాద ముత్తమమగు నారోగ్యమును, దీర్ఘాయువును, శాంతిని, ఐశ్వర్యమును, అందఱికి నిచ్చును. శాంత్యానందముల ప్రదాతయగు ప్రసాదమునకు మంగళము. మోక్షము, నక్షయ సుఖములయొక్క ప్రదాతయగు ప్రసాదముయొక్క భగవానునికి మంగళము.

విభూతి:—జగత్ప్రభువగు శివుని ప్రసాదమై యున్నది. నుదుటిపై నుపయోగింప బడవలెను. ఒక యల్పభాగము, లోనికి తీసికొనబడనగును.

కుంకుమ:—శ్రీదేవి లేక శక్తియొక్క ప్రసాదమై యున్నది. కనుబొమలనడుమ స్థలము (ఆజ్ఞా లేక భ్రూమధ్య) నొద్ద నుపయోగింప బడవలెను.

తులసి:- జగత్స్వామియగు విష్ణువు, రాముడు లేక కృష్ణునియొక్క ప్రధానమైయున్నది. లోనికి తీసుకొనబడవలసినది. బాదముపప్పు, కిస్మిసు, చిన్నద్రాక్ష, పండ్లు, మిఠాయిలు, మున్నగునవి. సమస్తమగు నీ ప్రసాదమును, సర్వప్రాధాన్యమగు ధార్మిక కార్యములందు నీయబడును.

## శ్రీ సుబ్రహ్మణ్య స్వామియొక్క నారాధన

ఈ విశ్వమునకు పరిపాలకుడును, మనహృదయములలో నంతర్యామి (నంతర్యామి) యు, జగత్ప్రభువగు శివునియొక్క ద్వితీయపుత్రుడును, "వల్లి" "దైవనాయ్" (Daivanai) ల యొక్క ప్రియుడును, (వనగా భర్తయును) తన భక్తులపై సులభముగ వరముల ప్రసాదించువాడును, శక్తి, జ్ఞానము, ప్రేమ, ఆనందము, (సౌఖ్యము) ల యొక్క మూర్తిభవమును నైన పరమాత్ముడగు (Supreme being) శ్రీసుబ్రమణ్యస్వామివారికి సాష్టాంగప్రణామములు, వందనములు.

అసురుడగు తారకుడు దేవతల నత్యధికముగ పీడించెను. స్వర్గమునుండి వారిని త్రోలివేసెను. సమస్తదేవతలు బ్రహ్మవద్దకు జనిరి. బ్రహ్మ దేవతలతో "ఓ దేవతలారా! తారకాసురు డుగ్రతపస్సుచే నాకృప నొందియుండుటవలన నే నాతనిని ధ్వంసమొనర్పజాలను. కాని నేను మీకొక సలహా (సూచన) నిత్తును. మన్మథుని లేక కామదేవుని సహాయము నొందుడు. తనయొక్క యోగసమాధిలో మగ్నమైయున్న పరమేశ్వరుడగు శివుని పార్వతితోడ కలియుటకై మోహపరచుటకు వానిని ప్రేరేపింపుడు. వారికి నొక శక్తివంతుడగు పుత్రుడు - శ్రీ సుబ్రహ్మణ్యస్వామి లేక కార్తి

కేయుడు జననమొందును. ఈ పుత్త్రుడా యసురుని నాశ మొనర్చుననియెను. ఇంద్రుడు కామదేవుని, వాని భార్య యగు రతీదేవి, వానిసహచారి (Companion) యగు వసంతము (Spring) తోడను, శివుని ధామమైన కైలాసపర్వతమునకు జనుటకు కోరెను. కామదేవుడు తక్షణము రతీదేవి, వసంత ములతోడ కైలాసపర్వతమునకు బయలుదేరెను. వసంత ఋతువు వెంటనే వచ్చెను. కామదేవుడొక చెట్టువెనుక నిలుచుని జగత్స్వామియగు శివుని, పార్వతి యా పరమేశ్వ రుని చేతిలో పుష్పముల నుంచు చున్నప్పుడు తనమదన బాణమున కొట్టెను. పార్వతి చేయి పరమేశ్వరుడగు శివుని చేతులతో స్పర్శనొందుట తటస్థించిన వెంటనే నాయన యొక తాపడు (feeling) ననుభవించెను. తన యోగమును భంగ పఱిచిన దదియేదియై యుండునని శివుడాశ్చర్య మొందెను. శివుడు చుట్టును చూచి చెట్టువెనుక కామదేవుని పరికించెను.

కాని, శివుడు తనమూడవ నేత్రమును తెఱచెను. ఆయన మూడవ నేత్రమునుండి బయల్వెడలిన యగ్నిచే మన్మ థుడు బూడిదగ దగ్ధమొనర్పబడెను. అందుచేతనే మన్మథుడు లేక కామదేవుడు (ప్రేమయొక్క దేవుడు) అనంగుడు లేక దేహరహితుడని పిలువబడు చున్నాడు.

కామదేవుని దగ్ధమొనర్చిన పిదప శ్రీశివుడు తనయోగ దృష్టిచే శక్తివంతుడగు తారకుని విధ్వంస మొనర్చుటకు సుబ్రహ్మణ్యస్వామి యొక్క జననము సంపూర్తిగ నవసరమని కనుగొనెను. శివునిబీజము నగ్నిలో విసరబడ నాతడు వహింప జాలక గంగలో విసర నాపె తిరిగి రెల్లు యడవిలోనికి విసరగా నందచ్చట రెల్లు నందుద్భవించిన (శరజన్మ)వాడని పిలువబడు

కార్తికేయుడు (సుబ్రహ్మణ్యస్వామి) జనియించెను. బ్రహ్మ యుద్దేశించిన రీతిగా నాతడు దివ్యగణముల (Celestial hoste) సేనానాయకుడై తారకాసుర వినాశకారి యయ్యెను.

సుబ్రహ్మణ్యస్వామి శివుని యొక్క నవతారము. సమస్త అవతారములును నేకైక పరబ్రహ్మము (Supreme Lord) యొక్క వ్యక్తస్వరూపములే. (నామరూపాత్మకములే) సుబ్రహ్మణ్యస్వామియును, శ్రీకృష్ణుడును నొకటియే. శ్రీకృష్ణుడు గీతలో "సేనానీనామ్ అహంస్కంద- సేనాపతులలో నేను స్కందుడ" నని చెప్పెను, భగవంతు డాయనంతటాయన వివిధనామ రూపములలో ధర్మము స్థాపించుట కొరకు, బహిర్గత (వ్యక్త) మగును.

సుబ్రహ్మణ్యస్వామి జగత్స్వామియగు శ్రీశివుని యొక్క చైతన్యము నుండి జనన మొందిన యొక కిరణము (అంశము) ఆయన జగత్ప్రభువగు శివునియొక్క శక్తి (energy) యే. "వల్లి" "దైవనాయ్" (Deivanai) యనువారలు వాని యిరువురుభార్యలు. వారు సుబ్రహ్మణ్యస్వామియొక్క క్రియాశక్తి, జ్ఞానశక్తుల ప్రాతినిధ్యమువహింతురు. హానుమానునివలె నీకలియుగమున నాయనయునొక ప్రత్యక్ష దేవతయే. ఆయన తన భక్తులపై వారు తనపట్ల నొకింత భక్తిని ప్రదర్శించు నప్పటికిని, లౌకిక, ఆధ్యాత్మికైశ్వర్యములను, ప్రతి యుద్యమములోను జయమును ప్రసాదించును. ఆయన దక్షిణ హిందూ దేశములో నధికముగ నారాధింపబడును. గుహుడు, మురుఘుడు, (murugha) కుమారేశుడు, కార్తికేయుడు, షణ్ముఖుడు, (ఆరు శిరస్సులు గలవాడు) సుబ్రహ్మణ్యుడు, వేలాయుధుడు, బల్లెము (Spear) ధరించువాడు)ను సమానార్థక పదములే.

బొమ్మ (చిత్రపటము) లో సుబ్రహ్మణ్యస్వామి, శక్తి తుడగు శిశువు తన చేతిలో త్రిశూలమును పట్టుకొన నటువలె తన చేతిలో వేలమును లేక బల్లెమును పట్టుకొనును. ఇది నధికారము (power) నకు చిహ్నము. ఆయనే ప్రపంచము నకు పరిపాలకుడని నిది తెలియజెప్పును. సుబ్రహ్మణ్యస్వామి యొక్క భక్తులు వేలమును విధిగ నారాధింతురు. వాని వాహనము నెమలి. ఆయన నెమలిపై స్వారి చేయును. ఆయన సంపూర్తిగ గర్వమును, నహంభావమును, దర్పము (Vanity) ను జయించెనని యిది తెలియజెప్ప Represent)ను. ఆయన పాదముల క్రింద నొక త్రాచుపాముండును. ఆయన బొత్తిగ నిర్భయుడు, మృత్యురహితుడు జ్ఞానవంతుడని యిది ప్రదర్శించును. ఆయనకొక ప్రక్క "వల్లి" యుండును. ఆయనకు వేఱొకప్రక్క "దైవనాయ్" యుండును. ఒక్కొక్కప్పుడాయన యొంటరిగ వేలముతో నిలువబడును. ఆయనిప్పుడు "దండపాణి" యను నామముచే పిలువబడును. మాయనుండి విడుదలైనట్టి యాయనయొక్క నిర్గుణాంశము (తత్త్వము) నిది ప్రాతినిధ్య మొసఁగును.

ఆరు శిరస్సులును నాఱుకిరణముల (అంశముల) ను లేదా నాఱుస్వాభావిక గుణములను నేవన జ్ఞానము (ఆత్మ విజ్ఞానము) వైరాగ్యము, (విరక్తి) బలము (శక్తి) కీర్తి (యశము) శ్రీ (సంపత్తి) యైశ్వర్యము (దివ్యశక్తులు) ల తెలియచేయును. అవి యాయన నాలుగు వేదములకు వేదాంగములకు, వేదాంతమునందలి షణ్మత (యాఱుమత) సిద్ధాంతములకును (Six Schools of Philosophy) మూలమనియును, నాయనాఱును ననగా పంచజ్ఞానేంద్రియములను మనస్సును

వశీకరణముకొఱకు నన్నియు వెల్లడి జేస్తాను. అవి యాయన అనంతశిరస్సులుగల సహస్రశిరస్సులతోడ గూడిన విరాట్పురుషుని యజ్ఞమొనర్చెను. అవి యాయన శిరస్సు సర్వత్ర వ్యాపించినవని (విశ్వతోముఖ) యనగా, యాయన సర్వవ్యాపియని నెఱుక పరచును. అవి యాయన సర్వశక్తిమంతుడనియు, నాయన తన యిచ్ఛను బట్టి గుణీకరించి (పెంపొందించి) రూపముల వహింపగలడనియు, చూపును.

సుబ్రహ్మణ్యస్వామి యొక్క గొప్ప దేవాలయములు తిరునల్వేలి జిల్లాలోని తిరుచెందూరులోను, ఉడిపి, పళని కొండలు, జాఫ్నా (Jaffna) సమీపమందలి కాతిర్ గ్రామము (Kathirgamam) లంక (Ceylon) తిరుపురాన్ కుంద్రము, (Thirupurankundram) లలోను గలవు. శ్రీ సుబ్రహ్మణ్యస్వామి తన బాలలీలలను తిరుచెందూరులో ప్రదర్శించి, తన సమాధిని కాతిర్గ్రామములో గలిగియుండెను. ఎవడేని నొకడు కాతిర్గ్రామమునకు శ్రద్ధ, భక్తి, భగవత్ప్రేమలతో జని దేవాలయమున రెండు లేక మూడు రోజులు నిలుచుచో సుబ్రహ్మణ్యస్వామి భక్తుని కాజ్ఞలొసగును. భక్తుడనుభవముల నొందును. ప్రతిసంవత్సరము స్కందషష్ఠి నాడొక గొప్ప యుత్సవ మీ దేవాలయములో జరుపబడును. వేల కొలది జనులీ స్థలమును దర్శింతురు. ఈ సమయమున కర్పూరపు కొండలు వెలిగింపబడును.

సుబ్రహ్మణ్యస్వామి తారకాసురుని చంపిన దినమైన స్కంద షష్ఠి సమయమున గొప్ప యుత్సవము లీస్థలములలో ఘనముగ నాడంబరము, వైభవములతోడ జరుపబడును. నవంబరు నెలలో స్కందషష్ఠి తటస్థించును. వ్యక్తిగతభక్తులు

కూడ నారాధన, భజన, కీర్తనలు నీ దినమున చాల వైభవమగు స్థాయి (నంతస్థు) లో చేతురు. వేనవేలు జను లమిత సంతృప్తిగ భోజన మిడబడుదురు. ఎవడేని "పళని" ని దర్శించి యుండలిదేవు నారాధించిన చాల కుదరరాని రోగములు కుదురును. దక్షిణ హిందూదేశములో సుబ్రహ్మణ్య స్వామి వారి లీలలు వేదికపై ప్రదర్శింపబడును.

సుప్రసిద్ధ నార్‌కీరార్ (Narkeerar) యను నాయన "తిరుమురు కాట్రుపడై" (Tirumuru katrupadai) ను నా జగత్స్వామి (సుబ్రహ్మణ్యుని) స్తుతిగా గాన మొనర్చెను. ఎవడైతే నీవిఖ్యాతమగు పుస్తకము నదుదినమును భక్తితోడ పారాయణ మొనర్చునో నాతడు జీవితమున జయమును, శాంతిని, నైశ్వర్యమును బొందును. సుబ్రహ్మణ్య స్తుతిగ నరుణగిరినాథార్ యొక్క నావేశ పూరిత కీర్తనలను గలిగి యుండునట్టి "తిరుపుగల్" యనునది యరవభాషలో నొక ప్రఖ్యాతమగు పుస్తకము. అరుణగిరి సుబ్రహ్మణ్య స్వామి యొక్క ప్రత్యక్షదర్శనము గలిగియుండెను. "కావడి చిందు" కీర్తనలుకూడ సుబ్రహ్మణ్య స్వామి స్తుతిగనే నున్నవి.

ఓ సుబ్రహ్మణ్యస్వామీ! ఓ సర్వకరుణామయప్రభూ! మాకు శ్రద్ధ (Faith) గాని. భక్తిగాని, లేదు. సక్రమ రీతిని నిన్నెటు లారాధించుటయో లేక నీపై ధ్యానించుటయో మాకు తెలియదు. త్రోవతప్పి, లక్ష్యమును నీనామమును మరచి పోయినట్టి మేము నీబిడ్డలము. ఓ దయాపూరితమగు తండ్రీ! పాడయిన (చెడిపోయిన) బిడ్డల నీయాశ్రయము క్రింద తిరిగి వెనుకకు తీసికొని, ప్రేమతో లాలించి. రక్షించి నీయొక్క

క్షమించు, నాశీర్వాదముల వర్షించుట నీవిధి (ధర్మము) కాదా ? ఓ తల్లిమాతా ! నీవు మమ్ములను నీ ప్రభువు (శక్తి) వద్దకు చేరఁబెట్టినా ? తన బిడ్డల నెడగల తల్లియొక్క ప్రేమ యీజగత్తున నేవస్తువుకంటెను భారతర (ఎక్కువ బరువు)మైనది, మేము నిష్ప్రయోజకపు, నమ్ర రహితమగు బిడ్డల మయినప్పటికిని నో ప్రియమగు మాతా ! మమ్ముల క్షమింపుము. మమ్ముల నమ్రములుగ. విశ్వాస వంతులుగ నొనర్పుము. ఈ యుత్తర క్షణమునుండియే మేము నీవారము. సదా నీవారమే. సమస్తము నీవియే. అజాగ్రతగ నుండు బిడ్డలు వారు లక్ష్యరహితముగ తప్పుడు త్రోవలో దారితప్పి జనుచున్నప్పుడు సరిచేసి విన్రగఁజేసి, సరిదిద్ది, పరివర్తన మొందించుట తల్లియొక్క విధి. నీనుండి మమ్ములను వేరుజేయు నఖాతము (Gulf) లేదా తెఱను తొలగింపుము. మమ్ముల వికాసమొనర్పుము. మమ్ముల నీపాద పద్మముల కడకు (తిరిగి) వెనుకకుగొని జనుము. మాకధికముగ చెప్పుట కేమియు లేదు. మా ప్రియమగు పురాతన తల్లిదండ్రులైన నీకును, నీ స్వామికిని, నిదియే మా తీవ్రమైన ప్రార్థన.

## శ్రీ గణేశప్రభువుయొక్క నారాధన

స్వయముగ బ్రహ్మ మైనట్టియు, పరాత్పరు (Supreme Lord) డై నట్టియు, జగత్ప్రభువగు నీశ్వరునిశక్తి (Energy)యై నట్టియు, సమస్త సుఖముల కాకర (Source) మైనట్టియు. సమస్త సద్గుణముల, సమస్తోద్యమముల(Undertakings) లో జయముయొక్క ప్రదాతయైనట్టి శ్రీ గణేశ ప్రభువునకు వందనములు.

మూషికవాహన మోదకహస్త-చామరకర్ణ విలంబితసూత్ర।
వామనరూప మహేశ్వరపుత్ర-విఘ్నవినాయకపాద నమస్తే।

చాల పొట్టిదగు రూపముతోడను, నీ వాహనమగు నెలుక (mouse) తోడను, చేతిలో మోదకము (తీపియుండలు) తోడను, విశాలమగు కర్ణములు (చెవులు) పొడుగాటి వ్రేలాడు బొజ్జ (trunk) తోడను నుండి సకలవిఘ్నముల నివర్తకారి (Remover) యు జగదీశుడగు శివుని కుమారుడును నగు నోయీ వినాయకప్రభూ! నీ పద్మములవంటి పాదములనొద్ద నేను సాష్టాంగమిడుదును.

శ్రీ గణేశప్రభువు గజముఖ (ఏనుగుముఖముగల) దేవుడు ఆయన ప్రప్రథమమున నారాధింపబడును. ఎట్టి శుభకార్య మారంభింపబడు ముందును నెవ్విధమగు నుపాసనా ప్రారంభము ముందును నాయన నామములు శ్లోకముల నుచ్చరింపబడును. ఆయనశక్తికి, జ్ఞానమునకు నధిపతి. శ్రీ శివుని జ్యేష్ఠపుత్త్రుడును, స్కంధుడు లేక కార్తికేయుని జ్యేష్ఠభ్రాతయు, (brother) నై యుండెను. ఆయన పరమేశ్వరుడగు శివుని శక్తియే, నందుచేతనే నాయన శంకరదేవ, ఉమాదేవిల యొక్క పుత్త్రుడని పిలువబడును.

ఈ దిగువకథ యాయన జననము, నాయ నేనుగు ముఖము కల్గియుండుటగూర్చి నుడువబడును. ఒకానొకప్పుడు రుద్రు (శివు) ని పత్నియగు గౌరీదేవి స్నానసమయమున తన శరీరపుమన్ను నుండి నొక శుద్ధునిగ (పవిత్రమగు శ్వేతవర్ణప్రాణి) గణపతిని సృజించి యింటిప్రవేశము (ద్వారము) వద్ద నాయన నునిచెను. ఆమె యాయనతో నెవరిని లోనికి రానీయవలదని చెప్పి స్నానమునకై జనెను. శ్రీ శివుడు

... బాహ్యముగ నుండి తిరిగివచ్చెను. కాని ద్వారమువద్ద గణపతిచే నడ్డగింపబడెను. శివుడు కోపమొంది యాయన నొక బాహ్యుడని (Outsider) తలచి గణపతి శిరస్సును ఖండించెను. పార్వతి యిదియంతయు తెలియవచ్చి చాల దుఃఖించెను. శివుడు తన సేవకులను నుత్తరముగ దానిశిరస్సుతో నిద్రించియుండు జీవియొక్క శిరస్సునైన దెమ్మని నాజ్ఞాపించెను. సేవకులు సంపూర్తియగు నన్వేషణ మొనర్చి యాతీరున నొక యేనుగునుమాత్రమే కనుగొనిరి. ఆ యేనుగు యొక్క శిరస్సుఖండించబడి ప్రభుని నెదుట తీసుకొనిరాబడెను. శివు డేనుగుశిరస్సును గణపతిశరీరమునకు సమ్మేళన మొనర్చెను.

జగదీశుడగు శివుడు మానవులచే తమ సమస్తోద్యమములు, వివాహములు, ప్రయాణములు, దండయాత్ర, గ్రంథ పారాయణ మున్నగువాటి ప్రారంభమున మానవులచే నారాధన కల్గునని వానినొసగ్చెను. శ్రీ గణేశునియొక్క సాంవత్సరికారాధన భాద్రపదమున (August September) శుక్లార్ధమందలి (శుక్లపక్షమందలి) నాలుగవదినమున (చతుర్థి)జరుగవలెనని శాసించెను.

శ్రీ గణేశునికృపయు, వాని సహాయము లేనిదే నెట్టిది పొందబడజాలదు. ఆయనయొక్కకృప లేదా నాశీర్వచనము లేనిదే నేకార్యమును యత్నింపబడజనదు.

మహారాష్ట్రమందును, నితర స్థలములలోను నక్షరాభ్యాస సమయమున బాలు డాయనయొక్క మంత్రమగు "ఓం గణేశాయనమః"లో ప్రథమమున ప్రవేశ మొనర్ప (దీక్షింప) బడును. తరువాతి మాత్రమే నక్షరమాల (alphabet) బోధింపబడును.

ఈశనకున నాయనయొక్క కొన్ని యత్యంత సామాన్యమైననామములు. సుముఖ, ఏకదంత, కపిల, గజకర్ణక, లంబోదర, విఘ్నరాజ, వినాయక, ధూమకేతు, గణాధ్యక్ష, బాల (ఫాల) చంద్ర, గజానన, వక్రతుండ, శూర్పకర్ణ, హేరంబ, స్కందపూర్వజ, సిద్ధివినాయక, విఘ్నేశ్వర. ఆయన మహాగణపతి యని కూడను తెలియబడును. ఆయన మంత్రము "ఓం గంగ గణపతయే నమః" యై యున్నది. గణేశుని తమ యిష్టదైవముగ నారాధించుసాధకు లీమంత్రమును లేదా "ఓం శ్రీం గణేశాయనమః" నుచ్చరింతురు

(ఓం) తత్. పురుషాయ. విద్మహే. వక్రతుండాయ. ధీమహి. తన్నో. దంతి. ప్రచోదయాత్. ఇదియే గణేశ గాయత్రి. ఆయన భక్తు లీమంత్రమునుగూడ జప మొనర్ప వచ్చును.

శ్రీ గణేశ ప్రభువు జ్ఞానము, సౌఖ్యము, (ఆనందము)ల యొక్క మూర్తీభవము. ఆయన బ్రహ్మచారుల కధినాయకుడు. ఆయన బ్రహ్మచారులు లేక సంయములలో ప్రప్రథముడు.

ఆయన వాహనముగు చిన్న యెలుక (చిట్టెలుక) పై స్వారిచేయును. ఆయన మూలాధార చక్రమందలి యధ్యక్ష (యధిష్ఠాన) దేవత. వాని స్వరూపము "ఓమ్" లేక ప్రణవమును తెలుపుడుచేయును.

ఆయనాధ్యాత్మిక పంథయందును, ప్రాపంచిక జయమందును సమస్త విఘ్నముల తొలగించు ప్రభువు. కాన నాయన విఘ్నవినాయకుడని పిలువబడును. ఆయన బీజాక్షరము "గంగ" ఆయనమైత్రి (harmony) శాంతులకు ప్రభువు.

ఎలుకపై స్వారీచేయుటచేత నహంభావము నంత మొందించెనని యభివ్యక్తించును. ఆయన నంకుశమును వహించును. అది యాయన ప్రపంచమునకు పరిపాలకుడని వ్యక్తమొనర్చును. అది దివ్యరాజరికత్వము (Divine Royalty) నకొక చిహ్నము.

గణేశుడు ప్రథమదేవుడు (ఆదిదేవుడు) ఎలుకొక చిన్న జీవి. (Creature) ఏనుగు సమస్త జంతువులలోను మిక్కిలి పెద్దది. ఎలుకపై స్వారీచేయుటయు, ఏనుగు తలను వహించుటయు నాయన నతిమిక్కిలి పెద్దదైన ఏనుగునుండి యతిమిక్కిలి చిన్నదైన నెలుకవరకునుగల సమస్త జీవులయొక్క సృష్టికర్తయనుటను తెలుపుజేయును. ఏనుగులు చాల తెలివైనవి. ఏనుగు శిరస్సును వహించుట గణేశప్రభువు జ్ఞానముయొక్క మూర్తీభవమని తెలియజేయును. అది సృష్టిక్రమాభివృద్ధి పద్ధతిని కూడ సూచించును. ఎలుక క్రమక్రమముగ ఏనుగులోని కభివృద్ధి (ఊర్ధ్వత్వ) మొంది కడపట మానవునిగ నగును. అందుచేత గణేశుడు మానవశరీరము, ఏనుగు శిరస్సు తన వాహనముగ నెలుకను కలిగియుండెననగా నదియే కారణము. ఇది యాయన స్వరూపముయొక్క సంజ్ఞక (చిహ్నక) తత్త్వము (Symbolic philosophy)

ఆయన భూతముల (Elements) గణము (సమూహము) యింద్రియముల గణము, తత్త్వముల గణము, వంటి గణములు లేక సమూహములయొక్క నధిపతి, అయన శివునియొక్క ననుయాయిల (Followers) కధినాయకుడై యున్నాడు.

దక్షిణభారతమున గణేశ ప్రభువు నారాధింతురు. వారా యనను "తుంబిక్కై ఆల్వార్" (అనగా తొండముతో నున్నవాడు) యని నామమిడిరి.

శ్రీ గణేశ స్వామియొక్క రెండు శక్తులును "కుండలినీ శక్తి" "వల్లభశక్తి" యనునై యున్నవి.

శ్రీ గణేశప్రభువు మోదకముల (బియ్యముతో నొనర్ప బడిన తీపియుండలు) కై చాల ప్రీతిగలవాడు. ఒకానొక గణేశపూజదినమున నాయన మోదకములసమర్పణ(కానుక)ల నంగీకరించుచు నింటినుండింటికి జనుచుండెను. ఆయన కర్పింప బడినట్టి యుత్తమసంఖ్యగల వీనిని భక్షించిన తరువాత నాయన రాత్రి సమయమున నెలుకపై తిరుగ నారంభించెను. ఒకపాముచు జూచి యెలుక భయమొంది త్రొటుపాటుగ పడిన ఫలితముగ గణపతి క్రిందపడెను. పొట్టవిచ్చి బద్దలయి మోదకములు బైటకురాగా గణపతి యా మోదకములను పొట్టలోనికి క్రుక్కి యా పామును పట్టుకొని తన యుదరము చుట్టు బంధించెను. ఇదంతయు చూచుచు నాకాశమండలి చంద్రుడు హార్దికముగ నవ్వెను. గణపతి చంద్రునియొక్క ప్రవ ర్తనకు చీకాకుపడి తన దంతములలో నొక దానిని వెలుపలి కూడబెరికి దానిని చంద్రుని వైపు విసరి గణేశ పూజా దిన మున చంద్రుని నెడ నెవరైనను చూడరాదని శపించెను. ఎవ రేని చంద్రుని నెడ చూచుచో నతడు చెడ్డపేరును లేదా నిం దను లేదా నపకీర్తిని సంపాదించును. తప్పిదముచే లేక నాక స్మిక సంఘటన (Romance) చే నా దినమున చంద్రు నెవ రేని చూచుట తటస్థించునేని, నాయన శ్యమంతకమణి విష యములో శ్రీకృష్ణునియొక్క తన శీలమును విశదపరచు

గాణేశ గాథ నుచ్చరించు వారు వినుచో వారు నాయప ద్దై లేక సంకటముండి విముక్తులగుదురు. గణేశప్రభు వీవిధముగ నిజమునించుటకు ప్రత్యక్షించెను. శ్రీ గణేశ ప్రభువునకు మంగళము. ఆయన తన భక్తులయెడ నెంత దయా, కరుణాపూరితుడు!

గణపత్యా రాధకులు (గాణాపత్యులు) యనను పరమాత్మతో సమానమైన వారిగ జూతురు. గణపత్యోపనిషత్తైన నాయన పరమాత్మతోడ నైక్యమొనర్పబడెను.

తన భక్తులయొక్క సమస్త విఘ్నముల నివారకుడగు శ్రీ గణేశుని యాశీర్వచనములు మీ యందఱపై నుండుగాక! మీ యాధ్యాత్మిక మార్గములో నిలిచియుండు సమస్త విఘ్నముల నాశము తొలగించి మీపై భక్తిని, ముక్తిని, రెంటిని ప్రసాదించుగాక!

## సప్తమాధ్యాయము

## ఉత్తేజక ధ్వనులు.

గానమొనర్చి భావ సమాధిలో జొరబడుడు.

జయ గణేశ, జయ గణేశ, జయ గణేశ, పాహిమామ్,

1. శ్రీగణేశ, శ్రీగణేశ శ్రీగణేశ రక్షమామ్.
జయసరస్వతి, జయసరస్వతి, జయసరస్వతి పాహిమామ్,
శ్రీసరస్వతి, శ్రీసరస్వతి. శ్రీసరస్వతి రక్షమామ్,
రాజరాజేశ్వరి, రాజరాజేశ్వరి, రాజరాజేశ్వరి పాహిమామ్
త్రిపురసుందరి, త్రిపురసుందరి, త్రిపురసుందరి రక్షమామ్,
శరవణభవ, శరవణభవ, శరవణభవ పాహిమామ్,

సుబ్రహ్మణ్యా, సుబ్రహ్మణ్యా, సుబ్రహ్మణ్యా రక్షమామ్.
వేల్ మురుహా, వేల్ మురుహా, వేల్ మురుహా పాహిమామ్,
(గుహానే)
వేలాయుధ, వేలాయుధ, వేలాయుధ రక్షమామ్.(వేలానే)
శ్రీ వ్యాసభగవాన్, వ్యాసభగవాన్, వ్యాసభగవాన్
పాహిమామ్,
శ్రీ బాదరాయణ, బాదరాయణ, బాదరాయణ,
రక్షమామ్.
శ్రీ శంకరాచార్య, శంకరాచార్య, శంకరాచార్య
పాహిమామ్,
శ్రీ వేదాంతగురు, వేదాంతగురు, వేదాంతగురు
రక్షమామ్.

2. జయగురు, శివగురు, హరిగురురామ్,
జగద్గురు, పరమ్‌గురు, సద్గురుశ్యామ్.

3 వ వరుస (Thars)

నటేశ శరణమ్-శరణమ్ శ్రీవెంకటేశ,
శ్రీ శంకరాచార్య శరణమ్-శరణమ్ శ్రీవ్యాసభగవాన్,
శ్రీ దత్తాత్రేయ శరణమ్-శరణమ్ శ్రీరాధేకృష్ణ,
శ్రీ సీతారామ శరణమ్-శరణమ్ శ్రీహనుమంత.

4 వ వరుస (Thars)

రామరామ నమోస్తుతే.
శ్రీవ్యాసభగవాన్ నమోస్తుతే. జయవిష్ణు అవతార్
నమోస్తుతే.

శ్రీ నారాయణ నమోస్తుతే, జయకృష్ణ ద్వైపాయన
నమోస్తుతే.
శ్రీ శంకరాచార్య నమోస్తుతే, జయజగద్గురు నమోస్తుతే,
శ్రీ అద్వైతాచార్య నమోస్తుతే, జయ శంకర అవతార
నమోస్తుతే.
శ్రీ దత్తాత్రేయ నమోస్తుతే జయశ్రీ అవధూతగురు
నమోస్తుతే.
శ్రీ గురుదేవదత్త నమోస్తుతే-జయ త్రిమూర్తిఅవతార
నమోస్తుతే.

5 వ వరుస.

దీనబంధు దీననాథ విశ్వనాథ హేవిభో,
పాహిమామ్ త్రాహిమామ్ ప్రాణనాథ హేప్రభో.

6 వ వరుస.

ఓం శివ ఓం శివ ఓంకార శివ
ఉమామహేశ్వర తవ చరణమ్
పరాత్పరా శివ తవ చరణమ్
నమామి శంకర భవాని శంకర
గిరిజా శంకర తవ చరణమ్

7 వ వరుస.

ఓమ్ శివ ఓమ్ శివ ఓమ్ శివ ఓమ్
ఓమ్ శివ ఓమ్ శివ. శివ శివ ఓమ్
ఓమ్ హర ఓమ్ హర ఓమ్ హర ఓమ్
ఓమ్ హర ఓమ్ హర హర హర ఓమ్

ఓమ్ హారి ఓమ్ హారి ఓమ్ హారి ఓమ్
ఓమ్ హారి ఓమ్ హారి హారి హారి ఓమ్

౮ వ వరుస.

హారహార హారహార - భుం, భుం, భుం
హారిహారి హారిహారి - ఓమ్, ఓమ్, ఓమ్
హారభుమ్ హారభుమ్ - హారభుమ్ భుమ్ భుమ్
హారిఓమ్ హారిఓమ్ - హారిఓమ్ ఓమ్ ఓమ్
హార హార హార - భుం భుం భుం
హారి హారి హారి - ఓమ్ ఓమ్ ఓమ్
హారభుం హారిఓం హారభుం హారిఓమ్
హారిఓమ్ హారభుమ్ - హారిఓమ్ హారభుమ్
భుం భుం భుం భుం - భుం భుం భుం
ఓమ్ ఓమ్ ఓమ్ ఓమ్ - ఓమ్ ఓమ్ ఓమ్
భుం ఓం భుం ఓం - భుం ఓం భుమ్
ఓమ్ భుం ఓమ్ భుం - ఓమ్ భుం ఓమ్

౯. శివ శంకర హార శంకర - జయ శంకర పాహి
నమ శంకర ఉమ శంకర - జట శంకర పాహి

10 వ వరుస.

కాశీవిశ్వనాథ సదాశివ
భుం బోలో కైలాసపతే
భుం బోలో కైలాసపతే

11 జయ శివశంకర - హార త్రిపురారీ,
పాహి పశుపతి - పినాకధారీ,

జయ శివశంకర - జయ అసురారీ,
జయ గంగాధర - జయ మదనారీ,
జయ మురళీధర - జయ అసురారీ, (కంసారీ)
జయ మనమోహన - కుంజవిహారీ,

12 శంభోశంకర్ - హర సదాశివ,
శంభోశంకర్ - హర సదాశివ,
శంభోశంకర్ - హర సదాశివ,
శంభోశంకర్ - హర సదాశివ,
శంకర్ శంకర్ - జయ మహాదేవ,
శంకర్ శంకర్ - జయ సదాశివ,
శంకర్ శంకర్ - జయ పరమేశ్వర,
శంకర్ శంకర్ - జయ హరోహర.

13 శంకరా శివశంకరా - శివశంకరా శివశంకరా,
శంకరా శివశంకరా - శివశంకరా శివశంకరా,
మాధవాహరి మాధవాహరి - మాధవాహరిమాధవా
రాఘువారఘు రాఘువా రఘు - రాఘువా రఘు
రాఘువా,
రాఘువారఘు రాఘువారఘు - రాఘువా రఘు
రాఘువా.
అచ్యుతానంద గోవిందాహరి - సచ్చితానంద
శాశ్వతా,
అచ్యుతానంద గోవిందాహరి - సచ్చిదానంద
శాశ్వతా.

14 హరహర శివశివ సర్వేశా
సచ్చిదానంద సర్వేశా
శంభోశంకర సర్వేశా
సర్వభూతాధివాస సర్వేశా
హరినారాయణ సర్వేశా.
ఆనందాత్మక సర్వేశా
హరిగోవింద సర్వేశా
సర్వాంతరాత్మా సర్వేశా
కేశవ మాధవ సర్వేశా
సర్వాంతర్యామి సర్వేశా
అఖండాద్వైత సర్వేశా.

15 జయ జయ సీతారామ రమాపతి
జయ జయ రాధేశ్యామ శ్యామ్
జయ జయ శంకర్ కైలాసపతి
జయ ఉమాపతి మహాదేవ

16 రామరామ రామరామ - రామనామ తారకమ్
రామకృష్ణ వాసుదేవ - భక్తిముక్తి దాయకమ్
జానకీ మనోహరమ్ - సర్వలోక నాయకమ్
శంకరాది సేవ్యమాన - దివ్యనామ కీర్తనమ్
రామరామ రామరామ రామరామ రామరామ్
రామరామ రామరామ రామరామ రామరామ్

17 శ్రీరామ, రఘురామ, పరంధామ, బలభీమ
శ్రీరామరామ, రఘురామరామ,
పరంధామరామ, బలభీమ

భక్తపాల, శక్తిలోల, యుక్తిజాల, విఠల
విఠలవిఠల, విఠలవిఠల, విఠలవిఠల, విఠల
భక్తపాల పాలా, శక్తిలోల లోలా,
యుక్తిజాల జాలా, విఠల

18 రామహో కృష్ణహో - రాధాకృష్ణ దేవహో
వేణుగానలోల నీలమేఘశ్యామ కృష్ణహో

19 జయరామ, శ్రీరాధేకృష్ణ భజలే సీతారామ్
భజలే సీతారామ్ ప్యారే, భజలే రాధేశ్యామ్

20 పతీత జనకో కరో పునీత -
హేరామసీత హేరామసీత
రామంవందే దశరథ బాలామి -
సీతానాయక రఘుకుల తిలకమ్
కృష్ణంవందే నందకుమారమ్ -
రాధావల్లభ నవనీత చోరమ్

21 జయ గోవిందమ్ జయ గోపాల్ -
కేశవ మాధవ దీనదయాళ్
జయదామోదర కృష్ణమురార్
జానకివల్లభ సర్వాధార్

22 జయగోపాల్, జయగోపాల్,
జయమనమోహన, జయనందలాల్
జయజయ విఠల, జయహరి విఠల,
విఠల విఠల జయపాండురంగ

23 గోవింద హరే - గోపాల హరే
జయ జయ ప్రభు దీనదయాల హరే

24 జగమే సుందర హైదోనామ్
"రాధేశ్యామ్ - సీతారామ్."

## ధ్వనులు

1 కృష్ణానంద ముకుంద మురారే - వామన
మాధవ గోవింద

గోవింద, గోవింద, గోవింద, గోవిందా
కృష్ణా రామ గోవింద, రామ కృష్ణ గోవిందా
కేశవమాధవ గోవింద, హరి హరి హరి హరిగోవిందా

2 జయ సీతారామ్ జయ, జయ సీతారామ్ జయ,
జయ సీతారామ్ జయ, జయ సీతారామ్,
జయ సీతారామ్ జయ, జయ సీతారామ్ జయ,
జయ సీతారామ్ జయ, సీతారామ్............
జయ సీతారామ్ జయ, జయ సీతారామ్ జయ
జయ సీతారామ్ జయ, రామ్ రామ్ రామ్
సీతారామ్, సీతారామ్, సీతారామ్, జయ సీతారామ్

3 జయ జయ సీతారామకీ జయబోలో హనుమానకీ
రామలక్ష్మణ జానకీ జయబోలో హనుమానకీ
జయ హనుమాన్ జయ, జయ హనుమాన్ జయ
జయ హనుమాన్ జయ, జయ హనుమాన్

4 అవధ్‌విహారీ సీతారామ్ - కుంజ్ విహారీ రాధేశ్యామ్
ధనుష్‌ధారీ సీతారామ్ - మురళీధారీ రాధేశ్యామ్
జయ దశరథనందన సీతారామ్ - జయ నందనందన
రాధేశ్యామ్

5 రాధేశ్యామ్, రాధేశ్యామ్, రాధేశ్యామ్,
జయ రాధేశ్యామ్
విపిన్ విహారీ రాధేశ్యామ్, మురళీధారీ రాధేశ్యామ్
జయ దుఃఖనాశక రాధేశ్యామ్, ప్రేమ
ప్రకాశక రాధేశ్యామ్
జయ నంద నందన రాధేశ్యామ్, యశోద నందన
రాధేశ్యామ్
గిరివరధారీ రాధేశ్యామ్, అధమోద్ధారణ రాధేశ్యామ్
బన్సేవాలా రాధేశ్యామ్, కమ్లేవాలా రాధేశ్యామ్
మోహన ప్యారే రాధేశ్యామ్, శ్యామ ప్యారే
రాధేశ్యామ్,
రాధావల్లభ రాధేశ్యామ్, గోపీ వల్లభ రాధేశ్యామ్
భక్తవత్సల రాధేశ్యామ్, పతీతపావన రాధేశ్యామ్
జనమన రంజన రాధేశ్యామ్,
భవభయభంజన రాధేశ్యామ్
జయసుఖకారీ రాధేశ్యామ్
జయదుఃఖహారీ రాధేశ్యామ్,

6 శ్రీరామా సీతారామా
జయరామా, జయజయరామా

7 సీతారామా, సీతారామా, సీతారామారామ్
రాధేశ్యామా రాధేశ్యామా రాధేశ్యామా శ్యామ్
శ్యామహరి, శ్యామహరి, శ్యామహరిశ్యామ్
రామహరి, రామహరి, రామహరి రామ్

8 గోవింద గోవింద గోపాలరామ
గోపాల గోపాల గోవిందరామ
గోవిందరామ – గోపాలరామ

9 గోవింద రామ్ రామ్, – గోపాల హరి హరి,
గోపాల రామ్ రామ్, గోవింద హరి హరి,

10 సీతారామ సీతారామ సీతారామ రామ్
రాధేకృష్ణ రాధేకృష్ణ కృష్ణరాధే
రాధే రాధే రాధే రాధే రాధే రాధే
జయశ్రీ రాధే జయశ్రీ రాధే జయశ్రీ రాధే
సీతే సీతే సీతే సీతే సీతే సీతే
జయశ్రీ సీతే జయశ్రీ సీతే జయశ్రీ సీతే
హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్ తత్సత్
హరిః ఓమ్ తత్సత్
హరిః ఓమ్ శాంతి హరిః ఓమ్ శాంతి హరిః ఓమ్ శాంతి

11 విహారి, మురారి, గిరివరధారి,
శ్రీకృష్ణ, గోపీకృష్ణ, రాధేకృష్ణ
నందలాల కంబ్లీవాల బన్సీవాలా
గోకులకే రహనేవాలా మురళీవాలా

12 బోల్ హరి బోల్ హరి హరి హరి బోల్
కేశవ మాధవ గోవిందబోల్
బోల్ హరి బోల్ హరి హరి హరి బోల్
క్యాలగేగా క్యాలగేగా ప్రాణీతేరామోల్
బోల్ హరి బోల్ హరి హరి హరి బోల్
శ్రీ రాధేకృష్ణ, గోవింద, గోపాల హరిబోల్

13 మదనమోహన భజో బృందావనచంద్ర భజో
రాధేగోవింద భజో రాధేగోవింద భజో

14 హరిహరాయే నమః, కృష్ణయాదవాయ నమః
యాదవాయ మాధవాయ కేశవాయ నమః
గోపాల గోవిందరామ శ్రీమధుసూదన

15 జయ మురళీధర, జయ గిరిధారీ
జయ మనమోహన కృష్ణమురారీ
జయ శార్ఙ్గ (రంగ) ధర జయ అసురారీ
జయ మనామోహన రామ ఖరారీ
జయ రాధా వల్లభ కుంజవిహారీ
మురళీధర మాధవ కృష్ణ మురారీ

16 జయ రామహరే, సుఖధామహరే
జయ జయ రఘునాయక శ్యామహరే
గోవిందహరే గోపాలహరే,
జయ జయ ప్రభు దీనదయాలహరే

17 రాధాకృష్ణ భజో కుంజవిహారీ
మురళీధర గోవర్ధనధారీ
మురళీధర గోవర్ధనధారీ - మురళీధర పీతాంబరధారీ
రాధాకృష్ణ జయ కుంజవిలాసా
గోపీమానస రాజహంస
గోపీమానస రాజహంస - గోపీమానస రాజహంస

18 గోపాలకృష్ణ, రాధేకృష్ణ
కృష్ణమురారీ, గిరివరధారీ
కృష్ణమురారీ మేరే గిరివరధారీ

బంకివిహారీ మేరే మోహన ప్యారే
కృష్ణకన్నయ్యా - రాసరచయ్యా
ఆజాబస్సే బజనేవాలే
ఆజా భార తేకే రఖ్వాలే
ఆజా గౌచరనేవాలే
ఆజా గీతాజ్ఞాన సునానేవాలే
ఆజా, ఆజా, ఆజా, ఆజా
ఆజా బేడాపార్ లగానేవాలే
ఆజాదుఃఖ్ మిటానేవాలే
ఆజాకష్ట మిటానేవాలే
ఆజా శివకేధనుష్ ఉఠానేవాలే
ఆజా ద్రౌపది చీర్ బఢానేవాలే
ఆజా మఖన్ చురానే వాలే
ఆవో మురారీ గిరివరధారీ
కృష్ణకన్నయ్యా కహానేవాలే
మఖన్‌చోర్ కహానేవాలే. (గోపాలకృష్ణ...)

19 రామకృష్ణ గోవింద - జయజయ గోవింద

20 ప్రేమమధుర జుగళనామ
సీతారామ్ రాధేకృష్ణ.

21 గోవిందబోలో రాధేరాధే.

23 విపినవిహారీ (వేరొక జట్టు) రాధేశ్యామ్
కుంజవిహారీ ,, రాధేశ్యామ్
బంకివిహారీ ,, రాధేశ్యామ్
గిరివరధారీ ,, రాధేశ్యామ్

మురళీధారీ (శ్లోక జట్టు) రాధేశ్యామ్
కృష్ణమురారీ ,, రాధేశ్యామ్
బంసీవాలే ,, రాధేశ్యామ్
మురళీవాలే ,, రాధేశ్యామ్
కంబ్లీవాలే ,, రాధేశ్యామ్
రాధావల్లభ ,, రాధేశ్యామ్
గోపీవల్లభ ,, రాధేశ్యామ్

23 విపినవిహారీ రాధేశ్యామ్ - హరేకృష్ణ హరేరామ్
కుంజవిహారీ రాధేశ్యామ్ - హరేకృష్ణ హరేరామ్
బంకివిహారీ రాధేశ్యామ్ - హరేకృష్ణ హరేరామ్
దేవకీనందన రాధేశ్యామ్ - హరేకృష్ణ హరేరామ్
గోపిజనవల్లభ రాధేశ్యామ్ - హరేకృష్ణ హరేరామ్
రాధావల్లభ రాధేశ్యామ్ - హరేకృష్ణ హరేరామ్
జనదుఃఖనాశక రాధేశ్యాం - హరేకృష్ణహరేరామ్
యశోదనందన రాధేశ్యాం - హరేకృష్ణ హరేరామ్
జయనందనందన రాధేశ్యాం - హరేకృష్ణ హరేరామ్
జయమనరంజన రాధేశ్యాం - హరేకృష్ణ హరేరామ్
భవభయభంజన రాధేశ్యాం - హరేకృష్ణహరేరామ్
కృష్ణమురారీ రాధేశ్యామ్ - హరేకృష్ణ హరేరామ్
బంసీవాలే రాధేశ్యామ్ - హరేకృష్ణ హరేరాం

24 దూంఢ్ లేలో మేరే గోపాలబాల - నందలాల
(దూంఢ్ లేలో...)

రాధేగోవిందకృష్ణ, రాధేగోపాలకృష్ణ,
నందనందనకృష్ణ, నవనీతచోరకృష్ణ,
వేణువినోదకృష్ణ, వేదాంతవిద్య కృష్ణ

గోవిందరామ కృష్ణ, గోపాలరామకృష్ణ
గోపాలముకుంద కృష్ణ, హరిహరి రామకృష్ణ

25 పఢోపాఠ్మే రామ్
లిఖోతక్తే పర్ రామ్
గినోగిన్తీమే రామ్
(దేఖోకంబేమే రామ్)
హరేరామ్ రామ్ రామ్
పియో కాఫీమే రామ్
జిమ్మో ఖానే మే రామ్
బోలో ఘుమ్నే మే రామ్
"జపో బైఠక్ మేరామ్"
హరేరామ్ రామ్ రామ్
దేఖో ఆంఖోంసే రామ్
సునో కానోంసే రామ్
బోలో జిహ్వాసే రామ్
హరేరామ్ రామ్ రామ్
బోలో జాగ్రత్ మే రామ్
దేఖో స్వప్న్ మే రామ్
పావో సుప్తీమే రామ్
హరేరామ్ రామ్ రామ్
బాల్యావస్థామే రామ్
యువావస్థామే రామ్
వృద్ధావస్థామే రామ్
హరేరామ్ రామ్ రామ్

26 శరణ్ మే ఆయా హైహూమ్ తుమారే
దయాకరో దయాళు భగవాన్
నహీమ్‌మే సాధన్
నహీంమ్‌మే శక్తి
నహీమ్‌మే పూజన్
నహీమ్‌మే భక్తి
శరణ్ మే ఆయాహై హూమ్ తుమారే

27 ఈశ అసారా సంసార సింధుమే - రామ్
నామ్ ఆధారహై
జిన్నే ముఖ్ సేరామ్ కహా ఉస్ జానకా బేడాపార్ హై
రామ్ నాంకా యశ్ మహేశ్‌న గాయా,
రామ్ నామ్‌కా పల్‌గణేశ్ న పాయా,
రామ్ నామ్‌నే వాల్మీకి కో తారా,
మేరా నామ్ నారదముని కోహై ప్యారా

హిందుస్తానీ రాగము.

(వరస (Thars) ల, ల, ల, ల.)

28A రాధేశ్యామ్, శ్యామ్, శ్యామ్, శ్యామ్
జయ జయ, శ్యామ్ శ్యామ్ శ్యామ్ శ్యామ్
ఘన్ శ్యామ్ శ్యామ్ శ్యామ్ శ్యామ్
జయ మనమోహన కుంజవిహారీ రాధేశ్యామ్
రాధేకృష్ణ - గోపాలకృష్ణ (జయ మురళీధర్)
సీతారామ్ రామ్ రామ్ రామ్
జయ జయ, రామ్ రామ్ రామ్ రామ్
జానకిరామ్ రామ్ రామ్ రామ్

జయ శారంగధర్ జయ అసురారి
జయ మనమోహన రామ ఖరారి
జయ జయ రామ, సియవర రామ
(జయ మురళీధర్)

28B రాధేశ్యామ్ శ్యామ్ శ్యామ్ శ్యామ్
జయ జయ శ్యామ్ శ్యామ్ శ్యామ్ శ్యామ్
ఘన్‌శ్యామ్ శ్యామ్ శ్యామ్ శ్యామ్
జయ మురళీధర్ జయ కంసారి
జయ మనమోహన కుంజవిహారి (రాధేశ్యామ్)
రాధేకృష్ణ గోపాలకృష్ణ

28C సీతారామ్ రామ్ రాం రాం
జయ జయ రాం రాం రాం రాం
జానకిరాం రాం రాం రాం
జయ సారంగధర్ జయ ధనుర్ధారీ
జయ మనమోహన జౌధ్‌విహారీ
జయ జయ రాం సియవర రామ

(సీతారాం...)

29 గోవింద గోవింద హరే మురారే
గోవింద గోవింద రథాంగపాణే
గోవింద గోవింద ముకుందకృష్ణ
గోవింద దామోదర మాధవేతి
శ్రీకృష్ణ రాధావర గోకులేశ
గోపాల గోవర్ధన నాథవిష్ణో
జిహ్వేపి బస్వామృతమే తదేవ
గోవింద దామోదర మాధవేతి

శ్రీకృష్ణ విష్ణో మధు కైటభారి
భక్తాను కంపిన్ భగవన్ మురారే
త్రాయస్వమాం కేశవ లోకనాథ
గోవింద దామోదర మాధవేతి

30 అంజనాసుత హనుమంత హారేబాలో
వాయుసుత హనుమంతహో...
హుక్కుం లేకర్ లంకర్ పీర్ కర్
వన్మే జక్కే దేఖో భై
అశోకవనమే సీతా బైఠీ
హంభీ జాకే దేఖాం
రామ లక్ష్మణ దో జానా భాయి
హం శ్రీరాంజీకే దూత్ హో
ఖూబ్ ప్రేంసే చూడామణి దేకే కరకే
రాంజీకీ దిల్ బహుత్ ఖుశ్ హూ

31 బజే రాధేకృష్ణ - గోవింద
భజరే భయ్యా - గోవింద
ఆవో ప్యారా - గోవింద
మిల్కర్ గావో - గోవింద
ప్రభో ప్రసీద - గోవింద

32 పతిత జనకో కరో పునీతా
హేరామ సీతా హే రామసీతా.

33 హరిహరిజప్ నా - జౌర్ సబ్ స్వప్నా
గురు గురుజప్ నా - ఔర్ సబ్ స్వప్నా

34 హరహర మహాదేవశంభో - కాశీ విశ్వనాథగంగే
విశ్వనాథగంగే - కాశీ విశ్వనాథగంగే.

35 వీనధారిణి దురితహారిణి
సత్వరజతమ త్రిగుణధారిణి
సగుణి, నిర్గుణి, అనిర్వచనీయ అష్టాంగి
సంధ్యా, సావిత్రీ, సరస్వతి, గాయత్రి
రుక్మిణి, జానకి, పంకజలక్ష్మి

36 రాధాకృష్ణనే త్రిలోకనాధనే
వేణుగానలోల నీలమేఘశ్యామనే

37 హరిహరి బోల్ - బోలో హరిబోల్
ముకుందమాధవ - గోవిందబోల్
(హరిహరిబోల్......)

38 సునాజా సునాజా సునాజాకృష్ణ
పిలాతే పిలాతే పిలాతేకృష్ణ
తు త్రేంభర్ పేలా పిలాతేకృష్ణ
దేఖాజా దేఖాజా దేఖాజాకృష్ణ
ఓ మధుర కేమూర్తి దేఖాజాకృష్ణ
లగాజా లగాజా లగాజాకృష్ణ
మేరా నయ్యాకేపార్ లగాజాకృష్ణ
ఖిలాతే ఖిలాతే ఖిలాతేకృష్ణ
మఖన్ ఔర్ మిశ్రి ఖిలాతేకృష్ణ

39 బోలోశంకర్ బోలోశంకర్, శంకర్ శంకర్ బోల్,
హరహర హరహరమహాదేవ, శంభోశంకర్ బోల్,
శివశివ శివశివ సదాశివ, శంభోశంకర్ బోల్.

40 జయతి శివశివ జానకిరాం, జయరఘునందన
రాధేశ్యాం.
అవధవిహారి సీతారామ్, కుంజవిహారి రాధేశ్యామ్
అవధసరయూసీతారాం, కమలావిమలామిథిలాధాం
(గంగాతులసీ సాలిగ్రాం)
దశరథనందన సీతారాం, అధమోద్ధారణరాధేశ్యాం
ధనుర్ధారి సీతారాం, మురళీధారీ మాధవశ్యాం
జయరఘునందన సీతారాం,
జయ యదునందన రాధేశ్యాం
జయజయ ఖండన సీతారాం,
ద్వంద్వ నిఖండన రాధేశ్యాం
జయత్రిఖరారీ రాఘవరాం,
జయతిమురారీ మాధవశ్యాం
జయదుఃఖ నాశక సీతారాం,
ప్రేం ప్రకాశక రాధేశ్యాం
భవనిధి తారణ సీతారాం.
అధమోద్ధారణ రాధేశ్యాం
జయజయ రఘువర రాజారాం,
జయజయ నటవర మోహనశ్యాం
జయ ఆర్తజన సీతారాం,
జయసుఖ సంపతి దాతశ్యాం

41 జయనందలాల దీనదయాల –
జయకృష్ణ జయ హరే హరే
జయనందలాల కృష్ణగోపాల –
జయకృష్ణ జయ హరే హరే

జయనందలాల పరమదయాల -
జయకృష్ణ జయ హరే హరే
జయనందలాల వేణుగోపాల -
జయకృష్ణ జయ హరే హరే
జయనందలాల దేవకిబాల -
జయకృష్ణ జయ హరే హరే
జయనందలాల బాలగోపాల -
జయకృష్ణ జయ హరే హరే
జయనందలాల యశోదబాల -
జయకృష్ణ జయ హరే హరే
జయనందలాల గోపీలోల -
జయకృష్ణ జయ హరే హరే
జయనందలాల యదుకులతిలక -
జయకృష్ణ జయ హరే హరే

12 బంసురి బంసురి బంసురి శ్యామకీ
శ్రీరాం, రాధేశ్యాం, సీతారాం, శ్రీగోపాల్
హరేరాం, హరేరాం, హరేరాం, సియురాం
సీతారాం, రాధేశ్యాం, సీతారాం, రాధేశ్యాం
(రాగము : భైరవి)

13 సావర బంసీవాలా, నందలాల గోకులకే
రహనేవాలా అంతరాయ్
కోయి కోయి కహే కృష్ణమురారీ
కోయి కోయి కహే నటవర గిరిధారీ
జపే తుమారామాలా - నందలాల -
గోకులకే రహనే వాలా

ఓం నమోభగవతే వాసుదేవాయ - ఓం నమో
భగవతే వాసుదేవాయ
(సావర బంసీవాలా.....)

44 భజమన్నారాయణ నారాయణ - నారాయణ
శ్రీ మన్నారాయణ నారాయణ - నారాయణ
బద్రినారాయణ నారాయణ - నారాయణ
లక్ష్మీనారాయణ నారాయణ - నారాయణ
హరిః ఓం నారాయణ నారాయణ - నారాయణ
హరిః ఓం ...... హరిః ఓం......
హరిః ఓం...... హరిః ఓం......
హరి బోల్ ... హరి బోల్... హరి బోల్...
హరి బోల్

(భజమన్నారాయణ......)

45 జయ గణేశ, జయ గణేశ, జయ గణేశ గమ్
నమశ్శివాయ, నమశ్శివాయ, నమశ్శివాయ, భమ్

46 జయ సియరామ్ జయ - జయ రాధేశ్యామ్
జయ హనుమాన్ జయ - జయ హనుమాన్

47 మహామంత్ర హైయహ్, జపాకర్ జపాకర్
హరిః ఓమ్ తత్ సత్ - జపాకర్ జపాకర్

48 ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం
హరిః ఓమ్ తత్సత్, శ్రీ ఓమ్ తత్సత్,
శివ ఓమ్ తత్సత్ ఓమ్
ఓమ్ తత్సత్, ఓమ్ తత్సత్, ఓమ్ తత్సత్, ఓమ్
ఓమ్ శాంతి, ఓమ్ శాంతి, ఓమ్ శాంతి ఓమ్

49 ఓం శక్తి, ఓం శక్తి, ఓం శక్తి ఓం
బ్రహ్మశక్తి, విష్ణుశక్తి శివశక్తి ఓం
ఆదిశక్తి, మహాశక్తి, పరాశక్తి ఓం

50 జయలలితే, శ్రీలలితే త్రిపురసుందరి జయలలితే
జయగంగే, శ్రీగంగే రాజరాజేశ్వరి జయగంగే
జయగౌరి, శ్రీగౌరి, ఉమామహేశ్వరి జయగౌరి.

## ద్విపక్షధ్వనులు

51 ఏ మదనమోహన భజో-బృందావనచంద్ర భజో
(ఒకపక్షము)
రాధేగోవింద భజో - రాధే గోవిందభజో
(వేఱుపక్షము)

51 బి హరేకృష్ణ హరేరాం, (ఒకపక్షము)
రాధేకృష్ణ రాధేశ్యాం. (వేఱుపక్షము)

51 సి హరేకృష్ణ హరేరాం. (ఒకపక్షము)
గోపికవల్లభ రాధేశ్యాం. (వేఱుపక్షము)

51 డి ఆంజనేయ వీర, (ఒకపక్షము)
హనుమంతశూర, (వేఱుపక్షము)

## జ య జ య కా ర ము లు

52 గజవదన గణేశ మహారాజకీ జయ్
సీతాపతి రామచంద్రజీకీ జయ్
బృందావన కృష్ణచంద్రజీకీ జయ్
ఉమాపతి మహాదేవకీ జయ్
శరణోద్భవ షణ్ముక మహారాజ్‌కీ జయ్

సర్వశక్తిస్వరూప మహాదేవికీ జయ్
పవనసుత హనుమాన్‌కీ జయ్
సబ్ సంతన్‌కీ జయ్
గౌరాంగ మహాప్రభుకీ జయ్
దత్తాత్రేయ మహరాజ్‌కీ జయ్
గంగామహారాణీకీ జయ్
సనాతనధర్మకీ జయ్
జయ జయ సీతారాం.........
జయ జయ రాధేశ్యాం.........

హరిః ఓం

ఓం పూర్ణమద పూర్ణమిదం,
పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ,
పూర్ణ మే వావసిష్యతే...

ఓం శాంతిః! శాంతిః!! శాంతిః!!!

గమనిక:- ఎప్పుడేని సంకీర్తనము జరుపబడునప్పుడు పైనున్న జయ జయ కారముల సంకీర్తనానంతరమున నుచ్చరింపబడవలెను. సంకీర్తనము "జయగణేశ" యింకను మహామంత్రమేదనగా

॥హరేరామ హరేరామ రామ రామ హరే హరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే

తో ప్రారంభింపవలెను.

# అ ష్ట మా ధ్యా య ము

## భక్తుల జీవితములు

### 1. ప్రహ్లాదుని జీవితము

ఒకానొకప్పుడు బ్రహ్మయొక్క పుత్రులనగా సనత్కుమారులు శ్రీహరిలోకమునకు జనినప్పుడు తమ ముఖములలో దివ్యప్రకాశముతో గూడిన నైదు లేక నాలువత్సరముల పసిబిడ్డలై యుండిరి. కాని వారు జ్ఞానమున మరీచియు, నితర ఋషులకంటెను నెక్కువవృద్ధులు. దివ్యరక్షకులగు దంతవక్త్రుడు, శిశుపాలుడును నా పసిబిడ్డల శ్రీహరితో కి సందర్శనమునకు (Interview) ప్రవేశింపనీయలేదు. ఆ యిరువురు దివ్యరక్షకభటులును దితిదేవి పుత్రులుగ జన్మించిరి. ప్రథమమున పుట్టినవాడు హిరణ్యాకశిపుడు, నల్పతరవయస్కుడగు చిన్నవాడు హిరణ్యాక్షుడు.

హిరణ్యాక్షుడు వరాహమూర్తి రూపమునగల విష్ణువుచే చంపబడెను. హిరణ్యాకశిపుడు తనసోదరుని మృత్యువుచే చాల నధికముగ కోపోద్రిక్తు డొనర్పబడెను. అతడు "నాయొక్క శక్తివంతమగు సోదరునికి విరుద్ధముగ నిలువజాలని నసర్థ్యమగు, దుర్బలమగు దేవతలు పక్షముతీసి శ్రీహరి సహాయముతోడ నాసోదరుని చంపిరి. నా సోదరుని చంపుటకు భ్రాంతికారకమగు వరాహరూపము వహించిన విష్ణువు పీక (కంఠము)పై నా త్రిశూలమును గుచ్చెదన"నియెను. హిరణ్యాకశిపుని నుత్తరువున నసురులు వాసస్థుల (Inhabitants) నంతమొందించిరి. అప్పుడు హిరణ్యాకశిపుడు తనతల్లిని ప్రశమన మొనర్చు మాటలతో నోదార్చెను.

హిరణ్యాకశిపుడు శత్రువుల భయము లేకుండ వయస్సు మెప్పు లేకుండ చావు లేకుండ నాయుధముల అవసరము లేకుండ నజేయమగు చక్రవర్తియగుటకు భూమిపై తన బొటనవ్రేళ్ళను మాత్రమే నిలుపుచు పైకెత్తబడిన (స్థితమగు) చేతులు, కండ్లతోడను మందరపర్వత వాలులపై (Slopes) నుగ్ర (తీవ్రమైన) తపమొనర్చెను. ఆతడు జలమునుసహితము త్రాగక నూఱు (వంద) దివ్యసంవత్సరములవఱకు నుగ్రమగు తపస్సు చేసెను. బ్రహ్మ వానిముందట ప్రత్యక్షమై "ఓ హిరణ్యాకశిపుడా! నీతపస్సుతో నేను సంతోషించితిని. ఏదేని వరము కోరుము. నేను నీకు విధిగనిత్తున"నియెను. బ్రహ్మయొక్క దర్శనముచే హిరణ్యాకశిపుడు చాలనధికముగ నానందమొంది "నా ప్రభూ! నీచే సృజింపబడిన జీవుల దేనినుండి నాకు మృత్యువును కలుగనీయకుమ"ని కోరెను. బ్రహ్మ యీ ప్రార్థనను ప్రసాదించెను. ఈ వరముయొక్క బలిమిపై హిరణ్యాకశిపుడు బలవంతముగ నింద్రుని వాని రాజ్యసింహాసనము నుండి తొలగించెను. ఆతడు దేవతలకు తీవ్రమగు హాని నొనర్చుచుండెను. దేవతలు శ్రీహరినిస్తుతించి యాపరమాత్మని సాయమునకై ప్రార్థించిరి. వా రాకసమున "ఓ దేవతలారా! భయపడకుడు. హిరణ్యాకశిపుని దుష్టకృత్యముల నే నెఱుగుదును. నేను వానిని నాశ మొనర్చెదను. తగుకాలము రానిండు. నా దర్శనమందఱకును సౌఖ్యము దెచ్చున"ని నొక వాణిని వినిరి.

హిరణ్యాకశిపునందు నలుగురు పుత్రులు జనించిరి. వారిలో ప్రహ్లాదుడు ముఖ్యుడు ఆతడు తనబాల్యమునుండియు చాల భగవద్భక్తి కలవాడు. ఆతడు జితేంద్రియుడు, (యింద్రి

యములపై నమిపు గలవాడు) వాని హృదయము భగవంతుని నెడ వాస్తవిక భక్తితోడ పూరింపబడి యుండెను. ఆతడందరికిని మిత్రుడు. ఆతడు విశ్వప్రేమను కల్గియుండెను. ఆతడు సర్వవేళల సత్యమునే పలుకుచుండెను. ఆతడు సర్వదా ధ్యానపు తీరులో నుండుచుండెను. ఆతడు సమస్త దివ్య గుణముల గలిగి యుండెను. ఆతడు శ్రీహరి నెడ నెనుదియని భక్తి నొంది యుండెను. ఒకొక్కప్పు డాతడేడ్చును. నొకొక్కప్పు డాతడు నవ్వును. అప్పు డప్పు డాతడు భగవన్నామముల గాన మొనర్చి దివ్యానంద పరవశమున నృత్య మొనర్చును. ఆతడు రోమాంచముతో భక్తి యశ్రువుల (నానంద బాష్పముల) రాల్చు చుండెడివాడు. తన దైనిక కృత్యములగు కూర్చొనుట, తినుట, నడచుట, మున్నగువానియందు సహితము నాతడు నిరంతరము భగవంతుని స్మరించుచుండెను.

విద్యకొఱకై న సురగురువులగు చండుడు, మార్కుడు (Chenda and Marka) (శుక్రుని కొడుకులు) ననువారల వద్దకు ప్రహ్లాదుడు పంపబడెను. ఇతర యసుర బాలకులతోడ గురువు లాతనిని గఱపిరి.

ఎవడు విద్యార్థులను నిరంతర మొకేవస్తువు ననగా శ్రీహరినామమును మాత్రము స్మరించుటకు ప్రోత్సహించునో నాత డొకడే గురువు. తండ్రి, తల్లి, స్నేహితుడు, నందఱు నొకటిగా నుండదగునని ప్రహ్లాదుడు తలంచుచుండెను. ప్రహ్లాదు డిట్టిరకపు పాఠమును తనగురువుల వద్దనుండి పొందలేదు. కావననే నాతడు తన విద్యాభ్యాసము (Study) ను వ్యర్థమని కనుగొనెను. ఆతని తండ్రి ప్రహ్లాదుని తనయొడిలో కూర్చుండబెట్టుకొని "ఓ ప్రియతమా! (darling) నీ విద్యాభ్యాసము

...లో నీ వతి శ్రేష్ఠమని తెలుచు దానియందొక కొంచెము
నాకు చెప్పుము” ని కోరెను. ప్రహ్లాదుడు సంసిద్ధముగ “తండ్రీ!
...కమునకు హేతువగు నా గృహమును విడిచి శ్రీహరియందు
...ణా మొంది గాఢధ్యాన మభ్యసించుట కొఱకే కొంత స్థలము
...కు జనుటయే సత్యోత్తమము”ని బదులిడెను. హిరణ్యకశిపుడు
...విని తన కుమారుని బుద్ధి యితరులయొక్క దుష్ట బోధలచే
నాశ మొనర్పబడు చున్నదనెను. ఆతడు గురువులకు బాలుని
...కమ విధమున గఱపుడని బోధించెను. అసురగురువులు
ప్రహ్లాదుని తమ యిండ్లకు తీసుకొనిపోయి “ఓ ప్రియమగు
ప్రహ్లాదుడా! మాకు నిజము చెప్పుము. బాలునియొక్క వివే
చనా శక్తి కతీతమైనట్టి యీ మూర్ఖపు టుపదేశముల నెట్లు
నేర్చితివ” ని ప్రశ్నించిరి. ప్రహ్లాదుడు “పూజ్యులగు గురువు
గారూ! అయస్కాంతము (చుంబకము Magnet) యొక్క
సన్నిధిలో నిను మెటుల సరిగ నూగునో నటులనే కూడ
నా బుద్ధి శ్రీహరి సమక్షమున దానంతటదే దాని స్వేచ్ఛ
తోడ సంచరించును. తరువాతి శ్వాసగూర్చి నిశ్చయములేదు.
ఏక్షణమందైన దాని సంచలనము నదియాపవచ్చును. కాబట్టి
యెవడేని నొక డేమి చేయవలయుననిన వానియొక్క వాస్తవిక
మగు బాల్యమునుండియు శ్రీహరినామమును తప్ప దేనినికీర్తింప,
(గాన మొనర్ప) కూడదని మాఱుపల్కెను. అప్పుడు గురు
వులు ప్రహ్లాదు నీమాటలతో భయపెట్టిరి. “బెత్తము తెండు.
వంశమునకు విధ్వంసము తెచ్చు, కుటుంబమున కవమానము
తెచ్చు, శ్రీహరి నామోచ్చారణచే తలక్రిందు (మూర్ఖపు)
బుద్ధి కలిగియుండునట్టి యాతడు శిక్షింపబడవలెను, ఇచ్చట
మంచిగంధపుచెట్ల యడవిలో ముండ్ల చెట్టొకటియున్నది.

మొండిబుద్ధి గలిగిన నీబాలుడు నిస్సంశయముగ నసురుల యొక్క వేరు (మూలము) ను ఛేదించు విష్ణువుయొక్క గోష్ఠిలియై యున్నాడు. ఇకముందు నీవు హరి పదము నుచ్చరింపరాదు"

కొన్ని నెలలు జరుగుబాటనంతరము గురువులు నాలుగు కళలలో ప్రవీణతనొందిన ప్రహ్లాదుని వాని తండ్రి యొద్దకుగొని చనిరి. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని తన తొడపై కూర్చుండబెట్టుకొని, "ఓ నాప్రియతమ బిడ్డా! ఈ యిన్ని రోజులు నీవునేర్చిన దేదియో దాని సారమును నాకిప్పుడు చెప్పుమ" ని వాని నడిగెను. ప్రహ్లాదుడు "శ్రీహరి కథలను వినుట, (శ్రవణము) నా జగద్రక్షకుని నామముల స్తుతుల గానమొనర్చుట, (కీర్తన) నా పరాత్పరుని ననవరతము జ్ఞప్తి యందుంచుకొనుట, (స్మరణము) పవిత్రమగు పాదపద్మముల పట్ల సాష్టాంగ ప్రణామములు, సేవ (పాదసేవ) నా పరమేశ్వరునికి సమర్పణలు (అర్చన) నమస్కారములు (వందనము) శుశ్రూష (దాస్యము) మిత్రత (సఖ్యము) ఇంకను నొకని యొక్క స్వీయ సమర్పణ లేక నాత్మార్పణ, (ఆత్మ నివేదన) ను నవి శ్రీహరినెడ నభ్యసింపదగిన భక్తియొక్క నవ (తొమ్మిది) విధ లక్షణములు. యివియే పరమోత్కృష్టమగు పాఠములని నే నూహించెదన" ని బదులు పల్కెను. హిరణ్యకశిపుడు తన కుమారుని మాటల వినినప్పు డాశాభంగమొంది గురువుల సంబోధించెను, వక్రజ్ఞానము గలిగిన నో హీన బ్రాహ్మణులారా! నా కుమారున కీపనికిరాని పాఠముల మీ రేల నేర్పితిరి. ఆతడు నా మాటలయొక్క సంపూర్తి తృణీకారమున నా శత్రువగు విష్ణునికి బద్ధానురాగుడై

యున్నాడు. మీరు నాయొక్క పతనపతనమునకు, విధ్వంసము నకు, లెక్కగాను పాఠముల వానికి బోధించుచున్నారు. "గురువులు వణకెడు స్వరముతో "దయయుంచి మమ్ముల క్షమింపుము" మొనర్చుకొనకుడు. మేము వాని కేవేని నీతి పాఠముల బోధింపలేము. ఈ బుద్ధి సహజముగవాని స్వకీయ మైనదే. అతడెన్నడును మా మాటల మన్నించి మా పాఠ ముల నేర్వడు. కాననే మేము వాని నిటకు మీముందు తెచ్చితిమి" మని జవాబు చెప్పిరి.

అప్పుడు హిరణ్యాకశిపుడు తన కుమారుని "ఈ బోధలు నీకు నీగురువులచే నొసంగ బడకపోయిన నెటుల, నెచ్చట నుండి యీమహిష్ట, వక్రమగు జ్ఞానము (తెలివి) ని సంపాదించితి వ" ని యడిగెను. "ప్రాపంచిక చిత్తులగు జనులు తిరిగి తిరిగి యింద్రియ విషయ సౌఖ్యముల ననుభవింతురు. వా రపవిత్ర మగు మనస్సులను, నశిక్షితమగు నింద్రియములను, కలిగియుం దురు. వారు తిరిగి తిరిగి గర్భముల ప్రవేశింతురు. వారి మన స్సులు శ్రీహరియొక్క పవిత్రమగు పాదములయొద్ద లగ్న మొనర్పబడజాలవు. వారి మనస్సు లింద్రియ విషయక వాస నలతోడ ముంచెత్తబడును. వారు విచారశక్తి (నిత్యా నిత్య ముల నడుమ నుండదగు విభేదపూర్వక తీర్మాన శక్తి) ని కలిగి యుండరు. వారు భగవత్సాక్షాత్కారమునకు లేక విముక్తికై లక్ష్యపెట్టరు. వారి మనస్సులు, నింద్రియములును, నిష్ప్రయోజకమగు, వినాశకరమగు ప్రాపంచిక పదార్థముల నెడ బాహ్యప్రసారక చిత్తవృత్తుల తోడ సమకూర్పబడి యుం డును. వారు మూఢమగు గ్రుడ్డిజనులు. వారు తమ మూఢ త్వము (అజ్ఞానము) ను సత్సంగము, భగవంతుడగు శ్రీహరి

నెడ భక్తిచేతను తొలగించుకొనినప్పుడు వారు పరిపూర్ణ జ్ఞానమును పొందగలరని ప్రహ్లాదుడు ప్రశాంతముగ బదులు చెప్పెను.

ఈమాటలు వినినమీదట హిరణ్యకశిపుడు కోపోద్రిక్తుడు కావింపబడెను. పెదిమల గొణుగుచు కోపముచే పొడువబడినవాడై నాతడు తనకుమారుని తన తొడనుండి త్రోసివైచెను. వాని కంఠస్తంభనమయ్యెను. ఆతడు యసురుల "ఓశక్తివంతమగు జనులారా! ఈబాలుని తక్షణము చంపుడు. వానిని మెడబట్టి బైటకు గెంటుడు. వాడు వాస్తవిక పితృహత్య నొనర్చెను. తన స్వకీయమగు పెద్దతండ్రి (uncle)ని నాశనమొనర్చిన విష్ణుని పాదముల వాడారాధించును. అయిదింటి (ఐదు వత్సరముల) బాలుడు తన తల్లిదండ్రులందు తనప్రేమను త్యజించెను. ఏనుగులచే త్రొక్కించుటయు, భయంకరమగు సర్పములు, విధ్వంసకమగు మంత్రములు, పర్వతముయొక్క సగ్రభాగము నుండి దొర్లించుట, చీకటి గుహాలలో బంధించుట, విషప్రయోగము, పస్తు, (ఉపవాసము) చేయించుట, హిమవంతశీతల వాయువునకును, అగ్ని మున్నగువాటి యెదుట నుంచుట మొదలగు సమస్త సాధనములు, సహాకారోప కరణములచే వానిని చంపుడ"ని సంబోధించెను. అసురులు సమస్తోపాయములను వ్యర్థముగ యత్నించిరి. వారు తమ యుద్యమములలో సంపూర్తిగ భంగమొందిరి. సమస్తమగు కఠిన బాధలమధ్యను ప్రహ్లాదుడు భగవన్నామము నధికానందముతోడ నుచ్చరించెను. ఏదియు వానిని బాధింప జాలక పోయెను. హిరణ్యకశిపుడీ బాలుని చంపజాలక పోయెను. ఆతడు తుదిని నిరుత్సాహముతో నీ దిగువ విధముగ బలికెను. ఈబాలుడు భయరహి

శత్రువు, మృత్యురహితుడు, వాడగణనీయమగు ఘనతగల వాడు వాస్తవముగ వానిద్వేషము వలన నేను చావనున్నాను. అటులగానిచో నే నవధ్యుడను"

గురువులగు చండుడు, మార్కుడు, హిరణ్యకశిపుని నీదిగువ మాటలతోడ నూరడించిరి. "ఓ పూజనీయమగు నసురరాజా! శుక్రాచార్యులవారి యాగమనము వఱకును నీ బాలుడు వరుణపాశముద్వారా నాతడు పారిపోలేకుండు నటుల ప్రతిబంధము (నదుపు) క్రింద నుంప బడవలయును. కాలక్రమముననను, గొప్పజనుల బోధల వలనను, నాతడు తన సక్రమేంద్రియముల స్పృహ (జ్ఞానము) కు రావచ్చును." హిరణ్యకశిపుడు, "రాజులకు (క్షత్రియులకు) గృహస్థులకు, వలయునట్టి విధులుగల రాజధర్మము" ను వానికి బోధింపమని వారిని గోరెను.

ప్రహ్లాదుడు తన బడి స్నేహితుల కీదిగువ విధమున బోధింప మొదలిడెను. ప్రియస్నేహితులారా! బ్రహ్మనుండి దిగువగల నత్యల్పమగు గడ్డిపరక (పోచ) వఱకు గల సమస్త సృష్టియు భ్రాంతి (మిధ్య) యే. ఏదేని సత్యమైనదియున్నచో నది మూడుసట్ల (ముమ్మారు) నిజమగునట్టి హరి, హరియొక్క నామ మొకటిమాత్రమే. జగత్ప్రభువగు శ్రీహరి సమస్త జీవులయొక్క ప్రభువు. శుభాకాంక్షియును, అందరికాత్మయు నైయున్నాడు. ఆ పరమాత్ముని పాదములు పవిత్రవానిచేత నారాధింపబడవలయును. ఆయనయే సమస్తమునకు నుత్కృష్ట మగు శరణ్యము. ఆయన (ఆ పరాత్పరుడు) పరానందమును, మోక్షమును, శాశ్వతశాంతిని ప్రసాదించును. ప్రాపంచిక చిత్తులగు జనులు తమ యమూల్యమగు జీవితములు ధనము

కొఱకై విక్రయింతురు. దరిద్ర, మోహితజీవులు వారుతమ బలీయమగు నింద్రియములచే మోహింపబడుదురు.

పండితుడైన మనుజుడు సహితము సంసారములో ముంపబడును. ఆతడు భగవంతునియొక్క వాస్తవికస్వభావమును విచారించుటకొక నిమిషము సహితము కలిగియుండడు. ఇది విచారకరము. దుఃఖకరము. కాదా? తన పాండిత్యమున్నప్పటికిని నాతడు నశించు దేహముతోడ తాదాత్మ్యము పొందుటచే నజ్ఞానములో నాతడు ముంపబడును. ఆతడు సర్వదా "నేను బ్రాహ్మణుడను, నేను పండితుడను, నేను ధనవంతుడను, నేను స్థూలశరీరుడను (fatty man) నేను దుర్బలుడను, నేను చెవిటివాడను, నేను గుడ్డివాడను. ఇది నాభార్య, వీడు నాకొడుకు, ఇది నాయిల్లు."అని చెప్పకొనును. అహమత్వము, మమత్వము, వానిలో గాఢముగ పాదుకొల్పబడియున్నవి. నీవు వానిని నిజమగు పాండిత్యము గలవానిగ నెట్లు పిలువగలవు?

ఆరు పరిణామము (షడ్వికారము) లేవనగా! స్థితి, పరిణామము, (వికారము-modification) క్షయము చావును, శరీరమునకు చెందును. గాని నమృతమగు నాత్మకుకాదు. ఈ యాత్మ శాశ్వతము, నవిభాగనీయము సర్వపరిపూర్ణము, క్షయరహితము, నమృతము, పరిశుద్ధము, పరిణామరహితము, స్వయంప్రకాశము, కాల, స్థల (దేశ) అవస్థ (cans-tion) ల కతీతము. నసంగము (unattached) బంధ (నియమ) రహితము (unconditioned) నై యున్నది. సరిగ నెటుల స్వర్ణకారుడు (కంసాలి - gold-smith) తనయొక్క పరిశుద్ధికరపద్ధతి (Cleaning process) గుండ బంగారమును మలినపదార్థము

(dross) నుండి వేఱుచేయునో నటుల నేకూడ వాస్తవికాత్మ జ్ఞాత (knower of the true self) తన సాధన (ఆధ్యాత్మికాభ్యాసములు) గుండ తన్ను తాను భ్రాంతిమయమగు పంచకోశములనుండియు లేదా త్రివిధ శరీరములనుండియు విడదీసుకొని బ్రహ్మమును లేక నాత్మనొందును. ఈ శరీరము పంచభూతముల కూడికచే నిర్మింపబడియున్నది. "నేతి, నేతి-యిదికాదు, యిదికాదు" యనెడి సిద్ధాంతముద్వారా పై నారోపింపబడిన (superimposed) సాధనములు (vehicles నీవు వ్యతిరేకించి (negate) విసర్జనపద్ధతి (process of elimination) చే పరిశుద్ధాత్మను గ్రహింపవలయును. బ్రహ్మనుండి దిగువగల గడ్డిపరక (పోచ) వరకుగల సమస్తసృష్టియును భ్రాంతియుతమే. (మిథ్యయే) ఏది నిఖిలప్రపంచమును దానిముందట కేవల శూన్యముగ సంక్షయమొనర్చి సర్వమునకు నదే ప్రకాశమై యుండునన సర్వచైతన్యమయ సర్వానందపూరిత, సర్వపవిత్రయుతమగు హరి కేవల హరియొక్క నామముమాత్రమే.

"ప్రియమిత్రులారా! సమస్త మధుర పదార్థముల కంటెను మధురతరమైనదియును, సమస్త మంగళ వస్తువుల కంటెను మంగళతరమైనదియు, సమస్త పవిత్రకారక ప్రాతినిధ్యముల (Agencies) కంటెను పవిత్రతరమైనదియు, నేదేనియున్నచో నది హరి కేవల హరియొక్క నామము మాత్రమే. ప్రాపంచిక చిత్తులగు నసురుల సహవాసమును త్యజింపుడు. మీ సమస్త దుష్కార్యములనుండి దూరముగా తొలగుడు. సత్సంగము (జ్ఞానుల సహవాసము) ను గొనుడు. పరమ ప్రభువగు నారాయణునిలో శరణ మన్వేషింపుడు.

ఆయన (పరమేశ్వరుడు) శాంతి, సౌఖ్యము, జ్ఞానములయొక్క మూర్తీభవము.

శ్రీహరి యందఱిలోను నాసీనుడయి యున్నాడు. ఎచ్చట తన భక్తులు భక్తితోడ హరినామము నితరములను కాక గాన మొనర్తురో నట నా పరాత్పరుడు నిరంతరము వసించును. మీరు శ్రీహరియెడ భక్తి నభ్యసింపవలయును. అప్పుడు మాత్రమే మీరు వాస్తవిక, శాశ్వత, సౌఖ్యము, జ్ఞానముల మీరొందుదురు. క్షణికమైన యింద్రియ సంబంధమగు సుఖముల వెంటబడిపోవుటచే, నేమి ప్రయోజనము. మీహృదయములయొక్క గుహలలో వసించు నట్టియు, మీ నిజమగు స్నేహితుడు, హితకారకుడు, తండ్రి, తల్లి, గురువును నైనట్టి శ్రీహరి నారాధించుటలో నెట్టికష్టములును లేవు, దేనికొఱకు సమస్త సుఖముల (నానందముల) వాంఛించునో నట్టి యీ మురికి భౌతిక దేహము నాశముగలది. అది నక్కలకు, కుక్కలకు నాహారమై యున్నది. శ్రీహరి పవిత్ర ప్రేమచే సంతోషింపబడును. మీ హృదయముల నాయన కిండు. ఆయన దేనిని మీనుండికోరడు. శ్రీహరి యమిత పాండిత్యముచే గాని, లేదా వ్రతములచేగాని పొందబడడు. మానవుని జీవితము సగము నిద్రలో వ్యర్థమగుచున్నది. మిగిలిన దానిలో నధిక భాగము ముసలివయస్సు (వృద్ధావస్థ) బాల్యమందలి యజ్ఞానము, బాధలు, కష్టములు, రోగములు. మున్నగువాటిలో వినియోగింపబడును. నీవు చాల కొద్దికాలము మాత్రము నీవశములో కలిగియుండునప్పుడు, యింద్రియ సంబంధసౌఖ్యముల వెంట నీవేల పరుగిడుదువు ? అధమ మీయల్పకాలమైనను భగవంతుని స్మరించుటలోను, నాపరమాత్ముని పాద

సన్మార్గములనెడి భక్తిని సంపాదించుటలోను. గడచి, చెడుగులతో కూడియుండు నీజనన మరణ సముద్రము (సంసార సాగరము) ను దాటుము. కాన సర్వవేళల హరినెడ హృదయ పూర్వక భక్తి ప్రేమల నభ్యసింపుము. పాపములయొక్క పర్వతమునకు పిడుగు (Thunder) వంటిదియును, ప్రాపంచికపురుషునకి యనెడు రోగమునకు తప్పనిదైన నివారణౌషధమును, భ్రాంతియనెడి రాత్రియొక్క నతిమిక్కిలి స్థూలమగు చీకటిని చెల్లాచెదరొనర్చునట్టి సూర్యోదయమువలె పని చేయునట్టిదియును, విస్తారమగు భీకరాగ్నివలె ప్రాపంచిక బాధలనెడి వృక్షమును, దహించునదియును, నానంద ధామమునకు ద్వారమార్గముగకూడి యుండునదియును నగు శ్రీహరియొక్క నామము ధన్యమైనది. ఒక క్షణము (Second) సహితము వృథపుచ్చకుము. ఇప్పుడు మీ హృదయ నధోభాగమునుండి యీ పరాత్పరుని నామమును గాన మొనర్పుడు.

పఢోపాతేమేహరి (రామ్); లిఖోతక్తే మే హరి (రామ్)
దేఖో కంభేమేహరి (రామ్); హా రేహరి (రామ్),
హరి (రామ్) హరి (రామ్)
సునో కానోసేహరి (రామ్); దేఖోహృదయోమే
హరి (రామ్)
బోలో జిహ్వాసేహరి (రామ్); హ రేహరి (రామ్)
హరి (రామ్) హరి (రామ్)

ప్రహ్లాదునియొక్క నీ మధురవాక్కుల నసుర బాలురు విని నప్పుడు వారు తమ గురువుల వాక్కుల నెడ నెట్టి లక్ష్యము నొసగి యుండలేదు. ప్రహ్లాదునిచే నీయబడిన స్వర్ణమయ సలహా వారిమనస్సున అమితముగ నాటబడినది. అసుర బాలురు

గొడ్డండ్ల (axes) వహించి శ్రీహరిగానిసలైరి. తమ సమస్త మస్త్ర గుణముల త్యజించి ప్రహ్లాదుని యొక్క నుపదేశముల ననుసరించిరి. సమస్త బాలురును విష్ణునామమును గానమొనర్ప నారంభించి ప్రహ్లాదునితో నానందమున నృత్య మొనర్చుటను గురువులు కనుగొనిరి. వారు ప్రహ్లాదుని తీసుకొని జని రాజు నొద్దకు బరుగిడి వానికి సమస్త బాలురయొక్క ప్రవర్తనయు ప్రహ్లాదుని బోధలను నెఱుకపరిచిరి. హిరణ్యకశిపుడు తన కుమారునియొక్క ప్రవర్తనయు, సమస్తా సుర బాలురపై వాని ప్రభావమును వినినప్పుడు చాల నధికముగ నుగ్రుడొనర్ప బడెను. ఆతడు ప్రహ్లాదుని "ఓ దరిద్రమానవుడా! వక్రపు తెలివి (బుద్ధి) కలిగిన నో క్రూరమగు దురాత్ముడా! ఓ వంశ ఘాతకుడా! నేను నిన్నిప్పుడు చంపుదును. నీవు నావాక్యములను నీ తల్లి దండ్రుల నెడ నీ విధులను తిరస్కరించితివి"

ప్రహ్లాదుడు "ఓరాజా! అది నేను లేక నీవు బల వంతులమనిగాదు. త్రిలోకములకును సృష్టికర్తయు, సమస్త జీవులయొక్క నాధారమును, నగు నా శ్రీహరి సర్వశక్తి మంతుడై యున్నాడు. ఆయన సమస్తజీవులయొక్క నాత్మయై యున్నాడు. ఆయన కాలమై యున్నాడు. ఆయన ప్రాణమై యున్నాడు. ఆయనింద్రియములు, మనస్సుయొక్క పటుత్వమై యున్నాడు. ఆయన మూడుశక్తులను నదుపులో నుంచును. ఆయనాంతర్య పరిపాలకుడై, నంతర్యామియై యున్నాడు. ఆయన మన సమస్తకర్మలకుసాక్షి ఆయన సంరక్షించువాడై యున్నాడు. ఆయన జగముల సృజించి, పోషించి, వినాశ మొనర్చును. ఆహా! ఎంతటివిషాదము! ప్రపంచము మెరిసెడి గాజుముక్క (యింద్రియ విషయక సుఖములు) పట్ల దాని

ససంసరణలలో విస్మృతి లోని కొక యమూల్యమైన రత్నము యేదనగా! శ్రీహరియొక్క నామమును పాడివేయు టెంతటి గొప్ప విచారము! ప్రియమగు తండ్రీ! నీ యొక్క గర్వము, బాహ్యాడంబరము (vanity) ల తోడ నుబ్బిపోయి నీ బలీయమగు నింద్రియములచే గొంపోబడకుము. నీ యొక్క నాసురిక ప్రకృతిని త్యజింపుము. మనశ్శాంతి నొందుము. భగవానుడగు విష్ణునెడ భక్తిని పెంపొందింపుము. ఈ దుష్ట మనస్సే నీ శత్రువు. నీ మనస్సులోపల నారు ప్రబలమగు శత్రువులు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య ములు) నీవు కలిగి యున్నప్పుడు నీ వెటుల రాజుగా నుండుట కర్హతను కోరగలవు? ఎవడైతే నీ యారుగురు శత్రువులను విధ్వంస మొనర్చి తన మనస్సును జయించునో నాతడే నిజ మగు చక్రవర్తి, రాజులకు రాజుగాని సామ్రాజ్య మున్నవా డెవడో వాడు రాజుగాడు. తన మనస్సును జయించనివాడు, నాతడి ప్రపంచమును తన పరిపాలన క్రింద కలిగి యుండి నప్పటికిని దేనిని జయించని వాడైనై యున్నాడు.

విష్ణువు ముందట సమస్త శక్తివంతమైన జనులును, నసురులును పూర్వకాలమున గాలిముందట దూదివలె నాయన యొక్క నుగ్రమగు కోపమునకు బల్యాహారులైరి. (Victims) శ్రీమహావిష్ణువునెడ భయపడని వాడెవడును నిప్పుడు లేడు. విష్ణువులో మాత్రము వాస్తవమగు శరణము (refuge) ను భక్తి ద్వారా నన్వేషింపనగును. కావున శ్రీహరియొక్క నాసనము (పీఠము) న మనస్సీ క్షణమునుండి యాశ్రయమును (asylum) నెమకనిండు. ఘనమగు మంత్రమైన "నారాయణ, నారా యణ" మీ కండ్లను తెరచుగాక. భగవంతు నారాధించి

వందన మాచరించువాడు పరిశుద్ధ భక్తితోడ నా పరమాత్ముని ధ్యానించు నప్పుడు మాత్రము తన యభీష్ట ఫలితముల నొందుగలడు. కాన సర్వదా నా పరాత్పరుని స్మరించి, యాయన (పరమేశ్వరుని) స్తుతిని గాన మొనర్పు"మని బదులు చెప్పెను.

హిరణ్యకశిపు డీమాటల వినినప్పుడు తన స్వభావము (temper) ను గోల్పోయెను. ఆతడు వానితో "ఓరీ కుంకా! నీ వతిమిక్కిలిగ వదరుచున్నావు. నేను నిన్ను యమలోకము నకు పంపుదును. ఈపృథ్వి యొక్క యేకైక చక్రవర్తి యొక్కడ? ఆయ నెక్కడ నున్నాడు? నీ వెవనిగూర్చి యత్యున్నతముగ పల్కు చుంటివో నట్టి నీ హరి లేక నారాయణుడు లేక విష్ణు వెక్కడనున్నా డని యడిగెను.

ప్రహ్లాదుడు ఖచ్చితముగ "శ్రీహరి యిచ్చట నున్నాడు. శ్రీహరి నచ్చటనున్నాడు ఆయన (జగదీశ్వరుడు) సర్వత్ర నున్నాడ" ని ప్రకటించెను. హిరణ్యకశిపుడు వానిని "అటులైనప్పు డీ స్థంభములో నెందుకుండ గూడద"ని యడిగెను.

ప్రహ్లాదుడు నిశ్సంశయముగ నా పరమేశ్వరు డీ స్థంభములో కూడ నున్నాడ"ని బదులు చెప్పెను. హిరణ్యకశిపు డా హరిని స్థంభములో గానక "ఓరీ మూర్ఖపు బాలుడా! నేనీ స్థంభమును కాలితో తన్నుదును. నీ యొక్క హరి యచ్చట నున్నది లేక లేనిదీ నన్ను చూడనిమ్ము. ఈ స్థంభములో హరి లేకపోయినచో నీ కుత్తుక (throat) యీా ఖడ్గముతోడ కోయుదును. నీ హరి నిన్ను రక్షింప నిమ్ము" ని యఱచెను. అటుల చెప్పుచు తన పీఠమునుండి పైకి లేచి

స్తంభమును కొలదన్నెను. ఒక యుగము మన్న ఘని స్తంభము నుండి బయలు వెడలి, దాని ద్వారా యావత్తు విశ్వమును ప్రబద్ధలయ్యెను. ఆ స్తంభమునుండి శ్రీహరి నరసింహ రూపమున బయటికి వచ్చెను. ఈ రూపము చాల న్యుగ స్వభావము కలది. ఆహా యేమి ! అది యెంతటి యాశ్చర్యమై యున్నది. అది మనుష్యుడు గాని లేక నరవిమృగముకాని కాదు. కాని యొక మానవుని యొక్కయు, నొక సింహము యొక్కయు, మిశ్రితమైన రూపము. అత్యంత భయము మూలమున చాల మంది యసురులు పరుగిడిపోయిరి.

హిరణ్యకశిపుడు భగవంతునియొక్క ప్రకాశమాన మగు స్వరూపముచే మిఱుమిట్లు గొలుపబడెను. ఆతడు వెంటనే తనఖడ్గమును, డాలు (Shield) ను శ్రీ నరసింహ భగవాను నెదుర్కొనుటకు తీసుకొనెను. పాము కప్పను సరిగ పట్టునటువలె భగవానుడు హిరణ్యకశిపునిపట్టుకొనెను. ఆయన వానిని ద్వారప్రవేశము (Thresh hold) పై నునిచి గరుడుడు పామును సరిగ చీల్చునటువలె తననఖముల (గోళ్ళ)తో వానిని చీల్చెను.

అప్పుడు దేవతలయొక్క విమానములును, వాయు రథముల వరుసలును, నాకసమును నింపెను. దివ్యగానమును దుందుభియును, మ్రోగింపబడినవి. గంధర్వులు స్వర్గీయ గీతములుపాడిరి. అప్సరసలు నృత్యమొనర్చిరి. అందఱును భగవంతుని వివిధరీతుల స్తుతించిరి.

ప్రహ్లాదుడు దివ్యానందము, భక్తియందున ముంపబడెను. ఆతనిరోమములు వాటిచివరలపై నిలుచుని (రోమాంచము) యుండెను. సంతతప్రవాహముగా వాని కండ్లనుండి

భక్తియుక్తులు కలిగియుండినను. అతడు భగవంతుని పాద ములవద్ద సాష్టాంగప్రణామ మొనర్చి "నేను సంపత్తు, గొప్ప వంశము, వ్యక్తిగతసౌందర్యము, శారీరకహింస (తపస్సు) శాస్త్రజ్ఞానము, ఇంద్రియముల తీక్ష్ణత, మానసికసౌమ్యత్వము ధైర్యము, పరాక్రమము, తెలివి, వివేచనము, యోగము, పరమాత్ముడగు శ్రీహరి యారాధనలో నీ సకలమగు పంగ్రహిం ఉద్దాతలును నిష్ప్రయోజనమని నేనూహింతు నేలన వాస్తవ ముగ నా సర్వశక్తిమంతుడగు భగవంతుడు గజేంద్రునినెడ నితరమగు దేనికిగాక నాపరమాత్మని నెడగల వానియొక్క నధికమగు భగవద్భక్తి యనురాగముల కొఱకు మాత్రమే సంతృప్తి నొనర్పబడియుండె.

తన సంకల్పములను, తన వాక్కులను, తన చేతల (కృత్యముల) ను, తనసంపత్తును, తనజీవితమును, భగవంతుని కంకితముచేయునట్టి శ్వపచుని (కుక్కమాంసమును తినునట్టి వాడు) సహితము, పైనుడువబడిన ద్వాదశార్హతలు గలిగి యుండినప్పటికిని, భగవంతుని పాదపద్మముల నారాధించుట కయిష్టుడైయుండునట్టి యా బ్రాహ్మణునికంటె యోగ్యతర ముగ భావింతును. నేలన మొదటివాడు తనకులమును (Race) పవిత్ర మొనర్చుచుండగా రెండవవాడు అత్యధికగర్వముతో నుబ్బింపబడుటచే నటు లొనర్పజాలడు.

నిస్సహాయులపట్ల ననురాగుడవగు నీవైన నో పర మేశ్వరా! జీవులు సంసారచక్రమున (జన్మమృత్యువుల నెడి చక్రమున) త్రిప్పబడునపుడు తాకొనబడు ననహానమగు క్లేశము గూర్చి యుగ్రముగ నేను భయపడు చున్నాను. నా కర్మలచే దృఢముగ కట్టబడి నేననను కూల పరిస్థితుల మధ్యలో వాటచే విసరబడితిని, పవిత్రులలో నతి మిక్కిలి

పవిత్రమయిన ప్రభూ! నీవు నన్నెప్పుడు నీ నిరంతర దయాపూర్ణమగు పాదముల మూలము (కరుణయొక్క ప్రారంభకోత్పత్తి స్థానము) నకు తిరిగి పిలుతువు?

“నీ పరాక్రమము గూర్చిన నమృతమువంటి సంకీర్తనమును చవిచూచుటలో నా మనస్సీవిధముగ నిమగ్నమయినందున నీ సంసారముయొక్క వైతరణీ (Vaitarini) (భీకరమగునది) ని దాటుటలో నత్యల్పమగు భయమును పొందను. కాని నీసుధ యొక్క నెట్టి సవిని కలిగియుండనొల్లక సంపూర్తిగ భ్రాంతి కారకము మాత్రమే గాకుండా నత్యమితముగా నాశాభంగము కూడను నయిన నింద్రియభోగము యొక్క మృత్యుభారము క్రింద శ్రమించుచుండెడి మానవ జీవులందలి యీ నీచమగు దీనుల విచారకరమగు స్థితికొఱకై నేనత్యధికముగ దుఃఖము ననుభవించు చున్నాను.

బ్రహ్మదేవుడు, దేవతలు (Gods) ఋషులు (Sages) నిన్ను తగురీతిగ నారాధింప జాలనపుడో నా ప్రభూ! అసుర కులమునకు చెందిన బాలుడనగు నేను నిన్నెటు లారాధింప గలను ఎట్టికోరికనుపెంచని నేను నీయొక్క బద్ధానురాగుడగు సేవకుడను, నీవు నా ప్రభువవు. నీవీ యావత్తు విశ్వమునకు నాధారకుడవు. (Supporter) పాలకులలో పరిపాలకుడవు. ప్రపంచమును త్యజించి తన సమస్తమగు కోరికల నణగ ద్రొక్కినట్టియు, నీ యారాధననుండియు, నధిక మనోధారణ తోడ కొనసాగింపబడు నాంతర్య విచారము (గాఢధ్యానము) నుండియు నుత్పత్తిచెందు పరిపూర్ణతాభి వృద్ధిచే మానవ జాతికి తటస్థమగు మానసిక చీకటియొక్క నవాంతరము (Barrier) క్రమ క్రమముగ తొలగింప బడునట్టియు నైన

భక్తుని మనోద్వారమువద్ద నీవగపడుదువు. నీవు సర్వసమా పూర్ణుడవు. సర్వమోక్ష ప్రదాతవు. సాధులందు స్నేహితుడవు. నేను నీ పాదపద్మములవద్ద సాష్టాంగ వందన మొనర్తును. నన్ను వాంఛారహితునిగ నొనర్పుము" ని పలికెను.

శిశువుయొక్క సుమనఃపూర్వక ప్రార్థనపై భగవానుడు వాని నాశీర్వదించి "ఉన్నత ప్రమాణము (Standard) నకు చెందిన పవిత్రమగు భక్తిని నీవు కలిగియున్నందున నేను చాల నమితముగ సంతుష్టుడ నయితిని. నీయొక్క వాస్తవిక భక్తిచే నీవు నీతండ్రిని, నీపూర్వీకులను, (Forefathers) నిరువదియొక్క తరములంతటి వెనుకటి వరకు పవిత్ర మొనర్చితివి. ఎచ్చట నాభక్తుడు వసించునో నా యదే ప్రదేశము దానంతటది పవిత్ర మొనర్పబడును. నీలో శరణు గొనువా రెవరో వారుకూడ నాభక్తులగుదుర" నియెను.

ఎవరీకథను, భక్తులలో మిక్కిలి ఘనుడైన ప్రహ్లాదుని మహిమను శ్రద్ధ, భక్తి, హృదయ పవిత్రతలతోడ విందురో వారు మోక్షమును, శాశ్వతశాంతిని, సత్యోన్నతానందమును, శ్రేష్ఠమగు నాత్మజ్ఞానమును నొందుదురు.

## 2. నారదుని జీవితము

### (భాగవతము నుండి)

"పూర్వకల్పమున నాయింతకు ముందటి జన్మమున వేదఋషులయొక్క నొకానొక దాసీ (maid Servant) దానికి పుట్టితిని. కొందఱు యోగులు వర్షఋతువును గడపుట కొక స్థలమున ప్రోగుపడిరి. ఇంకను నేను వారిని సేవించుట కొక

బాలునిగ నియమింపబడితిని. బాలునికివలె సర్వచాపల్యమును లేకుండుటయు, నాత్మసంయమన మొనర్చి యుండుటయునుగల నన్నుజూచి సమచక్షువులతో నంతటినెడ జూచెడి మునులు ముఖ్యముగనే నాటవిడిచి, వారి ననుసరించి, వారిని సేవించి, యల్పముగ మాటలాడు చుండెనంతన నాపట్ల దయగలిగి యుండిరి. పునఃపవిత్రీకృతుల (Regenerated) యనుజ్ఞ తీసికొనే నొకానొక సమయమందు వారి భోజనపు మిగిలిన భాగమును (నుచ్ఛిష్టమును) వాటాగొనగ నా మానసికయపరిపుష్టతలు సమస్తమును తొలగింపబడినవి. నా మనస్సువిధముగ పవిత్రమయినపుడు వారి ధర్మముపట్ల నా యాసక్తము (Inclination) పెరిగెను. వారి యనుగ్రహముచే శ్రీకృష్ణుని రమణీయమగు గాథల వారు గాన మొనర్చుట వింటిని. ఆ కథల నమృతమును శ్రద్ధతో వినుచు నేను శ్రీకృష్ణుని కొఱకై పవిత్ర ప్రేమను సంపాదించితిని. ఆ ప్రేమ మూలమున నా మనస్సు పరమాత్మునందే స్థిరమవగా నేను నాయొక్క స్థూల సూక్ష్మదేహములను సత్యమగు నాత్మ లేక బ్రహ్మము యొక్క నసత్య ప్రతిబింబములుగా మాత్రము దర్శింపజొచ్చితిని. నాలో వృద్ధిచెందిన భక్తి నా రజస్సును, తమస్సును, విధ్వంస మొనర్చెను. తమపరి దయావంతులగు ఋషులా ప్రదేశమును విడువబో నున్నప్పుడు వారు తమకు భగవంతునిచే స్వయముగ ప్రసాదింపబడిన రహస్యజ్ఞాన (Occult Knowledge) మందలి చాలనధికభాగమును నా కొసగిరి. ఆ జ్ఞానము ద్వారా భగవానునియొక్క మాయను నేను తెలిసికొంటిని. ఆ జ్ఞానముచేతనే నెవడేని మానవుడు భగవానునియొక్క స్థానము (Plane) ను చేరును. నే నీరహస్య జ్ఞానమును కృషి

చేసినందువలన భగవంతుడు స్వయముగ ప్రత్యక్షమై నాకు జ్ఞానమును, శక్తులను, మాటికి ప్రసాదించెను ! "

(భాగవత పురాణ భాష్యకారుడగు (Commentator) శ్రీధరస్వామి పైగాథలో నీ దిగువ విషయముల గుర్తించెను.

(1) సేవ యనగా:- మహాత్ములయొక్క శుశ్రూష. ఇంకను వారియెడ వేచియుండుట. (Attendance) (2) వారి యొక్క కృప లేక యనుగ్రహము. (3) వారి ధర్మమందు నమ్మిక. (4) భగవానుని గాథల వినుట. (5) భగవాను నెడ బద్ధానురాగము. (6) స్థూల సూక్ష్మదేహములయొక్క వివేచనచే నాత్మజ్ఞానము. (7) స్థిరమగు భక్తి. (8) భగవానునియొక్క వాస్తవికత యొక్క జ్ఞానము. (9) అంత్యమున భగవానుని యనుగ్రహముచే సర్వజ్ఞత్వము, ఇంకను నితర శక్తుల దృశ్యము.)

అటుపిమ్మట నేమియనుసరించెనని వ్యాసుడు ప్రశ్నించెను. నారదుడు కొనసాగించెను.

"నాగురువులగు భిక్షువులు జనిన కొంతకాలము తరువాత నాతల్లి పాముకాటుచే చనిపోయెను. నేనది యొక భగవంతుని కృత్యముగ భావించి నుత్తరదిశపట్ల పోతిని. చాల యడవులు, నదులు, పర్వతములు, దాటిన తరువాత నేనొక నేకాంతమగు నడవిని చేరి యందచ్చట నొక పిప్పల (--వృక్ష) వృక్షముక్రింద నాసీనుడనయితిని. నాగురువులచే బోధింపబడిన ప్రకారముననే నాత్మపై నాత్మలో నాత్మద్వారా ధ్యానమొనర్చితిని నామనస్సు సంపూర్తిగ భక్తిచే జయింపబడియెను. నేను భక్తిపూర్వకముగ నాకండ్లలో నశ్రుబిందువులతోడ భగవా

ముని పాదపద్మములపై ధ్యానించు చుండినపుడు శ్రీహరి క్రమేణ నాహ్వానము లో నగపడెను. ఓ మునివర్యా! అత్యధికమగు పవిత్రపేమ ద్వారా నా శరీరమందలి రోమము లంత్యమున నిలువబడియుండెను. నేను సంపూర్తిగ నానందమున పట్టుదప్పి స్వకీయమగు నాత్మనుగాని లేక నే యితరమునుగాని, తెలిసి కొని యుండలేదు. అవర్ణనీయమగు నీశ్వరు డీ విధముగ వాక్యములు బలికెను.

"ఓయీ! నీవు నన్నీ జీవితమున జూడ నర్హుడవు కావు. ఇచ్ఛానిచ్ఛలు రాగద్వేషములు (Likes and dislikes) సంపూర్తిగ దగ్ధమొనర్ప బడని నపరిపూర్ణ యోగులచే నేను చూడబడుటకు దుర్లభుడను. నేను నన్ను నీ కామము (అభీప్సితము) సర్వమును నాలో కేంద్రీకరింపబడ నగునని నీకు చూపితిని. నేను కామముయొక్క వస్తువు (కామ్యము) నైనప్పుడు సాధువు సమస్తేతర వాంఛలను త్యజించును. మహాత్ములయొక్క దీర్ఘకాల సేవచే నీ మనస్సు నాలో దృఢ ముగ స్థిరీకరింప బడినది. కావున నీ వీ దోషయుత శరీరమును త్యజించి నా సాంగత్యము సంపాదింపుము. నాలో లగ్న మొనర్ప బడిన మనస్సెన్నటికిని సృష్టియందు లేదా ప్రళయ మందు వినాశ మొందదు. పైగ స్మృతి (జ్ఞప్తి) యు తప్పదు."

"అటుల చెప్పుచు నీశ్వరు డంతర్థాన మాయెను. కాల క్రమమున భగవానునిచే నే నను గ్రహింప బడిన శుద్ధదేహము నైపు నే నీడువ బడినప్పుడు. నా పాంచ భౌతిక శరీరము (పంచ భూతములకు చెందిన శరీరము) నా ప్రారబ్ధకర్మ క్షయమున నధః పతనమాయెను. కల్పము తుదిని (నంత్య మును) చేరినప్పుడు నా నూతన దేహము నిద్రపోబోవుచున్న

బ్రహ్మయొక్క శ్వాసచే లోనికి లాగుకొనబడియెను. ఒక వేయి యుగావృతముల పిదప బ్రహ్మ మేల్కాంచి సృజింప నిచ్ఛించి నప్పుడు నేనును, మరీచియు, నింకా నితర ఋషులును బయటికి వచ్చితిమి. అప్పటినుండి నేను విధిగ నొకే మాదిరిగ బ్రహ్మచర్యము నవలంబించి శ్రీ మహావిష్ణుని కృపద్వారా నా మార్గము సంపూర్తిగ నిరాటంకమగుటచే త్రిలోకముల సర్వత్ర నంతరముగ, బాహ్యముగను, భయమునను, ప్రయాణ మొనర్చుచుంటిని. దేవతలు సర్వబ్రహ్మముతోడ నలంకరింపబడిన నీ వీణను నా కొసగిరి. ఈ వీణపై బాడుటచే హరి సంకీర్తనముల చుట్టును సర్వత్ర బాహ్యముగ పంపుదును. తిరిగి తిరిగి వచ్చెడి జీవులయొక్క సముద్రమును దాటుటకు సంకీర్తనము లే కేవలోపాయము.

పురాణములలో నుడువబడిన విధముగ నిది నారదుని యొక్క విచిత్రము (Mystery) గడచిన పూర్వకల్పము నుండియు నారదుడు రహస్య జ్ఞానమున కాశ్రయ స్థానము. ఈ కల్పపు మొదటి తొల్లింటి ప్రవీణుడుగా వాని కార్య వాహకత్వము mission) నిరంతరముగ సప్తసంగీత ధ్వనులపై బాడుచు గోపనీయ (రహస్య) మగు జ్ఞానమును వ్యాప్తి చెందించుటయై యున్నది. ఆయన సదా జాగరూకుడై సమస్త యుగపరిణామములలో తన కాలము నెల్లప్పుడు నిరీక్షించుచు వసించును. దేవియగు సరస్వతియొక్క దానికి వలెనే వీణ సదానుసరణ (Constant accompaniment)మై యుండునది యొక్క ఋషికి మాత్రమే. వానియొక్క కార్య రంగము త్రిలోకములున్నై యున్నవి. యింకను భూర్ భువర్, స్వర్, లోకవాసులు వానినొకే మాదిరిగా గౌరవింతురు.

అత్యుత్కృష్టమగు దేవతలకును, సత్యోత్కృష్టమగు ఋషులకును, చైతము నాయన విశ్వసనీయ సలహాదారుడు. ఆయన నిరంతర హార్థిక వ్యవహారము విశ్వజగత్తుయొక్క శ్రేయస్సు ఒకవిషయ మాతని గూర్చి చెప్పబడును. నదేమన నాతడప్పుడప్పుడు తఱచుగ తన ఉద్దేశ్యమును నొకరిని వేఱొకరికి ప్రతికూలముగ పెట్టి నిర్వహించుకొనును. ఇంకను మూఢజనులలో వాని నామము తగవులాటకు సామెత (Byeword) యైనది. అది యటులున్నప్పటికిని నీకల్పమున సదావిశ్వమున కతిమిక్కిలి ఘనమగు శ్రేయస్సు వానిచే నొనర్పబడు చుండెను. వానియొక్క నుత్తేజత క్రింద వాల్మీకియు, వ్యాసుడును, తమ యతిమిక్కిలి గోపనీయ వాక్యముల వ్రాసిరి. యింకను వాని ప్రసన్నతా పూర్వక ప్రభావము శాశ్వతముగ సమస్త విశ్వపరిణామములలో గమనింప బడును. భాగవతము శ్రేయస్సానరించుటకగు వాని నిరంతరోద్యమముల వ్రాయుచున్నను.

## ౩. ధృవుని జీవితము

(భాగవతము నుండి)

మొదటి మనువుయొక్క కొడుకులలో నుత్తానపాదుడొకడు. "ఉత్తానుపాద"యనగ "పైకెత్తబడిన పాదముతో"నని యర్థము ఇది బహుశః జీవుడు తనలో నాధ్యాత్మికతత్త్వమును దృఢముగ గల్గియుండి భౌతికావతరణ (material descent) గతి (course) లో లగ్నము కాబడక పైగనొక పాదము మహర్లోకమువైపు కలిగి యుండినప్పటి సమయమును తెలియబడుచును. ఉత్తానుపాదు డిరువురి భార్యల - ("సురుచి" నుత్తమమగు సంపదములతో (Graces) నింకను "సునీతి"

(నుత్తమునుగ నీతులు పొందిన) కలిగియుండెను. ఉత్తముడు లేక నుత్తముడు సురుచియొక్క కొడుకు. ధ్రువుడు లేక సీయుడు సునీతియొక్క కొడుకు. ఒకానొకప్పుడు ధ్రువుడు ఉత్తముడు తన తండ్రి తొడపై యుండుట కనుగొని స్వయముగ తాను నటనుండ వాంఛించెను. సురుచియొక్క భయము కతన నుత్తాన పాదుడు ధ్రువునిపైపు తన చేతుల చాచ సాహసించలేక బోగా, పైగా సురుచి స్వయముగ నా బాలుని వాని మూర్ఖమగు నీప్సితమునకు నిందించెను. తన సవతితల్లి యొక్క కటువగు వాక్యములచే శీఘ్రముగ నొప్పింపబడి తన తల్లివద్దకు త్వరగా జని యామెకు తనదుఃఖముల విన్నవించెను. సునీతి యైదేండ్లు వయస్సుమాత్రమే గల తన కుమారుని తపస్సుచేయ సలహా నిచ్చెను. ధ్రువుడు కాలము నష్టపఱచ లేదు. కాని తన తల్లిచే మార్గము చూపబడిన ప్రకారము తపస్సొనర్చుట కింటిని విడిచెను. నారదుడు త్రోవలో వానిని కలుసుకొనెను. "ఓయీ ధ్రువుడా! నీ వొక శిశువవు. బహుజన్మల వఱకు నభ్యసింప బడిన తీవ్రయోగము, ధారణ, కామమునుండి విముక్తుల ద్వారా పొందదగు నా పరమాత్మను కనుగొనుటకు నీ కెటుల సాధ్యపడును? నా కుఱ్ఱవాడా! ప్రస్తుతమునకు మానుము. ప్రపంచ మందలి సమస్త వస్తువుల ననుభవించి నీవు పెరిగి వృద్ధుడ వయినప్పుడు యత్నింపు మ" ని ఋషి శ్రేష్ఠుడు పలికెను. కాని ధ్రువుడు తన నిశ్చయమున స్థిరుడయ్యెను. ఇంకను నాతడు నారదుని నెటుల ధ్యానింపవలెనో తనకు బోధింపుమని బలవంతపెట్టెను. నారదుడు ధ్రువుని "ఓం నమో భగవతే వాసుదేవాయ" యనెడి మంత్రము యొక్క విచిత్రములలో నుపదేశ మొనర్చి

వాసుదేవునిపై నెటుల ధ్యానించుటో వానికి చెప్పి, భగవానుడు శాశ్వతముగ వసించునట్టి మధుర (Madhura) వద్ద నొక తప స్సొనర్పు మని కోరెను. ధృవుడు తన దినముల నుగ్రమగు ధ్యాననిష్ఠయందు నొంటి పాదముపై నిలువబడుచు వాయువు (గాలి) పై జీవించుచు గడపెను. ఆ రాజపుత్రుడు తుదిని తన శ్వాసను వశపరచుకొని గాఢమగు ధారణతోడ హృదయమున దివ్యజ్యోతిని గాంచెను. భగవానుడా జ్యోతిని హృదయమునుండి వెనుకకు లాగగా సమాధి విచ్ఛిన్నమగుట తోడనే ధృవుడదే సమానమగు దేవతాపురుషుని (Divinity) వెలుపల తనమ్రోల నిలువబడినటుల గాంచెను. ఒకింత సమయము వఱకు నాతడు మాటల కలిగియుండ లేడు. భగవానుడు వానిని సంబోధించుచు "ఓయీ! క్షత్రియ బాలుడా! నేను నీ నిశ్చయము నెరుగుదును. నీవు సర్వదా నభివృద్ధి పొందుదువు గాక! సదా జ్యోతివంతమైనట్టియు, నిర్వాణము స్థిరమైనట్టియు, నొక స్థలమును నేను నీ కొసగుదును. గ్రహములును (planets) నక్షత్రములును, నా స్థలమునకు బద్ధమై యుండును. ఒక కల్పము వఱకు జీవించు వారెవరో వారు చనిపోదురు. కాని నా స్థల మెన్నటికిని విధ్వంస మొనర్ప బడదు. ధర్మము (Lharma) అగ్ని, కశ్యపుడు, నింద్రుడు, నింకను నాకాశ మండలి సమస్త జ్యోతుల (luminaries) తో కూడిన సప్తఋషులును, నా స్థలము చుట్టును నిరంతరము పరిభ్రమణ మొనర్తురు. సింహాసనముపై గల నీ తండ్రి యనంతరము నీవు దాని నొంది 36,000 (ముప్పదియాఱువేల) సంవత్సరముల వఱకు పాలింతువు. నీ సోదరుడగు నుత్తము డరణ్యములో మాయమగును. నీ సవతి తల్లియగు సురుచి తన కుమారు

ననుసరణలో మరణించును. నీ వంశ్యమున జనువారి స్థలము ఋషుల స్థలముకంటెను నున్నతరమైనట్టి నా యొక్క స్వకీయ ధామమే. మరియు దానినుండి తిరిగి వచ్చుట నుండ దని పలికెను.

ధృవుడు తన తల్లిదండ్రుల వద్దకు తిరిగిరాగా తన తండ్రిచే సింహాసనముపై నుంచబడెను. అతడు శిశుమారుని కుమార్తెయగు భ్రమిని వివాహమాడి నావెద్వారా కల్పుడు, వత్సరుడను నిరువురు కుమారుల గలిగియుండెను. అతడు "యిళి" ద్వారా "ఉత్కళుడ" ను నేకొక కుమారుని పొంది యుండెను. వేటకై బాహ్యమునకు జనగా బలీయుడైన యక్షు నిచే "నుత్తముడు" చంపబడెను. తన సోదరుని మరణ కారణ మున యక్షులపై పగబూనుటకు (సాధించుటకు) ధృవుడుత్తర దిశకు జనెను. యుద్ధమున నాతడు వేలమంది యమాయిక యక్షులను, కిన్నరులను, దునిమెను. మనువు వారిపై కరుణ గొని తన మనుమని యుద్ధమునుండి మానుమని కోరెను. ధృవుడు నమ్రతగా మనువునకు శిరస్సువంచెను. గాన యక్షు లకు రాజైన కుబేరుడు వానితో నతిమిక్కిలి ప్రీతుడై వాని నాశీర్వదించెను. ముప్పదియారు వేల సంవత్సరము లనంతరము విష్ణుని నిరువురు సహాయకులైన సనందుడు, నందు డనువారలు రథముతోడ వచ్చి వాగ్దత్తమగు ధామమునకు ధృవుని గొం పోయిరి.

## 4. రత్నాకరుని జీవితము.

రత్నాకరుడను వాడొక గొప్పదొంగ. అతడు పథికుల దారిపొంచి ముట్టడించి నిర్దయగ వారిని జంపి వారు కలిగి యుండు సకలములను తీసుకొను చుండెడివాడు. అతడు గొప్ప

జీవి నొసద్ను చుండెను. అదృష్టవశమున నాతడు నారద ఋషిని కలుసుకొనగ నీ సమావేశమే వాని జీవితమును పూర్తిగ మార్చి వేసెను. ఆతడు బహుసంవత్సరముల వఱకు "మర మర" యని భక్తితో నుచ్చరించి గాఢ ధ్యానము నభ్యసించెను. ఆతడెన్నడు తన యాసన స్థానమును విడువ లేదు. ఆతడు తన దేహము చుట్టును చీమల పుట్ట యేర్పడునంత యధికముగ భగవదీయ ధ్యానమునందు లీనుడయ్యెను. ఇదియే వానికి "వాల్మీకి" యనగా చీమల పుట్టయను నామము నొసగెను. ఆతడొక గొప్ప సుప్రసిద్ధమగు కవి యాయెను. ఆతడు రామాయణమును వ్రాసెను. ఎట్టి ఆశ్చర్యమగు సంఘటన !

## 5. జగాయి, మధాయిల జీవితము.

చైతన్య మహాప్రభుని కాలమున నవద్వీపములో వసించు చుండిన జగాయి, మధాయి (Jagai Madhai) యను నారిద్దరు దుష్టజనులు. వారు సోదరులు. సాధారణముగ సత్యము (Truth) నుద్బోధించిన భగవంతునియొక్క సమస్త దూతలు, సమస్త దివ్యసందేశ కర్తలు (Prophets) తీవ్రముగ బాధింపబడిరి. కొందఱు తమ నిశ్చితాభిప్రాయముల కొఱకై మరణించిరి కూడను. ఏసుక్రీస్తు ప్రభువు శిలువ (Cross) వద్ద మరణ మొందింపబడెను. గౌరాంగ ప్రభువుగూడ తప్పించుకొనలేదు. నవద్వీపమందలి జనులు వానిని తీవ్రముగ బాధించిరి. జగాయి మధాయిలు వానిని అనుచరులను నెక్కువగ గాసి పఱచిరి. గౌరాంగుడు వారిని జయింప నిశ్చయించెను. ఆతడొకనాడు తన కీర్తన దళముతో శ్రీహరి

నామమును గాక మొహమ్మును జయింపదేరెను. గౌరాంగప్రభుని ముఖ్యశిష్యుడగు నిత్యానందుడు డాబరములో నుండెను నాడు జగాయి, మధాయిలు కలుసుకొనిరి. దుడ్డుకఱ్ఱల (Cudgels) తో నుగ్రముగు కొట్లాట జరిగెను. అందఱును పరుగిడిపోయిరి. కాని నిత్యానందుడు తీవ్రముగ గాయపడి నన్నుటికెని, స్థిరముగ నిలుచుండెను. అతడు బాహ్యముగ బారచాచిన చేతులతో జగాయి, మధాయిల ప్రేమతోడ కౌగలించుకొనుటకు వచ్చెను. నిత్యానందుని పవిత్ర ప్రేమచే నీయుపువున దుర్మార్గులు నంత్యమున జయింపబడిరి. వారు గౌరాంగప్రభుని నాతురమైన (కాంక్షింపదగు) శిష్యులైరి. ప్రేమకంటె ఘనతరమైనది పృథ్విపై నే శక్తియు లేదు. ప్రేమ యందరిని జయించును. ప్రేమ యంత్యమున గెలుపొందును. ద్వేషము ద్వేషముచే శమింపదు. కాని ప్రేమచే శమించును. ప్రాణాయామాభ్యాసముచే మిక్కిలి దృఢమగు నినుప గొలుసును నీవు త్రెంపగలుగుదువు. కాని పవిత్ర ప్రేమ యనెడి గొలుసును నీవు త్రెంపజాలవు. ప్రేమ జయింపరానిది. ప్రేమయే దేవుడు. దేవుడే ప్రేమ. కావున దివ్య ప్రేమను పెంపొందింపుము.

## 6. దొంగకథ

శ్రీ రామకృష్ణ పరమహంస వారి సమకాలికుడగు పవ్హారిబాబా (Pavhari Baba) యను మునీశ్వరుని కుటీరము నొకదినమున నొకదొంగ చొచ్చెను. వాడొక సంచిలోనికి సమస్తపాత్రలను ప్రోగుచేసి మోసుకొని పోబోవ నుండెను. దొంగ దానిలోనికి ప్రవేశించినప్పుడు పవ్హారి

బాబా కుటీరములో లేడు. మునీశ్వరుడు [Saint] తన కుటీరమును ప్రవేశించినప్పుడు దొంగ సమస్తవస్తువులను విడిచి పారిపోయెను. పవహారిబాబా సంచిని తన భుజముపై మోసుకొని దొంగను వెంబడించెను. ఆయన "ఓ దొంగడగు నారాయణా! నీవు నా కుటీరములోనున్నటుల నాకెన్నడు తెలియదు. ఇది నీయాస్తి. దయయుంచి వాటి నంగీకరింపగలందులకు ప్రార్థించుచున్నాన"ని పలికెను. ఆయనా దొంగయెదుట సాష్టాంగవందనమాచరించి సంచిని వాని పాదములనొద్ద నుంచెను. దొంగ నిర్ఘాంత మొనర్పబడెను. వాడు చాల మిక్కిలిగ తన దుష్టకార్యమునకు పశ్చాత్తాపపడెను. తక్షణమే నాతడు పరివర్తనమొందిన మానవుడాయెను. భగవత్కృప వానిపై నిప్పుడవతరించెను. వాడు మునీశ్వరుని మ్రోల సాగిలబడి "నా ప్రభూ, నేనొక ఘోరమగు దౌష్ట్య [Crime] మొనర్చితిని. నన్ను క్షమింపుడు. నన్ను మీ శిష్యునిగ నొనర్పుడు నాకు గురుమంత్రము నిండు. నా కుపదేశింపు"డనెను. వాడు గురుమంత్రము నొందెను. వాడు తీవ్రసాధన, ధ్యానములనొనర్చి నుత్తమ భక్తుడాయెను.

## 7. నామదేవుని జీవితము

తన దినమందలి ప్రపథమభోజనమునకై [breakfast] పండరీపురమందలి నామదేవుడను భక్తుడొక రొట్టెముక్కను నేతిని సిద్ధముగ కలిగియుండెను. ఆతడు తన భోజనము గైకొన బోవనున్నపుడొక కుక్క లోనికి శీఘ్రముగ ప్రవేశించి రొట్టెను తననోటితో పట్టుకొని పారిపోయెను. నామదేవుడు తన చేతిలో నేతితోడ కుక్కవెంట పరుగిడుచు "ఓ విఠలప్రభూ! ఎందు

రొట్టె నీకై రుచిగనుండునని కాదు. దయయుంచి రొట్టెతో కూడ నీ నేతిని తీసుకొనుము" అని యడిగెను. ఆతడాకుక్కను నేతిలో కలుపబడిన రొట్టెతోడ తినిపించెను. ఆతడు స్వయముగ నారోజున తన భోజనమును తీసుకొనలేదు. పరాభక్తి గలిగిన నామదేవునికా కుక్కయే విఠలభగవాను (శ్రీకృష్ణు)డై యుండెను. దివ్యప్రేమయొక్క మహిమను గుర్తింపుడు. నామదేవుడు పరాభక్తిని వృద్ధిపఱచెను. అతడు సమస్తజీవులలోను శ్రీకృష్ణుని గాంచెను.

## 8. రెండు పిల్లులతోడి పూజకథ

కాన్పూరుకు చెందిన రామ్‌నాథ్ మిశ్రాయనునాయన శ్రీకృష్ణ పూజ నుదయము వేళ చేయుచుండెను. భగవంతుని కొఱకుంచ బడిన ప్రసాదమును రెండుపిల్లులు తినివేసెను. రామ్‌నాథ్ మిశ్రా రెండుపిల్లుల తనకెదురుగనున్న నొకస్థంభమున కనుదినమునుకట్టి వేసి పూజ చేయుచుండెను. రామ్‌నాథ్ మిశ్రాయొక్క కుమారుడగు భోలేనాథ్ మిశ్రాయునుకూడ తనపూజగదిలో తనకెదురుగ రెండుపిల్లులనుకట్టివేసి యుదయము వేళ క్రమముతప్పకుండ పూజ చేయుచుండెను. ఒకనాడు రామ్‌నాథ్ తనకుమారుని పూజ గదిలోని రెండు పిల్లులను చూచి "భోలేనాథ్, నీవేల రెండు పిల్లులను నీ యెదురుగ కట్టుదు" వని యడిగెను. "పూజ్యపితా! నీ పూజగదిలో నీ యెదురుగ నేను రెండు పిల్లులను చూచినాను. కాన నేను కూడ నా పూజగదిలో నా కెదురుగ రెండు పిల్లుల కట్టినాను. నేను భగవాను నారాధించినపుడు పూజగదలో రెండు పిల్లులు కట్టివేయ బడవలె నని నేనూహించితి" నని జవాబిడెను.

ఈ రకపు పూజ చాలమంది జనులచే నొనర్పబడును.

తంత్రీ యేదే నొకానొక విధముగు సంధ్య యుపాసన, లేదా ధ్యానము, లేదా ధార్మిక క్రియ [rites] నొనర్చును. తాను కూడ మతవిషయమున భగవద్భక్తి కలవాడని జనులుభావింప చేయుటకై కొందుకు కూడ తంత్రి ననుకరించును.

ఉపాసనా పద్ధతి, నీవు వల్లించు (పఠించు) శ్లోకముల యర్థము, మంత్రముల, మతకర్మల ప్రాముఖ్యత, జపము, నారాధనల యొక్క ప్రయోజనములకు చెందిన సక్రమావ గాహనమును నీవు కలిగి యుండవలయును. శ్రద్ధ, భావము, భక్తి, నీవు కృషి యొనర్పవలెను. భగవన్నామము నెడ రుచిని లేక స్వామిత్వమును నీవు కలిగి యుండవలయును. ఉపాసనా శాస్త్రము, జపయోగము, మంత్రయోగము, భక్తి యోగముల యొక్క జ్ఞానమును నీవు కలిగియుండ వలయును. లక్ష్యము, భగవత్స్వభావముల యొక్క స్పష్టమగు నభిప్రాయ మును నీవు కలిగి యుండవలయును. వైరాగ్యమును నీవు కలిగి యుండవలయును, మంత్రముయొక్క జపమెటుల మనస్సుపై పవిత్ర కారక ఫలితముల కలుగచేసి, రజస్సు, తమస్సుల విధ్వంస మొనర్చి మనస్సును సత్త్వములేక పరిశుద్ధత తోడ నింపి, మానవ స్వభావమును దివ్య స్వభావముగ మార్చునో నీవు తెలిసికొన వలయును. అప్పుడు మాత్రమే నీ వున్నత ముగ ప్రయోజన మొందింప బడుదువు. అపుడు మాత్రమే నీ వాధ్యాత్మిక పంథలో శీఘ్రమగు పురోభివృద్ధి [progress] ని కలిగియుండ గలవు. మన మిత్రుడగు భోలేనాథ్ వలె నీ పూజ గదిలో రెండు పిల్లుల కట్టి వేయకుము. విచారింపుము. ఆలో చింపుము. తలపోయుము.

భగవద్భక్తి రహితమగు తల్లి దండ్రులు భగవద్భక్తి

రహితముగు పిల్లలను కలిగియుందురు. తల్లిదండ్రులు స్వాయముగ మత విషయక, భగవద్భక్తియుత జీవనమును గడుప వలయును. ఉపాసనా శాస్త్రము, మంత్ర యోగము, జప యోగము, భక్తియోగముల వా పత్తుమ పాటించులుగ నొనర్ప బడవలయును. సక్రమ విధమున వారు తమ బిడ్డల నాధ్యాత్మిక మార్గమున వారి కేవలబాల్యమునుండి శిక్షణ చేయవలయును. అపుడు మాత్రమే గృహము పృథ్విపై నొక వైకుంఠమగును. అపుడు మాత్రమే గృహములో మైత్రి, శాంతి, విస్తృత (కలిమి) ఐశ్వర్యము లుండును. మతములేని జీవనము విషాద కరమగు వృథాయును, వాస్తవిక మరణమునై యున్నది.

## 9. అంబరీషుని కథ

రాజగు నంబరీషుడు వివేకము, వైరాగ్యము కలిగి యుండెను. వాని భక్తి ఘనమైనది. ఎటు చూడబడినను వాని మనస్సు విష్ణుని పాదపద్మములపై లగ్నమై యుండెను. వాని వాక్కులు సర్వమును వైకుంఠ మహిమను గూర్చియై యుండెను. వాని హస్తములు విష్ణు దేవాలయముల పరిశుభ్ర పరచుటలో పూన్చబడియుండెను. వాని చెవులు విష్ణునియొక్క మాహాత్మ్యమును క్రియలనుగూర్చి మాత్రమే వినియుండెను. వానికండ్లు బుద్ధిపూర్వకముగ విష్ణు చిహ్నముల పైననే చూచియుండెను. వాని శరీరము వైష్ణవుల స్పర్శలో నానంద మొంది యుండెను. వాని ముక్కు విష్ణు పాదములనుండి బయలుదేరు తులసియొక్క సౌమ్యమగు సుగంధము (సౌరభము) నాఘ్రాణించి యుండెను. వాని నాలుక విష్ణునకు సమర్పింపబడిన నాహారమును మాత్రమే రుచిచూచి యుండెను. వాని పాదములు విష్ణునకు పవిత్రకరమైన స్థలముల

గిరిగెను. వాని శిరస్సు విష్ణుని వందనమునకై వినియోగింప బడెను. ఆతడు ప్రాపంచిక వస్తువుల ననుభవించి యుండినచో నది విష్ణుని సేవకొఱకై నుండెనుగాని, భోగము నిమిత్తము కాదు. ఆత డనురాగము కలిగియుండినచో విష్ణునెడ నను రక్తులొనర్పబడిన వారి కొఱకు మాత్రమే. తనకర్మ ఫల ముల నాతడా పరమేశ్వరునకే సమర్పించు చుండెను. భక్తి చేతను, తన జీవితమండలమునకు చెందిన విధులయొక్క నిస్స్వార్థమగు నాచరణ (స్వధర్మము) చేతను నాతడు భగ వానుని సంతుష్టు నొనర్చి క్రమ క్రమముగ సర్వసంకల్పముల నాతడు త్యజించెను. ఆ జగత్ప్రభువు (విష్ణువు) రక్షణ కొఱకై వానికి తన స్వకీయమగు చక్రము నిచ్చునంతటి యధికముగ రాజుతో సంతుష్టు డాయెను.

అంబరీషుడు తన భార్యతోడ నొక సంవత్సరము వఱకు ద్వాదశి వ్రతము నాచరింప నొకానొకప్పుడు బూనెను. ద్వాదశి, చంద్రునియొక్క పండ్రెండవ దినము. చంద్రునియొక్క నేకాదశి (పదునొకండవ) దినమున నుపవాస మొనర్చి పండ్రెండవ రోజున నుపవాసమును భంగమొనర్చు టతో వ్రతము కలిగియుండును. ఒకానొక సమయమున నాతడు మూడు వరుస దినము లుపవాస ముండెను. ఆతడు స్వయముగ యమునలో స్నానమొనర్చి మధుర [Mathura] యందలి విష్ణు నారాధించెను. ఆతడు బ్రాహ్మణులకు విస్తార మగు, ధనములను, పశుగణము నొసగెను. ఆతడు తదుపరి బ్రాహ్మణులకు భోజన మొనర్చి తాను తినుటకై వారి యను జ్ఞను కోరెను. ఆ సమయమున దూర్వాసుడు వాని యతి థిగ ప్రత్యక్షమాయెను. రాజు వానిని తగువిధిగ స్వీకరించి

యూయనను భోజనమును గొన బ్రతిమాలెను. ఋషి యంగీకరించి నదిలో స్నానమొనర్చుటకును తన దైనిక (దైవిక) కర్మల నాచరించుటకును జనెను. రాజు వాని కొఱకు చాల కాలము వేచియుండెను. కాని, యాతడు తిరిగి రాలేదు. ఇప్పుడొక యర్థ ముహూర్తము మాత్రమే ద్వాదశియందు మిగిలియుండెను. రాజేదియు తినక పోయినచో, వాని వ్రతమాచరింపబడదు. అతడు తినుచో నొక బ్రాహ్మణునికి నిర్లక్ష్యము నాతడు చూపెను. ఇట్టి సంధి పరిస్థితి [Juncture] యందు రాజొకింత నల్పమగు జలమును తీసుకొనుట ద్వారా నిరు (రెండు) ద్దేశముల గొనసాగింప నిశ్చయించెను. నేలన బ్రాహ్మణులు దానిని తినుటను, తినకుండుటనుగా నామ కుదురుచు. (వ్యవహరింతురు) దూర్వాసుడు నెను దిరిగి వచ్చెను. ఆధ్యాత్మిక దృష్టిచే నాత డేమి జరిగినది తెలిసికొని నత్యున్నతముగ కోపోద్దీపితు డాయెను. ఆతడు జడకుచ్చు (శిఖ) నూడ జెరికి యంబరీషుని చంపుటకు దాని నాజ్ఞాపించెను. రాజు నిశ్చలుడై యుండెను. విష్ణుని చక్రము దూర్వాసునిచే పంప బడిన విధ్వంసక శక్తిని దగ్ధపరిచి వానిని సహితము ధ్వంస మొనర్ప జనెను. ఋషి అన్ని దిక్కులకు పరువిడెను. ఆత డెచ్చటకు జనినను చక్రము వానిని వెంబడించెను. ఆతడు బ్రహ్మయొద్దకు జని రక్షింప బడుటకై ప్రార్థించెను. "నిన్ను రక్షించుటకు నా సామర్థ్యములో లేదు. నీవు విష్ణుని యొక్క భక్తుని కోపింప జేసితి వ"ని బ్రహ్మ పలికెను. ఆతడు శివుని వద్దకు జనెను. "బిడ్డా! విష్ణుని యీ యాయుధము నాకు సహితము చాల నధికమైనది. నీవు విష్ణువు నొద్దకు జనుమని శివుడు చెప్పెను. దూర్వాసుడు విష్ణువునొద్దకు బోయి క్షమింప

యనుటకు రక్షింప బనుటకు, ప్రార్థించెను. విష్ణువు "ఓయీ బ్రాహ్మణుడా! నేను నా భక్తులపై నాధారపడి యున్నాను. నేను స్వేచ్ఛాపరతంత్రుడను గాను, నా హృదయము భక్తుల వశములో నున్నది. నేను వారికి ప్రియముగ నుందును. నా భక్తులైన నీవు లేకుండ నన్నుగాని నా పరిపూర్ణాధికారము లను గాని నేను కోరను. నేలన నేను వారికి కేవలము శ్రేష్ఠ మగు నాశ్రయముగా నుందును. నా నిమిత్తము వారు తమ భార్యల, గృహముల, బిడ్డల, నింకను సంపత్తిని త్యజింతురు. నే నెట్లు వారిని విడువగలను. వారి హృదయము నా యెడ గొలుసుతోడ బంధింప బడును. వారంతటిని సమదృష్టితో చూతురు. పతివ్రతలగు భార్యలు తమ భర్తల నరిగ నాకర్షించు నట్లువలె భక్తిచే వారు నన్ను గొలుతురు. నా సేవయే వారికి సర్వమును సర్వమై యున్నది. నాలుగు ముక్తులగు సాలో క్యము, నింకా నితరములను సహితము వారి సులభమగు చేరు బడిలో వచ్చు నప్పటికిని వారు కోరరు. ఏ నశించు వస్తువుల కొఱకు వారపేక్ష కలిగి యుండగలరు? సాధువులే నాహృద యము. నేను సాధువుల హృదయముగ నుందును నన్ను తప్ప నింకెవరిని వారెఱుగరు. వారు తప్ప నింకెవరిని నే నెఱుగను. ఓ బ్రాహ్మణుడా! నీవు చేయదగు మార్గమును వినుము. నీలో నీ భయము కలుగ చేసిన దెవరో వానివద్ద కాలస్యము లేకుండ పొమ్ము. సాధువుల నెడ విరుద్ధముగ శక్తి యుపయోగింపబడు నప్పుడు శక్తినుపయోగించు వానిపై నది ప్రతీకార మొనర్చును. వాస్తవిక తపస్సు, జ్ఞానమును రెండును బ్రాహ్మణులయొక్క విమోక్షణమునకై యున్నవి. కాని నశిక్షితుడగు వానిలో నవి ప్రతికూల ఫలము నుత్పత్తిచేయును. కాన నీవు "నాభాగుని

వ్రతుని వద్దకు జనుము. వాని క్షమాభ్యర్థనను వేడుము. నీవు రక్షింపబడుదువ" నెను.

దూర్వాసు డంబరీషుని వద్దకు తిరిగి జని రాజుయొక్క పాదముల స్పృశించెను. బ్రాహ్మణునియొక్క యీ కృత్యమున కంబరీషుడు వ్యాకులుడై, ఋషియొక్క నుద్దేశము సరిగి యాతడు చక్రమును దాని జను మార్గమునుండి మానుమనియు, బ్రాహ్మణుని సంరక్షింపుమనియు, ప్రార్థించెను. చక్రము సరిగ నప్పుడే తనవిధ్వంసక కృత్యము నారంభించెను. కాని, నంబరీషుని ప్రార్థనపై తన శక్తుల ననుకరు లాగుకొనెను. దూర్వాసు డత్యమితముగ కృతజ్ఞుడై నాతడు రాజు నీవిధముగ స్తుతించెను. "ఓ రాజా ! నేడు దినమున వైష్ణవుల ఘనతను చూచితిని. నేను నిన్ను కోపింపచేసినప్పటికిని నీవు నాయొక్క క్షేమమునకై ప్రార్థించితివి. విష్ణువంతటివానిని జయించిన వారికి నేనియు నాశ్చర్యముకాదు. నీవు నాయెడ చాల దయగల్గియుంటివి. నీవు నన్ను చాల ననుగ్రహించితివి. నీవు నా తప్పిదమునుసహితము తలంపలేదు. కాని నీవు నాప్రాణమును రక్షించితివి." ఈ సమయమంతయు దూర్వాసుకొఱకు రాజు వేచియుండెను. ఆయనిప్పుడు ఋషి పాదములవద్దబడి భోజనమును దీసికొన నాతనిని ప్రార్థించెను. ఋషి సంతసముతో నటులొనర్చి రాజునుకూడ తనభోజనమును గైకొనచేసెను.

దూర్వాసుడప్పుడు బ్రహ్మలోకమునకు జనెను. ఆతడొక సంవత్సరమువరకు తిరిగిరాలేదు. రాజు తిరిగి ఋషిని చూచు నాతురతతో యీ కాలమంతయు కేవలము నీటిమీదనే జీవించెను. అంబరీషుని పవిత్రగాథ యిట్టిది.

# అనుబంధము

## భక్తియోగ ప్రశ్నోత్తరి

భక్తియోగముయొక్క సారమునంతను శ్రీ శివానంద గురుభగవానులు నలుబదియెనిమిది (48) ప్రశ్నలు, వాటికి సమాధానముల రూపమున నొసగియుండిరి. వీటి పఠనచే పాఠకుల సర్వసందేహములు తప్పనిసరిగ నివృత్తియయి భక్తిహీనులను భక్తులుగను, భక్తులను పరాభక్తులుగను నొనర్చితీరును. సర్వులు నాచరణచే ధన్యులగుదురుగాక !

1. ప్రశ్న:-జీవితముయొక్క గమ్యమేది ?

జవాబు:-ఆత్మ సాక్షాత్కారము. [Self-realisation] లేక భగవచ్చైతన్యము. [God-consciousness]యొక్క ప్రాప్తి.

2. ప్రశ్న:-మోక్షముయొక్క స్వరూపమెట్టిది ?

జవాబు:-సర్వదుఃఖ నివృత్తియు, మరియు పరమానంద ప్రాప్తియును, సర్వవిధములగు కష్టములపరిహారము [removal]నుత్కృష్టమగు సుఖముయొక్క సిద్ధియును.

3. ప్రశ్న:-ఈ కలియుగములో సులభముగ మీరెట్లుమోక్షమొందగలరు ?

జవాబు:-హరినామస్మరణ, దైనందిన హరినామ సంకీర్తన చేయుచుండుట ద్వారా.

4. భక్తియోగ మననేమి ?

జవాబు:-ఏది ప్రాపంచిక జీవనపు కొఱతల [Wants] కోరికల కష్టములయొక్క విరమణ (నివృత్తి) గొని తెచ్చునో,

మానవునికి చెందిన నాత్మయొక్క భాగధేయుడగు భగ వానుని పట్ల నెంతలో ననురాగము గలదో. నా భక్తి మార్గమే అది. అది జీవుని భగవానునితో నైక్య మొనర్చు ప్రేమపంథ [Path] యే.

5 ప్రశ్న:-రామునికంటె నధిక మే వస్తువు ఘనతరమైనది ?
జవాబు:-రామ నామము

5 A ప్రశ్న:-ఎటుల ?

జవాబు:-శ్రీరామునితో హనుమానుడు ! "ఓ నా ప్రభూ ! పరాత్పరుడవగు నీకంటెనుకూడ గొప్పదొకటి యుత్కృష్ట మైనది గలద" ని తెల్పెను. శ్రీరాముడు సంపూర్తిగ నాశ్చర్యమొందెను. ఆయన హనుమానుని "ఏవస్తువు హనుమంతా! నాకంటెను శ్రేష్ఠమైనది ?" యని యడి గెను. హనుమానుడు "హే ప్రభూ ! నీవు నదిని పడవ సహాయముతో దాటితివి. కాని నేను మహాసముద్రమును దేవదేవుడవగు నీ నామముయొక్క సహాయము, శక్తి, బలములతో మాత్రము దాటితిని. నీనామములోమాత్రమే పాషాణములు తేలియాడెను. కాబట్టి భగవానుడవగు నీ నామము వాస్తవికముగ నీకంటెను గొప్పది."

6. ప్రశ్న:-భగవంతుని యునికి [Existence] కై ఋజువు లెవ్వి ?

జవాబు:-రక్తమునుండి వీర్యము, పాలు, పిత్తము, [Bile] లాలా జలము, [Saliva] ఉదరరసము, [Gastric Juice] మున్నగు నవి యుత్పత్తిగావింపబడుటకై శరీరముయొక్క జీవకణములు [Cells] గ్రంథుల [Glands] కెవరు చైతన్య [Intelligence]

మొదలిది? సౌందర్యముయొక్క అంతర్విభాగముల(Strata) మున్ను నిర్మించియుంచు కన్ను కైవారాహార మిత్తురు? తల్లి గర్భాశయములోని బిడ్డను పోషించునదియు దాని పెరుగుదలను సహాయము నొసగునదియు, నగు శక్తియేది? ఒక వీర్యపు బిందువునుండి రోమములు, వ్రేళ్ళు, కండ్లు, ముక్కు, కాళ్ళు మున్నగు వాటితోగల గొప్పరూపమును బైటకు గొనవచ్చునట్టి యంతయద్భుతమగు విచిత్ర శక్తి యెద్ది? అదియే భగవానుడు లేక యీశ్వరుడు లేక పాలకుడు (Ruler) లేక సృష్టికర్త.

7 ప్రశ్న:-భగవానుని యొక్క స్వభావ మెట్టిది?

జవాబు:-భగవానుడే సత్యము. భగవానుడే ప్రేమ. భగవానుడే జ్యోతులలో జ్యోతి. భగవానుడుశాంతి, జ్ఞానము, సుఖము, సౌందర్యముల మూర్తిత్వము. (embodiment)

8 ప్రశ్న:-భగవానుడెక్కడ నున్నాడు?

జవాబు:-ఆ పరాత్పరుడు మీ హృదయములో నున్నాడు. ఆయన మన హృదయములలో నంతర్వాసి (నంతర్యామి)

9 ప్రశ్న:-ఈ కలియుగమున సులభముగ మోక్షమిచ్చు మహా మంత్ర మెద్ది?

జవాబు:-హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే

10 ప్రశ్న:-భక్తియన నేమి?

జవాబు:-అది భగవంతునికై నుత్కృష్టమగు ననురక్తత (devotion) తీవ్రమగు నాసక్తి (attachment) యే.

11 ప్రశ్న:-భక్తిని వృద్ధిపొందించు లేక కృషి చేయుటకు ఆరు సాధన (ఉపాయము) లెవ్వి?

జవాబు:-భాగవతుల, సాధుల, సన్న్యాసులసేవ, భగవంతుని యొక్క నామోచ్చారణ, సత్సంగము, హరికీర్తనము, భాగవతము లేక రామాయణ పారాయణ, బృందావనము, పండరీ పురము, చిత్రకూటము లేక అయోధ్యలో వాసము. ఇవి భక్తి కృషి చేయుట కాఱు తెరవులు.

12 ప్రశ్న:-హరియొక్కనామము నెవరు గాన మొనర్చనగును

జవాబు:-శ్లో॥ తృణాదపి సునీచేన - తరోరపి సహిష్ణునా ।
అమానినా మానదేన - కీర్తనీయః సదాహరిః॥

ఎవడైతే పచ్చగడ్డి రేకు (blade) కంటె వినమ్రుడో, ఎవడు చెట్టువలె సహనతా శక్తి (Power of endurance) గలిగి యుండునో, నెవడైతే గౌరవమునకు నరకు గాక కుండ పైపెచ్చు (మీదుమిక్కిలి) నన్యుల గౌరవించునో, నాతడు సర్వవేళల హరినామమును కీర్తించుట కర్హత గలవాడు.

13 ప్రశ్న:-భక్తి మార్గములో నైదు కంటకము (ముండ్లు) లేవి?

జవాబు:-శ్లో॥ జాతి విద్యామహత్త్వంచ-రూప యౌవనమేవచ ।
యేతే భక్తి మార్గేషు-జనితా పంచకంటకాః॥

భక్తి మార్గములో జాతి, వైదుష్యము (పాండిత్యము) హోదా, సౌందర్యము, యౌవనము, నైదు ముండ్లని గుఱ్ఱుగుము.

14 ప్రశ్న:-దివ్యామృత మెచ్చట నున్నది ?

జవాబు:-విద్వజ్జనులు (Learned people) "అమృతము సము ద్రములో, చంద్రునిలో, పాములయొక్క ప్రపంచము (నాగలోకము) లో, స్వర్గములో, గన నగున" ని చెప్పు దురు. ఇది నిజమగుచో సముద్రములో నుప్పదనము (Saltishness) చంద్రునిలో క్షయము. (Decrease) సర్పములయొక్క నోళ్ల (Mouths) లో విషము. యిం ద్రునియొక్క మరణము లేక సింహాసన (రాజ్య) చ్యుతి, (Dethronement) నెటులుండగలవు ? కాబట్టి నిజమగు నమృతము భాగవతుల (భగవంతునియొక్క భక్తుల) కం ఠము (నుడులు లేక బోధలు) లో గన నగును.

15 ప్రశ్న:- భక్తు లెరుగబడు టెటుల ?

జవాబు:-భక్తులు దేనికిని లక్ష్యము చేయరు. వారి హృదయ ములు భగవంతునియొక్క చరణ కమలములవద్ద లగ్న మొనర్పబడి యుండును. వారు చాల నమ్రతగ నుందురు. వారు సమదృష్టి గలిగియుందురు. వా రెవరి పట్లను, నే వస్తువు పట్లను, నాసక్తి (ననురాగము) గలిగియుండరు. వారు స్వకీయత్వము (మమత - Mine-ness) లేదా నాత్వము (అహంత - I-ness) లేకుండ నుందురు. దుః ఖము, సుఖముల మధ్య వారు భేదా (Distinction) నొందియుండరు. వా రితరులనుండి యేదియు తీసుకొనరు. వా రుష్ణము, శీతలత లేక బాధను సహింప జాలుదురు. వారు సర్వప్రాణి జీవుల (Living beings) కై ప్రేమ గలిగి యుందురు. వారు శత్రువుల గల్గియుండరు. వారు ప్రశాం

తముగ నుందురు. వారొరవర్ని ప్రాయమగు శీలమును వహింతురు. భగవానుడగు శ్రీహరి యొక్క నామము సదా వారి పెదవులపై నుండును. వారు బాల భక్తిగ నుందురు. వారు శ్రీహరిని సర్వజీవుల, వస్తువులలోను చూతురు. వారన్యుల మనోభావముల (Feelings) నెన్నడును హాని చేయరు. వారు సర్వుల నెడ మైత్రిగ నుందురు. వారు కోపము, ద్వేషము, గర్వములనుండి విముక్తులుగనుందురు.

16 ప్రశ్న:-భక్తిని పెంపొందించు మార్గములలో నిలబడు రెండు అంతర్య శత్రువు లెవరు?

జవాబు:-కామము, క్రోధము.

17 ప్రశ్న:-కామమును వెంబడించు పది దుర్వ్యసనము (Vices) లెవ్వి?

జవాబు:-వేటాడుట యందాసక్తి, జూదము, (Gambling) పగటివేళ నిద్ర, అపనింద వేయుట, (Slandering) దుష్ట స్త్రీలతోడి సాంగత్యము, త్రాగుడు, శృంగార కీర్తనల (Love Songs) పాడుట, నృత్య మొనర్చుట, అవినీతి (Vulger) స్వభావపు సంగీతము, నింకను నుద్దేశ్య హీన మైన తిరుగుటయును.

18 ప్రశ్న:-క్రోధము (కోపము) తో సహచరించు నెనిమిది రకముల దుర్గుణము లెవ్వి?

జవాబు:-అన్యాయము, తొందరపాటు తనము, బాధించుట, అసూయ, ఆక్షేపణ [Captiousness] మోసగించుట, (అన్యుని యాస్తిని స్వాధీన పర్చుకొనుట) పరుషపు [Harsh] మాటలు, క్రూరత్వము. [Cruelty]

19. ప్రశ్న:-భక్తియొక్క నానావిధచిహ్నములు లెవ్వి ?

జవాబు:-అశ్రుపాతము (కన్నీళ్ళు) పులకము (రోమాంచమగుట) కంపనము (కండరము లదురుట) ఏడ్చుట, నవ్వుట, చెమర్చుట, (sweating) మూర్ఛ, (శోషిల్లుట) స్వరభంగము (మాటలాడుట కశక్తితనము) ను.

20. ప్రశ్న:-భగవానుడు భక్తులకెట్టుల సాయమొనర్చెను ?

జవాబు:-శ్రీకృష్ణప్రభువే స్వయముగ (తనంతటతానే, నర్సీ మెహతా కూతురియొక్క వివాహమహోత్సవమును జరిపెను. నర్సీ తల్లియొక్క శ్రాద్ధముకొఱకై భగవానుడు నాతని నెయిని గొనితెచ్చెను. ఆ పరాత్పరుడు తనచేతులలో నొకకఱ్ఱగొనుచు సంఘుడగు బిల్వమంగళుని బృందావనమునకు దారిచూపెను. తన మంగలి భక్తునియొక్క హాజరుకానిదినములలో నా భగవానుడు రాజు పాదములొత్తెను.

21. ప్రశ్న:-భక్తిమార్గములో నైదు తప్పనిసరి యావశ్యకత లేవి ?

జవాబు:-భక్తి నిష్కామ్యపద్ధతిగ నుండవలయును. అది "అవ్యభిచారిణి"గ కూడ నుండవలెను. అది తైలధార (Flow) వలె నెడతెగకుండ నుండవలయును. జిజ్ఞాసువు (మోక్షార్థి) సదాచారము లేక సత్కర్మప్రవర్తన నవలంబింపవలయును. ఆతడు తన భక్తిమయసాధనలలో చాల చాలతీవ్రముగ, మనఃపూర్వకముగ నుండవలయును. అప్పుడుమాత్రమే భగవంతునియొక్క సాక్షాత్కారము బహుశీఘ్రముగ వచ్చును.

22. ప్రశ్న :-ఏకదినమైన శ్రీరామానుష్ఠానమును చేయుటెట్లు ?

జవాబు:-తెల్లవారుఝామున 4 గంటలకు (4 a. m.) లెండు. మీకు ప్రావీణ్యమొందిన నేయాసనముపైనైన మీ జపమును ప్రారంభింపుడు. ఏ యాహారము లేక పానీయమును 14 గంటలవరకు గొనకుడు. ఆసనమునుండి పైకి లేవకుడు. మీకు వీలగుచో సూర్యాస్తమయమువరకు మూత్రముపోయుట (విడుచుట) నరికట్టుడు. మీకు నిగ్రహింపగలుగుచో నాసనమును మార్చకుడు. జపమును సూర్యాస్తమాన మున ముగింపుడు. అప్పుడు పాలు, పండ్లను గొనుడు. దానిని సెలవు దినములలో పక్షమున (Fortnight) కొకపరి లేదా నెలకొకపరి లేదా వారమునకొకపరి యభ్యసింపుడు.

23. ప్రశ్న :-40 దినములవరకు ననుష్ఠానమొనర్చు టెట్లు ?

జవాబు:-అనుదినము 3000 వంతున రామ, రామ, యొక్క జపమును నొక లక్ష పాతికవేల (1.25,000) పర్యాయము లొనర్పుడు. తెల్లవారుఝామున 4 గంటలకు (4 a. m.) లెండు. జపమునర్పుడు. హృషీకేశము, హరిద్వారము, ప్రయాగ, నాసిక లేక కాశి, లేక బృంధావనము లేక అయోధ్య, లేక చిత్రకూటమువద్ద ననుష్ఠానముచేయుడు. అటులకానిచో దానిని మీస్వంతయింటివద్దనే యొనర్పుడు చివరి యైదుదినములు 4000 చొప్పున జపము చేయుడు. ఒకే ఆసనముపై మాత్రమే కూర్చొనుచు నొకలక్ష జప మునుకూడ మీరు ప్రతిదినమును చేయవచ్చును. ఆఖరి రోజు (దివసము) న హవన (హోమ) మొనర్చి, కొందఱు బ్రాహ్మణుల, సాధువుల, సన్యాసుల భుజింప జేయుడు.

24 ప్రశ్న:-నిరాకారము సాకార మెట్లగును?

జవాబు:-జలము రెండు స్థితులలో నేవనగా నిరాకార (రూప రహిత) మగు నావిరి (Steam) గను, మంచు రూపములో సాకార (రూపసహిత) ముగ నెటులుండ గలదో నటులనే కూడ బ్రహ్మము నిరాకారము, సాకారము; రెండును కూడ నైయున్నాడు. నిరాకార బ్రహ్మము తన భక్తుల యొక్క దైవిక (pious) ధ్యానమునకై కేవల నిమిత్తముగ రూపమును గొనును. సరిగ నెటుల వాయువు నిరాకారమై యుండి తుపాను (cyclone) గ సాకారమును గైకొనునో నటులనే కూడ నిరాకార బ్రహ్మ మాకారమును వహించును.

25 ప్రశ్న:-భక్తియు, జ్ఞానమును, నామ్లము (acid) క్షారము (alkali) ల వలె సంబద్ధములా? (Incompatibbe)

జవాబు:-కాదు. జ్ఞానము భక్తిని పెంపొందించును. భక్తి యొక్క ఫలమే జ్ఞానము. పరా భక్తియు, జ్ఞానమును నొకటియే. కేవలాద్వైత జ్ఞానియగు శ్రీశంకరులు శ్రీహరి, హర, దేవీలయొక్క గొప్ప భక్తుడు. శ్రీరామకృష్ణ పరమహంస కాళి నుపాసించి తన యద్వైత గురువగు స్వామి తోతాపురిగుండా జ్ఞానమును బడసెను. దక్షిణ హిందూ దేశపు సుప్రసిద్ధ జ్ఞానియగు నప్పయ దీక్షితులు పరమశివ ప్రభుని తీవ్రమగు భక్తుడు.

26 ప్రశ్న:-ఎవరు గుడ్డి మనుజుడు?

జవాబు:-సమస్త నామరూపములలో దాగొని యుండు నొకే యొక నవినాశ సారమగు [Imperishable essence]

“హారిని” కనుగొనజాలని యొకడే (మానవుడే) కాని తన భౌతికమానస చక్షువులతో మాంసజాలని యొకడు ద్రష్టే మనుజుడుకాడు.

27 ప్రశ్న:-ఎవడు మృత (చచ్చిన) మానవుడు?

జవాబు:-ఎవడైతే తన జీవితమును తినుట, త్రాగుట, నిద్రించుటలలో మాత్రమే గడపునో, నెవడైతే మోక్షము నొందుటకు శ్రీహరి నారాధింప యత్నింపడో వ్యక్తియొకడు (మానవుడు). కాని, నెవని ప్రాణములు వాని భౌతిక శరీరమునుండి విడలినవో వ్యక్తి యొకడు చచ్చిన మానవుడు కాడు.

28 ప్రశ్న:-ఎవడు మాదిగ (చెప్పులుకుట్టు [cobbler] వాడు?

జవాబు:-ఎవడు తన శరీరమును దాని సంబంధములను గూర్చి మాటలాడునో, నెవడాత్మ దృష్టిని గాక చర్మ దృష్టిని గలిగియుండునో, వ్యక్తియొకడు(మానవుడు) కాని చెప్పులను తయారొనర్చు నొకడు మాదిగవాడుకాడు.

29. ప్రశ్న:-జపమన నేమి?

జవాబు:-జపము భగవంతునియొక్క నేదేని మంత్రపునుచ్చారణయే.

30. ప్రశ్న:-ఎన్నిరకములగు జపముగలవు?

జవాబు:-మూడురకములు. వైఖరి (వాచిక) యుపాంశు (ఔష్ఠ్య - పెదవులతో వినబడి వినబడనటుల పలుకునది) నింకను మానసికము (మనస్సులో నుచ్చరించునది.)

31. ప్రశ్న:-ప్రతిరకపు ఫలము లేవి?

జవాబు:-వైఖరీజపముయొక్క వాటికంటె నుపాంశువుయొక్క ఫలములు వేయిరెట్లధికము. ఉపాంశువుయొక్క వాటికంటె మానసికజపముయొక్క ఫలములు పదివేలరెట్లధికము.

32. ప్రశ్న:-జపము, ధ్యానములమధ్య భేదమేమి?

జవాబు:-జపమనేదేని మంత్రమునయొక్క నుచ్చారణయే. తన సహజలక్షణముల (Attributes) తో కూడిన శ్రీహరి లేక శ్రీకృష్ణుని రూపముపై చింతనయే ధ్యానము.

33 ప్రశ్న:-శ్రీహరియొక్క ధ్యానమొనర్చు టెటులు?

జవాబు:-మానసికముగ నీమనస్సు నా పరాత్పరుని పాదపద్మములవద్ద స్థిరపరుపుము. తదనంతరము మనస్సును వాని పట్టువస్త్రము (పీతాంబరము) శ్రీవత్సము, వాని హృదయముపైనుండు కౌస్తుభమణి, వాని భుజములపైనుండు దంతకడియములు, (Bracelets) చెవిపోగులు, (Ear rings) శిరస్సుపై కిరీటము, పిమ్మట చేతులలోని శంఖము, చక్రము గద. పద్మములపై త్రిప్పి, నటు తదుపరి వానిపాదముల వద్దకుర మ్ము. ఈపద్ధతిని తిరిగి పునరావర్తన (Repeat) మొనర్పుము.

34. ప్రశ్న:-మనస్సు నెట ధారణ (నేకాగ్రత) నొనర్చుట?

జవాబు:-మీ యభిరుచి, యభిలాషలబట్టి హృదయపద్మము (అనాహతచక్రము) లేదా రెండుకనుబొమల మధ్యప్రదేశము (త్రికుటి)

35. ప్రశ్న:-భక్తియొక్క రెండుతరగతు లెవ్వి?

జవాబు:-అపరాభక్తి (అల్పతరభక్తి) యు, పరాభక్తి (ఉచ్చతరభక్తి) యును.

36. ప్రశ్న:- అపరాభక్తియన నేమి ?

భక్తుడు తన యిష్టమూర్తి (విగ్రహము)ని గలిగి యుండును. ఆతడు ధార్మికక్రియా (Ritualistic) రాధనను, భగవదీయకార్యముల (Ceremonies) ను గలిగి యుండును. ఆతడు విగ్రహములయొక్క పూజనొనర్చును

37 ప్రశ్న:-పరాభక్తి యననేమి ?

జవాబు:-ఈ రకపు భక్తుడు శ్రీహరిని సర్వత్రను, సమస్త పదార్థములలోను, గాంచును. తైలధార (నూనె తెగని) వలె వాని మనస్సు భగవంతునియొక్క పాదపద్మముల వద్ద లగ్నమై యుండును. ఆతడు సర్వాలింగన [all embracing] సర్వసంకలిత [all inclusive] విశ్వప్రేమను గలిగియుండును. ఆత డేజీవిపట్ల నత్యల్ప ద్వేషమును గల్గి యుండడు. ఆతడు సమస్త ప్రపంచమును విశ్వ బృందావనముగ చూచును.

38 ప్రశ్న:-సకామ్య భక్తి యన నేమి ?

జవాబు:-భక్తుడు, ధనము, పుత్రుడు, లేక నేదేని వ్యవహారము [under taking] లో జయము నొందుటకు, లేదా రోగము నుండి తన్ను తాను విముక్తుడగుటకు, భగవాను నారాధించును.

39 ప్రశ్న:-నిష్కామ్య భక్తి యన నేమి ?

జవాబు:-భక్తుడు ఫలాకాంక్ష (expectation of fruits) గలిగి యుండడు. ఆతడు భగవానుని మాత్రమే వాంఛించును. అది ప్రేమ నిమిత్తార్థము ప్రేమ [Love for love's sake] యై యున్నది.

40 ప్రశ్న:- వ్యభిచారిణీ భక్తి యన నేమి ?

జవాబు:- కొంతకాలము వరకు భగవానుని ప్రేమించుటయు, భార్య, పుత్రులు, ఆస్తిని కలిగిన కాలమున ప్రేమించుటయే.

41 ప్రశ్న:-భక్తియొక్క నవ విధము లేవి ?

జవాబు:-1 శ్రవణము - భగవానుని లీలల వినుట, 2 కీర్తనము - ఆ పరమాత్ముని స్తవముల గాన మొనర్చుట, 3 స్మరణము - భగవానుని జ్ఞప్తియుంచుకొనుట, 4 పాద సేవనము - భగవానుని పాదపద్మముల నారాధించుట, (ప్రజాకోటి, దేశము. దీనజనులయొక్క సేవ) 5 అర్చనము - పుష్పముల సమర్పణ. 6 వందనము - సాష్టాంగ ప్రణామములు, 7 దాస్యము - సేవ, 8 సఖ్యము-మిత్రత 9 ఆత్మ నివేదనము-సంపూర్ణాత్మ సమర్పణ, (శరణాగతి)

42 ప్రశ్న:-స్నేహము, ప్రేమ, శ్రద్ధ, భక్తుల నడుమ తేడా యేమి ?

జవాబు:-చిన్నపిల్లలవంటి తక్కువగలవారి [Inferiors] నెడ చూపబడు ప్రేమయే స్నేహము, భార్యా, స్నేహితులట్టి సమానుల మధ్య ననురాగమే ప్రేమ. తల్లి దండ్రులు, గురువులు, నటువంటి హోదాలోనుండు వేఱితకుల వంటి పెద్దల [Superiors] నెడ ప్రేమయే శ్రద్ధ, భగవంతుని యెడ ప్రేమయే భక్తి.

43 ప్రశ్న:-ఐదు విధములగు నుపాసన లేవి ?

జవాబు:-గణేశ, హరి, శివ, సూర్య, శక్తులయొక్క నుపాసన.

44. ప్రశ్న:-ఐదు విధములగు భావములేవి ?

జవాబు:-శాంతభావము. (ప్రశాంతత) దాస్యభావము (సేవకత్వము) సఖ్యభావము (మిత్రత్వము) వాత్సల్య భావము (మాతా పితృత్వము) మరియు మాధుర్య భావము (దాంపత్యత)

45. ప్రశ్న:-ఆరాధనయొక్క నైదు తరగతులేవి ?

జవాబు:-భూతములు [elements] గతించిన జీవుల [departed-spirits] యొక్క నారాధన. ఋషులు, దేవతలు, పితృలయొక్క నారాధన నవతారములయొక్క నారాధన, సగుణ బ్రహ్మోపాసనారాధన. నిర్గుణ బ్రహ్మోపాసనారాధన.

46. ప్రశ్న:-చతుర్విధములగు ముక్తులేవి ?

జవాబు:-ఒక రాజ్యమందలి నివాసివలె భక్తుడు శ్రీమహావిష్ణువెందులో నివసించునో నాలోకములో నుండును. ఇది సాలోక్యముక్తి. రాజుయొక్క పరిచారకుని [attendant] వలె భగవంతునితోడ సన్నిహిత సాన్నిధ్యమున నాతడు నివసించును. ఇది సామీప్యముక్తి. రాజుయొక్క సోదరుని లేదా యువరాజువలె నాతడు భగవంతునియొక్క నదే సరిసమానమగు రూపమును బొందును. ఇది సారూప్యముక్తి. నీటిలో నుప్పు లేక పంచదారమాదిరిగ నాతడు భగవంతునితో నొకటగును. ఇది సాయుజ్యముక్తి.

47. ప్రశ్న:-భక్తియొక్క నాలుగంతస్థు లేవి ?

జవాబు:-మృదుమనోద్రేకము, [Tender emotion] తీవ్రానురాగము, [warm affection] సజ్జ్వలమగు ప్రేమ, తపన

(సహించు) కాంక్షయును, శ్లాఘన, నాకర్షణ, నాసక్తి యుక్తప్రేమయునని వేఱొకవర్గీకరణము. [Classi-fication] గలదు.

43. ప్రశ్న:-భగవదనుభూతి (సాక్షాత్కారము) నొందిన భక్తుడు పునర్జన్మ మొందునా? వాని వాసనలు సంపూర్తిగ తుదముట్టింపబడినవా? అతడు బాధననుభవించునా?

జవాబు:-అతడు పునర్జన్మ మొందడు. సమస్తవాసన లిప్పుడు విధ్వంస మొనర్పబడినవి. అతడెట్టిదగు బాధ ననుభవించడు. అతడు క్రమముక్తి (ఉత్తరోత్తర మోక్షము) నొందును. అతడు బ్రహ్మలోకము (గోలోకము లేక వైకుంఠము) నకు జనును. అనంతరమున నాతడు చివరకు బ్రహ్మములో లీనమగును.

## భక్తియోగ వర్ణమాల (అక్షరమాలిక)

**A** ఇతర నేదైనను మినహాయించి భగవంతునిపట్ల నేకైక మనస్కమగు బద్ధానురాగమే నవ్య భక్తి.

**B** ఈ కలియుగమున భగవత్సాక్షాత్కారమునకు భక్తి యోగమతి మిక్కిలి సులభమైన మార్గము.

**C** చాంద్రాయణవ్రతము భక్తునిచే పాపము నాశమొందించుటకు భగవంతుని స్మరణను నొనర్చుటకు నవలంబింపబడును.

**D** భగవంతుని (తన దివ్యప్రభుని) పట్ల భక్తునిచే వహింపబడు సేవకా భావమే దాస్యభావము.

E వాస్తవిక భక్తియొక్క పెరుగుదల కేవలతయు (ధనము, బిడ్డలు, స్వర్గము కొఱకగు మూలకోరికలు) నష్టమగుగ నిలచును.

F భగవంతుని శక్తిలోని విశ్వాసమే (నమ్మికయే) భక్తియొక్క పునాది.

G గురువే భక్తునికి స్పష్టమైన సంస్పృశ్యమగు ((ప్రత్యక్ష) దైవము.

H రోమాంచము లేక పులకిత మగుటన భక్తునిచే నాతడు భక్తిలో ముందుకు సాగుకొలది ననుభవ మొందునట్టి శరీరపు వెండ్రుకలు (రోమములు) లేచి నిలుచుటయే.

I ఎవరి యారాధనచే నైతే భక్తుడు భగవచ్చైతన్య మొందునో నట్టి యొకని యభీష్టము లేక యెంపుడు దైవమే యిష్ట దేవత.

J భగవన్నామముల జపము,మనస్సుయొక్క పవిత్రతను గాని తెచ్చి ధారణ [Concentration] నొక గొప్ప స్థితికి పెంపొందించు.

K కలిమలిన విధ్వంసకుడగు కృష్ణుడు పరదైవతము.

L భక్తిమార్గములో నూతన (ప్రారంభకు) లకు భగవన్నామముల ఉచ్చారణపట్ల లజ్జ యొక గొప్ప ఆటంకము.

M మాధుర్యభావము భక్తియొక్క అత్యున్నత పర్యవసానము

N భక్తియోగ మార్గములోని సర్వ జిజ్ఞాసువులచే నవవిధ భక్తి యభ్యసింప బడవలయును.

O శరీరము, మనస్సు, ఆత్మయు, సంపూర్తిగ భగవత్సేవకై సమర్పించుటయే శరణాగతి లేక నాత్మార్పణ.

P భగవానుని చరణకమలముల సేవ లేక నారాయణ భావముతో ప్రజాకోటి సేవయే "పాదసేవన"

Q వేదాంతికి, మఱియు భక్తునికి, నిరువురకు సామాన్యమైన సన్నిహిత మనోవృత్తియే.

R భగవన్నామముల ఉచ్చారణకొఱకగు ప్రీతియే(నామ)రుచి

S భగవచ్చైతన్యము యొక్క లబ్ధి (పొందుట) యే సాక్షాత్కారము.

T ఇంద్రియ సంబంధ వస్తువులకై తృష్ణ లేక నాంతరికకాంక్ష భక్తియొక్క పెంపునకు సంపూర్తిగ భంగకరమైనది.

U ఉపాసన భగవంతుని యారాధనయే.

V మనః పూర్వక భక్తునిచే పొందబడు భగవంతునినుండి యెడబాటుచే కలుగు తీవ్ర బాధయే విరహము.

W భగవంతుని యెడబాటున కేడ్వుడు. కాని బంధువుల చావు లేక ధన నష్టమునకు వలదు.

X మీ యిష్ట మంత్రపు కనీస మొక పురశ్చరణ (మంత్రమందెన్ని యక్షరము లుండునో నన్ని యక్షరలక్షల మంత్ర జపమొనర్చుట పురశ్చరణన బడును) యొక్క సంపూర్తి కొఱకై క్రిస్టమస్ (క్రైస్తవుల) సెలవు దినములు సద్వినియోగ మొనర్ప బడవలయును.

Y భక్తునియొక్క యోగక్షేమము భగవానునిచే పూచీ యియ్య బడినది.

Z సాత్త్వికాహారము సద్గ్రంథపఠనము ప్రార్థనయు, భగవన్నామస్మరణ (శ్రవణకీర్తనము) లో నొక నిష్ఠయును శాంతిని మనసున కిచ్చును.

## శ్రీ రా మ నా మ వై భ వ ము.

భగవన్నామమనే నాధ్యాత్మిక వృక్షము. అది పాపో పతితముల విధ్వంసకారి. అది పరమశాంతి, శాశ్వతానందము, ననంతజ్ఞానముల ప్రసాదించును. అది యుచ్చరించు వారి హృదయములలో దివ్యప్రేమను పురికొల్పును. అది సమస్త సుఖములయొక్క మూలకందము. (Fountain head) అమృతత్వప్రదాతయగు నా దివ్యనామము సమస్తమును మీ భయముల తొలగించి సర్వులకు నూరడిని, పరమ సంతోషమును గొని తెచ్చు గాక !

శ్రీరాముని నామము మధురతమ పదార్థముల కంటెను మధురతరమైనది. అది శాంతి కనికిపట్టు. (ఆశ్రయము) అది పవిత్రాత్ములయొక్క స్వాతఃజీవనమే. అది సమస్త పవిత్రకారక పరికరముల [Agencies] లో పవిత్రకారి [Purifier] యై యున్నది. అది ప్రాపంచిక వాంఛలను దహించు నగ్నిని వెల్గొల్పును. అది మన హృదయములలో నణగియున్న భగవంతునియొక్క జ్ఞానమును మేల్కొల్పును. అది ముముక్షువు [Aspirant] ను దివ్యానంద సముద్రములో స్నానమొనర్ప చేయును. శ్రీరామునకు, వాని నామమునకు జయము !

ప్రతి వస్తువుయొక్క నాంతర్యమున నెట్టి చినుగు (బీట) లేక నొకేయొక రాముడు మాత్రమే గలడు. ఎటు

వై పు చూచినను రాముడేగలడు. ఆతడు సదా సంతోషమున క్రీడించును. యావత్తు ప్రపంచమును వాని లీలయే. పుష్ప ములలో, వృక్షములలో, నాకాశములో, రాముడే గలడు. జల ములలో, నాహారములలో, రాముడే గలడు. స్తంభములలో, గోడలలో, రాముడే గలడు. గొడుగులలో, కలములలో, కాగిత ములలో, రాముడే గలడు. రాముడే సర్వత్ర గలడు. ఆయన లేకుండ ప్రపంచమే లేదు. ఈ విశ్వజగత్తు రామునితోడ పూరింపబడి యున్నది. నే నెటుల వాని యనుపమ వైభవ మును వర్ణింపజాలుదును. ? రామునికి జయము. రామునికి మంగళము. రాముని కారాధనలు. ఇంకను రామునికి వందన ములు. వేదము లనెడి సముద్రమునుండి మథించబడి వెలిదీయ బడినది, కలియుగ [Iron age] పు దోషముల వినిర్ముక్త మొన ర్చునది, శ్రీ పరమ శివప్రభుని జిహ్వాపై నెడ తెగకుండ వసిం చునది. ప్రాపంచికపురుషునికి (సంసారము) యొక్క రోగమును నయ మొనర్చుటకు రామౌషధము. లేదా నిరాఘాటమగు మందు [Unfailing Specific] ను, జానకీ మాతకు స్వీయ ముగ ప్రాణమును, నైన శ్రీరామునియొక్క నామామృతము నవిరళముగ త్రాగు వాడెవడో నట్టి పుణ్యాత్ముడు [Pious-Soul] ధన్యుడు !

“భగవానుని కంటె భగవన్నామమే గొప్పది. యేలన బ్రహ్మముయొక్క నగుణ, సగుణాంశములు భగవన్నామమహి మచే నవి చూడబడి యనుభూతి నొందబడును. శ్రీరాము డొక స్త్రీ యగు నహల్యనే విముక్తి నొందించగా, నా దివ్య నామము కోట్లకొలది దుష్టజనుల పావన మొనర్చెను. రాముడు తన యొద్దకు విశ్వాస పాత్రమైన సేవకులగు జటా

యువు, కలికి నోత్తమముగాను. కాని రామనామసంకీర్తనముగు పాపిష్టి జనుల సంరక్ష (ఉద్ధారక) కమై యున్నదని తులసిదాసు చెప్పెను.

రామనామముయొక్క ప్రాముఖ్యతపై నొక్కిడిగ తెల్పుటలో నాతడు విసుగుచెందడు. “ఏవిధముగ నైనప్పటికినిసరే శ్రీరాముని స్మరించుకొనుచుండు ధన్యుడు. ఇంకను వాని తల్లిదండ్రులును ధన్యులు. పొరబాటు (తప్పిదము) ద్వారా సహితము రామనామ ముచ్చరించునాతడు నాశరీరపు చర్మమునుండి చేయబడిన చెప్పుల [Shoes] జతను ధరింపనగును. పగలును, రాత్రియు రామనామము నుచ్చరించు జాతిబాహ్యుడు [out - caste] చండాలుడును, ధన్యుడు! రామనామ ముచ్చరింపని నొకని (మానవుని) కున్నత జన్మమిప్రయోజనము? పర్వతపు టున్నతమశిఖరములు పాములకుమాత్రమే నాశ్రయ మొసగును మైదానములలో పెంపొంది, సర్వులకు నానందమిచ్చు చెరకు ధాన్యము, తమలపాకులు, [betel leaves] ధన్యమ”నియాతడు పల్కును.

ఆతడింకను “రెండు మధురమగు, రంజకమగు “రామ” యను నక్షరములు వర్ణమాలల [alphabets] యొక్క రెండు కన్నులవంటివియు. భక్తులయొక్క స్వతశ్ప్రాణ శ్వాసవంటివియు, నై యున్నవి. అవి జ్ఞప్తియుంచుకొనుటకు సులభము, సర్వులకు సంతోషకారకమునై యున్నవి. అవి ఈ లోకములో నుపయోగమై, పరలోకములో మనల పోషించున”ని తెల్పెను. “ఈమణి- రామనామజ్యోతి” (దీపము)ని నీద్వార ప్రవేశమగు నాలుకవద్ద నీవు నీస్వకీయ వికాసమును నంతర్బాహ్యముల వెంటను, (నీవు నీలోపల వెలుపల) గోరుచో నుంచుము.

కిరాతుడు, నారదోపదేశమున "మరా, మరా" యనుచు, నామ మును కూడ పలుకన్న (ప్రతీకరాల) కీర్తిని సహిత ముచ్చరించు చుండి మహర్షి శ్రేష్ఠుడను వాల్మీకి, స్వయముగ బ్రహ్మ మయి యుండు సమస్తప్రపంచ మోహమునకు యతీతు నుడువును.

తిరుగవేసిన నామపు ఉచ్చారణయొక్క మహాత్మ్య మిట్లై యున్నప్పుడు, సక్రమముగ, సరియైన నామ ముచ్చ రించుటయొక్క మాహాత్మ్యమునుగూర్చి యింకేమి చెప్పుట ?

భగవంతునియొక్క ప్రతియొక నామము వివిధమగు దివ్యశక్తులు, నమృతముతో నిండియున్నవి. దేనిచే శ్రీరా మునిచేరగలనో నా యుపాయ (తెలివు) మా భగవానుని నామమునగాని, నందులో ముంచె త్తబడియుండుటయే. భగ వానునియొక్క మధుర నామమును గైకొనుచు సదా పాన మత్తులైయుండుము. మీ మనసులో శుచి లేక నశుచియొక్క నెట్టిభావంబు జొరనీయకుము. ప్రపంచములో నపవిత్రవస్తు వెద్దియు లేదు. ఏదైననుండుచో, నది భగవన్నామమునియొక్క నాంగత్యముచే పవిత్రమైనవాటిలో పవిత్రతమమైనదిగ నగును. భగవన్నామము దివ్యప్రేమలలో గాఢముగ లీనుడై నిలుచువా డెవడో, వానిని భ్రాంతి (మాయ) యాపె యొక్క సమస్త ప్రయత్నములపైన నస్పృటికిని పట్టువహించుటయందుతప్పును. రామునికి శోభ (మంగళము) రామునికి సాష్టాంగప్రణామములు.

## మహాకుంభ మేళము

## యాత్రా ప్రాముఖ్యత

12 సంవత్సరముల కొక పర్యాయము "హరి ద్వారము" "(అలహాబాద్-ప్రయాగ)" "ఉజ్జయిని" "నాసికల"

వద్ద మహా కుంభమేళా జరుప బడును. కట్టకడపటి కుంభ మేళము 1938 వ సంవత్సరము మార్చి మే నెలలయందు జరుప బడెను. మేళ (ఉత్సవ) సమయములో కొన్ని విశిష్ట దినములు కలవు. యింకను నా దినములలో స్నానము చాల పవిత్ర మైనదిగ నెంచ బడును. ఈ నెలలలో లక్షలకొలది జనులిట గుమిగూడుదురు. మోక్షము నొసగు నమృతము లేక సుధ యొక పాత్ర (కుంభము లేక కలశము) లో నుంచబడెను. సుధ నొందుటకై దనుజులకును దేవతలకును 12 దినముల వరకును గట్టి (Tough) యుద్ధముండెను. ఆ యుద్ధములో కుంభము పృథ్విపై నాలుగు స్థానములు "హరిద్వారము" "అలహాబాదు" "ప్రయాగ" "ఉజ్జయిని" "నాసిక" ల వద్ద బడెను. 12 రోజుల యనంతరము సూర్యుడు మేషరాశిపై నను గురువు (Jupiter) వృషభ రాశిలోను నుండినప్పుడు శ్రీ మహా విష్ణువు ప్రత్యక్షమై సుధ న్యూతగల మనుజులకు పంచుట ద్వారా, శాంతిని ప్రశాంతవృత్తిని సర్వులకును గొని తెచ్చెను దేవతలయొక్క 13 దినములకు సరిసమానమగు 12 సంవత్స రములలో నొక సర్వోదయము మేళము వచ్చును. కుంభ దినమున గంగలో స్నానము, భూమిచుట్టు లక్ష ప్రదక్షిణల యొక్క నాధ్యాత్మిక ఫలితముల నొసగు నని విష్ణుపురాణము తెలుపును. ఆ సర్వ దినమున లక్షలాది జనులు గంగలో స్నానము గొనుటకై "హరిద్వారము" న సమ్మేళనమగుదురు. పూర్వపు రోజులలో కుంభమేళములు జనులయొక్క నైతికా ధ్యాత్మికోద్ధారము (Uplift) నకై ప్రారంభింప బడినవి. హిమా లయ గుహలలో, నడవులలో, తపస్సు, మౌన ధ్యానముల నభ్యసించెడి పలు మహాత్ములు, ఋషులు, యోగులు,

నాధ్యాత్మిక గురువులు పిపాసించు జిజ్ఞాసువుల (Thirsting Aspirants) కు, గృహస్థులకు నాధ్యాత్మికోప దేశముల ప్రసాదించుటకై నీస్థలములలో కుంభమేళ దినముల ప్రోగుపడి యుండిరి. ఆదినములలో నధిక గంధర గోళము (శబ్దము) లేదు. ప్రజలు శ్రద్ధ, భావములతోడ నీ మహాత్ముల దర్శన మొందుటకు, నా యున్నతోద్ధి తాత్మల (Highly elevated souls) బోధల గ్రహించుటకు జనుచుండిరి. మత తరగతులు (religious classes) జరుప బడెడివి. యింకను నాచరణాను భవముగలమహాత్ములచే నుపన్యాసము లొసగబడుచుండెడివి. వాస్తవిక, మనః పూర్వక జిజ్ఞాసువులు యోగ కైవల్యముల రహస్యములలో దీక్షింపబడు (Initiated) చుండిరి.

ఈ రోజులలో మీరు గనునదేమి? సర్వత్ర భండారము (విందు) లుండును. జనులు వివిధరీతులలో నైశ్వర్యమును ప్రోగు చేయుటకు యత్నించు చున్నారు. ఈమూడు నెలలలోగా ధనవంతమగుటకు వారు తమ యత్నశక్తి ను సామర్థ్యపు టంతస్థు నుద్యమించుచున్నారు. ఉత్సవము (శుభ కార్యము) యొక్క పవిత్రత మాయమైనది : జనుగుసత్తా (నాధ్యాత్మిక భావము) పోయినది. అది కేవల సంత [fair] గా నైనది. నిజమైన ప్రశాంత (Silent) మహాత్ములు మేళమున హాజరగుట (నుపస్థితమగుట) కిచ్చింపరు. తమ యూహా (భావన) ల నాధ్యాత్మికాను భవముల పరిమార్పు [Exchange] కొనుటకు, నాధ్యాత్మిక జ్ఞానమును విస్తృతముగ మోక్షార్థులకు (Aspirants) గృహస్థులకు వ్యాప్తిచేయుటకు. ఋషులు, తపస్వులు, యోగులు నెందులో ప్రోగుపడెడు వారో నట్టి కుంభమేళము లేదా పూర్వీయపు టుత్కృష్ట

మహాత్మ్యభావపు టక్కులు ప్రాంతభాష్మక (religious) సమావేశ మిచ్చెడు కోలాహల ధ్వని, పెడబొబ్బలు. నుల్లాస ప్రసారక పరిభ్రమణము (రంగుల రాట్నము -merry-go-round) ల తోడి పెద్ద తమాషా లేక గొప్ప సంతగ నిచ్చును ధ్వనించి నది. అధునాతనమున కుంభ మేళములో కొంత జనసమూహము గాంచన, (ధ్వని) దుమ్ము, చెత్త (filth) దెబ్బలాటలు, జగడములు తప్ప నధికముగ చూడదగు నదిలేదు. ఈ యుద్దేశ్యమునకై పొదుపు (నిలువ) రక్షక భటుల [Reserve Police] తోడి ప్రత్యేక రక్షకభట వాసము [Police Station] ను ప్రభుత్వము నిర్మించెను. ఎట్టి మతవిషయక ప్రచారము చేయ బడజాలదు. విస్తారమగు జన సముదాయములో జనుల మనస్సు లలజడిచెంది కలతనొందును. వారు సర్వ తరహాల ప్రజల నడుమ తిరుగవలసివచ్చి బీద (దరిద్ర) వసతి తోడ నిద్రలేని రాత్రుల గడుప వలయును. సమస్త సామూహిక స్థలములలో సామాన్యముగనుండు సంటురోగముల [Infectious diseases] ద్వారా వారెంతయో బాధ నొందుదురు. ప్రజలు కొంత ప్రదర్శనము [Show] వర్ణము (Colour) శబ్దము (గుద్దులు (blows) ననుభవించి నిష్ప్రయోజక మార్గములలో సొమ్మును వినియోగించిన తమపరి మెట్టి ఘనమైనదియు లేకనే నప్పుడింటికి మరలుదురు. అయినప్పటికిని లక్షలాది జనులు మేళముల (ఉత్సవముల) కు హాజరగుట ద్వారా సంతోషము నానందము నాధ్యాత్మిక ప్రయోజనముల పొందు నాకాంక్షలో నుందురు. ఇదియే మాయ. ఇది తమ వివేచనా శక్తిని గోల్పోయిన జనుల మోహింప చేయు

టకు వింత (Curiosity) యొక్క ప్రాబల్యముగుండా నగు మాయయొక్క నే సక్కృత్యము.

సాధువులకు, సన్యాసులకు, విస్తారమగు నుచిత భోజన ముండును గాన, కాషాయాంబరములోని బిచ్చగాండ్రు నగణ్యమగు సంఖ్యలుగ (నసంఖ్యాకములుగ) (?) నెలవరకును సునాయాస సుఖజీవనము గలిగియుండు టకు సమకూడుదురు. డబ్బు కేవలము వృథ చేయబడు చున్నది. ప్రాపంచిక మనుజులు మోసగింప బడుచున్నారు. వారు నిజమైన నాధ్యాత్మిక జీవుల (పురుషుల) గనుగొన జాలకున్నారు. క్రమబద్ధ, సునిర్వాహక, మతసంబంధబోధ జరుప బడవలయును. అప్పుడు కుంభమేళము సవిస్తర మానవకోటి కాశీర్వాదమగును.

ప్రాపంచిక మానవు లీరోజులలో మహాత్ములనిగూర్చి మూఢాభిప్రాయముల వహింతురు. వారిని మోసగించి, ధనము ప్రోగుచేయుటకు చాలమంది మనుష్యులు కాషాయబట్టి ధరించి జట, గడ్డములు పెంచుదురు. యింకనుచిన్న బాలురు, మనుష్యులు, తమ వస్త్రములు కౌపీనమువిసర్జించి గృహస్థులమధ్య దిగంబరిగ నడచి, గొప్ప జితేంద్రియ యోగులుగ నటింతురు. బహు విద్వజ్జనులు తమ యమూల్యకాలమును ననవసర చర్చల పాక్షిక (sectarian) జగడములలో వృథపరచి జీవన్ముక్తులుగ బరగజెల్లుదురు. మానవులు బాహ్య వేషములచే గొంపోబడ రాదు. ప్రారంభమునో శారీరకముగ నగ్నమయిన నధువు నొక గొప్పమహాత్మునిగ వారు తీసుకొందురు. సన్నిహిత సాంగత్యానంతరము వారు వానిలో విశ్వాసమును గోల్పోవు దురు. వలయున దేదన! "మానసికనగ్నత" యనగ వాస

నలు, సహాంభావము, మున్నగువాని సంపూర్తిగ మానవలెను. ఓ ప్రియమిత్రులారా! వేషముల (ప్రదర్శనముల)చే మోసగింపబడకుడు. ఒకరోజు లేక రెంటికై సరళమగు నాకస్మిక సంభాషణద్వారా నొక మహాత్ముని మీరు పరీక్షింపజాలరు. మీరు సరియైనయభిప్రాయము (గ్రహింపు)ను గలిగియుండ గోరుచో మీరు వానితోడ సన్నిహితముగ వసింపవలయును.

స్థలము పలురకములమనుష్యులతోడ నింపబడియుండు నప్పటికిని పైగ శ్రమరహితముగ పనిచేసి సముత్తజిజ్ఞాసుల (Aspirants) సందేహములవిడమర్చి వారి నాధ్యాత్మికపంథగో దారిచూపు సనాతన ధర్మసభయొక్క కొంద ఉన్నతముగ పెంపొందిన (నాధ్యాత్మికవ్యక్తులు) మండలేశ్వరులు, విజ్ఞులగు పండితులుగలరు. వారు మానవాళియొక్క నాధ్యాత్మిక శ్రేయస్సునకై పనిచేతురు. ఇంకను నొకకొన్ని నిశ్శబ్దమూలల (Silent corners) లో మీరు కొందరు గొప్ప విరక్తమహాత్ముల, త్యాగుల కనుగొందురు. సాధువులు, సన్యాసులు, యోగులు, నాగబాబాలనదుము నిట్టిమహాత్ములకై నీవు వేటాడవలయును. వారు నిన్ను సక్రమమార్గములో నడిపించగలరు. ఇట్టిమహాత్ముల దర్శనముగలిగియుండి నాధ్యాత్మికోపదేశముల బడయుము. అప్పుడు నీ వాధ్యాత్మికముగ ప్రయోజన మొందింపబడుదువు.

గృహస్థులు సన్న్యాసులయొక్క పూర్వనామము, జాతి (కులము) మతవిశ్వాసము [creed] నర్హతలు [qualifications] బంధువులు, వయస్సు, మున్నగువాటినిగూర్చి బహు ప్రశ్నలు వేయరాదు. సందేహముల స్పష్టపరచుకొను నుద్దేశ్యముతో తాత్త్వికాంశములపై మాత్రమువారు మాటలాడ

గలను. అప్పుడు, సత్పురుషమాత్రమే సాధువులతోడి సత్సంగముద్వారా నాకు ప్రయోజన మొందింపబడ జాలుదురు. ప్రాపంచికమనస్సు నాధ్యాత్మికసంకల్పము మార్చుటకును, దుష్ట, చెడు సంస్కారముల పరిశుద్ధ మొనర్చుటకును, సత్సంగమది మిక్కిలి సులభమైన, శీఘ్రఫలమైనసాధనము. జ్ఞానులగు సాధువుల సాంగత్యములో వసింపుము ఆసాంగత్యమే స్వయముగ నాధ్యాత్మికశిక్షణ (Education) వారిని భక్తి, శ్రద్ధలతో సేవింపుము. వారియవసరముల (కోరికల)ను హాజరగు(తీర్చు)చుండుము. వారినుండి యుపదేశ మొందుము. అప్పుడే దినములలో కొన్నిలక్షలజపము (అనుష్ఠానము) ను పూర్తిచేయుటకు గుప్తచేసుకొనుము. ఇట్టిసమయమున పవిత్రస్థలములలో చేయబడిన జప మద్భుతమగు ప్రభావముగల్గి నీపై నాధ్యాత్మికలాభముల ప్రసాదించును. 15 లేదా 30 రోజులవరకు ననుష్ఠానము నాచరింపుము. పాలు, పండ్లనే గైకొనుము. విస్తారమగు జప మొనర్పుము. గీత, ఉపనిషత్తులు, రామాయణము, భాగవతముల పారాయణ మొనర్పుము. సత్సంగమును గల్గియుండి మహాత్ముల వాక్కుల శ్రవణమొనర్పుము. మౌనము వహింపుము. ఇటునటుతిరుగకుము. నిశ్శబ్ద. కఠినసాధనద్వారా నీవద్భుతముగ పెంపొందుదువు. విస్తారముగ దాన మొనర్పుము. "దానము పాపభారముల్లతను గప్పును." సాధువుల, మహాత్ముల, సేవింపుము. వారిని భక్తి, చేతిలో పండ్లతోడ సమీపింపుము. ఆధ్యాత్మికోపదేశములకై ప్రార్థింపుము. రోగిష్టిజనుల సేవించి, సహాయ మొనర్పుము. నీకై నిష్కామ్యకర్మయోగ మొనర్చుటకు చాల నుత్తమమైన నవకాశము గలదు. 12 సంవత్సరములలో నొకపర్యాయమువచ్చు నీపర్వ

మగు మేళము (కుంభమేళ) నకు నీవు వచ్చినచో నీవు కొంత ఆధ్యాత్మిక సాధన యభ్యసించవలెను. సాధారణముగ సమస్త పుణ్యక్షేత్రములకును యాత్రలు పై శిక్షణ [discipline] తో జరుపబడవలెను. ప్రతివత్సరము ప్రజలు హృషీకేశము, హరిద్వారము, బదరీనాథము, యింకా యితరస్థలములకు జనుదురు. వారందరు పై నియమములను పాటించవలయును. ఇంకను వారు మాత్రమేవారు యాత్ర లేక పుణ్యక్షేత్ర పరివ్రజన [Pilgrimage] మాచరించిన ఫలముల పొందగలరు.

వాస్తవిక, స్థాయియగు [sustained] ఘనిష్ఠమైన సాధననొనర్చుటకు భగవానుడు నిన్ను సకల శక్తితో నాశీర్వదించుగాక! భగవానుడు నీపై సంతోషము, శాంతి, సుఖము మోక్షముల నొసగుగాక!

[రాబోవు కుంభమేళము "మే నెల 1962" లో జరుగును.]

## శ్రీరామమంత్రము యొక్క మూలము.

(ఓమ్ శ్రీరామ్ జయ రామ్ జయ జయ రామ్.)

ఒకానొకప్పుడు లంకాపట్టణమునుండి తిరిగి వచ్చిన తరువాత శ్రీరామచంద్రులవారు అయోధ్యలో దర్బారు మంటపమున నుపవిష్టులైరి. రాజునకు కొన్ని ముఖ్యసలహాల నిచ్చుటకై దేవఋషియగు నారదుడు, విశ్వామిత్రుడు, వసిష్ఠుడు, మున్నగు చాలమంది ఆ సమయమున హాజరై యుండిరి.

ఆధ్యాత్మిక విషయములు చర్చించు సమయమున దేవర్షియగు నారదుడు లేచి "నామము" (భగవన్నామము)

"నామి" (భగవానుడు) యను వానిలో నేది గొప్పదో నిష్కాట సమావేశమైయున్న మీ యంతటి నిశ్చితాభి ప్రాయము నుయీ యుభయ గలందులకు కోరుచున్నానని పలికెను. అప్పు డా విషయమై, తీవ్రమగు చర్చ బయలు దేరెను. సభ యావత్తు నిశ్చితమగు పర్యవసానమునకు రాజాలక పోయెను. తుదకు నారదుడు "నామి" కంటె నామమే తప్పక గొప్ప దనియు, తానప్పుడే సభాసదులు వెళ్ళిపోవు లోపల నొక రూపాత్మకమగు దృష్టాంతముచే ఋజువు పరుతుననియు, తీర్పు చెప్పెను.

నారదు డప్పుడు హనుమంతుని తనవద్దకు పిలిచి యిటుల నెను. "బలాఢ్యుడవగునో శూరుడా! నీవు మామూలు ప్రకారము శ్రీరామునకును, ఋషులకును, వందన మాచరించునపుడు విశ్వామిత్రునకు మాత్రము వందన మాచరింపకుము అతడొక రాజర్షి మాత్రమే. సమాన ఆదర మర్యాదల కాతడర్హుడుకాడు. హనుమంతు డంగీకరించెను. వందన సమయ మేతెంచినపుడు హనుమంతుడు విశ్వామిత్రముని వద్దకు తప్పించి మిగిలిన వారందఱి వద్దకు జని సాష్టాంగ ప్రణామము లొనర్చెను.

అంత నారదుడు విశ్వామిత్రునితో ఓ ఋషి వర్యా! హనుమంతుని శఠత్వము (పెంకితనము) ను చూడుము. సభలో నిన్ను తప్ప మిగిలిన వారందఱకు వందన మాచరించెను. ఆతడెంత గర్వము. అహంభావము గలవాడో గుర్తించుమనెను.

విశ్వామిత్రుడు కోపముతో మండిపడుచు శ్రీరాముని తో "ఓ రాజా! ఈ ఋషివర్యుల సమక్షములో నీ సేవ

కనుక హనుమంతునిచే నీ శపథము నెరవేర్పింప బడును. రేపటి సూర్యాస్తమయము లోపున నీచేత చావున కాతడర్హుడు" అనెను. తన గురువులచే శ్రీరాముడు విశ్వామిత్రుని మన్నింపవలసి వచ్చెను తన స్వహస్తములచే విశ్వాసనీయుడగు సేవకుని చంపవలసి వచ్చినందులకు శ్రీరాముడు సంకోచావస్థయందుండెను. కాని యాతడు తప్పించజాలడు. శ్రీరాముని చేతిలో హనుమంతుని యొక్క నిర్దేశింప బడిన చావు విషయమై పట్టణమంతట కార్చిచ్చువలె వ్యాపించెను.

హనుమంతుడు కూడ చాల కలతచెందెను. ఆతడు నారదముని నొద్దకుజని "ఓ దేవముని సత్తమా! ఇప్పుడు నన్ను రక్షింపుము. రామచంద్రప్రభువు రేపు నన్ను చంపును నీ సలహా ప్రకారము ఆచరించితిని. నే నిప్పుడేమి చేయ వలయుననెను. నారదుడంత "ఓ హనుమంతుడా! దిగు లొందకుము. నేను నీకు చెప్పినటుల చేయుము. ఉదయమున పెందల కడనే బ్రహ్మ ముహూర్తమున లెమ్ము. సరయూ నదిలో స్నానము చేయుము. నదీ సైకతము (యిసుకతిన్నె) పై నిలబడి చేతులు జోడించి "ఓమ్ శ్రీరామ్ జయరామ్ జయ జయరామ్" అనుచు నుచ్చరింపుము. నిన్నేదియు బాధించ లేదని నేను నొక్కి వక్కాణించుచున్నా ననెను.

తరువాతి దినము తెల్లవారెను. హనుమంతుడు సూర్యోదయా త్పూర్వము సరయూనదికి జని స్నాన మాచరించి నారదఋషిచే నుపదేశింపబడినటుల చేతుల జోడించి భగవన్నామముల నుచ్చరించు చుండెను. ఉదయమున జన సమూహములు హనుమంతుడు పొందవలసిన కఠిన పరీక్షల

వీక్షించుటకై వచ్చియుండిరి. హనుమంతునకు కొంత దూర ములో నిలబడి తన సేవకునివైపు మిక్కిలి జాలితో చూచుచు మిక్కిలి దయిష్టతతో శ్రీరాముడు వానిపై బాణముల వ ర్షించ సాగెను. ఒక్కటియు కూడ హనుమంతుని బాధించ జాలక పోయెను. పగలంతయు వానిపై బాణములు వర్షింప బడెను. కాని ప్రయోజనములేక పోయెను. యుద్ధభూమిలో కుంభకర్ణుడు మున్నగు గొప్ప రాక్షసులను చంపుటకు విని యోగించిన తీవ్రములగు శస్త్రాస్త్రముల సహితము వాడెను. చిట్టచివర వ్యర్థపోరాని యస్త్రమగు బ్రహ్మాస్త్రమును తీసెను. శ్రీరాముడు వర్ణనాతీతముగ నుగ్రుడయ్యెను. జగత్ప్రభువున కాత్మార్పణముతోడను, తీవ్ర భావముతోడను, బిగ్గరగ హనుమంతుడు మంత్రమును జపించుచుండెను. ఆతడు రాముని వైపు దరహసిత వదనుడై నిలుచుని యుండెను. అందఱును ఆశ్చర్య భరితులై హనుమంతునకు "జయ్ జయ్" అనుచుండిరి.

ఇట్టి విషమసమయమున నారదుడు విశ్వామిత్రునివద్దకు జని "ఓ మునిసత్తమా! కోపము మానుము శ్రీరాము డిప్పు డలసినాడు. వివిధములగు బాణములు హనుమంతు నేమియు చేయ జాలక పోయెను. హనుమంతుడు నీకు వందన మొనర్పక పోయిన నేమి? ఈ యారాటము నుండి రాముని తప్పింపుము. వాని కృపనుండి మాన్పింపుము. శ్రీరామునియొక్క నామ ముల మాహాత్మ్యము నీ కిప్పు డవగత మయినది. ఈ మాట లచే విశ్వామిత్రుడు కరుణించి హనుమంతుని బ్రహ్మాస్త్ర ముతో చంపుటనుండి రాముని విరమింప చేసెను. హను మంతుడు వచ్చి ప్రభువు పాదములపై బడెను. మఱియు విశ్వామిత్రునికిగల దయకై వానికికూడ వందనమాచరించెను.

విశ్వామిత్రుడు ఉచితముగ సంతోషించి హనుమంతుని నాశీర్వదించెను. వానికి శ్రీరాముని యెడ గల భక్తిని మెచ్చెను.

ఈ మంత్రము తొలుత నారదుచే హనుమంతునకు ఆతని గొప్ప విపత్తులో నున్నపు డుపదేశింపబడెను. కావున నో సాధకులారా! సంసార క్లేశముచే బాధింపబడు మీరును కూడ నటులనే యీ మంత్రమును జపించి విముక్తి బొందుడు.

"శ్రీరామ్" అనునది రాముని సంబోధించుట "జయ రామ్" అనునది వాని స్తుతి "జయజయ రామ్" అను నది వానికి చేయు సంపూర్ణార్పణము. ఈమంత్రమును జపించునప్పుడు "ఓ రాముడా! నేను నీకు వందన మొనర్చు చున్నాను. నన్ను నీకు అర్పించుకొను చున్నాను." అను నీ భావమును కలిగి యుండుము. వానియొక్క (భగవానుడగు రాముని యొక్క) దర్శనమును త్వరలో పొందుదువు. శ్రీ సమర్థ రామదాసు యీ మంత్రమును 13 (పదమూడు) కోట్ల సారులు జపించి రామచంద్ర ప్రభువుయొక్క ప్రత్యక్ష దర్శనమును పొందెను. రామనామములో నొక దివ్యమగు ప్రభావము లేక అచింత్య శక్తి కలదు. రామనామము యొక్క మహిమను గానము చేయుము. ఈ మంత్రమును జపముచేయ గలుగుటే గాక మనోహరముగ గానముకూడ చేయవచ్చును. ఈమంత్రమునకు 13 (పదమూడు) అక్షరములు కలవు. మఱియు పదమూడు (13) లక్షల పర్యాయములు జపముచేయుచో నొక పురశ్చరణ యగును.

ఓ నారాయణుడా! ఇతరులు చాలమంది యొనర్చినటుల నీవును యీమంత్రమును జపమొనర్చి యీయొక్క జీవితముననె భగవత్సాక్షాత్కారము నేల పొందరాదు?

నామము మీకాశ్రయమగుగాక ! నామము మిమ్ముల రక్షించి, దారిచూపి, సమ్మోహనమునకు చేర్చుగాక! తీవ్రమగు భక్తిశ్రద్ధలతో చేయబడు నాటంకరహితమగు భగవన్నామ జపముచే నీ జీవితములో భగవత్సాక్షాత్కారమును పొందు దురుగాక !

## దివ్యనామ వైద్యము

హూణవైద్యము, [Allopathy] హోమియో వైద్యము, వర్ణ (రంగు) వైద్యము [Chromopathy] ప్రకృతివైద్యము, ఆయుర్వేదవైద్యము, నింకా సర్వేతరవైద్యములు నొకవ్యాధిని కుదర్చజాలనప్పుడు, "దివ్యనామ" వైద్యముమాత్రమే మిమ్ముల రక్షించును. భగవంతుని నామమొక రాజౌషధము. పట్టుకొమ్మ. (ప్రధానాశ్రయము) అమోఘమైన సర్వరోగ నివారిణి. యింకను సర్వరోగములకు సర్వనయకారిణి [cure-all] అది విచారము, నిరాశ, లలో క్రుంగుపాటు (మనోదైన్యము) దుఃఖములలో జీవిత దైనికయుద్ధము లేదా నున్నిక్కై తీవ్ర కృషిలో నాదర్శప్రాయమగు లేక ఘనమగు నుత్తేజక బల వర్థని.

భగవన్నామములో విచిత్రమగు శక్తికలదు. పరాత్పరుని నామములో పరిశీలింపరాని శక్తిగలదు. ప్రభుని నామములో సమస్తదివ్యశక్తులు దాగియున్నవి. అది వ్యావనప్రాశము మకరధ్వజము, బాదము, వసంతకుసుమాకరము. లేదా స్వర్ణ భస్మము, [Gold oxide] యొక్క ప్రధానసత్తు లేక సారము. అదియొక అద్భుత, అనిర్వచనీయమగు దివ్యమైన "1910194" సూదిమందు. (Injection)

ఏ జబ్బునైన సరిచేయుటకే "నామజప" మందును మీ యంతట మీరు తీసికొన వచ్చును. ఈ యాధ్యాత్మిక ఔషధమును మీ గృహములోని ఇతర రోగులకు కూడను లేదా వేఱొకరికొరకు మీరు ప్రయోగించవచ్చును. రోగి ప్రక్క కూర్చొని "హరి ఓమ్ శ్రీరామ్ ఓం నమశ్శివాయ" వంటి భగవన్నామమును మనః పూర్వక భక్తి శ్రద్ధలతో నుచ్చరింపుడు. (జపింపుడు) మఱియు నా భగవానుని నామముల,

"హరేరామ హరేరామ - రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ - కృష్ణకృష్ణ హరేహరే ।

కూడ సంకీర్తింపుడు. ఆ దేవదేవుని కరుణకు, అనుగ్రహమునకు ప్రార్థింపుడు. సర్వవ్యాధులు, బాధలు, నంతమునకు వచ్చును. "నామజప" చికిత్స నుదయ, సాయంత్రముల నథమము రెండు గంటలవర కొనసాగింపుడు. కొద్ది కాలములో విచిత్రమగు ఫలితమును మీరు కనుగొందురు. వైద్యుడు, రోగియు, నిరువురును భగవన్నామములో, నా ప్రభుని కరుణా కటాక్షము (అనుగ్రహములలో) సంపూర్ణ విశ్వాసము కలిగి యుండవలయును. వాస్తవిక వైద్యుడు భగవాన్ నారాయణుడు మాత్రమే.

ఆయుర్వేద శాస్త్రము నుద్ఘాటించిన ముల్లోకముల వైద్యుడగు ధన్వంతరి భగవానుడే స్వయముగ "అచ్యుత, అనంత, గోవింద" యొక్క ఉచ్చారణ అనెడిమందు (ఔషధము) చేత, సర్వవ్యాధులు నయమగును. ఇది నా నిశ్చిత, ఋజు (నిష్కపట) ప్రకటన" ని వెల్లడించెను. సమస్త చికిత్సలలోను భగవాన్ నారాయణుడే నిజమగు వైద్యుడు. ప్రసం

చపు టక్తి శ్లేష్మవైద్యులు సహితము చనిపోవుచున్న రాజు (ప్రభువు) ను కుదర్చ జాలరని మీరు కనుగొందురు. అతి మిక్కిలి చెడ్డరకపు రోగములతో బాధపడురోగులు, మిక్కిలి సామర్థ్యమైన వైద్యులు జబ్బుస్థితి నిరాశ యని వెల్లడించినను, విచిత్రముగ నయమైన బహు ఉదాహరణల కూడ మీరు వినియే యుందురు. సర్వనయమగుట (రోగనివారణ) ల వెనుక "భగవానుని హస్తము" న్న దనుట కిదియే దానంత టదె సుస్పష్టమైన ఋజువు.

దివ్య (భగవానుని) నామము, జనన-మరణము లనెడి రోగము నంత మొందించి, మీకు మోక్షము, ముక్తి లేదా నమృతత్వమును, ప్రసాదించును.

మీరట్ [MEERUT] పట్టణములో నొక భూస్వామి కుమారుడు తీవ్రముగ బాధపడు చుండెను. వైద్యులు రోగ స్థితిని సంపూర్తిగ నిరాశగ వక్కాణించిరి. భక్తులారోగి విష యమును తమ హస్తముల లోనికి గొనిరి. రోగి పడక [bed] చుట్టును నేడుదినము లహోరాత్రము లెడ తెగని కీర్తన గావించిరి. ఏడవ దినమున రోగినిలుచుని భగవన్నామమును గాన మొనర్ప ప్రారంభించెను. ఆతడుసంపూర్తిగ తేరుకొనెను. సంకీర్తన యొక్క విచిత్ర శక్తి యట్టిది.

## ఏ కా ద శి మా హా త్మ్య ము.

భగవద్భక్తులీదినమున నుపవాసముండి రాత్రియంతయు జాగరణముసలిపి, జప, హరికీర్తన, ధ్యానముల చేయుదురు. కొందఱు మంచినీటి బొట్టునైనను తీసికొనరు. (అనగా నిరా

హార, నిర్జలోపవాసముల చేయుదురు.) పూర్తిగ నుపవాసము చేయజాలనివారు, అరటిపండ్లు, పాలు, ఫలములను తీసికొందురు. ఏకాదశిదినమున వరియన్నము తినరాదు. ఇది చాల ముఖ్యమైనవిషయము. ఈ కలియుగమున భక్తి, శ్రద్ధ, వైరాగ్యములతో శ్రీహరియందు పూర్తిగ మనసును లగ్నము చేసి యొక ఏకాదశిని మాత్రమైనను సలుపుచో, చావు, పుట్టుకల పరిభ్రమణమునుండి విడివడుదురు. దీనిగురించి సందియమెన్నడియు లేదు. పురాణము లీ విషయముపై నొక్కి వక్కాణించుచున్నవి.

బ్రహ్మ నుదుటినుండిపడిన చెమట రాక్షసరూపమును దాల్చి తనకు వసించుటకు వసతి నేర్పఱచుమనగా నాపరమేష్ఠి (బ్రహ్మ) యారాక్షసునితో నేకాదశినాడు భుజించు మానవుని యన్నపుతునుకలలో వసించి వారియుదరములలో పురుగులుగమ్మని పల్కెను. అదియేకారణముగ నేకాదశిదినమున యన్నము నిషేధింపబడినది.

వరుసగ విడువకుండ యేకాదశి యుపవాసముచేయుచో శ్రీహరి యెంతయు తుష్టుడగును. సర్వపాపములు నశించును. మనస్సు పరిశుద్ధమగును. భక్తి క్రమముగ పెంపొందును. భగవంతుః పైగల ప్రేమ యధికమగును. మామూలు యేకాదశి దినములలోకూడ దక్షిణ హిందూదేశములోని చాదస్తపు (మూఢవిశ్వాసపు) జనులు పూర్తియుపవాసమును, జాగరణమును, సలుపుదురు. విష్ణుభక్తులగు వైష్ణవులకు యేకాదశి యనునది చాల పవిత్రమగు దినము.

నేటికాలములలో నంధకారయుతమగు భౌతికప్రభావములచే బాలనుండి విద్యావంతులు యేకాదశిదినముల నుపవసింపరు. బుద్ధి పెంపొందుకొనవలెనని పాఠశాలలోను, పనికిరాని చర్చలలోను, దిగుట కారంభించెదరు. ఆధ్యాత్మికసంస్థలో బుద్ధి యనునదొక యడ్డంకి. హృదయమును పెంపొందింపక బుద్ధినిమాత్రమే పెంపొందించినవారు ప్రతివిషయములోను తర్కయించుచు ప్రశ్నించుట కారంభింతురు. వారు తప్పుడుగ గొంపోబడుచున్నారు. ప్రతి విషయమునకు, వారెందుకు, యెట్లు, అనుచు, శాస్త్రవిజ్ఞానాధికారము కోరుదురు. భగవంతుడు బుజువులకు, నూహాపోహలకు, నతీతుడు. మతమును పురాణములను, శ్రద్ధ, భక్తి, హృదయపవిత్రతతోను డాయవలెను. అరచేతిలోని యామలకఫలమువలె, మతరహస్యములప్పుడాతనికి విదితమగును. ఎవడైన తనతల్లిని యీమె మనుజుడే నాతండ్రియని బుజువుచేయమనునా ?

ఉపవాసము కామము నణచును. ఉద్రేకభావముల శాంతిబఱచును. ఇంద్రియములనుగూడ నదపులో నుంచును. అదియొక గొప్పతపస్సు. మానస్సును హృదయమును బవిత్ర మొనర్చును. పాపపురాశిని నశింపచేయును. మనశ్శుద్ధికై చాంద్రాయణవ్రతమును. కృష్ణవ్రతమును, ఏకాదశీవ్రతమును, ప్రదోషవ్రతమును, శాస్త్రములు విధించుచున్నవి. ఉపవాసము, మానవునికి ప్రబలశత్రువైన ముఖ్యమగు జిహ్వను వశమొనర్చును. ఉపవాసము, శ్వాస, రక్త ప్రసరణ, జీర్ణ, మూత్రమండలముల బాగుచేయును శరీరమునందలి సమస్త మలినములను, సర్వవిధ విషములను, ధ్వంస మొనర్చును. మూత్రపుటాళ్లు నిలువలను తొలగించి వేయును. అపరిశుద్ధమగు బంగా

రమును మూఁడుసార్లు వార్చి కాచి కల్పించి యెట్లు పరిశుద్ధ పరతురో, యట్లనే యీ యుపవాస సాధనము మనస్సును తిరిగి తిరిగి యుపవసించుటచే పరిశుద్ధతరముగ చేయఁబడును.

కామము బాధించునప్పుడు దృఢకాయులగు యువక బ్రహ్మచారు లుపవాస దీక్ష గొనవలెను. మనస్సు శాంతి యుతమగుటచే నుపవాస కాలములో నెంతయు వారికి ధ్యానము కుదురును. ఉపవసించుటలో ముఖ్యోద్దేశ్య మేమన యింద్రియములన్నియు శాంతియుతముగ నుండును. గాన నా సమయమున ధ్యానమును తీవ్రముగ నొనర్చుటయే.

ఇంద్రియములను మఱలించి భగవంతునిపై మనస్సును స్థిరపఱుపుము. భగవంతుని నీకు మార్గదర్శకము కమ్మనియు, పంథ (ఆధ్యాత్మిక) పై దివ్యజ్యోతి ప్రవాహమును ప్రసరింప చేయుమని ప్రార్థింపుము, భావ సహితముగ "హే భగవానుడా! ప్రచో దయాత్, ప్రచో దయాత్, నన్ను నడుపుము, నన్ను నడుపుము. త్రాహి. త్రాహి రక్షింపుము, రక్షింపుము. నేను నీవాఁడను. నన్ను విడువకుమ" ని పలుకుము. నీవప్పుడు పవిత్ర, ప్రకాశము (జ్ఞాన) బలములతో నాశీర్వదింప బడుదువు. ఉపవాస దినము లందైనను లేదా నుపవసించు నేకాదశి దినములందైనను నీ సాధన నను సరింపుము.

యోగమునందలి దశవిఘ్నములలో నుపవాస మొకటి. అమితముగ నుపవసించుట మానుము ఏలన నది నీరసమును కలుగచేయును. సామాన్య జ్ఞానము ,నుపవసించుటలో నుప యోగింపుము, పూర్తిగ నిరువది నాలుగుగంట లుపవసింప

జాలని చో నథమను 10 లేక 12 గంటలైన నుపవసించి కొద్ది పాలను పండ్లను, తీసికొనుము, ఇరువది నాలుగుగంట లుప వాసముండుట కలవాటు పడువరకు క్రమేణ 15 గంటల వఱకును, నంతకు పైగను, నుపవాసమును, పొడిగింపుము. అన్ని యుపవాసముల యొక్క ప్రత్యక్ష ఫలితమేమన, శారీరక మానసిక, పరిశుద్ధతయే, ఆధ్యాత్మికముగను, మానసికము గను, కూడ నుపవాసములు మానవుని దృఢ మొనర్చును. మనువను గొప్ప హిందూ ధర్మ (న్యాయ) ప్రదాత తన ధర్మ శాస్త్రమున పంచమహా పాతక నివారణకై నుపవాసమును విధించెను. అలోపతీ, హోమ్యోపతీ వైద్యులచే కుదరవని చెప్పబడు రోగము లుపవాసముచే కుదురును. ఉత్తమమగు నారోగ్యమును నిలబెట్టు కొనుటకును, శరీరాంత రావయవము లకు విశ్రాంతి నిచ్చుటకును, బ్రహ్మ చర్యమును నిలబెట్టు కొనుటకును, యావన్మంది కితఱచుగ, సంపూర్తిగ, నుపవసించు టొక గొప్ప యావశ్యకమై యున్నది. సర్వరోగములు నమిత ముగ తినుటచే నుత్పత్తి యగును. మఱియు వాటిని కుదుర్చు టకు, లేదా యడ్డగించుటకు, నుపవాసము మాత్రమేమార్గము.

పూర్తి యుపవాసము నిద్ర నదుపులో నుంచుటకు సహాయ పడును. తేనీరు నాశ్రయించి నిద్ర నదపులో బెట్టుట వాంఛనీయము గాదు. బాహ్యౌషధ వస్తు సేవనపై నాధార పడుచో నాధ్యాత్మిక శక్తిని బొంద లేవు. ఉపవాస కాలమున సమస్తసహవాసము మానుము, ఒంటరిగవసింపుము సాధనలో నీ కాలము వినియోగింపుము. ఉపవాసానంతరము బరువగు నాహారము నెద్దియు తీసికొనకుము. పాలు లేక పండ్ల రసము ప్రయోజనకారి.

మితాహారము, ప్రత్యాహారము, అనునవి యొకే నాణెము యొక్క సక్రమ, వికరీత (బొర్లగిల - తిరుగుడు) భాగముల వంటివి. శరీరమును సరియగు నిర్వాహక పద్ధతిలో నుంచుటకు కొద్దిగ నాహారమును, లేదా పానీయమును, తీసికొనుటయే మితాహారాభ్యాసము, భగవద్గీతలో "అర్జునా! అమితముగ తినువానికి గాని, లేదా అమితముగ మానువానికి గాని ఎక్కువగ నిదురించు వానికి గాని లేదా నధికముగ జాగరణ మొనరించు వానికి గాని, యోగ మెంత మాత్ర ముద్దేశింప బడ లేద"ను టను నీవు చూడనగును. ఇంద్రియము లను వాటివాటి యింద్రియ విషయముల నుండి మఱల్చుటయే ప్రత్యాహారా నుష్ఠాన మన బడును. అప్పు డింద్రియములు మనస్సులో లీనమగును. ఎప్పుడు మితాహార, ప్రత్యాహారము లందు సంపూర్ణముగ స్థిరపడునో నప్పుడే యింద్రియముల యొక్క పరమ వశ్య మబ్బును.

ఏకాదశి దినముల నుపవసించుటయు, జపము చేయు టయు, చాల గొప్ప పరిశుద్ధకారి, ఉపవాసము మనస్సును సాత్త్వికమొనర్చును. దేహమును తేలిక చేయును. మఱియు చాల యుగ్రతలను బోగొట్టి యేకాగ్రత లేక ధారణకు సహాయ పడును.

ఒకానొకప్పుడు "ముర" యను రాక్షసుడు దేవతల బాధించు చుండెను. దేవతలు రక్షణకై శ్రీ హరిని వేడిరి. ఆ రాక్షసుని చంపుటకై శ్రీహరి "యోగమాయ"ను బంపెను. రాక్షసుని జంపి భగవదాజ్ఞను కొనసాగించెను. అప్పుడు యోగమాయతో శ్రీహరి "ఓ యోగమాయా! ఎవరైతే

యేకాదశి వ్రతము నాచరించువారు పాపముల నుండి విముక్తులగుదురు. నీవు యేకాదశి యను పేరుతో పిలువ బడుదు వనెను.

రాజగు అంబరీషుడు శ్రీహరియొక్క గొప్ప భక్తుడని మీ కందఱకు తెలియును. ఏకాదశి వ్రతము నొక సంవత్సరము పాటు జరిపెను. రాజుపట్ల శ్రీహరి సంతుష్టు డయ్యెను. అంబరీషుడు భగవానుని యనుగ్రహమునకు పాత్రు డయ్యెను. ఒకసరి, మూడు దినములు వరుసగ నుపవసించెను. ఉపవాస మును విడువ దలచు చుండెను. ఈ సమయములో దూర్వాసులు వాని యతిథులుగ వచ్చిరి. రాజు వానిని తగు గౌరవముతో స్వీకరించి భోజనమునకై ప్రార్థించెను. ఋషి యంగీకరించి, నదికై స్నానమునకు బోయెను. రాజు వాని కొఱకు చాలకాలము వేచి యుండెను. కాని యాతడు తిరిగి రాలేదు. ద్వాదశి పోవుట కొక యర్థ ముహూర్తము మాత్ర మే మిగిలి యుండెను. రాజు యేమితినకుండ నుండుచో వ్రతముసలుప నష్టమగును. తినియుండుచో ఋషికై నిర్లక్ష్యతను చూపుట యగును. రెండుద్దేశ్యములకు పనికివచ్చుటకై కొద్దిగ నీటిని పుచ్చుకొనెను. ఇది త్రాగుటయు, త్రాగకుండుటయు రెంటిగ ననబడును. దూర్వాసులు తిరిగివచ్చెను. దివ్యదృష్టిచే సమస్తమును తెలిసికొనెను. ఆతడు (ఋషి) చాల యుగ్రుడయ్యెను. శిఖనుండి యొకజడ నూడబెఱికి యంబరీషుని జంపుటకు నియోగించెను. రాజు చలించకుండెను. విష్ణుమూర్తియొక్క చక్రము దూర్వాసునిచే పంపబడిన విధ్వంసకారకమగు శక్తిని నశింపచేసి దూర్వాసుని సహితము తరుమ ముట్టించుట కతిగెను. ఎచ్చటికిబోయినను చక్రము వెంబ

డించుచుండెను. దూర్వాసులు బ్రహ్మను, శివుని, సాయము నకై వేడెను. వారునతప్పక యేకాదశీవ్రతము నాచరించు విష్ణువుయొక్క భక్తుని కోపించితిరి విష్ణునొద్దకు జనుమని వారనిరి. శ్రీహరివద్దకు రాతఁడు జనగా "నేను నా భక్తులపై నాధారపడియుందును. నాహృదయము నాభక్తుల వశములో నున్నది. వారిహృదయము నాకు గొలుసుకువలె లంకింపబడి నది. అంబరీషునివద్దకు పొమ్ము. వాని క్షమార్పణవేడుము. నీవు రక్షింపబడుదువు" నెను. దూర్వాసుఁడు తిరిగి యంబరీషుని వద్దకు జని వానిపాదముల స్పృశించెను. అంబరీషుఁడు చక్రమును తనగమనమునుమాని ఋషినిరక్షింపుమని ప్రార్థించెను. చక్రము తక్షణమే యంబరీషుని ప్రార్థనపై తనశక్తిని లాగుకొనెను. హృదయాంతరాళమునుండి యంబరీషునకు దూర్వాసులు వందనమొసఁగెను. శ్రీహరి భక్తునియొక్క శక్తి యిట్టిది. ఏకాదశి వ్రతముయొక్క మహిమ యిట్టిది.

చంద్రునియొక్క వివిధకళలు మన మనస్సులపై నధికముత్తముగ విచిత్రమగు దివ్యదృశ్యప్రభావము కలుగఁజేయును. పక్షమునందలి కొన్ని దినములలో నాధ్యాత్మికచింతన కనువగు ప్రత్యేక ప్రభావాన్వితమగుశక్తులు భూమిపై ప్రసరించుచుండును. పదునొకండవ దినము లేక యేకాదశియొకటి అట్టిదినము. బాహ్యచంద్రుఁడు వివిధకళలద్వారా జనునట్లు మానవుని సూక్ష్మశరీరమందలి సరియగు సూక్ష్మ (లింగ) తత్త్వ ప్రతిభాగ మాంతర్యకేంద్రములద్వారా శిరసునుండి కాలి బొటనవ్రేలి చివరకు పరిభ్రమణమొనర్చును. శుక్లపక్ష కృష్ణపక్ష యేకాదశిదినములలో సూక్ష్మమగు చంద్రతత్త్వ మనుదినవదునగ, కనుబొమ కేంద్రమునను, నాభికేంద్రమునను, వదన

క్రమముగనుంచబడి, యున్నతర, అధోతరశక్తులతో (స్వభావములతో) సాంగత్య మొనర్చుకొనుచుండును. తొలినుడువబడిన యున్నతరశక్తుల ననువుగ చేసికొనుటకును, తరువాతి నుడువబడిన యధోతరశక్తుల త్యజీకరించుటకును, నుపవాసము, ప్రార్థనలు, గొప్పసహాయకము, లాభదాయకమని ఋజువుపర్చును. పైగా చంద్రలోకమునుండి పితృదేవతలు యేకాదశి, యమావాస్య మున్నగు దినములలో మనతో సంబంధమేర్పఱచుకొని మన మనస్సుల మిక్కిలి సులభముగ పరిశుద్ధ మొనర్పగలరందురు.

వైకుంఠ యేకాదశి వ్రతమును, యేకాదశి వ్రతమును, వదలక క్రమముతప్పకుండ మీరందఱు మనస్ఫూర్తిగ నాచరింపగలందులకు నేను నమస్పూర్వకముగ ప్రార్థించుచున్నాను. మీరు శ్రీహరి కృపనొంది యుత్కృష్టశాంతి, యనంత సౌఖ్యముల నొసగునట్టి శాశ్వతసామ్రాజ్యమున ప్రవేశింతురు.

## శబ్దముయొక్క నాలుగంతస్థులు

ఈశ్వరునియొక్క శబ్దోత్పత్తి (వ్యక్తీకరణ) యే వేదములుగ నేర్పడును. ప్రాణము (Prana) లో మాత్రమే వ్యక్తీకరణగాను "పరా" మనస్సులో వ్యక్తీకరణగాను "పశ్యంతి" నింద్రియములలో వ్యక్తీకరణగాను "మధ్యమ"యు నింకను వాఙ్మడి (acticulater ex pression) లో వ్యక్తీకరణగాను "వైఖరి" యను నాలుగు విభాగములా శబ్దము గలిగి యుండును. "పరా" "పశ్యంతి" "మధ్యమ"యు సముద్రమువలె నగాధముగ, లోతు కొలువరానిదిగ నుండును. మఱియు,

వైఖరి మాత్రము ప్రణవములో నుత్పత్తియై వర్ణమాల (Alphabet) యొక్క యక్షరములు ఛందస్సుల (metres) గుండాననుసరించెడి వేదములలో వ్యక్తీకరణమగును. వైఖరి సహితము మనుష్యులచే సరిగ గ్రహింపబడదు.

వైఖరి యనగా స్థూలరూపవాక్కు (speech)గు వాచా సంభాషణ (articulate speech) స్వరావయవముల (vocal organs) గుండా బయల్వెడలుచున్నదేదియో నా యంతస్థే "మధ్యమ". ఎవరైతే యోగదృష్టి కలిగియుందురో వారు మాత్రమే మొదటిమూడును చూడగలుగుదురు. భాషలో బాహాటముగ నుచ్చరించబడిన రీతిగ వేదములవగాహన మొనర్చుకొనుటకుగూడ కష్టము. వాక్కు సూక్ష్మస్థూల రూపముల గలిగియున్నది.

మేరుదండము (వెన్నెముక - (Spinal column) యొక్క కేంద్రస్థానముల (centres) లేదా చక్రములలో నమ్మలకు జీవమొసగు పరమాత్ముడు వ్యక్తమైయున్నాడు.

ఆయన మూలాధార చక్రమును ప్రాణము, శబ్దము యొక్క సూక్ష్మతమ రూపము (పరా) లతో ప్రవేశించును. మనస్సునకు మాత్రమే దృశ్యమగునదేదియో నట్టి "పశ్యంతి" "మధ్యమ" వంటి యల్పతర, సూక్ష్మరూపములగుండ జనిత తదుపరి యా పరమాత్మ పదము, (syllable) స్థాయి. (pitch) యక్షరము. (letter) మాత్ర (పరిమాణము) స్వరము, (ఉచ్చారణ) వర్ణము. (వర్ణమాలాక్షరములు) లతో కూడిన చాల స్థూలశబ్దము (వైఖరి)గ నా పరమాత్మ చిట్టచివర వెలువడును.

ఉచ్చారణ (బాహాటముగు శబ్దము) దైవీయమైన శబ్ది శక్తి (divine soun l energy) యొక్క కట్టకడపటి స్థూలతము వ్యక్తీకరణయే శబ్దశక్తియొక్క నత్యున్నతమ వ్యక్తీకరణ, ప్రసక్షమ (మూలు, స్వరము, దివ్యవాణియు "పరా" పరా వాణి (ధ్వని) మూలభావములు, లేదా మొలకయూహాల (germ thoughts) గును. అది కంఠధ్వనియొక్క ప్రథమవ్యక్తీకరణ "పరా"లో శబ్ద మవిచక్షణీయః (అవ్యక్త -undifferentiated) రూపములో నిలుచును. "పరా" "పశ్యంతి" "మధ్యమ" "వైఖరి" యనునవి శబ్దముయొక్క వివిధస్థాయీ (అంతస్థు)లయి యున్నవి. "మధ్యమ" యనునది నడుమ గల శబ్దముయొక్క నవ్యక్తస్థితి. దాని యుపవిష్టత (Seat) హృదయమై యున్నది.

"పశ్యంతి" యొక్క స్థానము (Seat) నాభి లేక మణిపూర చక్రము. వర్ణము (రంగు) రూపముల గలిగి నట్టియు, సమస్తభాషలకును నున్మడియైనట్టియు, శబ్దముయొక్క స్పందన సమానత్వము (vibratic homogenity) గలిగియుండు నట్టియు, మాటయొక్క "పశ్యంతి" స్థితిని సూక్ష్మమగు నాంతర్యదృష్టి గల యోగు లనుభవ మొంద జాలుదురు. హిందువులు, యిరోపావారు. అమెరికావారు ఆఫ్రికావారు, జపానీయులు, పక్షులు, మృగములు, సర్పాలు కంఠధ్వని లేదాశబ్దముయొక్క "పశ్యంతి" యవస్థలో నొక వస్తువుయొక్క నదే సరిసమాన మైన భావన ననుభవ మొందుదురు. సంజ్ఞ (gesture) యొక విధమగు మూగయైన సూక్ష్మభాష. అది సమస్త మనుష్యులకు నొకటియై సరిసమానమైనదై యున్నది. ఏ దేశపు

యే వ్యక్తియైనను నాలుకదాహముగ నుండినప్పుడు ప్రత్యేక తీరున తన నోటిలో తన చేయిని పెట్టుకొనుట ద్వారా నదే సరిసమానముగు సంజ్ఞ నొనర్చును.

ఒకే యొక సరిసమానమైన సత్తా లేక శక్తి చెవుల గుండా పనిచేయుచు వినుటయు, కండ్ల గుండా చూచుటయు, మున్నగు వాటిగ నుండునో నా యదే "పశ్యంతి" స్థిరీకృత మయి [materialise] నప్పుడు శబ్దముయొక్క వివిధ రూపముల వహించును. భగవానుడు స్వయముగ తన మాయా శక్తి ద్వారా మూలాధార చక్రములో తొలుత "పరావాణి" గ తదుపరి నాభివద్ద మణిపూరక చక్రములో "పశ్యంతి"గ స్వయముగ వ్యక్తమును, తదుపరి హృదయములో "మధ్యమ" గ నటుపిమ్మట తుదిగ కంఠము నోటిలో "వైఖరి" గను నగును. ఇదియే పరమాత్ముని వాణియొక్క దివ్యావతరణ. సమస్త "వైఖరి" యు నా పరమాత్ముని వాణి మాత్రమే అది విరాట్పురుషునియొక్క వాణి. సరిగ నెటుల కాష్టము (wood) లో నంతరత (latent) వేడిమిగ నగ్నియుండి దృఢముగు రాపిడి ద్వారా గాలి సహాయముతో నిప్పురవ్వ (మెరుగు spark) గ వ్యక్తమయి, తదుపరియొక చిన్న జ్వాలగ నటు తుదిని నేతి యాహుతిగుండా గొప్ప జాజ్వల్యమగు (blazing) మంటగ నుండునో నటులనేవాక్కు [Speech] రూపములో భగవానుని యొక్క వ్యక్తీకరణమై యున్నది. వేడిమి "పరా" వాణికి నిప్పురవ్వ "పశ్యంతి" కి చిన్నజ్వాల "మధ్యమ" కు పెద్ద జాజ్వల్యమానమగు మంట వైఖరి లేదా శబ్దముయొక్క శ్రావ్య

[audible] రూపమునకు ననుగుణమగు [correspond] ను. ఈ విధముగ వాక్కు [speech] భగవానుని యొక్క వ్యక్తీకరణమే.

# శుద్ధాశుద్ధపత్రము

| పుట | పంక్తి | అశుద్ధ | శుద్ధ |
|---|---|---|---|
| 2 | 14 | [illegible] | [illegible] |
| 7 | 8 | [illegible] | [illegible] |
| 8 | 12 | [illegible] | దయూత్ |
| 10 | 18 | [illegible] | నన్ను |
| 17 | 15 | కంఠం | కుంఠ, |
| | 21 | ఎంపృపైన | ఎప్పుడైన |
| 16 | 20 | కట్టి | కట్టి |
| 25 | 22 | చేయు | చేయు |
| 32 | 4 | సుపాసన | నుపాసన |
| 33 | 4 | నకీయ | స్వకీయ |
| 34 | 13 | నమస్త | సమస్త |
| 50 | 12 | ప్రకాశమునకు | ప్రకాశమునకు నన్ను |
| 52 | 12 | నూతన | నూతన |
| | 20 | నుండు | నుండి |
| 53 | 16 | సనుసరింపుము | ననుసరింపుము |
| 88 | 10 | తపన్ను | తపస్సు |
| 90 | 20 | mymphs | nymphs |
| 93 | 21 | స్వాగము | స్వాగతము |
| 100 | 19 | కానుకకు | కానుకలు |
| 104 | 1 | ధర్మాది | ధర్మస |
| 131 | 8 | రూపముకు | రూపమును |
| 140 | 4 | కాంకిప | కాంక్షింప |

| పుట | పంక్తి | అసాధు | సాధు |
| --- | --- | --- | --- |
| 141 | 16 | వుండును | పుండును |
| 145 | 6 | ముండును | మొండును |
| 153 | 6 | నేతిదీపమునకై | ఒకరు నేతిదీపమునకై |
| 153 | 21 | నమ్మోళన | సమ్మోళన |
| 158 | 15 | నపేక్షణాజ్ఞాన | నపేక్షణానాజ్ఞాన |
| 169 | 18 | ఫలసమితి | ఫలమితి |
| 166 | 6 | లనదగిది | లనదగినది |
| 169 | 16 | ధ్యాననము | ధ్యాసనము |
| 171 | 20 | నానేవదత్తురు | నాదేవదత్తురు |
| 173 | 13 | limitant | limiting |
| 178 | 19 | శద్దాత్ | శబ్దాత్ |
| 184 | 10 | గానమొనర్చుట | గానమొనర్చుట భక్తితో సమర్పించుట |
| 185 | 1 | విషము | విషయము |
| 196 | 11 | Substratcum | Substratum |
| 197 | 23 | ద్వ్యాదరా | ర్వాదరా |
| 201 | 4 | యజ్ఞానము | యాజ్ఞానము |
| | 9 | నికలిగియున్నది | నియున్నది |
| 202 | 11 | కాకభక్తి కొరతనుండి | |
| 203 | 3 | వికారాసుః | వికారాసత్యాః |
| 205 | 7 | యొక్క మూర్తీభవమే | యొక్క నైకైక జీవనము వేదముల యొక్క మూర్తీభవమే |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 218 | 19 | ్యాసి | వ్యాప్తి |
| 228 | 15 | సంఘాణము | సంఘామణము |
| 229 | 22 | Theari'es | Theories |
| | 23 | యొకాంటు | యొకాటంకే |
| 230 | 15 | ప్రానాసము | ప్రసాదము |
| | 18 | వంక్తి | పంక్తి |
| | 23 | సర | సర్వ |
| 234 | 2 | hoste | hosts |
| 238 | 15 | కషిముగ | కషికముగ |
| | 21 | సమ స్త | సమ స్త |
| | 21 | కాకర | కారక |
| 254 | 11 | మురళీధర | మురళీధర |
| 258 | 2 | దయాళు | హేందయాళు |
| | 14 | మ్రా | రామ్ |
| 275 | 17,18 | స్థితి, | పరిణామము |
| | | | స్థితి, పుట్టుక వృద్ధి పరిణామము |
| | 21 | Consctiod | Causation |
| 281 | 13 | ప్రహ్లాదుడు | ప్రహ్లాదుడు |
| 326 | 6 | తోధ్ది | తోడ్ది |
| 331 | 20 | హాజరె | హాజరై |
| 335 | 12 | గవానుడగు | భగవానుడగు |
| | 17 | ఆచింత్య | అచింత్య |
| 339 | 7 | పుటుకల | పుట్టుకల |
| 344 | 23 | విధ్వస | విధ్వంస |

| పుట | పంక్తి | అశుద్ధము | శుద్ధము |
| --- | --- | --- | --- |
| 348 | 20 | octiculator | Articulator |
| x | 14 | ప్రవర్తకాయి | ప్రవర్తకాయః |
| xii | | ఆత్మార్ఠర్పణ | ఆత్మార్పణ |
| xvii | 19 | బాంబాయి | బొంబాయి |
| | 21 | గ్రంథములు. | గ్రంథములు:— |
| xviii | 10 | ప్రపథమ | ప్రప్రథమ |
| xxiii | 7 | లేఖ | లేఖలు |
| xxvii | 1 | assimnation | assimilation |
| | 8 | శాండిల్యామునకు | శాండిల్యునకు |
| xxxiii | 19 | త్రక్షు | త్ర్యక్షు |

# సాధ్వసాధుపత్రము

| ప్రట | పంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| 2 | 14 | ఖద్ధముగు | బద్ధముగు |
| 7 | 8 | నదర | నదరు |
| 8 | 12 | దాయాత్ | దయాత్ |
| 10 | 18 | నని | నన్ను |
| 17 | 15 | కండు. | కుండు, |
| | 21 | ఎంపుడైన | ఎప్పుడైన |
| 18 | 20 | కట్టు | కట్ట |
| 25 | 22 | చేయ | చేయు |
| 32 | 4 | సుపానన | నుపాసన |
| 33 | 4 | నకీయ | స్వకీయ |
| 34 | 13 | సమ స్త | సమ స్త |
| 50 | 12 | ప్రకాశమునకు | ప్రకాశమునకు నిన్ను |
| 52 | 12 | సూతన | నూతన |
| | 20 | నుండు | నుండి |
| 53 | 16 | సనుసరింపుము | ననుసరింపుము |
| 88 | 10 | తపన్సు | తపస్సు |
| 90 | 20 | mymphs | nymphs |
| 99 | 21 | స్వాగము | స్వాగతము |
| 100 | 19 | కానుకకు | కానుకలు |
| 104 | 1 | ధర్మాజ | ధర్మస |
| 131 | 8 | రూపముకు | రూపమును |
| 140 | 4 | కాంకిప | కాంక్షింప |

| పుట | పంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| 141 | 16 | వుండును | వుండును |
| 145 | 6 | ముండును | మొందును |
| 152 | 6 | నేత్రాదీపమునకై | ఒకరు నేత్రాదీపమునకై |
| 153 | 21 | నమ్మేళన | సమ్మేళన |
| 158 | 15 | నపేక్షణాజ్ఞాన | నపేక్షణానాజ్ఞాన |
| 169 | 18 | ఫలసమితి | ఫలమితి |
| 166 | 6 | లనదగిది | లనదగినది |
| 169 | 16 | ధ్యాననము | ధ్యానసనము |
| 171 | 20 | నానేవదత్తురు | నాదేవదత్తురు |
| 173 | 13 | limitant | limiting |
| 178 | 19 | శద్దాత్ | శబ్దాత్ |
| 184 | 10 | గాన మొనర్చుట | గాన మొనర్చుట భక్తితో సమర్పించుట |
| 185 | 1 | విషము | విషయము |
| 196 | 11 | Substratcum | Substratum |
| 197 | 23 | ద్వాదరా | ర్వాదరా |
| 201 | 4 | యజ్ఞానము | యాజ్ఞానము |
| | 9 | నికలిగియున్నది | నియున్నది |
| 202 | 11 | కాకభక్తి కొరతనుండి | |
| 203 | 3 | వికారాసుః | వికారాసత్యాః |
| 205 | 7 | యొక్క మూర్తీభవమే | యొక్క నేకైక జీవనము వేదముల యొక్క మూర్తీభవమే |

| పుట | పంక్తి | అశుద్ధ | శుద్ధ |
|---|---|---|---|
| 213 | 19 | వాసి | వ్యాపి |
| 228 | 15 | సంభాణను | సంభాషణను |
| 229 | 22 | Theari'es | Theories |
| | 23 | యెకాంట | యెకాటంక |
| 230 | 15 | ప్రాసాదము | ప్రసాదము |
| | 18 | వండ్లు | పండ్లు |
| | 23 | సర | సర్వ |
| 234 | 2 | hoste | hosts |
| 238 | 15 | కధిముగ | కధికముగ |
| | 21 | నమస్త | సమస్త |
| | 21 | కాకర | కారక |
| 254 | 11 | మురశీధర | మురళీధర |
| 258 | 2 | దయాళు | హేందయాళు |
| | 14 | మ్రా | రామ్ |
| 275 | 17,18 | స్థితి, | పరిణామము |
| | | | స్థితి, పుట్టుక వృద్ధి పరిణామము |
| | 21 | Consctiod | Causation |
| 281 | 13 | ప్రష్టాదుడు | ప్రహ్లాదుడు |
| 326 | 6 | తోర్ధి | తోశ్రి |
| 331 | 20 | హాజరె | హాజరై |
| 335 | 12 | గవానుడగు | భగవానుడగు |
| | 17 | ఆచింత్య | అచింత్య |
| 339 | 7 | పుటుకల | పుట్టుకల |
| 344 | 23 | విధ్వస | విధ్వంస |

| పుట | పంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| 346 | 20 | octiculator | Articulator |
| x | 14 | ప్రవర్తకాయి | ప్రవర్తకాయ |
| xii | | ఆత్మారర్పణ | ఆత్మార్పణ |
| xvii | 19 | బాంబాయి | బొంబాయి |
| | 21 | గ్రంథములు. | గ్రంథములు:— |
| xviii | 10 | ప్రపథమ | ప్రప్రథమ |
| xxiii | 7 | లేఖ | లేఖలు |
| xxvii | 1 | assimnation | assimilation |
| | 8 | శాండిల్యమునకు | శాండిల్యునకు |
| xxxiii | 19 | తృక్కు | త్ర్యక్కు |